ప్రచురణ : యువనామ సంవత్సర
చైత్రశుద్ధ పౌర్ణమి-ఏప్రిల్-1995

ప్రతులు - 1000

అన్ని హక్కులు గ్రంథకర్తవి

Price Rs 150/-

ముఖచిత్రం శ్రీ "బాపు"

ప్రతులకు :
జనప్రియ పుస్తకమాల
విజయవాడ-2.

ముద్రణ : లలితా ప్రింటింగ్ ప్రెస్,
టౌన్‌హాల్‌రోడ్డు విశాఖ-1

టైటిలు ప్రింటింగ్ : "స్వాప" ప్రింటర్స్,
దొండపర్తి - విశాఖ

# అం కి త ము



ఏ మహాత్ముడు-ధరణిలో నెల్ల జనుల
బాధలను బాప _ వర నర భవము దాల్చె
శాంత్యహింసల కొరకు రాక్షసుల గూల్చె
నట్టి "సత్యవ్రతున" కిత్తు అంకితమ్ము

ర చ యి త

## తల్లిదండ్రులకు వందనము

వ్యసనముల కోర్చి - నను బెంచి - వసుధ నిడుచు
మానవత నేర్పి వరలిన మాన్య గుణులు
అమ్మ "పార్వతి" నాన్నయౌ ఆ "అనంత
రామయ"కు భక్తి మ్రొక్కెద ప్రేమ మీర.



## అత్తమామలకు నమస్కారము

వసుధ శ్రీ నగరంపల్లి వంశ జనితు
డతుల వైద్యుండు "నారాయణాఖ్యు" డతని
సతియు "రాజేశ్వరమ్మ"లు సత్కులీను
లత్త-మామలు - వారికే నంజలింతు.

# తొలి పలుకు

"వేదః ప్రాచేతసాదాసీత్ - సాక్షాద్రామాయణాత్మనః"

ప్రాచేతసు డయిన వాల్మీకి మహర్షిచే ప్రపంచాన వెలసిన వేదమే రామాయణ మని ప్రతీతి. అక్షయమైన కథాగమనంతో - మానవ మను గడకు అత్యంతావశ్యకమైన [illegible] - అనుక్షణం ఉత్కంఠ కలి గించే రసవత్తరమైన [illegible] శ్రీ మాపు డూరు అనంతరామయ్యగారు [illegible] ప్రవచనం చేసినపుడు నా పదిపదిహేనేళ్ళ ప్రాయంలో [illegible] విన్నాను. బాగా ఆకర్షితుడనైనాను. [illegible] అర్థ మయ్యే రీతిలో [illegible] ను. అదే యిప్పటి నా [illegible] కృతజ్ఞుడనై [illegible] సిద్ధియించుగాక.

ఆంధ్ర దేశంలో అనేకానేక రామాయణాలు ఉన్నాయి. అయినా రాముని నామం పలికినంత మాత్రమునే సర్వపాప పరిహారం జరుగుతుం దట కదా! అందుచేత రామనామ సంకీర్తనమైన రామాయణమును నాదైన రీతిగ వ్రాయుటంలో దోషం లేదనిపించింది. అందుకే ప్రయత్నం మొదలు పెట్టాను.

మొదటి ప్రయత్నంలో పట్టాభిషేకం వరకు 1500 తేటగీతులలో రామాయణాన్ని పూర్తి చేశాను. కవిశేఖర-సుధాకవి శ్రీ గొండేపూడి సుబ్బారావు గారికి చూపాను. వారు నా ప్రయత్నాన్ని సమర్థించి పద్యాలను చదివి సంస్కరించి చక్కని సలహాలనిచ్చి నన్ను ప్రోత్సహించారు. తరువాత శ్రీమాన్ ఆచార్య [illegible] సుబ్రహ్మణ్యశాస్త్రి గారికి - శ్రీ పాటిలు తిమ్మారెడ్డి గారికి చూపించాను. వారు కూడ కొంత సంస్కరించి నన్ను ఉత్సాహపరచినారు. శ్రీ సుబ్బారావుగారు సంస్కరిస్తున్నపుడే కళాప్రపూర్ణ గడపతిరాజు అచ్యుత రామరాజు గారికి చూపించాను. అంతవరకు పేరు లేకుండా ఉన్న రచనకు వారు "రఘురామ రామాయణము" అని పేరు పెట్టి నా ప్రయత్నానికి మరింత ఊత నిచ్చారు. ఆ దశలోనే నా వ్రాతప్రతిని

సాహిత్య విద్యాప్రవీణులు భాషాప్రవీణులు – వేదాంత భూషణులు అయిన శ్రీమాన్ మహేంద్రవాడ జగన్నాథస్వామి వారు (కళింగపట్నం)- సంస్కృతాంధ్ర విద్యా ప్రవీణులు – పండితులు నయిన శ్రీమాన్ అరవెల్లి నారాయణాచార్యులుగారు శ్రీకాకుళం చూచి నన్ను ద్విగుణీకృతోత్సాహునిచేశారు. సవరించిసలహాలు కూడ ఇచ్చారు.

నాకు అంతటితో తృప్తి కలుగలేదు ఇంకా పెద్దల సలహాలు తీసికొని పాటించా లనిపించింది. ఆ దశలో విశేషానుభవ ప్రపూర్ణులు - వివిధ శాస్త్ర విశారదులు – విజ్ఞాన ఖనులు – ఆచార్యులు-విద్వాంసులు అయిన బ్రహ్మశ్రీ దివాకర్ల రామమూర్తి గారిని ఆశ్రయించాను. వారు నా ప్రయత్నమును ఆమోదించి సుమారు ఒక సంవత్సరకాలం విపరీతమైన శ్రమ కోర్చి ఓపికతో 2130 పద్యాలను చదివి రసపుష్టి లేని పద్యాలను యేరి సంస్కరించి సలహాలిచ్చి మరల వ్రాయించి నిండు మనసుతో నన్నాశీర్వదించారు. వారి అమోఘాశీర్వాద బలమే యీ నా టీ యీ రఘురామ రామాయణ పుస్తక రూపం వారి మేలు నాకు మరువరానిది.

మధ్య మధ్య నా వంటి వాడు రామాయణం వంటి గ్రంథాన్ని వ్రాయుట మేమిటి అని నిరుత్సాహం కలుగుచుండే సమయాలలో నా అసంపూర్ణ అముద్రిత గ్రంథంలోని ముఖ్యమైన ఘట్టములను చదివి శ్రీ ధర్మపురి కృష్ణమూర్తి భాగవతార్-(బి.ఏ.బి.ఇడి, బరంపురం) శ్రీ వనమాలి బుచ్చిరామయ్య వర్ధులు ( సత్యవరం ) డి. విశ్వనాథాచారి ( స్టేట్ బ్యాంక్ బరంపురం ) ధర్మపూరి బుచ్చిపంతులు (బరంపురం) శ్రీ మాన్పుడూరు రామమూర్తిశాస్త్రిగారు (బరంపురం) మంచి ప్రోత్సాహమిచ్చి ముందునకు నడిపించి రచన పూర్తిచేయుటాకికి కారకులైనారు. ఉర్లాందరి కామేశ్వరిపేట వాస్తవ్యులు శ్రీవాకముళ్లరామారావు; యీరుక్మిణయ్యక-బి ఏ; నగరంపల్లి సాంబశివరావు యింకొందరు గ్రామ పామరజనం నారచన విని వినినంత మాత్రమునసే కథ అవగాహన మగుచున్నదని వ్యక్తపరచి నన్ను మరింత ఉత్సాహ పరచినారు.

నా రచనలో సామర్థ్యం లేక పోయినా సారవంతమైన రామకథ వీరందరికీ ఆనందాన్నిచ్చి నన్ను ప్రోత్సహించేలా చేసిందని నా విశ్వాసం. అందరికి నాహృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

అర్థించినంతనే ఆనందంగా తమ అమూల్యమైన అభిప్రాయాలను అందజేసిన మహా మహులు ప్రవచన శిరోమణి శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామి వారికి - కళాప్రపూర్ణ చర్ల గణపతిశాస్త్రిగారికి ఆచార్య-విద్వాన్ దివాకర్ల రామమూర్తిగారికి - ఆచార్య వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి గారికి; కవిశేఖర - మధురకవి ప్రసన్నభారతి పత్రికా సంపాదకులు కొండేపూడి సుబ్బారావుగారికి; ఆచార్య పండితారాధ్యుల వీరేశలింగం గారికి; కళా ప్రపూర్ణ గణపతిరాజు అచ్యుత రామరాజుగారికి: పీఠిక వ్రాసి యిచ్చిన ఆచార్య శ్రీమతి కోలవెన్ను మలయవాసినిగారికి నాహృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు సమర్పించుకుంటున్నాను.

అర్థించినంతనే ఉదారంగా తపాలా ఖర్చులు కూడా తామే భరించి అందమయిన ముఖచిత్రాన్ని చిత్రించి యిచ్చిన ప్రముఖ చిత్రకారులు-సినీ దర్శకులు అయిన శ్రీ "బాపు" గార్కి శతకోటి వందనాలు సమర్పించు కుంటున్నాను. శ్రీ"బాపు"గారు మొదట పంపిన ముఖ చిత్రాన్ని నా అజాగ్రత్త వలన పోగొట్టుకొన్నాను. అయినా విషయాన్ని తెలుసుకొని ఉదార హృదయంతో మరల మరొక ముఖచిత్రాన్ని చిత్రించి నా కందించి నాయీ రఘురామ రామాయణానికి ఊపిరి పోసి సర్వాంగ సుందరంగా వెలువడడానికి కారకులయిన శ్రీ "బాపు"గార్ని ఎంత అభినందించినా చాలదనే నా అభిప్రాయం. వారికి మరోమారు నా నమస్సుమాంజలులు.

శ్రీ "బాపు" గారు చిత్రించిన ముఖచిత్రానికి ఆకర్షితుడై అడగకుండానే ముందుకు వచ్చి-ముఖచిత్ర ముద్రణా వ్యయాన్ని తానే భరించిన మిత్రులు-ఆత్మీయులు శ్రీ ధనాలకోటి విశ్వనాధాచారి (State Bank Berhampur) గారిని మనసారా అభినందిస్తున్నాను.

ఏ సంస్థ యొక్క ధన సహాయము లేకుండా ముద్రణ సాగించగలనా అని ఆలోచించుచున్న తరుణంలో చెరి చేయిస్తూ పెద్దల్లు తమవంతు సహాయ్యంగా నిచ్చి మద్రణకు ప్రోత్సహించిన కళాపోషకులు ఉదార హృదయులు అయిన శ్రీ దూర్వాసుల భాస్కరమూర్తిగారికి; దయాల్

రమణమూర్తి (పద్మనాభం రమణమూర్తి) గారికి హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలుపు కుంటున్నాను.

పుస్తకాన్ని అందంగా ముద్రించిన శ్రీలలితా ప్రెస్ కార్మికులకు అధినేతలు శ్రీచర్ల గణపతి శాస్త్రిగార్కి; ముద్రణా కార్యక్రమంలో విశేష శ్రమను వైకొన్న శ్రీకోపల్లె రామమూర్తిగారిని మనసార అభినందిస్తూ శ్రీ శాస్త్రిగారికి నమస్కృతులు తెలుపుకొనుచున్నాను.

అచంచల రామభక్తి పరాయణులు - రాజకీయ యుగంధరులు అయిన స్వర్గీయ తెన్నేటి విశ్వనాథంగారిచే స్థాపింప బడిన శ్రీ "విశాఖ సారస్వత వేదిక" ప్రచురణగా; ప్రచురించుటకు అంగీకరించిన అధ్యక్షులు ఆచార్య - విద్వాన్ శ్రీ దివాకర్ల రామమూర్తిగారికి - కార్యదర్శి శ్రీదూర్వాసుల భాస్కరమూర్తిగార్కి వందనము లర్పించు కుంటున్నాను.

కవరుపేజీని ఆఫ్‌సెట్ ప్రింటింగులో అందంగా ముద్రించిన "స్వా" ప్రింటర్స్, అధినేతలు శ్రీ కుమార్‌గారికి - శ్రీప్రసాద్‌గారికి కృతజ్ఞతలు తెలుపు కొంటున్నాను.

అతి పవిత్రమైన రామాయణ మహాగ్రంథాన్ని సులభశైలి తేట గీతులలో పాఠక లోకానికందించి వారి ఆశీస్సులను అందుకొనే తలంపే నా యీ రచనకు ఊపిరి. రసగ్రహణ పారీణులు సహృదయులు అయిన పాఠకులు తప్పులు మన్నించి విశాల హృదయంతో నన్నాశీర్వదించ గలరనే నమ్మకంతో-

నా విద్యార్థ్యయనానికే గాక నా తమ్ముల విద్యార్థ్యయనానికి గూడ ఇతోధిక ఆర్థిక సహాయ్యా నందించిన డాక్టరు శ్రీ యస్.యస్. శర్మగారికి (బరంపురం) నేనెంతో ఋణపడియున్నాను వారికి నానమస్కృతులు.

గురువులు స్వర్గీయ తుమరాడ జగన్నాథంగారిని, గురుతుల్యులు శ్రీ నేతేటి వాయునందన శర్మగారిని; చిలకమర్తి వారి సాహిత్యం మీద థీసిస్ వ్రాసికూడా - డాక్టరేటు పుచ్చు కోకుండా అర్థాంతరంగా యాక్సిడెంటులో మృతిజెందిన స్వర్గీయ పులఖండం జగన్నాథరావుని యీ సందర్భంగా ఒకసారి సంస్మరించు కొంటున్నాను. యీమువ్వురు వ్యక్తులు నాలో కవితావేశాన్ని పెంపొందించిన సహృదయులు.

**రచయిత**

# ఆమోదము

ఆచార్య-విద్వాన్
శ్రీ దివాకర్ల రామమూర్తి
రిటైర్డ్ ప్రిన్సిపాల్-ఎ.వి.యన్ కళాశాల
విశాఖపట్నం 10-3-1995

"చరితం రఘునాధస్య - శతకోటి ప్రవిస్తరమ్
ఏకైక మక్షరం ప్రోక్తం మహా పాతక నాశనమ్".

సర్వ లోకాభిరాముడు శ్రీరాముడు. ఆవేద వేద్యుడు దశరథ తనయునిగా జన్మించాడు. వేదము ప్రాచేతసు డయిన వాల్మీకి మహర్షిచే రామాయణముగా నవతరించినది. వాల్మీకి రామాయణ సత్కథా సుధా రసమును గ్రోలి తనియనివాడు తరింపనివాడు ఉండడు. ఆ మహామహుని రామకథను గ్రోలి పరవశులై తన్మాధుర్యమును స్వభాషలో వెల్లరిచే నాస్వాదింపజేయపలయునని యెందరెందరో తమతమ భాషలలో ననువదించిరి. ఒక్కొక్క అనువాదము ఒక్కొక్క రచనా మాధుర్యమున పొదుగబడినను వాల్మీకి రచనా శిల్ప సౌందర్యాదులను పూర్ణముగా ప్రకటింపలేకపోయినది. ఇది ఆయా రచయితలను కించపరచుటకు ఆడిన మాటలు కావు, వాల్మీకి మహాకవి రచనా విన్యాస మట్టి అద్వితీయ ప్రతిభను కలిగిన దనుటయే.

ఆంధ్రభాషలో లెక్కకు మించిన రామాయణానువాదములు ఉన్నవి. శ్రీ భాస్కర రామాయణము; శ్రీగోపీనాథ రామాయణము; శ్రీరంగనాథ రామాయణము; శ్రీమొల్ల రామాయణము; శ్రీవిశ్వనాథ రామాయణ కల్ప వృక్షము; శ్రీగణపతి రామాయణ సుధ; ఇవికొన్ని మాత్రమే. బహు విధ కావ్య ప్రక్రియలలో పద్య కావ్యములుగ; గద్యలుగా; ద్విపదలుగా; కీర్తనలుగా; నాటకములుగా; హరికథలుగా; బుఱ్ఱకథలుగా మారి యెన్నిటిగానో రామాయణము వెలసినది. వాని వాని ప్రత్యేకతలు వాని కున్నవి. అన్నియును యించుమించుగా జనాదరణము పొంది నవియే, రామాయణము మధురము - మధురాక్షరము. వాల్మీకి యెక్కడ? గోపినాధుడెక్కడ? నేనెక్కడ? అని భావించి రచన

మానినవాడు లేడు. రామకథా మాధుర్య మట్టిది. కవిగా ధన్యతవహింప వలెనన్న రామాయణము నేదియో యొక ప్రక్రియలో వ్రాసి తరించిన వారే. రాముని స్మరించిన వారే.

ఈ కాలములో పద్య కవిత్వమునకు ఆదర మున్న దనుడు. లేదనుడు. రామాయణము మాత్రము హృద్య పద్య శైలులలో అవతరించుచునే యున్నది. అట్లే అవతరించినదీ రఘురామ రామాయణము. చి॥ నూవుడూరు రఘురామయ్య దీనిని రచించెను. రఘురామయ్య శ్రోత్రియుడు. వంశ పరంపరయా రామ భక్తుడు. సారస్వతాభిమాని. కవి. ఆవేశపరుడు. ఇంతకు పూర్వమే మేఘ సందేశమును తేట గీతులలో వ్రాసి శ్రోత్రజన ప్రీతి సంపాదించినాడు. అంతర ప్రేరణ పురస్సరముగా రామాయణ రచనమునకు దీక్ష వహించినాడు. ఆశ్చర్య పడితిని. వాల్మీకి వంటి మహాకవి కావ్యమును అనువదింప గలడా యని సందేహ పడితిని. ఎంత కాలము పట్టును తుది వరకు సమర్థింపగలడా యని. ముద్రిత గ్రంథాన్ని చూశాక ఫరవాలేదని అనిపించినది. రఘురామయ్య ముందుగా తానూహించిన ప్రకారము రచనమును పూర్తి చేసినాడు. గోపినాథ రామాయణమును అనుసరించినట్టుగా తోచినది.

రామాయణ ప్రారంభమును పూర్వ వృత్తాంతముతో గాక కథతో ప్రారంభించి రచన కొక సౌందర్యమును సమకూర్చినాడు. యోగినీ ఋక్షబిలవృత్తాంతము వాల్మీకమున లేనిదైనను వివరించెను. సీతాకళ్యాణము మంథర దశరథుని విలాపము - పట్టాభిషేక భంగము-లక్ష్మణుని కోపము రాముని అనునయము - మొదలైన ఘట్టము లన్నియు సహజముగా సాగినవి. ఆయా పాత్రల గుణములు ప్రత్యేక దృష్టితో చిత్రింప బడినవి అనుటకు సందేహము లేదు. వర్ణములు దీర్ఘములు కావు. హృదయమునంటు కొని తత్కథా సరళిలో నిమగ్నము చేయు నట్టివిగా నున్నవి.

పట్టాభిషేక భంగమును పురస్కరించుకొని కైకేయి పై విపరీత కోపము పూనినలక్ష్మణు ననునయించుచు రాముడు ఇట్లనెను.

రాజ్యమది చూడగా వీర భోజ్యమగుట
సత్యమే - యైన ప్రాకృత జనుని భంగి
శమ దమాదిక సత్యలక్షణము తోడ
స్వీయ ధర్మము వీడ వివేకమగునె?

ఇందు రాముని ధర్మ తత్పరత - నిగ్రహము - అల్పాత్వక్షర పదములతో చక్కగా నిరూపింప బడినది.

రామాయణము రాముని కథ. రాముని శీల చిత్రము మూలమున నున్నట్లు మనోజ్ఞముగా రచింపబడినది. చూడుడు.

"కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్య వాక్యో దృఢవ్రతః
చారిత్రేణచ కోయుక్తస్సర్వభూతేషు కోహితః
విద్వాన్ కః సమర్థశ్చ కశ్చైక ప్రియదర్శనః
ఆత్మవాన్ కోజిత క్రోధో ద్యుతిమాన్ కోనసూయకః
కస్య బిభ్యతి దేవాశ్చ జాత రోష స్యసంయుగే.

ఇది రాముని గుణము. ఈ గ్రంథమున రఘురామయ్య యీ గుణములను రాముని యందు ఆయా ఘట్టములలో చాల నిపుణముగా నిరూపించినాడు. రఘురామయ్యకు రాముడే హృదయము. తన హృదయాధి దేవతనే చిత్రించినాడు. కృతకృత్యుడైనాడు.

హనుమద్రామ సమాగమము - వాలిసుగ్రీవుల యుద్ధము మున్నగు ఘట్టములు మనోహరముగా సాగినవి. వర్షఋతు వర్ణనము హృదయంగమముగా నున్నది.

సుందరకాండ రచన బహుసుందరముగా నిర్వహింపబడినది. అందుఒక్కొక్క సన్నివేశమున కవిచూపిన ప్రజ్ఞ కొనియాడ దగియున్నది. తన్ను తాను మరచిపోయి రచించినాడు. అతని తన్మయత్వము నియమపాలనమును విస్మరింపలేదు, నిగ్రహముతో రచన సాగినది

జయమంత్రమును అనువదించినాడు. రాక్షసులతోడి యుద్ధము రమ్యముగ వర్ణింపబడినది. యుద్ధకాండ సంక్షిప్తముగ మనోహరముగ వర్ణింపబడినది. ఆదిత్య హృదయము గూడ చక్కగా సాగినది.

రామాయణము నందలి ఘట్టముల నన్నింటిని వదలక నిగ్రహమున వర్ణించి - తన నిశిత వివేకమున విసువు జనింపకుండ కథను సాగించి కథాంతర్గత విశేషములను మనోహరముగా వాకొనినాడు. ఔచిత్యమైన సులభ సుందర రచనమగు యీ రఘురామ రామాయణము కొనియాడదగి యున్నది.

రామాయణము రాముని కావ్యము. రాముడే అధినేత. అందుచే నెవ్వరికి కృతియొసంగవలయునను ప్రశ్న రాలేదు. రాముని పరముగావించినాడు. అయినా ఎవరికి తన రామాయణమును వినిపింపవలెనను ప్రశ్నయుదయించినది. ఆంధ్రుల హృదయాస్థానమున నెలకొనియున్న మహోదార రసజ్ఞ శక్తి యొక్కడు. ఆంధ్రమాతకు ముద్దు బిడ్డడు-ఆంధ్రులందరికి ప్రేమపాత్రుడు- రామ మయ జీవితుడు - రామాదర్శమును నిర్వహించినవాడు రామ కథను తనజీవిత లక్ష్యముగ నెన్నుకొనిన వాడు సహజ సౌశీల్య సుందరుడురామభక్తుడు - రామ విప్రవాసమును రచించిన వాడు - రామాయణభారత భాగవత స్వరూపుడు - అయిన శ్రీతెన్నేటి విశ్వనాథ మహోదయులకు.

విశ్వ విఖ్యాత తెన్నేటి విశ్వనాథ
అవధరింపుము నాదు రామాయణమ్ము

అని భక్తి పూర్వకముగావినిపించి స్వర్గీయ విశ్వనాథముగారి పై గల తన భక్తిని ప్రదర్శించుకొనినాడు.

శ్రీవిశ్వనాథముగారు స్థాపించిన శ్రీవిశాఖ సరస్వత వేదిక యెందరినో కవులను సృజించినది. ఎందరి చేతనో కావ్యములు రచింపజేసినది. ఎందరినో గుణగ్రహణ పారణులుగా తీర్చి దిద్దినది. ఆ శ్రీ తెన్నేటి విశ్వనాథముగారికి_వారి కభిమతమైన సహజ సులభ సుందర రచనలో సాగించిన రఘురామ రామాయణమును వారి శతాబ్ది ఉత్సవసందర్భంలో వినిపించుట ఎంతయో సమయోచితముగా నున్నది.

తెనుగు జాతీయములను - తెనుగు నుడులను - విశేషముగా వాడ వలయునను భావము ప్రశంసనీయము. కాని యందందు కొన్ని శాబ్దిక దోషములు దొర్లినవి. అయ్యవి కావ్యానందము ననుభవించుట కడ్డంకులు కావు. రసదృష్టి ప్రధానము. అనర్గళ కథాగమనమున దృష్టి పరిధానము. ధర్మ స్ఫూర్తి ప్రముఖము; అందుచే ఆ స్వల్పదోషములు చంద్రుని యందలి మచ్చవలె సౌందర్యభంజకములు కావు.

చి॥ రఘురామయ్య మంచి ఆవేశపరుడు. ఆంధ్రత్వము మూర్తీ భవించిన వ్యక్తి. వీర పూజాభిమాని, వృత్తి యొకటి - ప్రవృత్తి వేరొకటి. వృత్తిని వీడలేదు. ప్రవృత్తి అయిన సరస సాహిత్య ప్రియత్వమును మానలేదు.

> పూర్వ కవికుల గురుని రామాయణమును
> తేట గీతి మనోజ్ఞ విధిని రచించి
> ఋషి ఋణము తీర్చుకొన్న కవీశవర్య
> శ్రీయుతుని రఘురామునాశీర్వదింతు.

—o—

విశాఖపట్నం
16-2-95

## ఆశీస్సు

కవిశేఖర - మధురకవి - ప్రసన్న భారతీ
పత్రికా సంపాదకులు
శ్రీ కొండేపూడి సుబ్బారావుగారు.

సకల సంపత్ప్రదము మానవ ధర్మాచరణకు మార్గదర్శకము అయిన శ్రీ సీతారాముల చరితమును వ్రాసిన శ్రీ మావుడూరు రఘురామయ్యగారు ధన్యులు. రచన అద్యంతము సుందరమునైన గీత పద్యములలో సాగినది. ఈ గ్రంథమునకు బహుళ ప్రజాదరణ లభింప గలదని విశ్వసించుచున్నాను.

విశాఖపట్నం
20-2-95

# మంగళా శాసనము

ఉభయ వేదాంత ప్రవర్తక - ప్రవచన శిరోమణి
శ్రీ భాష్యం అప్పలాచార్యులు
ఎమ్ ఐ జి 61/ఎ - సీలానగర్ విశాఖ-12

భారతజాతి భాగ్య వశంచేత వ్యాస వాల్మీకి మహర్షులు అందించిన అమూల్య నిక్షేపాలు భారత రామాయణాలు. మానవజన్మ దుర్లభం. అందున భారతదేశంలో జన్మించటం మహాభాగ్యం. జన్మించిన సంసారికమైన పరిధి నుండి బయల్పడి భారత రామాయణ వాఙ్మయము పైపు మనసు ప్రసరించుట సుకృత పరిపాకంచేగాని జరుగదు. వేద వాఙ్మయము తరువాతలోకంలో జీవితాన్ని సవ్యమైన మార్గంలో పయనింప జేసి లక్ష్యాన్ని చేరటానికి సాహాయపడే రెండు మహాగ్రంథాలు భారత రామాయణాలు. రెండును వేదమువలె పవిత్రములు - పుణ్యదములు- పాపహరము లు. భారతము మానవ జీవితంలో సంభవించే ఒడుదుడుకుల నన్నిటినీ సూచిస్తూ ధర్మస్వరూపాన్నెరింగించి; దానిని అలంబనంగా చేసికొని; నిలువబడి అధర్మాన్ని ఎదిరించటం ఎంత కష్టమో నిరూపించింది. దైవబల ముంటేనే అధర్మాన్ని ఓడించ గలమని నిరూపించింది భారతం.

శ్రీమద్రామాయణం దైవం - జ్ఞానం అంతరంగ అంతర్బాహినుపై సాగాలని -నడవడి జీవితానికి ముఖ్యమని - నడవడి లేని జ్ఞానం హానికరమని నిర్దేశిస్తుంది. మానవునికి ప్రధానమైనది ఆచరణ. ఆచరణ లేని జ్ఞానం- శవాభరణం. మంగళకరం కాదు. మానవుడు ఐహికంగా ఆముష్మికంగా పొందవలసిన సుఖాలను పొందటానికి ఎలా నడవాలో - పారమార్థికమైన పరమ ఆనంద ధామాన్ని చేరటానికి ఎలా ప్రవర్తించాలో నడచి నేర్పినవాడు శ్రీరామచంద్రుడు. ఆ శ్రీరామచంద్రుని దివ్యచరితాన్ని మనకందిచినది శ్రీరామాయణం. శ్రీరామచంద్రుడు మానవుడు. శ్రీరామాయణం కావ్యం. సీతాదేవి నారీమణి. వారిని చూచి మానవుడెట్లా ప్రవర్తించాలో నేర్చుకోవాలి. భారతదేశానికే కాదు - యావత్ప్రపంచానికి

అధ్యయనం చేయవలసిన గ్రంథరాజం శ్రీరామాయణం. భారత
దేశంలో రామనామం పలుకని వాడు _ రామ కథను వినని వాడు
ఉండడు. కోయిల కూత వినగానే అనుకరించాలని బుద్ధి పుట్టు నట్లు
రామకథ వినగానే మరల పలకాలని అనిపిస్తుంది. కవులకు కావ్య వస్తు
వుగా స్వీకరించటానికి ఎన్నో కథలున్నాయి. కాని జన్మాంతర సంస్కార
విశేషంచేత కొందరు కవులకు మాత్రమే రామకథ మనసు నాకర్షిస్తుంది.
వారి వాక్కు రామాయణ రచనచే సార్థకమవుతుంది. దానిచే వారి
ప్రాచీన సంస్కారం అవిష్కృతమై లోకానికి ఉపకరిస్తుంది. శబ్దం
అర్థం-రసం – గుణం _ రీతి - శయ్యాపాకం మొదలైన కావ్య లక్షణాలు
అన్ని కావ్యాలలోను ఉంటాయి. కాని వానిని రామకథా ప్రతిపాదకమైన
కావ్య రచనకు వినియోగించిన కవి మహాకవి.

చి॥ రఘురామయ్య సంస్కారవంతుడు. తనకున్న కవితా సామగ్రిని
రామాయణ రచనకై వినియోగించి ధన్యుడైనాడు. కావ్యానికి అవసర
మైన ప్రసాదగుణం - స్పష్టత - మాధుర్యం ఇతని కావ్యంలో ప్రస్ఫుటంగా
గోచరిస్తాయి. ఇది అనువాదం కాదు. కథ ప్రాచీనమే. కాని కావ్యం
రఘురామయ్య స్వంతమే. ఇష్టంగా అనుభవించి – అనుభవించిన
దానిని ఆవిష్కరించిన తీరు ఇతని రచనలో గోచరిస్తుంది. కాని శబ్దార్థ
ఆడంబరాలకు ఇతని వాక్కు ఇష్టపడదు. రామాయణం సంస్కృతంలో
సులభమైన కావ్యం. సాధారణమైన సంస్కృత జ్ఞానం కలవారికి గూడా
అర్థమయేలా వ్రాశాడు వాల్మీకి మహాకవి. ప్రసన్నత-మాధుర్యం జంటగా
కన్పిస్తాయి వాల్మీకి రచనలో. చి॥రఘురామయ్య కూడ దైవదత్తమైన
కవితావేశాన్ని మహాకావ్య రచనకు వినియోగించాడు. ఆడంబరాల జోలికి
పోలేదు. తేటతనమే ఇతని కవిత్వానికి ప్రథమ లక్షణం. భక్త్యావేశం
ఇతనిని ప్రేరేపించినది. జీవితాన్ని ధన్యత నొందించు కొనుటకు వ్రాసి
చరితార్థతనందినాడు స్థాలీపులాక న్యాయంగా అక్కడక్కడ కొన్ని ముఖ్య
ఘట్టాలలోని పద్యాలు మాత్రం విన్నాను. నన్నాకర్షించినది. అసందిగ్ధ
మైన భావావిష్కరణము. నిండైన రచన, చక్కని నడక. వానిని చూచి
శ్రీ రామచంద్రుని అనుగ్రహం ఇతనిపై పరిపూర్ణంగా కలదని భావించి
కావ్యానికి ముందుమాట పలకటానికి తగిన కావ్యరచనా నైపుణిలేని వాడ

సైనను ఏవో రెండు మాటలు అభినందిస్తూ వ్రాయాలని సిద్ధపడినాను. శ్రీసీతారామచంద్ర ప్రభు చి॥ఘురామయ్యకు సన్మార్గ వర్తనాన్ని ఉత్తమ సంస్కారాన్ని ప్రసాదించి యిటువంటి విశ్వశ్రేయమును కలిగించు ఉత్తమ కావ్యములను రచించు నట్లు అనుగ్రహించును గాక అని మంగళా శాసనము చేసి విరమించుచున్నాను.

(○)

## ఆశంస

కళాప్రపూర్ణ చర్ల గణపతిశాస్త్రి
లలితా ఆర్ట్ ప్రెస్–విశాఖ.
15–2–95

చి॥ రఘురామయ్య శ్రీగోపీనాథ రామాయణము ఆధారంగా సంగ్రహముగా రఘురామ రామాయణము రచించిరి. ఇది సులభశైలి తేట గీతులలో తేటతెనుగులో వ్రాసిరి. ఏమాత్రము తెనుగు తెలిసిన వారికైనా అర్థమగు పద్ధతిలో రచనసాగినది. మచ్చునకు కొన్ని పద్యములు - రాముని పట్టాభిషేక వార్త విని కైకతో మంధర అన్నమాటలు.

వింటివాకైక! వీనులు ప్రీలు వార్త
రాముడటరాజు మనకందరకును నింక
పరగ పట్టాభిషేకము జరుగు రేపు;
జనములుప్పొంగుచున్నారు సంతసమున.

ఆమాటలు విని మొదట సంతోషముతో మంధరకుకైక నగను బహుమాన మిచ్చినది. అపుడు మంధర విషపూరిత దరహాసముతో నిట్లన్నది.

సవతి కౌసల్య పద సరోజముల చెంత
దాసివై హీనగతి నీవు దోసిలొగ్గి
కొడుకుతో దీనతనమున కొలుపు సలుపు
కాలమాసన్నమైనదే బేలసేడు - అని

రాముడు కిష్కింధకు వెళ్లినపుడు సీతజారవిడచిన నగలను సుగ్రీవుడు చూపెను; అప్పుడు రాముడు ఆ నగలుచూచి సీతవని పోల్చి చూచువారలకు జాలి కలిగేటట్లు విచారించుట యిలావర్ణింపబడి.

అనుచు హరివడదిగ్రిగుహాంతరమ్ము
జొచ్చి – నగలున్న మూటను దెచ్చి – రాము
మ్రోలనిడ – సీతవని పోల్చి జాలిగొలుప
కనుల నీరమునించె నాకరుణమూర్తి.

కాని మూలములో రాముడు తన కన్నీళ్లచే తాను చూడలేక లక్ష్మణుని చూడమన్నట్లున్నది. లక్ష్మణుడు కాలి యందెలను పోల్చి – ఇతర భూషణములు తెలియవనెను. యీవిధముగ అక్కడక్కడ కొన్ని మార్పులు గలవు.

వీరి రచన సరళ సుందరముగ సాగినది. దీనిని ప్రజలు ఆదరింతురు గాక. వీరికింకను నిట్టి రచనలు చేయగలశక్తిని ప్రసాదింపమని ఆ భగవంతుని ప్రార్థిస్తున్నాను.

((*))

## మందారం


ఆచార్య వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి
ఎం. ఏ (సంస్కృతం) ఎం.ఏ.పి హెచ్.డి
తెలుగు శాఖ
ఆంధ్రవిశ్వకళా పరిషత్తు – విశాఖ–3

శారదాపీఠం
46–15–35, మండావారి పేట
విశాఖపట్నం – 530016
తే 27–2–95


శ్రీమద్రామాయణాన్ని రచించి వాల్మీకి మహర్షి సంస్కృత సాహిత్యానికి శ్రీకారం చుట్టినాడు. ఆ కారణంగా రామాయణం ఆది కావ్యంగా ప్రశస్తి పొందింది. ఒక్క సంస్కృత సాహిత్యంలో నే గాకుండా సర్వ భారతీయ సాహిత్యాలలో కూడా ఆ మహాకావ్యం ఆది కావ్యమే.

వేదవేద్యుడైన పరమపురుషుడు దశరథాత్మజుడైన రాముడుగా అవతరింపగా వేదమే శ్రీమద్రామాయణంగా అవతరించినదని పౌరాణికోక్తి.

"వేద వేద్యే పరేపుంసి జాతేదశరథాత్మజే
వేదః ప్రాచేత సాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా"

సకలగుణ పరిపూర్ణుడూ పరమాత్మా అయిన రామచంద్రుని నామం ఎంతో పవిత్రమైనదనీ - సర్వపాపహరమనీ భారతీయుల విశ్వాసం. రామ శబ్దంలోని "రా" అనే అక్షరాన్ని ఉచ్చరించినంత మాత్రంలో దేహ పంజరం నుండి సర్వపాపాలు తొలగి పోతాయనీ - "మ" అనే అక్షరాన్ని కూడా రా అనే అక్షరంతో కలిపి పలికితే తొలగి బైటకు పోయిన పాపాలు భస్మీపటలం అవుతాయి అని పెద్దలు ఇలా ప్రవచిస్తారు;

రా శబ్దోచ్చారణే జాతే వక్త్రాత్ పాపం విగచ్ఛతి
మకార శ్రవణే జాతే భస్మీభావం గమిష్యతి.

రామ తత్వాన్ని గ్రహించడానికి పరమాధార మైనది - శ్రీమద్రామాయణం. పండితులు రామాయణం అనే పదానికి "రామః అయ్యతే ప్రాప్యతే అనేనేతి రామాయణమ్, రామస్య అయనం స్థాన మితి రామాయణమ్" అని వ్యుత్పత్తి చెప్తారు.

రాముని ప్రసక్తే లేకపోతే అది పురాణం కాదు; సంహిత కాదు; ఇతిహాసము కాదు; కావ్యం కూడా కాదు; అని స్కాందపురాణంలో ఇలా చెప్పబడింది.

నతత్ పురాణం నహి యత్ర రామః
యస్యాం నరామో నచ సంహితాచ
న చేతి హాసం నహి యత్ర రామః
కావ్యమ్ నతత్ స్యాత్ నహి యత్ర రామః.

వాల్మీకి తన రచనకి రామాయణం - సీతాచరిత్రం - రావణ వధ అని మూడు పేర్లు పెట్టినట్లు "కావ్యం రామాయణం కృత్స్నం సీతా

యాశ్చరితమ్ మహత్ - పౌలస్త్య వధ మిత్యేవ చకార భగవాన్ ఋషిః" అనే శ్లోకం ఆధారంగా భావింప వచ్చును. కాని రామాయణంఅనే పేరే లోకంలో బహుళ ప్రచారంతో ఉంది.

శ్రీమద్రామాయణం వేద తుల్యమైనది వైదికధర్మ ప్రతిపాదక మైనది. సంసార సముత్తరణ సమర్థకమైనది కాబట్టి సంస్కృతంలోనూ ఇతర భారతీయ భాషలలోనూ ఎందరో కవిపుంగవులు ఎన్నెన్నో ప్రక్రియలలో ఎన్నెన్నో కల్పనలతో రామకథను రచిస్తూనే ఉన్నారు. రామాయణ రచనకు వాల్మీకిని ప్రోత్సహిస్తున్న బ్రహ్మ - రామకథ భూమిపై నదులు నదులుగా - పర్వతాలు పర్వతాలుగా ఉన్నంత కాలం ప్రచారంలో ఉంటుందని - "యావద్ స్థాస్యంతి గిరయః సరితశ్చమహీతలే - తావద్రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి" అని చెప్పడం ప్రత్యక్షరం సత్యబద్ధమని స్పష్ట మౌతోంది.

ఆంధ్రసాహిత్య చరిత్రలో ఆధునిక యుగం అత్యంత విలక్షణమైనది. పాశ్చాత్య సాహిత్య ప్రభావం చేత ఎన్నో నవ్య సాంప్రదాయాలు తలెత్తి విజృంభిస్తున్నా ప్రాచీన సాహిత్య సాంప్రదాయాలు కూడాభాసిస్తూనే ఉన్నాయి. కవి సామ్రాట్టుతో పాటు కవి చంద్రులు కూడా రామకథను పద్య కావ్యంగా రచిస్తున్నారు.

మాన్యశ్రీ రఘురామయ్యగారు సహృదయ శిరోమణులు. నిరంతర పద్య రచనా తత్పరులు. మేఘదూతాన్ని ఇతః పూర్వం తేట తెల్లంగా తెనిగించిన కవిలోక చూడామణులు. వారి ప్రధాన వృత్తి సాహిత్యంతో ఏమాత్రమూ సంబంధం లేనిదే అయినా ప్రవృత్తి మాత్రం సాహిత్య సంపన్నం. ఈనాడు 2780 గీత పద్యాలలో రామాయణాన్ని రఘురామ రామాయణం అనే పేరుతో రచించడం పరమాభినంద్యం.

భారతరాజకీయ రంగంలో అత్యంత విశిష్టమైన స్థానాన్ని అలంకరించిన స్వర్గీయ డా॥ తెన్నేటి విశ్వనాథముగారికి శ్రీరఘురామయ్యగారు ఈ రామాయణాన్ని వినిపిస్తున్నట్లు-

విశ్వ విఖ్యాత తెన్నేటి విశ్వనాథ
అవధరింపుము నాదు రామాయణమ్ము

అని రచించడం విశేషం. అత్యంత ప్రశంసార్హం కూడా. దీనిని బట్టి కవిగారికి శ్రీతెన్నేటి వారిపై గల గాఢ గౌరవాదరాలు ఎంతటివో విశద మౌతోంది. తన మహాభారత రచనని నన్నయ రాజరాజ నరేంద్రునకు శ్రవణగోచరం చేసిన విధం ఈ సందర్భంలో స్మరింప వలసి ఉంటుంది.

విషయాన్ని విస్పష్టంగా వినిపింటానికి గీత పద్యం ఎంతో అనుగుణమైనది. సామాన్య పాఠక లోకాని రామకథని సులభ సుందరంగా పరమ మధురంగా నివేదించటానికి గీతపద్యం సముచితమైనదని కవిగారు గుర్తించడం బహు ప్రశంసార్హం. రామాయణంలోని ప్రతి సన్నివేశాన్ని క్లుప్తంగా – మంజులంగా గీతపద్యంలో నిబంధించిన శ్రీ రఘురామయ్యగారు కృతకృత్యులు.

సీతారాముల కళ్యాణానంతరం వైభవోపేతంగా సపరివారంగా అయోధ్యకు వెళ్తున్న దశరథుని అడ్డగించి శివధనుర్భంగానికి రామునిపై పరశురాముడు ఆగ్రహించిన విధం ఈ రామాయణంలో ఇలా అభివర్ణింప బడినది.

రాముడెవ్వడు మీ యందు? రమణి సీత
కొరకు పశుపతి కార్ముక మరయ విరచి
మేటి నన్ని గర్వమందు నామేటి జూడ
వచ్చితిని భార్గవుడ నంచు బలికి మరల

జీర్ణమగు శంభు చాపము క్షితిప వంశ్య!
భంగ మొనరించి ఘనమని బహు విధాల
విఱ్ఱవీగుచు నుండెడి వెఱ్ఱి రాము
బల పరీక్షను జేయ నేవచ్చితి నన.

పదబంధం సరళంగానే ఉన్నా – పరశురాముని ఔద్ధత్యం విశదమౌతునే ఉంది. మీ యందు రాముడెవడు అని అడగడం నాటకోచితం. పరశురాముని ఆగ్రహాన్ని సూచిస్తోంది.

## XVII

శ్రీరాముని వనవాస వృత్తాంతాన్ని విని దుఃఖిస్తున్న కౌసల్యను ఓదారుస్తున్న రాముని వాక్యాలు చాలా సమంజసంగా ఉన్నాయి. ఆ వాక్యాలు విని కౌసల్యా పరితాపానికి సంక్షుబ్ధ మనస్కుడైన లక్ష్మణుడు రామునితో యిలా అంటాడు.

లక్ష్మణుడు తక్షణమె అన్న రాము గాంచి
కోప సంజనితారుణాక్షుండు నగుచు
గుండె రగిలించి సంక్షుబ్ధ కోప వహ్ని
వెలికి గ్రక్కుచు నన్నతో పలికె నిటుల.

ధర్మమని అన్న పలుమార్లు తడవనేల"
జనహితుండును ధార్మికు డనఘు మఱియు
గుణ విశిష్టుండు ముద్దుల కొడుకు నిటుల
వనములకు బంప ధర్మ ప్రవర్తనమ్మె?

"కోప సంజనితారుణాక్షుండు నగుచు గుండె రగిలించు సంక్షుబ్ధ కోప వహ్ని' వెలికి గ్రక్కుచు అనుటలో లక్ష్మణుని ధీరోద్ధత స్పష్టం అవుతోంది. ముద్దుల కొడుకుని అరణ్యాలకు పంపటం దశరథునకు ధర్మమేనా అని ప్రశ్నించటం పాత్రోచితంగా ఉంది.

సీతారాములు అరణ్యవాసం చేస్తున్నప్పుడు శూర్పణఖ రాముని చూసి కామించి అతనిని సమీపించి తనగురించి ఇలా పరిచయం చేసుకుంటుంది.

భీకరాకారు డఖిల లోకైక వీరు
డసుర పతి రావణుడు లంకాధిపుండు
మూడు జగముల శాసించు ముఖ్య డమర
పూజితుడు బుద్ధి బలుడుగ్ర భుజబలుండు

రాక్షసుల కెల్ల సామ్రాట్టు రావణుండ
సుర గణము లెల్ల నాతని చుట్టు జేరి
దాస్య మొనరించు చుండు నా దైత్య పరుని
అనుగు చెల్లెలన్ నన్ను శూర్పణఖ యంద్రు

ప్రత్యే రావణుని చెల్లెలవడమే శూర్పణఖ విశిష్టత, రావణుని స్వరూప స్వభావాలు సంక్షేప పరచి రామచంద్రునికి ముందుగా నిరూపింప బడ్డాయి. ఆమెకు ఎట్టి అవమానం సంభవించినా రావణుడు ఆదుకోగలడని కూడా వ్యంగంగా సూచింప బడింది. రాముని రూప సౌభాగ్యానికి శూర్పణఖ ఎలా మోహాన్ని పొందుతోందో ఈ సందర్భంలో రామునికి యిలా తెలుపు కొంటోంది.

దాపగా నేల? ఓ రాజ! దగిలెనిపుడు
నామనమ్మది నీయందు ప్రేమ యనగ
నిదియె కాబోలు! కాకున్న నింత గాథ
హృదయ సంసక్తి చెలరేగి యేచు నయ్య.

నీదు లావణ్యము-వయస్సు-నీదు పొగసు
గాంచి నంతనె నిను పొంద కాంక్ష కలిగె
కామకేళికి నావంటి కాంత రసిక!
దొరక బోదెందు నీకు నిద్ధరణి యందు.

భర్తృ వియోగ ప్రాప్తించినప్పటి నుండి బహుశ శూర్పణఖ భక్ష్య భోజ్యాదులతో జీవితాన్ని గడపడమే గాని కామ తంత్రంతో గడపి యుండదు. "పుంసాం మోహన రూపాయ" అనేటట్లు ఆజానుబాహుపైన రాముడు కనబడంతో భర్తృ వియోగాన్ని కూడా మరచిపోయి అతనితో కామకేళితో వినోదించాలని సంకల్పించడం గమనార్హం. స్త్రీపురుషుల మనస్సులు కలియడం ప్రేమ అన్న తత్వం చక్కగా ఇక్కడ ప్రతిపాదించబడింది. స్త్రీ పురుషుని కామించడానికి ప్రధాన లక్షణాలు లావణ్యము - వయస్సు - పొగసు. అనే మూడు అని కవి పేర్కొనడం చమత్కారావహం. ఓ రసిక! రామ! నా వంటిది కామకేళికి నీకు భూమిపై ఎక్కడా దొరకదయ్యా అని చెప్పడంలో శూర్పణఖ యొక్క రాక్షసరతి వెల్లడి అవుతోంది. ఇలా యింకా యీఘట్టం ఎంతో పట్టుగా రచింప బడడం అభినందనీయం.

తన కోరిక నిరాకరింప బడి ప్రతిఫలంగా విరూపత ఎప్పుడైతే ప్రాప్తించిందో వెంటనే శూర్పణఖలో రామునిపై ప్రతీకారవాంఛ

మిక్కుటమైంది. రావణుని చేత రామచంద్రుని పై గల పగ సాధించాలని నిశ్చయించింది. జగద్విదితమైన అన్న కొలువునకు వెళ్లి సీతా సౌందర్యాన్ని ఎంతో మనోహరంగా ఇలా వర్ణించింది.

అన్నా! ఆ రామపత్ని సీతమ్మ అంద
మపని యెందును గాన మయ్యనిమిషాది.
గరుడ గంధర్వ సిద్ధ లోకముల యందు
ఆమె సౌందర్య మతిలోకమై వెలుంగు.
మెరపు తీపల గికురించు మేనికాంతి
వాలుగల సౌరు కొల్లగొన్న వాలు కనులు
ముగ్ధ మోహన వదనము మురుపు లొలుకు
రమణి – సీతమ్మ యొక అపరంజి బొమ్మ.

కళ్లకు కట్టినట్లుగా సీతమ్మ సౌందర్యాన్ని శూర్పణఖ నోట పలికించాడు రచయిత. రావణునకు సీతపై గాఢమయిన అనురాగం కలగడం. వెంటనే సీతను తెచ్చుకోడానికి ప్రయత్నించడం భావికథ. ఇంకా సీతా రూపవైభవాన్ని శూర్పణఖ "మదను నారప ములికియై మహి వెలంగు – శశిని వీడక యుండెడి చంద్రిక వలె"…. మొదలైన విధంగా అభివర్ణించడంలో సీత యొక్క అతిలోక సౌందర్యాన్ని అద్భుతంగా నిరూపించారు మన రఘురామయ్యగారు.

లంకా పట్టణంలో అశోకవనంలో పరమ దైన్యస్థితిలో ఉన్న సీతను హనుమ చూస్తాడు. అప్పటి ఆ సీతారూపవర్ణనం అందంగా ఇలా నిర్వచించ బడింది.

మలిన చేలమ్ము ధరియించి మహిత దుఃఖ
భార మెదగ్రమ్మ శ్వాసంపు బరువు చేసి
వదన కమలమ్ము వసివాడ ముదము బాసి
నశ్రుపులు ధారగా గార్చు నతివ గాంచె.

చదల మబ్బులు గ్రమ్మిన చంద్రు వగిది
పొగలు గ్రమ్మిన ప్రళయాగ్ని సెగ విధాన

పంక మలమిన కాంచన పద్మ మట్లు
కళలు వాడిన యొక పుణ్యకాంత గనియె.

పరమ పతివ్రతయైన సీత రావణ బద్ధయై మలిన వస్త్రంతో–కన్నీళ్ళ ధారతో కాంతి విహీనంగా ఎలా ఉందో చక్కగా వర్ణింప బడింది. ఇంకా.

శ్వానముల మధ్య జిక్కిన దీనహరిణి
కరణి బహుదుష్ట రాక్షస కామినులకు
జిక్కి- యుపవాస నియతి కృశించి యున్న
ఏక వేణీధర గనె వసై కచరుడు.

రాక్షసాంగనల మధ్య భయపడుతూ – ఏక వేణితో కృశించి ఎలా ఉందో కూడా ఉపమాన పూర్వకంగా వర్ణింపబడింది. ఈ విధంగా యీ రామాయణంలో పాత్రల భిన్నభిన్న మానసిక స్థితి గతులు ఎన్నో సందర్భములలో పరమాహ్లాద కరంగా చిత్రింప బడ్డాయి.

రావణుని తేజోవంతమైన రూపాన్ని చూచిన రాముడు పొందిన విస్మయం ఇలా వర్ణింప బడింది.

అహహ! యేమి యీ బ్రహ్మ దీప్త్యాననమ్ము
గలుగ వశమౌనె యెవ్వారికైన భువిని
గొప్ప ఘా వుండు గాకున్న కలరె సములు?
చాలడే మూడు భువనాల నేల నితడు

అని వితర్కించి రావణు నభినుతించి
ఇట్టి నీచత్వ మీతని కెవ్విధాన
కలిగె ననినంతి రాముండు తలచి తలచి
చాల విస్మయమును బొందు వేళ యందు.

భార్యాపహర్తయైన శతృవులోని గుణసంపదను కొనియాడటంలో ఆతని ఔన్నత్యం విశద మౌతోంది.

ఈ విధంగా నిశితంగా పరిశీలిస్తే ఈ రఘురామ రామాయణం రామకథా తత్వాన్ని సులభ సుందరంగా తేటతెల్లంగా గీత పద్యాలలో

ఆవిష్కరిస్తోందని అంగీకరింపక తప్పదు. భాష సులభ గ్రాహ్యం భావాలు పరమ రమణీయాలు, ఎల్లయెడల వైశద్యం వెల్లి విరుస్తోంది. రామకథను సర్వజనులకు కరతలామలకం చేసిన మాన్యశ్రీ "రఘురామయ్య గారి కవితా వ్యాసంగం సర్వజన సమాదరణీయం" పరమ ప్రశంసార్హం. బహుధా శ్లాఘనీయం.

ఇతోధికంగా శ్రీ రఘురామయ్యగారు ఇటువంటి ఉత్తమ కథా నిబద్ధములైన రచనలు చేస్తారని ఆకాంక్షిస్తున్నాను. మనసారా అభినందిస్తున్నాను.

జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాం యశః కాయే జరామరణజం భయం.

((*))

# భావన

పండితారాధ్యుల వీరేశలింగం
రీడర్ యిన్ తెలుగు
గవర్నమెంటు ఉమన్స్ కాలేజి బరంపురం.
తేది 24-2-95

శ్రీమద్రామాయణము సహజముగ మధురమైనది. వాల్మీకి శిల్ప చాతుర్యముచే - ఉపనిషత్సారమగుటచే - శ్రీ రాముడు భారతీయులకు ఆరాధ్య దైవమగుటచే రామాయణ రచనము పాఠకులను రంజించుట సహజము. ఇక కవి యేమాత్రము శ్రద్ధ వహించినను ఆ రామాయణ మకరందాస్వాదనకై పాఠక షట్పదము తహ తహ లాడును.

మిత్రులు శ్రీ మాపుదూరు రఘురామయ్యగారు మధుర కవులు. వీరి భాష మధురము. భావము మధురము. శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి వంటి మధుర కవులు వీరికి ఆదర్శప్రాయులుగ కాన్పించు చున్నారు.

సామాన్యులకు గూడ అవగాహన కందవలె ననునది కవి లక్ష్యము. ఫలితముగ శబ్ద కాఠిన్యత – సమాస జటిలత–అన్వయ క్లిష్టత ఇత్యాదులు లేని మధుర మంజులమైన రసపుష్టి గల తేటగీతుల తోడి తేటైన రామాయణము తెలుగు ప్రజలకు అందినది. చక్కని కవితా మధురిమలైన కొన్ని యుదాహరణములు చూడుడు.

## అయోధ్యాపుర వర్ణన

కర్షకుల కృషి సర్వదా కలుము లొసగ
కార్మికుల శక్తులైశ్వర్య గరిమ నింప
పృథివి నగరములందు కీర్తి ప్రతాప
దీపమయి వెల్గు భువి నయోధ్యాపురమ్ము.

ఐశ్వర్య కారకులు కార్మికులని చెప్పుటలోని అధునిక శైలి గమనార్హము.

## పుత్రులకైన దశరథుని ఆవేదనము

పసితనపు ముద్దు మోముల బాలు లాడు
కొనెడు వేళల నాశగా గోపురాగ్ర
భాగముల నిల్చి చూచుచు బాధ జెంది
యేదొ పోగొట్టు కొన్నట్టు లెద తలంచు.

ఇట్టిదియే 13 వ పద్యము ను. రమణీయ కల్పనములు. విశ్వనాథ వారి కల్పనల వంటికల్పనములు కన్పించుచున్నవి.

## దేవతలు తమబాధలను బ్రహ్మకు తెల్పుట

ఘోర రాక్షస బాధల కుమిలి కుమిలి
దుష్ట రావణ సర్ప సందష్టుల మయి
తల్లడిలు చుంటి మయ్య! ఓతండ్రి! యెటుల
దీరు మాబాధ _ మార్గము దెలుపు మనగ.

ఈ మాటలు 'బాధా సర్పదష్టులు" అనే శ్రీ శ్రీ మాటలను స్ఫురణకు తెచ్చుచున్నవి,

42 వ పద్యమున మిమ్ము "శ్రీలక్ష్మిభర్త" రక్షించునని బ్రహ్మ పల్కెను. సీతా చరితమున నారాయణుని "శ్రీలక్ష్మి' భర్త యని చెప్పుట ఉచితముగ నున్నది.

వసిష్ఠాలుని రాముని విడువజాలననెడి దశరథుని పుత్రవాత్సల్య మును ఈ క్రింది పద్యమున మృదు మధుర శైలి యందించు చున్నాడు.

అయ్యా! మునిరాజ! చూడ రామయ్య యిపుడు
పాల బుగ్గల చిన్ని వరాల కూన
రాక్షసుల నోర్చి నీ యాగ రక్షణమ్ము
సేయ గలడటె? నేవచ్చి జేతునయ్య.

104-105 పద్యములందలి ప్రకృతి వర్ణనము – శ్రీరామ మహాత్మ్య మును తెల్పు కల్పనములు.

అహల్యరాయి యగుట - ఇంద్రుడు కోడియగుట – ఇత్యాది కల్పన ములు రంగనాథ రామాయణము నుండి గ్రహించి యుండ వచ్చును.

శ్రీరాముని 'విశద మెరుగగ విప్లవ వీరుడగుదు" వని వర్ణించి ఈ క్రింది విధమున విప్లవ నిర్వచన మిచ్చిరి.

విప్లవమ్మన, యోచింప – విలయకాల
మావహిలు తరి నా రాక్షసాధములను
మట్టుపెట్టి యధర్మము మాపి - జగతి
శాంత్యహింసలు వెలయించు సరణిగాదె.

సీతా స్వయంవర ఘట్టము రమణీయమై బంధ్యాల పాపయ్యశాస్త్రి గారి 'ధనుర్భంగము' ను జ్ఞప్తికి దెచ్చుచున్నది.

బాలకాండము నందలి విశేషము లొకటిరెండు జూపితిని. మిగిలిన కాండము లన్నియుయిటులనే రమణీయమైన శైలిలో రచత్తరములుగ నున్నవి. అందు తొటికిసలాడు అత్యాధునిక బావములు సందర్భోచిత ములై కవి అభ్యుదయ దృష్టికి నిదర్శనములుగ నున్నవి. ఒక్క మాట చెప్పిన చాలును. రామకథ వ్రాసినవారెల్ల ధన్యులు. ఈ కవి ధన్యుడు. మృదుమధురముగ రామకథ చెప్పి పాఠకులచే ఆనందముగ చదివింప జేసి వారిని కూడ ధన్యులుగా నొనర్చు కవి సమర్థు డగుటచే తెలుగు పలుకు ధన్యత నందినదని భావింతును.

(O)

# శ్రీ రఘురామ రామాయణం

కళాప్రపూర్ణ డా॥ గణపతిరాజు, అచ్యుతరామ
30-11-12 డాబాగార్డెన్సు విశాఖ
తేది 11-3-95

రామనామ పీయూష పానామరత్వ
ప్రాప్త శత సహస్ర విమల భవ్యభక్త
రశన విదిత బహుళ రుచిర మధురిమము
తెనుగునే రుచికేని యెన్నేని విధులా.

ఓపిలో నెన్ని రకములో తెలియ రాగ
నమృత మదికూడ నాల్కకోయమల రుచిని
మాట మాటకు మనిషికో మాదిరగను
రామ గాధను రమ్యత రహిని నించు.

తరుగ రానట్టి రుచుల నెంతగ నలదిరొ
వరుస నెన్ని గాధలవి యెందరెటు వలెను
రామ వృత్తములవి చెప్పి రాఐ గొన్న
నాల్క కొక కొ్రొత్త యమృతమ్మై నచ్చ నిలచు.
అట్టి జీవ జీవనగాధ పట్టి పరమ
పూజ్య భావ నిర్భరతను పూర్వ పుణ్య
వశత రఘురామ సూరి ప్రవచన మటుల
ఫలితి కొన్నది యీకావ్య ఫణవ గీతి.

మావుడూరింటి రఘురామ మాన్య సుకవి
తేట గీతుల వెలయించు మేటి రచన
మింక మరియొక రామ నామాంక పూత
కావ్య గౌరవ మంది లోకాన వరలి

# XXV

నవ్య రఘురామ రామాయణ మనిపించు
కొనుచు సరళ భాషా ప్రయోగ నియమాన
మాన్య సామాన్య బహుజన మాన్యమగుచు
పవిత్ర శ్రోతృ లోకాఖిల పరమ పూజ్య

సకల పరమార్థదాయక సాధనంబు
మధుర భావనా మంజుల మార్దవంబు
నగుచు పదికాలముల పాటు నెగడు గాక
గ్రామ పేరిట కవితల రాణ మించ

((*))



# అక్షరార్చన (పీఠిక)

ఆచార్య శ్రీమతి కోలపెన్ను మలయవాసిని
ఎం. ఏ. పి. యచ్. డి
తెలుగు విభాగము ఆంధ్రవిశ్వకళా పరిషత్తు విశాఖ
తేది 15-3-95

శ్రీ మద్రామాయణం పర్వతములు -నదులు ఉన్నంతకాలము నిలిచి ఉంటుందని వాల్మీకి వచనం. నిలిచి ఉండటమే కాదు రచింప బడుతూ ఉంటుంది కూడా అనడానికి ఆంధ్ర వాఙ్మయమే నిదర్శనము. తెలుగులో రామాయణ రచన సాగినంతగా తక్కిన గాథలురచింప బడలేద నడం నిర్వివాదాంశం. వివిధ ప్రక్రియలలో వివిధ ఛందస్సులలో రామకథా వాహిని తెనుగు కవుల గంటములనుండి జాలువారింది

రామాయణ రచనకు శ్రీకారం చుట్టిన కవులు తమ రచనకు కార ణాన్ని పెక్కు విధాలుగా భావించారు. "ఎత్తరి నైనసుధీరో దాత్త నృపోత్తముడు రామ ధరణీ పతి సద్వృత్తము సంభావ్య" మంటూ తిక్కనతన నిర్వచనోత్తర రామాయణ రచనకు ఉద్యమించారు. "ఆది రఘురాము చరితము - ఆదరముగ వినిన క్రొత్తయై లక్షణ సంపాదమ్మై పుణ్యస్థితి వేదమ్మై" తోచినది మొల్లకు. వేదమ్మై వరలిన రామకథా గానం చేసి కవికోకిలలు ధన్యత గాంచాయి. "రాఘవేశ్వరుని చారిత్రము వెందరెన్నిగతులన్ వర్ణించినన్ గ్రాలదే" అన్న కంకంటి పాపరాజు మాటను సత్యమహితముచేస్తూన్న రీతిలో - శ్రీ గురునాధేశ్వర వరప్రసాద సహజ కవితా సంప్రాప్త - కాశ్యపస గోత్రులు - పార్వతీ అనంతరామ పుత్రులు శ్రీ మావుడూరి రఘురామయ్యగారు రఘురామ రామయణాన్ని తేటగీతి కావ్యంగా తెలుగు పాఠకుల కందించారు.

బంగారానికి తావి యబ్బి నట్లు - ఈ ఉదార పురుషుని గాథకు శ్రోత - శ్రీరామ భక్తులు - రామరాజ్యస్థాపన మహోన్నత భావనా విభవులు, విశ్వ విఖ్యాతులు, శ్రీ తెన్నేటి విశ్వనాథముగారు. శ్రీరఘు రామయ్యగారన్నట్లు వారు శ్రీమహోన్నత చారిత్ర, చిద్విలాస రూప

గంభీర చిరయశో రుచిర తేజులు. శ్రీమదఖిలాంధ్ర విలసిత స్వీయభావ రాజకీయ యుంగధరులు శ్రీతెన్నేటి విశ్వనాధముగారి శతజయంతి సందర్భంలో యిట్టి ఉత్తమ కావ్యాన్ని వారికి వినిపించి - ఆ లోకంలో లేని రామకథను వినే అవకాశం కల్పించి ధన్యులయారు శ్రీరఘురామయ్య గారు.

కావ్యాలుగా ప్రబంధాలుగా ద్విపదలుగా ద్వ్యర్థికావ్యములుగ నాటకాలుగా యక్షగానాలుగా శతకాలుగా వచన గ్రంథాలుగా వివిధ ప్రక్రియల్లో రామకథా స్రవంతి తెనుగు భూమిని పునీతం చేసింది. అది గాక ఛందో భేదములలో కూడ రామకథ రాణకెక్కింది. శతక కవులలో తటవర్తి కొండయ - ఉంగుటూరి సుబ్బయ 1860 ప్రాంతంలో కంద పద్యాలలో రామకథను శతకంగా చెప్పారు. బృందావనము లక్ష్మయ దేశికులు 1870 లో రామారాజ కంఠీరవా అనే శతకం మత్తేభ శార్దూల వృత్తాల్లో రామకథను వర్ణించారు. దూపాటి తిరుమలాచార్యులవారు 1855 లో భవ్యగుణధామ శ్రీరావిపాటి రామ అనే మకుటంతో సీస పద్యాలలో ఆరుకాండల విభాగంతో రామాయణాన్ని వ్రాసారు. 1880 లో జూలూరి లక్ష్మణ "ముకుంద రాఘవా!" మకుటంతో "కూర్చెద భవత్కథావళిన్' అని రామకథను రెండువందలయాభై ఉత్పలచంపక మాలలో బాలకాండాది విభాగం చేసి రచించారు.

ఇలా కేవలం శతక కర్తలు ఆయా వృత్తనియమాలను పాటిస్తూ వ్రాయడమే కాదు-శ్రీ కలగోడు అశ్వత్థరావుగారు రామాయణం ఆరుకాండలూ దండకంగా కూర్చారు. కేవలం రెండే రెండు గణాలతో రామకథను వ్రాయుట కథానాయకునిలో కలియు దండక చేసినట్లున్నది అనిపించు కొన్నారు.

శ్రీ ఆకొండి వెంకటరమణ శ్రీమూలా పేరన్న, శ్రీఉపమాక నారాయణమూర్తి ప్రభృతులు రామాయణ మాలికా ప్రబంధాన్ని కూర్చారు. అది ఉత్పల మాలిక శ్రీ నారాయణమూర్తిగారు ప్రత్యేకం మత్తేభ విక్రీడితంలో నకార ప్రాసతో నాలుగు వేల చరణాల రామకథను రచించారు.

శ్రీ మల్లాది శివరామ్‌గారు ఆటవెలదుల్లోను; శ్రీ అకెళ్ళ అచ్యుతరామ్‌గారు రామాయణ మకరందమను పేర రగడలోను శ్రీశిష్టా వెంకటసుబ్బయ్యగారు కందములలోను, శ్రీ కొచ్చెర్లకోట వెంకట రామయ్యగారు "త" ప్రాస కందములలోను, శ్రీనల్లాన్ చక్రవర్తుల రామానుజాచార్యులుగారు ఆట వెలది తేటగీతులలోను రామ కథామృతాన్ని ఆంధ్ర పాఠకులకు అమోతలుగ పెట్టిన కవివరులు.

అట్టి కవిశ్రేష్ఠుల రీతిలో శ్రీ రఘురామయ్యగారు కేవలము "తేట గీతుల"లో రామకథను తేట తెనుగులో తేట తెల్లముగ రచించి రామభక్తి సామ్రాజ్య పదవిని చేపట్టినారు.

వామలూరు భవుని వాగమృతమును తేనెలూరు తేట తెనుగున రచించే సందర్భంలో వీరు రంగనాథ - భాస్కర - మొల్ల రామాయణ ములతో పాటు ఆధునిక కాలములో వెలసిన విశ్వనాథ వారి రామాయణ కల్పవృక్షమును చదివి, ఆయా రామాయణము అందలి రమ్యతరభావము లను తమ రచనలో కూర్చినారు. రచన బహు సరళముగ సాగుటతో పాఠకునికి ఎట్టి అన్వయ క్లిష్టత లేక - సామాన్య పాఠకుడు గూడా చదవ గానే అర్థం చేసుకొనే స్థితి ఈ రచనలోని ప్రత్యేకత.

విషయాన్ని అందించే పట్టున వీరు ప్రయోగించే ఉపమలు సందర్భశుద్ధి కలిగి ఉదాత్త భావ సమన్వితములై ఉంటాయి. దశరథు నికి ధర్మకర్మాతిశయులు అర్థాంగులవని ముగురు-అంటారు. పుత్ర సంతానార్థియైన దశరథుడు మేడమీదనుండి ఆడుకుంటున్న బాలుర జూచి "ఏదో పోగొట్టు కొన్నట్టు లెద దలంచు" నట. మారు వేషంలో నగరంలో తిరిగే సందర్భంతో పిల్లలకు భక్ష్యాలను పంచుతాడట ఆ రాజు. ఆ తీరును యీ కవి.

> సహజమే గద సంతాన రహితులైన
> వారలందున యీతీరు వసుధ వెందు
> పడమిక జేడ్డైన, జడుడైన, అడవి యందు
> మసలు వాడైన, నిది దైవ మాయ గాదె. (బాల ॥24 ప)

అంతట్లాడ్ను

పాయసాన్నం పంపకం విషయంలో వీరు అధ్యాత్మ రామాయణాని అనుసరించారు. కౌసల్యా కైకలకు రాజు చెరిసగం పాయసాన్నిచ్చాడు. తమ తమభాగాల్లో వారు కొంత సుమిత్ర కిచ్చారు. ఆ రాణుల కడుపు పండగా దశరథుని యింట పసిపాపల బోసి నవ్వుల పంట పండిందట. ఆ పంట పాల్కడలి రత్నములను మించినదట చూడుడు.

బుజ్జి పసిపాప లందాల బోసి నవ్వు
పంట పండింప దశరథు నింట నెపుడు
పరమ వైకుంఠ విభవ సంపదల వెల్ల
పాల్కడలి రత్నముల వెల్లువల చెలంగి. (బాల-63)

వీరి సీతా స్వయంవరఘట్టములోని పద్యాలు కరుణశ్రీ గారి పదాచె లను తలపిస్తు వీరి ప్రతిభను చాటుచున్నవి. (పద్యం.20?)

సీతారామ కళ్యాణాన్ని వాల్మీకి ననుసరిస్తు జరిపిస్తునే కొన్ని ఆంధ్రుల ఆచారాలను జోడించారు. "ఛాయేవ" అనే వాల్మీకి భావాన్ని గౌరవిస్తు-

నాయనా! యీామె నిన్ను నీ ఛాయ గానె
అనుసరించును సాధ్వియై యనవరతము.
అబల సహధర్మ చారిణి నందు మనుచు
కాళ్లు కడిగెను కొబ్బరి నీళ్లతోడ॥

రామ నారాయణుని కాళ్ళు ఎట్టి కలుషము అంటని కొబ్బరినీళ్ళతో కడిగించిన పుణ్యమూర్తి శ్రీరఘురామయ్యగారు. తెర పట్టడం - జీలకఱ్ఱ బెల్లం పెట్టించడం - తాళి కట్టించడం జరిపించారు. తలంబ్రాల మార్పిడిని వదలి వేశారు. అయితే చూపుల తలంబ్రాలను వర్ణించా రనుకునే పద్యాలు 233; 234. జిలుగు బుగ్గల నును సిరి సిగ్గులలర పతుల పేర్లను మెల మెల్ల పలికి వారు"- అనిపేర్లుచెప్పించే వేడుకతో రమ్యంగా బాల కాండ ముగించారు.

ఇక అయోధ్యకాండ సీతారాముల దాంపత్య వైభవ వర్ణనతో ఆరం భించడం అమలోదాత్తమైన విషయం.

రామునకు గుండె మైథిలీ రామ యయ్యె
జానకికి గుండెయును రామచంద్రు డయ్యె
జానకీరాము లద్వైత సత్వు లంచు
జనము లాదర్శ పారవశ్యంబు గనిరి. (అయో-౩)

సీతారాము లద్వైత సత్వులనడం అర్ధవంతమైన పలుకు.
రాముని వనవాసము భరతుని పట్టాభిషేకము - కైకకోరిన వరాలు.

వరములా యవి? ప్రళయాగ్ని భయద హేతు
శరములా? ఘూబిలము వీడి సత్వ మెప్ప
పైకి వచ్చిన కాల సర్పముల జంట
కాలకూట విషాగ్ని వికార మేమొ?

అనే రచన లోని ఉపమానాలు వరాల తీక్ష్ణతని భయంకరత్వాన్ని వ్యక్తం చేస్తున్నవి.

తన రాజ్యాన్ని ఏలుకొమ్మని అంజలి ఘటించిన గుహుణ్ణి రాముడు ఆనంద భరితుడై కౌగిలించు కున్నాడు. ఆ అనుభూతిని రసార్ద్రంగా మలచారు వీరు.

"గుహుని బిగియార కౌగిట గుచ్చి రాల్చె
ఆర్ద్ర నయనాల అశ్రు ముత్యాల మాల".

స్నేహ ప్రసన్న మనస్కుడైన రాముని హృదయాన్ని ఆవిష్కరించిన ఘట్టాల్లో ఇది ఒకటి. సుగ్రీవునితో మైత్రి సంఘటితమైన తరువాత వ్వకుండా లంకకు వెళ్లి వచ్చిన సుగ్రీవుని కౌగిలించుకొని రాము డిట్లా అంటాడు.-

వీర కపిముఖ్య! వచ్చితివి సరె! వేరు
విధమె యైన; జానకి యేల? విశ్వ మేల?
లక్ష్మణుండేల? అతుల సామ్రాజ్య మేల?
పౌరుషమ్మేల? నాకింక బ్రతుకదేల?

## XXXI

స్నేహితుని హితము కంటె తనకేదీ ముఖ్యం లేదనే ఉదాత్తగుణ సంపన్నుడు రాఘవుడు. ఈ పద్యంలోని భావం వాల్మీకి మహర్షిదే. అయినా భాష రఘురామయ్యగారిది. అలతి అలతి తునియల కావాళ సంధించిన విధమిది.

సీతను లంకకు తెచ్చి రావణుడు సీతతో - సామాన్య మానవు డీ మహా సముద్రాన్ని దాటి రాలేడు. నన్ను వరించమంటాడు. ఆ మాటకు సీత ధీరురాలై యిలా సమాధానం చెపుతుంది.

> జలనిధిని దాట లేడంచు దలచి నీవు
> విఱ్ఱవీగుట నీదగు వెఱ్ఱి గాదె?
> చెలగి రాముండె యలిగిన జలధి యుండు
> జలము లుండునె ? ఉండవీ జగతి నీవు' (అరణ్య-268)

రాముడే అలిగితే సముద్రంలో నీళ్లే ఉండవు. నువ్వూ ఉండవు నీళ్లు లేకపోయాక దాటడ మనే ప్రశ్నే లేదు. రాముడు పాలుని పరాక్రమాన్ని ఇంత స్పష్టంగా చెప్పినా రావణుని తలకెక్కలేదు.

సీతాన్వేషణ వేళలో వనసీమలలో రామ లక్ష్మణులు ఎందరో ఉదార మతులను కలుసు కుంటారు. ఈ విషయాన్ని రాముడు లక్ష్మణునికి వివరించటంతో అరణ్యకాండ ముగించటం అపూర్వంగా ఉంది.

> ఆ అగస్త్యుడు శరభంగు - డత్రి శబరి
> త్యాగి ఖగ [illegible] ర ఉదాత్త యుతులు
> ఆదరాశయ మధుమూర్తు లతుల గుణులు
> ధరణి [illegible] పరోపకారాచరణ మతులు. (అర-[illegible])

ఇక కిష్కింధకాండలో వాలిని వాలనేసిన రాముణ్ణి చూసి ఇది ధర్మమా! నీకు -" ధరణి గనవు కోవ సద్గుణములు నిన్ను వీడెనేమొ? అన్న తీరు భాస్కర రామాయణంలోని తారను తలపులోకి తెస్తున్నది.

సీతా విరహంతో విలవిల లాడుతున్న రాముడు వర్షకాలపు మేఘాన్ని - మెరుపుని చూసి పొందిన అనుభూతి అనన్య సామాన్యంగా చిత్రించ బడింది.

XXXII

కారు మొగిలుల పంచను చేరి _శంప
మిగుల చలియించు రీతి సౌమిత్రి! నేడు
పరమ నిందా స్వభావుడౌ పంక్తి ముఖుని
చెరను నెంత చలించునో యురలి సీత (కిష్కి-167)

ప్రకృతిలో యే దృశ్యాన్ని చూసినా రామునకు అర్ధాంగి సీతాలతాంగి తలంపునకు రావడం ఆభార్యా భర్తల అనురాగానికి నిదర్శనం_

లంకలో సీతాదేవిని అన్వేషిస్తున్న హనుమన్నకు ఎప్పటికీ సీత కానరాలేదు. మండోదరిని చూచి సీత అనుకొని-అంతలోనే నిజం తెలుసుకొని లెంపలేసుకోడం చక్కగా ఉంది.

సీత కానరాలేదనే ఆవేదనాపూరితమైన రోషంతో
సత్వరమె దృంతును విధాత జందెములను; జనకజంగానకున్న
లంక పెకలింతు రావణు హొంత మణతు; అంటూ ఆవేశ పడడం స్వభావ సుందరంగా వర్ణించారు కవి
సీతా రావణుల సంభాషణ ఘట్టంలోని పద్యాలు - హృద్యంగా మొల్ల పద్యాల ప్రభావంతో పరిమళిస్తున్నాయి.

జడలు ధరియించి మునివృత్తి బడుగువోలె
అడవులను కూరగాయలు గుడుచు పెట్టి
రాము డేరీతి యత్నించు లంక జేర;
తమ్మునింగూడి వననిధి దాట గలడె? (సుంద- 212)

జలము లింకింప జేయగా జాల రతయు
సెగిరి రాలేరు వార్నిధి నీద లేరు (సుంద _213)
కుడువ కూడును నిలువగా గూడు లేని (సుంద_114)
అన్న రావణుని మాటకు సీతాదేవి సమాధానంలోని

"దొంగ పతె జొచ్చు నొక గజ దొంగ వీవు" (సుంద_219)
"రాజ మాత్రుడె ? సజ్జన రక్షకుండు

రామ జనపాలు డాది నారాయణుండు". (సుంద_223)
"జనకు బాసను నెరవేర్ప జడలు దాల్చి
తాపసుల రీతి నయ్యన్న దమ్ములరయు" (సుంద_346)
సందర్భాను సారంగా చక్కగా ఉన్నాయి.
ఇంక హనుమంతుడు తన రూపాన్ని చూపు సందర్భంలో
"చుక్కలే తలపూవులై పొగసు గూర్ప
మేరునగ సమముగ తన మేను బెంచె (సుంద-379)

అందమైన ఉపమానం. మొల్లకవితా సౌరభాలు ఈ రామాయణంలో తేట గీతులుగా రూపు దిద్దు కున్నాయి. "కంటిన్ జానకి_ఉన్నాడు లెస్స రాఘవుడు" వంటి క్రియా వాచకాలతో ప్రారంభించే పద్ధతి కూడ వీరి రచనలో చోటు చేసుకుంది. 'కంటి' సీతా మహాసాధ్వి కన్నులలర 'సేమమే అమ్మ!' అని హనుమ అంటాడు. ఇలాంటి చిన్న చిన్న పదాలతో కూడిన పద్యాలతో సుందరకాండ సుందరంగా సాగింది.

తరువాత యుద్ధకాండ 'కదన కుతూహలం" అనే శీర్షికతో ప్రారంభించడం కవిగారికి సంగీతం మీదగల అభిమానాన్ని తెలియ వరుస్తోంది.

విభీషణుడు రావణునికి చేసిన నీతిబోధ అల్పాక్షరముల అనల్పార్థ రచనగా సాగింది.

మించి పోలేదు రాముఁడు మంచివాడు
అసమ కరుణా మహోదధి _ అతని జేరి
జనక సుతనర్పణము చేసి - శరణు వేఁడ
కనికరము పూని కరుణతో గావగలడు. (యుద్ధ-49)

హితవుచెప్పిన తమ్ముణ్ణి రావణుడు గుండెల మీద తన్నడం, నలుడు నీళ్లపై వేసిన రాళ్ళు నీళ్లలో మునగక తేలే వరాన్ని పొందడం, అవర ప్రభావంతో వారధి కట్టడం రంగనాథరామాయణాన్ని అనుసరించిన ట్లుగా రూపిస్తున్నది.

కందువ మాటలు, అందంగా సామెతలు కూరిస్తే _ తెనుగునకు పొందై వీనులకు విందై తెలుగు కవిత్వం తేజరిల్లు తుందన్న మొల్ల

మాటలు నిజమనిపించే రీతిలో వీరి కవిత్వం కందువ మాటలతో-చక్కని సామెతలతో నిండి ఉంది. మచ్చునకు కొన్ని-

దీవించె నాతడు కనులతోడ; మది కుదురు కొనగ
కంట వత్తులు వేసుక గాచియుండ; వడలి పోయిన సింగమ్ము
ఎండ వానల పడియున్న బండరాయి; ఎంతచల్లని వార్త
బ్రతికి బట్ట కట్టగ బోడు; నాగుండె కాయవు తరుణి నీవు
వలపు చిలుక; ఇంత భాగ్యానికా; కొంపమునిగిన యట్టులు
చిటికెలో పూర్తియగు; పచ్చి నీరైన ముట్టడు; మట్టి గరపించు
ఉసురు ఊరక పోదు; విధి లిఖితము తప్పదెంతటి వారికైన
నిప్పు ద్రొక్కు నిప్పులుమిసెడు; పండె నీపాపము;
అడ్డంకు మడ్డులొత్తెడు; నక్క వినయాలు చూపెడి కుక్క.
వంటి తెనుగు పలుకుబడులు వీరి రచనలో కనబడుతూ ఉంటాయి
రామ భక్తులయిన వీరి రచనలో-

ఈ నిఖిల జగము రామ లీలా విలాసమై రహి వహించె; రాముని నీడ; వంటి వాక్యాలు వీరి మానసాభ్యంతరము నుండి వచ్చినట్టివి.

రావణ వధానంతరం రామ పట్టాభిషేక మహోత్సవం; రాముడు రాజ్యభారం వహించడంతో రామకథ పరిసమాప్త మవుతూంది. ఆరాముడు

నాల్గు పాదాల ధర్మంబు నడపువాడు
నాల్గు పురుషార్థముల వెంట నడచు వాడు
నాల్గు వేదాలు మెచ్చెడి నడక వాడు
భూమి భారంబు వహియించె మోదమలర

మానవుని జీవితాన్ని మధుమయ మార్గానికి - ధర్మ పథానికి నడిపించే వాడు ఆ శ్రీరామ చంద్రుడే.

అందుకే 2730 తేటగీతులను రామాయణ మహామాలగా అల్లి తోమాల సేవతో శ్రీ స్వామివారి నర్చించి శ్రీమాపుడూరు రఘురామయ్యగారు తరించారు.

# XXXV

ఆంధ్ర వాఙ్మయ రంగంలో రామాయణాలు ఆయా కవుల పేర్లతో వ్యవహరింప బడడం రామాయణాల రచనా విస్తృతి వలననే. ఈ రామాయణం "రఘురామ రామాయణం"గా రూపు దిద్దుకుంది. సులభ సుందర శైలిగల ఈ రామాయణం ఆంధ్ర పాఠకులను అలరిస్తుందనడంలో సందేహం లేదు.

కవిగారు ఈ కావ్యానికి రచించిన ఫలశ్రుతితోనే ఈ పీఠికను ముగిస్తాను.

రామ చరితమ్ము ధర్మ సామ్రాజ్య పథము
రామ చరితమ్ము భవ ముక్తి రాజ పథము
రామ చరితమ్ము పుణ్య విభ్రాజితమ్ము
రామ చరితము యోగ సంక్షేమ మయము.

—: సీతారామాభ్యాన్నమః :—



# అవతారిక ఇష్ట దేవతా స్తుతి

## వినాయక ప్రార్థన

శ్రీ కరుండును - శుభదు_డా శ్రిత జనాళి
కొంగు బంగారమై వెలుగొందు నట్టి
మంద మందస్మితుండు - ఉమా సుపుత్రు
చరణ కమలమ్ములకును నంజలి ఘటింతు.

తల్లి యొడి చేరి పాలను త్రాగు వేళ
బాల్య చేష్టల నవలి చన్బట్ట బోయి
పాము దగిలిన బెదరక పాలు గుడిచి
ఆటలాడెడు గణనాథు నంజలింతు.

విఘ్నముల దీర్చి యత్నముల్ వివిధ గతుల
సిద్ధి యొనరించి _జనుల నాశీర్వదించు
పార్వతీబాయి ముద్దులబ్బాయి నిపుడు
గ్రంథ పరిపూర్తికై వేడుకొందు మదుడు.

## సరస్వతీ స్తుతి

చదువు కళలు జనాలలో సంస్కరించి
సతము గాపాడు దివ్య ప్రశాంత మూర్తి
మృదుల దరహాస వదన_సహృదయ_సదయ
వనజభవురాణి వాణికి వందనములు.

## అమ్మకు వందనము

అందమింపొంద - జగమందు - నఖిల పాప
ములను తలరాతు నేదేవి-మోక్షదాయి
ఆ పదలు దీర్చి_జీవుల నలర జేయు
నట్టి జగదైక మాతకే నంజలింతు.

# XXXVII

## కనకమహాలక్ష్మి స్తుతి

కోరి కొలిచెడి భక్తుల కృప వదలిరప్ప
సతము గాపాడి రక్షించి మతము బూను
తల్లి! ఆశ్రిత మందార వల్లి-తల్లి
కనకమహలక్ష్మి వందింతు కడు ముదాన.

## సర్వదేవతా నమస్కృతి

భక్త వత్సలుడగు రాము భక్తి మ్రొక్కి
మదిని శ్రీగురునాథు నమస్కరించి
భవ విమోచను శరవణభవు నుతించి
ఘనుడు శ్రీరామ పదభక్తు హనుమ గొలుతు

## కవి వందనము

వ్యాస వాల్మీక ఘన కాళిదాస ప్రభృతి
సంస్కృత కవుల నెమ్మది సంస్మరించి
నన్నయను తిక్క యజ్వ పెద్దన్న మరియు
పోతనార్యుని శ్రీనాథు పొసగ దలతు.

ఆంధ్ర గీర్వాణ భాషల యందు సతము
కృషిని సలుపుచు లోకోప కృతి యొనర్చు
వరలు పూర్వుల - నవ కవి వరుల నెపుడు
ముదము మీర దలంతు నా హృదయ మందు.

## ఉమాకామేశ్వరస్వామి ప్రార్థన

అతుల కరుణా విశేష సమ్మతి వహించి
గొలుచు భక్తుల గాపాడు గుణము గల్గి
వెలసె కామేశ్వరి పేట నిలయమందు
ఈసు డతనిని మనసార నెద దలంచి.

## స్వవిషయము

మహిని పేరెన్నికంగన్న మూపుఢూరి
వంశ వృక్షాన శాఖయి - వైద్య వృత్తి
ఖ్యాతి గాంచిన "నరపయ్య తాత" గారి
తనయు డైనట్టి ఘనుడు "చింతాత" తాత.

# XXXVIII

వైద్య వృత్తిని మసలుచు వర పురాణ
పఠన పాటవమున రాము పలికి మనిన
మధుర జీవి "అనంత రామయ్య" తండ్రి
పరమ గుణవతి మాతల్లి 'పార్వతమ్మ'

వసుధ నా నగరంపల్లి వంశ మందు
పేరు మోసినవైద్యుండు - ప్రథిత యశుడు
మామ యగు "నారాయణమూర్తి" ప్రేమ మయుడు
అత్త రాజేశ్వరమ్మ తా నుత్తమ సతి.

కళల నిత్యము భాసిల్లు ఘన గుణుండు
గురు పథంబుల మెలగు సద్గుణ వతుండు
అగ్రజుడు రామసన్యాసి అమల గుణుడు
అతుల గుణవతి వరలక్ష్మి అతని భార్య

రామ - లక్ష్మణ - గణపతిరావు - సుబ్బ
రావు లనుజులు - ధర్మ కర్మాతిశయులు
పద్మ - లక్ష్మియు - జయ - హైమ ప్రఖ్యాత సుతులు
వారి భార్యలు సుగుణాల వాలు లవని.

చేయి పట్టిన దాది నా శ్రేయ మెంచి
శ్రమ వహించిన యిల్లాలు - చక్కనైన
మార్గముల నన్ను నడపించి మంచి పంచి
అలరు సూర్యప్రభయె నాదు అనుగు పత్ని.

వాసు - మోహను - శంకరు వర రమేషు
శాంతి - పెంద్రాణి - శారద - చక్కనైన
గర్భ ఫలములు - అల్లుళ్ళు గనగ రమణ
సుబ్రమణ్యంలు సద్గుణ శాలు లవని.
వరలు "శ్రీవిద్య"-"ఇందిర"-వరుసగ "[illegible]ష"
అనుగు కోడండ్రు-గనగ వారమల గుణులు

# XXXIX

సింధుజా - శైలజలు - వాణీ-చైతు-నాని
మహిని వరలెడు మనుమలు మనుమ రాండ్రు.

జాపలగు "సాంబమూర్తి" "సుబ్బన్న" - మరియు
ఘనుడు "వెంకట రమణయు" గణుతి గన్న
"సూర్యనారాయణుడు"ను విశుద్ధ యశులు
వాసి గన్న నగరంపల్లి వంశభవులు.

మహిత కీర్తిని నలరారు మావుడూరి
"రామమూర్తి శాస్త్రి" యు మరి రమణమూర్తి"
ప్రేమతో నన్ను లాలించు పిన్న తండ్రు
లరయ నాటక రంగాన నటచతురులు,

మిత్రమై బంధువై ప్రేమ మీర నన్ను
ఆదరించెడి గురుతుల్యుడైన వాడు
హరికథా రంగమందున నరయ ఘనుడు
"ధర్మపురి కృష్ణమూర్తి" సోదర సముండు.

వెనుకబడి బ్రాహ్మణుల లోన పేధి బడక
గౌరవ ప్రద జీవితాల్ గడపు వార
లరయ 'నా రామ ద్రావిడు' లందు - నేను
నొకడ నని చెప్పగా నగు ప్రకట మతిని.

దైవ సంకల్ప బలమొ? నాతల్లి తండ్రి
చేయు సుకృతమొ? యూహింప చెప్పలేను
భారమును వారిపై నిడి - భక్తి మ్రొక్కి
వ్రాయ మొదలిడినాను రామాయణమును

అభ్యుదయ వృద్ధి మదిని నే నాస జేసి
పతిత పావనుడగు రామ భద్రు చరిత
మాల పించుచు నుంటి - దోషాలు వీడి
మంచి మన్నింప ప్రార్థింతు మాన్యులార,

# విషయ సూచిక

## బాలకాండ



## అయోధ్యాకాండ



## అరణ్యకాండ

## కిష్కింధకాండ



## సుందరకాండ



4
0
4
5
6

## యుద్ధకాండ



# రఘురామ రామాయణం

శ్రీ మహోన్నత చారిత్ర, చిద్విలాస.
రూప గంభీర, చిరయశో రుచిర తేజ,
విశ్వ విఖ్యాత తేన్నేటి విశ్వనాథ!
అవధరింపుము: నాదు రామాయణమ్ము

## బాలకాండ

### అయోధ్యాపురము

శ్రీకరము సర్వ బుధజన సేవితమ్ము
భాను కులజాత నృపవర పాలితమ్ము
వర సుగుణ ఖను అగు రఘువంశ నృపులు
కూర్మి నేలిన దేశమ్ము కోసలమ్ము 1

ఉత్తరమ్మున మన భారతోర్వి పైన
దనరు దివ్యనది సరయూ తటము నందు
పాడి పంటలు భాగ్యముల్ వరిఢ విల్ల
దేశమున నుండు కోసల దేశ మెపుడు 2

దివ్య విభ వాఢ్య కోసల దేశమందు
సకల సౌభాగ్య మయమయి సాగునట్టి
పుణ్య జన శోభితమ్మగు పుర మయోధ్య
రాజ వినుతిని గనినట్టి రాజధాని 3

శ్రీలకును కళలకు నాలవాల మగుచు
సకల సంపదలకును నాస్థాన మగుచు
ధర్మ నిరతికి జూడ నాదర్శమగుచు
దనరు సతతము మహి నయోధ్యా పురమ్ము 4

కర్షకుల కృషి సర్వదా కలుము లొసగ
కార్మికుల శక్తు లైశ్వర్య గరిమ నింప
పృథివి నగరములందు కీర్తి ప్రతాప
దీపమయి వెల్గు భువి నయోధ్యాపురమ్ము 5

వేదముల బ్రహ్మ నెదిరించు విప్రవరులు
క్షాత్రమున భార్గవుని దాకు క్షత్రియులును
ధనదు మించెడి వైశ్యులు వినుతరీతి
ధరణి పండించు శూద్రు లప్పురిని గలరు. 6

అమల మణిమయ మందిరోద్యాన సౌధ
సముదయమ్ముల విశ్రాంతి సదనములను
నమరపురి యంద మలరారు నాయయోధ్య
పుణ్య నగరము భారత భూమి యందు. 7

## దశరథుడు

ఆ పురమ్మును సూర్య వంశాబ్ధి సోము
డసమ భుజశాలి దశరథు డనెడు రాజు
రాజధానిగ కోసల రాజ్య లక్ష్మి
నేలె నింద్రుండు సురపురి నేలినట్లు 8

మధుర మంజుల సౌహార్ద మానసుండు
ధీర గంభీర తైజస దివ్యమూర్తి
సకల జన రక్షణాశయ సదయు డరయ
శక్ర విభవుండు దశరథ చక్రవర్తి. 9

కరులు హరులును రథములు కాల్బలములు
భండ నోద్దండు లగు భట మండలములు
నరి భయంకర దండనాయక వరులును
మంత్రిసామంతు లతనికమరిన సిరులు. 10

నాల్గు జాతుల ప్రజల ననారతమ్ము
కన్న బిడ్డల వలెజూచు ఘను డతండు
ప్రజల గౌరవాదరములు బడసి సతము
ధరణి పృథుకీర్తి నార్జించె దశరథుండు. 11

నియమముగ యజ్ఞయాగాది నిఖిల విధులు
ప్రజల శ్రేయస్సుకై జేయు ప్రభు వతండు
నిరత దాన ధర్మాది తత్పరుడు నగుట
దేశ జనులెల్ల సుఖముల దేలుచుండ్రి. 12

వేద వేదాంగ చోదిత విధుల నెల్ల
శ్రద్ధ మీరంగ నాతడు జరిపి-శుభము
నొసగు చుండుట వలన సకలోర్వి జనుల
బ్రతుకు లానంద మయములై బరగె నచట. 13

సకల వృత్తుల వారును సర్వజనులు
హితులు బుధులును నిజ పురోహితులు మునులు
మంత్రి సామంతు లంద రామనుజ విభుని
పాలనమ్మున వడసిరి స్వర్గ సుఖము. 14

అఖిల సుఖ సంపదల ప్రజాహ్లాద మెసగ
ప్రజల యందున ప్రభుభక్తి భావ మమర
గౌర వాదరమ్ముల నంది ఘనత గాంచి
సూర్య వంశము చిరకీర్తి చూరగొనియె, 15

ఆ మహీపాల వర్యునాస్థాన మందు
గురుడగు వశిష్ఠు డినవంశ కులగురుండు
శాస్త్ర విధులను సర్వము జరుపుచుండ
ఘన యశమ్మందె దశరథ క్ష్మావిభుండు. 16

అమల ప్రేమానురాగ సద్విమల యశులు
సకల జనవంద్య లయిన కౌసల్య కైక
యల సుమిత్రయు ధర్మ కర్మాతిశయులు
ఆ నృపాలున కర్థాంగు లవని ముగురు. 17

ప్రవిమలానంద రసమయ ప్రణయవార్థి
డోల లూగగ నిజసతుల్ దోడుగాగ
దేశ జనులెల్ల ప్రభుభక్తి దీక్ష వరల
వంత నెరుగక మోదించు ప్రభువరుండు. 18

సకల భోగ భాగ్యాలను సౌఖ్యములను
తన ప్రజలు సంతసమ్మున దవరుచుండ
కొరత లేదెందున్దశరథ, క్షోణిపతికి
కులము వర్ధిల్ల-కొడుకుల కొఱత దక్క 19

ఆ విచారము హృదయాన ననవరతము
బాధ గలిగించుచుండ నప్పార్థివుండు
చెప్పుకొనలేక మబ్బుల గప్పబడిన
చందురుని పోలె తేజమ్ము సడలియుండె. 20

పుత్ర వాంఛలు మదిగ్రమ్మ భూవిభుండు
రాచ కార్యాల యందు విరక్తు డగుచు
నప్పు డప్పుడు చింత తన్నావరింప
స్వాస్థ్యమును గోలుపోవుచు సంతపించు. 21

వసితనపు ముద్దు మోముల బాలు లాడు
కొనెడు వేళల నాళగా గోపురాగ్ర
భాగమున నిల్చి చూచుచు బాధ జెంది
యేదొ పోగొట్టు కొన్నట్టు లెద దలంచు. 22

మారు వేషాన పురమున తీరుతెన్ను
లరయ దిరిగెడు వేళ లయ్యవని ధవుడు
ముచ్చటగ నాట పాటల ముద్దు లొలుకు
బాలురను బిల్చి పంచును భక్ష్యములను. 23

సహజమేగద! సంతాన రహితులైన
వారలందున యీతీరు వసుధ నెందు
పుడమి తేడైన జడుడైన యడవి యందు
మనలు వాడైన; నిది దైవ మాయ గాదె! 24

హృదయ శ్రమ తాప దుఃఖముల్ వదల జేసి
అను నిమేషము సంతస మందజేయు
సుతులు లేకున్న జగమెల్ల శూన్య మనెడి
సామెతయు నెంతటి కఠోర సత్య మరయ. 25

క్రతుశతలను దాన ధర్మాది వ్రతములను-ద
శరథు డొనరించి విసుగందె-సంతుగూర్చి
చేయనిది లేదు: నింకేమి జేతు నంచు
ప్రబల దుఃఖితు డాయె నా రఘువరుండు. 26

విమల సద్గుణ ధర్మ విశేషు డాన్ప
పత్నికి సంతాన లోప మేగతి దొలంగు
నంచు-ప్రజలెల్ల సతము చింతించు చుండ
నెపుడు కరుణించునో జగదీశ్వరుండు. 27

గురువగు వశిష్ఠుడును బుధవరులు హితులు
మంత్రివరు లొకదినమున మహిపు సభను
కూడి-రాజు విచారము గూర్చి-మిగుల
చర్చ గావించు వేళ నజ్జన విభుండు. 18

పలికె; నా పాప మెట్టిదో తెలియ దైతి;
ఎన్ని యున్నను ఫలమేమి? యీశ్వరుండు
కులము నుద్ధరించెడి యొక్క కొడుకు నయిన
కరుణ నిడకుండె నయ్యొ! నా గతి యిట్టిది 19

వయసు మళ్ళెను యీ రాజ్యభార మింక
మోయ లేకుంటి సుతులపై మోహ మొదవె
భానుకులము వర్ధిలు నుపాయ మెందు
చెప్పు మని గోరినంత వశిష్ఠమౌని. 20

పలికె నోరాజ! చింతింప వలదు సుమ్ము
అరయ గ్రహదోష మొదవ ని యఘము గలిగె
నశ్వమేధము గావింప నఘముతొలగు
పుత్రకామేష్టిచే సుతుల్ పుట్ట గలరు 21

విజ్ఞుడును బుద్ధిశాలి వివేకవంతు
డౌ వశిష్ఠుని పలుకుల కలరి నృపతి
యశ్వ మేధాది యాగమ్ము లాచరించ
బ్రతుకు పండగ సంతతి బడయ నెంచె 22

## అశ్వమేధ పుత్రకామేష్టులు

ఇంతలో నేగుదెంచె వసంత ఋతువు
సకల జనముల స్వాంతముల్ సంతసిల్ల
జన్న మొనరింప ననువైన సమయ మంచు
క్షితిపుడుం గోరినంత వశిష్ఠ మౌని 23

క్షితిప ! సరయూ తటమ్మున శ్రీల దనరు
సవన వాటిక శాస్త్రోక్త సరణి నపుడె
సిద్ధ మొనరించితిమి నీవు శీఘ్రగతిని
దీక్ష వహియింప వేలెమ్ము స్థిరుడ వగుచు. 34

ఆ వశిష్ఠుని యనుమత మనుసరించి
యొక్క శుభదిన మందు నయ్యుర్వి విభుడు
సకల మునిజన సహితుడై సంతసమున
సతులతో గూడ జేరె న్యాసవనశాల. 35

దేశ దేశాల జనులెల్ల దీక్ష గొన్న
క్షితిపు నాహ్వానముంగొని జేరి రంత
కనుల పండువుగా యాగ కర్మ లెల్ల
సాగు చుండెను వేద ఘోషలు చెలంగ 36

ఆలు బిడ్డల సహితులై యటకు జేరు
సర్వ జనములు ఘన పాయసాన్నములను
దృప్తులై "భద్రమస్తంచు" గుప్తముగను
ప్రభుని కోరిక నీడేర్ప ప్రభుని గోర 37

అన్న దానము కడు దొడ్డ దవని యందు
దాన నఘములు దొలగు సంతాన మొదవు
తనదు పూర్వ పుణ్య ఫలమ్ము దైవ కరుణ
గలుగు - కృతపాప ఫలితము దొలగి నంత 38

ముని వశిష్ఠుని యాదేశ మనుసరించి
ఘన తపస్వి ఋష్యశృంగు డనెడి మునిని
కడు వినమ్రత నేగి తోడ్కొనుచు వచ్చి
పుడమి రేడు యజ్ఞమ్ములు నడప దొడగె 39

## దివిజులు-రాక్షస బాధలు బ్రహ్మకు చెప్పుట

యాగమున భాగములు గొన నేగి నట్టి
అమరు లెల్లరు తమ బాధ లజుని తోడ
విన్నపము చేయగా నెంచి - విశద పరువ
చేరి రజుకడ - మొరలిడి చెప్పి రిటుల. 40

ఘోర రాక్షస బాధల కుమిలి కుమిలి
దుష్ట రావణ సర్ప సందష్టుల మయి
తల్లడిలు చుంటి మయ్యా - ఓ తండ్రి! దేవుల
దీరు మాబాధ - మార్గము దెలుపు మనగ. 41

## అమరులకు శ్రీమన్నారాయణుండు ప్రత్యక్ష మగుట

విబుధులార! దుఃఖమ్మేల? వెతలు దీర్ప
భక్త సులభుడు శ్రీ లక్ష్మి భర్త గార
నన్యులకు నౌనె? యనునంత - నాకసమున
పక్షి వాహను డెదుట బ్రత్యక్ష మాయె. 42

హస్తముల శంఖ చక్రాది ఆయుధములు
దాల్చి - మృదుల పీతాంబర ధారి యగుచు
అభయ హస్తాన చిద్భావ నులరు హరియు
కనుల కింపుగ సురలకు గాను పించె. 43

హస్తములు మోడ్చి - దృక్కుల నతని పాద
కమలముల జేర్చి; బహు భక్తి గానములను
కీర్తనము జేసి యమరులు - ఆర్త రక్ష
ణాశయుండగు హరికిని నతులొనర్చె. 44

దేవ! దేవాది దేవ! యీ దీనుల మొఱ
నాలకింపుము; తాళ లేమసుర బాధ
లష్ట దిక్పాలకాది మహాను భావు
లెల్లరును రాజ్యముల వీడి నేగి రెటకొ. 45

అరయ రావణు డనెడు లంకాధి నేత
ముఖ్యుడై దేవ భామినీ మోహమొంది
బలిమి వారల చెఱబట్టి పావ మతిని
చెఱల నుంచి బాధల పెట్టి సురుగజేయు. 46

చెనటి యగు రావణుని నేమి చేయలేక
దీనతను గాసి జెందుచు దిక్కనీవ
టంచు మది నిశ్చయించి యాచించు చుంటి
మంచు నమరులు శిరములు వంచి-మరియు 47

శత్రు భంజన చతురుడౌ చక్రి తోడ
చెనటి యగు దుష్ట రావణు చేష్ట లెల్ల
విన్నవించిన సర్వము విని హరియును
వారలను గాంచి యిట్లని యూరడించె. 48

కైకసీ సుతు డీ కంజ గర్భు గూర్చి
ఘోర తప మాచరించి తా నేరిచేత
వసుధలో చంప బడనట్టి వరము గోరి
నరుల వానరులను జెప్ప మరచి పోయె, 49

అదియు శుభమాయెను దశరథావని పతి
పుత్ర సంతతికై దీక్ష బూని - శ్రద్ధ
నశ్వమేధమ్ము గావించి - నలతి రక్తి
పుత్ర కామేష్టి యాగముం బూర్తి జేసె. 50

గురుడు చంద్రుడు లగ్నాన గూడి శుభము
గలుగ జేసెడి తరి శుభ గ్రహములైదు
నుచ్చమై యుండ గౌసల్య యుర్వి రాము
గనియె దిక్పతి చంద్రుని గన్న యట్లు. 62

ఎల్ల గ్రహములు శుభ దృష్టి నెనగు వేళ
కైక కొమరుని గనియెను - గనియె పిదప
వర సుమిత్రయు కవలల పరమ ప్రీతి
ముద్దు మోములు గల నవ మోహనులను. 63

సుతులు గలిగిన యానంద మతిశయింప
దానముల నెన్నియో జేసె దశరథుండు
హృదయములు పొంగ నగరాన ముదము మీర
సంబరమ్ములు జరిపిరి జనము లెల్ల. 64

పది దినమ్ము లరిష్టముల్ గడియు కుండ
వేద విప్రులు దేవతా ప్రీతి కరము
లైన వైదిక విధులను నంతి పురిని
సలిపి నారలు గురునాజ్ఞ తలను దాల్చి. 65

కమల నాభుడు కౌసల్య కలల పంట
ముజ్జగంబులు మురిపించు మోహనాంగు
డమిత తేజో విరాజితు డగుట నతడు
రాము డనియెడు ఘన దివ్య నామము దాల్చె. 66

భరత లక్ష్మణ శత్రుఘ్న వర పవిత్ర
నామములు శేష సుతులకు ప్రేమ మీర
ప్రగతి పదిసెంచి నుంచిరి పెద్ద లెల్ల
జాత కర్మలు జరిపించు సమయ మందు. 67

దేవ! దేవాది దేవ! యీ దీనుల మొఱ
నాలకింపుము; తాళ లేమసుర బాధ
అష్ట దిక్పాలకాది మహాను భావు
లెల్లరును రాజ్యముల వీడి నేగి రెటకొ. 45

అరయ రావణు డనెడు లంకాధి నేత
ముఖ్యుడై దేవ భామినీ మోహమొంది
బలిమి వారల చెఱబట్టి పాప మతిని
చెఱల నుంచి బాధల పెట్టి సురుగజేయు. 46

చెనటి యగు రావణుని నేమి చేయలేక
దీనతను గాసి జెందుచు దిక్కునీవ
టంచు మది నిశ్చయించి యాచించు చుంటి
మంచు నమరులు శిరములు వంచి-మరియు 47

శత్రు భంజన చతురుడౌ చక్రి తోడ
చెనటి యగు దుష్ట రావణు చేష్ట లెల్ల
విన్నవించిన సర్వము విని హరియును
వారలను గాంచి యిట్లని యూరడించె. 48

కైకసీ సుతు డీ కంజ గర్భు గూర్చి
ఘోర తప మాచరించి తా నేరిచేత
వసుధలో చంప బడనట్టి వరము గోరి
నరుల వానరులను జెప్ప మరచి పోయె, 49

ఆడియు శుభమాయెను దశరథావని పతి
పుత్ర సంతతికై దీక్ష బూని - శ్రద్ధ
నశ్వమేధమ్ము గావించి - నఱతి రక్తి
పుత్ర కామేష్టి యాగముం బూర్తి జేసె. 50

గురుడు చంద్రుడు లగ్నాన గూడి శుభము
గలుగ జేసెడి తరి శుభ గ్రహములైదు
నుచ్ఛమై యుండ గౌసల్య యూర్వి రాము
గనియె దిక్పతి చంద్రుని గన్న యట్లు. 62

ఎల్ల గ్రహములు శుభ దృష్టి నెసగు వేళ
కైక కొమరుని గనియెను – గనియె పిదప
వర సుమిత్రయు కవలల వరమ ప్రీతి
ముద్దు మోములు గల నవ మోహనులను. 63

సుతులు గలిగిన యానంద మతిశయింప
దానముల నెన్నియో జేసె దశరథుండు
హృదయములు పొంగ వగరాన ముదము మీర
సంబరమ్ములు జరిపిరి జనము లెల్ల. 64

పది దినమ్ము లరిష్టముల్ గదియ కుండ
వేద విప్రులు దేవతా ప్రీతి కరము
లైన వైదిక విధులను నంతి పురిని
సలిపి నారలు గురునాజ్ఞ తలను దాల్చి. 65

కమల నాభుడు కౌసల్య కలల పంట
ముజ్జగంబులు మురిపించు మోహనాంగు
డమిత తేజో విరాజితు డగుట నతడు
రాము డనియెడు ఘన దివ్య నాము డాయె. 66

భరత లక్ష్మణ శత్రుఘ్న వర పవిత్ర
నామములు శేష సుతులకు ప్రేమ మీర
ప్రగతి పదిసెంచి నుంచిరి పెద్ద లెల్ల
జాత కర్మలు జరిపించు సమయ మందు. 67

బుజ్జి పసిపాప అందాల జోసి నవ్వ
పంట పండింప దశరథు నింట నెపుడు
పరమ వైకుంఠ విభవ సంపద లవెల్ల
పాల్కడలి రత్నముల వెల్లువల చెలంగి. 68

సకల కళ్యాణ సంధాయి యఖిల లోక
రక్షకు డయిన శ్రీరఘురామ మూర్తి
జనని లాలన తోన ముజ్జగము మురియ
భద్రముగ సర్వ విద్యల భద్రుడాయె. 69

మల్ల విద్యయు శస్త్రాస్త్ర మర్మములును
ధర్మశాస్త్రాది సకల విద్యలను మరియు
నశ్వ శాస్త్రము గజశాస్త్ర మాది యైన
శాస్త్రముల యందసామాన్య శక్తి గాంచె. 70

ఎన్నికగ నెల్ల విద్యల పిన్న వయసు
నందె ఘనులైరి దశరథ నందను లిల
వారి గని మోద మందిరి పతియు సతులు
నాట పాటల బహుతృప్తి నందు చుండ్రి. 71

హరి యవతరించినది మొదలా అయోధ్య
సత్య కళ్యాణముల తోడ నివ్వటిల్లి
పచ్చ తోరణ వంత్రు [illegible]ము నంటి
వీధి వీధిని నిండింట విరిసి వెలసె. 72

శ్రేష్ఠుడగు రాముడఖిల లోకేష్టు డగుచు
దశరథునికెంతొ హితుడయి ధరణి పురుష
శ్రేష్ఠుడయి - ధాత కై పడి శిష్టు డగుచు
జగతి వనరారె పున్నమి చంద్రుడు వోలె. 73

ధీరు డయి కీర్తి విలసిత దీప్తుడౌచు
శూరు డౌచు ఘన సుగుణో దారు డౌచు
శత్రు గంభీరు డౌచును జనులు పొగడ
రాముడు గనంగ లోకాభి రాము డయ్యె, 74

తంత్రి సేవల యందు సంతసము గల్గి
ఆగమ విదుండు నస్త్ర విద్యా నిపుణుడు
సువ్రతుండయి రథుడయి శ్రుతులు నేర్చి
ధరణి ప్రియుడయి రాముండు దనరుచుండె. 75

అన్న రాముని కుడిభుజ మగుచు సతము
ప్రియము గదురగ సేవించు ప్రీతి పాత్రు
డగుచు లక్ష్మణు డతనికి నన్న కంటె
లోకమే లేదు; దైవ స్వరూపు డతడు. 76

లక్ష్మణుడు తోడు లేకుండ రాము డెపుడు
ఆట లాడడు; ఘన పాయసాన్న మైన
నోట బెట్టడు; వీడక వేట కేగు
వేళలను లక్ష్మణుడు రాము వెనుక నుండు. 77

ఎల్ల వేళల లక్ష్మణు డింపు మీర
అన్న రాముని కతి హితుడైన యట్లు
పరమ ప్రీతి శత్రుఘ్నుండు భరతు నంటి
యుండు నది యెట్టి భ్రాతృత్వ యోగ మగునొ? 78

సుతులు నల్వురు పితృ భక్తి శోభితు లయి
సేవ లొనరింప దశరథ క్షితిప వరుడు
పూర్ణ చంద్రుని గాంచి యుప్పొంగు క్షీర
సాగరము వోలె మది పొంగు సంతతమ్ము. 79

సుతుల యందున యౌవన శోభ గాంచి
పరిణయోత్సవ సమయమ్ము వచ్చె ననుచు
తగిన కన్యల వెదుకంగ దశరథుండు
హృదయమున నిశ్చయము చేసి యుండు నంత 80

నిజ పురోహిత సామంత నిఖిల బంధు
కోటితో ముని జనులతో కొలువు దీరి
పంక్తి రథుడు నిజ సుత వివాహ విషయ
చర్చ గావింప దలచు నా సమయ మందు. 81

## విశ్వామిత్ర మహర్షి రాక

కుశిక పుత్రుడు చనుదేర - కువల యేశు
డర్ఘ్య పాద్యాది విధిపూజ లాచరించి
ఆసనం బిడి భక్తి సాష్టాంగ పడుచు
అంజలిడి ప్రీతి కుశలము నడిగి మరియు. 82

తాపసోత్తమ! నీ పుణ్య దర్శనమున
పరమ ధన్యత గాంచె మావంశ మెల్ల
కుశలమా! మీకు శ్రీ శిష్య కోటి కిలను
సవనములు విఘ్నములు లేక సాగు నొక్కొ? 69

జన్మ సఫలమ్ము సేయు మీ శాసనమ్ము
సల్పు భాగ్యమొక్కటి నాకు చాల దొక్కొ?
ఆజ్ఞ యిడుట యనుగ్రహ మగును గాదె
హితము మీయాజ్ఞ శిరసావహింతు ననఘ. 84

అమటయును గాధి నందను డాత్మ మురిసి
యెల్ల జనముల కుశలమ్ము లెరుక పరచి
తానువచ్చిన కార్యము దశరథునకు
వ్యక్త మొనరించె దివ్య మహర్షి యంత. 85

జగతి సేమమ్ము మది నెంచి జన్నములను
వనము లందున దీక్షతో మునులు సలుప
లోక మెల్ల సుభిక్షమై లోటుదెల్ల
సౌఖ్య సంపన్ను లగుట వాస్తవము గాదె. 86

అట్టి క్రతువుల నోర్వక సమర వైరు
లతుల గర్వాంధులై దుష్టమతులు సతము
భగ్న మొనరించుచున్నారు ప్రబలు లగుచు
వారి నోర్వగ మునులకు భార మయ్యె. 87

మునులు – దీక్షల నుంటచే ననిమిషాం
అఘము లొనరించు చున్న నే మునగ లేక
శక్తి గల్గియు నేమియు సలుప లేక
మిగుల వొగులుచున్నారు భూమీశ వినుము. 88

రాజ్య మందున ప్రజలు సదాచరణము
నంత నొందించు కర్తవ్యమదియు ఘనుడ!
ప్రభువులది గాదె? గాన నే నభయ మడుగ
వచ్చితి నటంచు బలుక నవ్వసుధపతియు. 89

ధరణి సర్వస్వమును మీదు కరుణ వలన
సాగుచున్నది గాదె; యో సంయమీంద్ర!
బహుళ రాజ్యమ్ము నొక తృణప్రాయముగను
కినుక విడి బ్రహ్మ ఋషివైన ఘనుడ వీవు, 90

ఇన కులమ్మున కనఘ! నియ్యేలను ఒప్ప
కీర్తి సాధించి పెట్టిన మూర్తి వీవు.
ధరణి నీయాజ్ఞ గన శిరోధార్యమయ్యె
ఆనతిడు మయ్యె వేడ్క నీ యభిమతమ్ము 91

పంక్తిరథు డట్లు ముదముగా బల్కి నంత
సభను గల జనావళి యెల్ల సంత సిలిరి
ముని వశిష్ఠాది ఘనులెల్ల ముదము గొనిరి
గాధిజుండును హర్షము గాంచి పలికె. 92

అనఘ చరిత! యే నొక్క మహాధ్వరమ్ము
దీక్ష గైకొని చేయగా దితిజు లిర్వు
రల సుబాహుడు మారీచు డనెడివారు
భగ్న మొనరించు చున్నారు బహు విధాల. 93

రణ విశారదు లైన యీ రామ లక్ష్మ
ణులను నావెంట గొనిపోవు దలపు గలిగి
వచ్చి నాడను దీన మీ వంశ యశము
దశ దిశలు నిండు – నవినీతి ధ్వంసమగును. 94

అనుచు కౌశిక ముని బల్క నవని పతియు
నశని పాతమ్ము కలిగినట్లడలి మిగుల
వ్యాకులుడయి డగ్గుత్తిక వ్యథను దెలుప
ననియె వినయమ్ము దోప నమ్మునికి నిట్లు 95

అయ్య! మునిరాజ! చూడ రామయ్య యిపుడు
పాల బుగ్గల చిన్ని వరాల కూన
రాక్షసుల నోర్చి నీ యాగరక్షణమ్ము
సేయ గలడటె? నే వచ్చి జేతు నయ్య 96

అనెడు దశరథు పల్కుల కాత్మ నవ్వి
గాధి సూనుండు – నీ చేత గాదటంచు
చెప్ప నేరను! నీ రాము గొప్ప తనము
ఎరుగవో రాజ! విక్రమ హరి యతండు. 97

అతి భయంకరు లా రాక్షసాధములను
రాముడే యోర్వ గలడయ్య — ప్రేమ తోడ
బంపు — క్రతు రక్షణమ్మిది భగవ దిచ్ఛ
చింత వలదు రామునకును సేమ మగును. 98

మౌని మాటలు వినుచు నమ్మనుజ విభుడు
గురువు దెస నంత సంశయ పరత జూడ
సంశ యింపకు మన్నట్టు సంజ్ఞ చేసి
కరము దీవించె నాతడు కనుల తోనె. 99

అంత మది కుదురు కొనగ నవని పతియు
కౌశిక మునీంద్రు నతి భక్తి గనుచు ననియె
సూర్య వంశీయుడవు నీవు — సూర్య వంశ
రక్షణము గూడ నీదు కర్తవ్య మనఘ! 100

జగతికిని జనులకు క్షేమ జరుగు నెడల
ప్రాణ మైన గణింపని ప్రభువె ప్రభువు
లోక కళ్యాణ మంగళ శ్రీకరములు
పర హితమ్ములె రఘువంశ ప్రభుల క్రియలు. 101

అనుచు కులగురుడు వశిష్ఠు ననుమతి గొని
కడకు పయనము గావించె కాక పక్ష
ధరులు తేజః ప్రపూర్ణ భాస్కరులు; బాల
రామ లక్ష్మణులను ముని రాజు వెంట. 102

## రామ లక్ష్మణులు యాగ రక్షణార్థమై విశ్వామిత్రుని వెంట జనుట

రామ లక్ష్మణు లమ్ముని రాజు వెంట
పయన మైనంత దశరథ ప్రభువరుండు
బంపగా లేదు సేనల వారి వెంట
కలవు ముని యా శిషములు; పుష్కల మటంచు 103

ప్రకృతిచే ప్రేరితమ్మయి పరగె గాలి,
మెల్ల మెల్లగ కలయంపి జల్లి నటుల
చెట్ల పూవులు గుములుగా చెదరి పడియె
త్వరగ వారేగు ఘన రాజ పథము నందు. 104

కుంద మందార సుమ వృష్టి గురిసె–దేవ
దుందుభులు మ్రోగె నాకసమందు–నపుడు
వేద ఘోషలు వీనుల విందు గాగ
వినగనయె వారు మునివెంట జనెడు వేళ 105

గజముఖుడు షణ్ముఖుండును గౌరవమున
పరమ శివు వెంట జనియెడు కరణి నపుడు
మంద గమనాల దశరథ నందనులును
కౌశికుని వెంట కుతుకాన కదలినారు 106

శస్త్ర ధరులయి వారట్లు జనుచు జనుచు
సార్ధ యోజన మార్గమ్ము సాగినంత
చేరి రా సరయూ నదీ తీర మపుడు
మధుర దరహాస వదనుడై మౌని పలికె 107

రామ! నదియందు శుచివయి రమ్ము – నీకు
మహిమ గల రెండు విద్యలు – మహిత శక్తి
నలరు వానిని నొసగెడు తలపు గలిగె
అసుర సంహారమున కవి యవసరములు. 108

అనుచు ముదమున గాధేయ మునివరుండు
రామచంద్రున కిడియె బలాతి బలల
నంగ బరగు నస్త్రములు మహా ప్రభావ
కలిత విద్యల, వాత్సల్య కంధి యగుచు. 109

అంత నా రేయి మౌనీంద్రు డాలపించు
పుణ్య కథ లాలకించుచు పుణ్యమతులు
నిదుర జేసిరి అట వీచు నీటి గాలి
పరవశింప జేయగ నొక్క పర్ణశయ్య 110

మఱు దినమ్మున వేకువ మౌనివర్యు
డరుణ రాగము తూరుపు నలము వేళ
పర్ణశయ్య నిద్రించు విశ్వ విభు జేరి
లలిత సుప్రభాతమ్ము మేల్కొలిపి నాడు. 111

సాధ్వి కౌసల్య సుత! రామచంద్రమూర్తి!
వేగు దెలుపుచు పూర్వాద్రి వెలిగె నదిగొ!
దైవ మాహ్నిక కర్తవ్య తతులు దీర్ప
ఓ నృశార్దూల వేగ లేవోయి తండ్రి! 112

మౌనివరు డిటు మేల్కొల్ప మహిప సుతులు
వేగ మేల్కాంచి తన్నదీ విమల జలము
లందు మజ్జన మాడి మౌనీంద్రు మ్రొక్కి
భక్తి తాత్పర్య భరిత సద్భావ మలర 113

తపసి యనుమతి గొని వారు తక్షణమ్ము
నచ్చటు వీడుచు వడి వడి నవల జనుచు
గంగయును సరయూ నది గలయు చోట
పరమ పావని జాహ్నవి నరసి నారు 114

నాటి రేయి వారా రెండు నదుల నడిమి
దేశమున గడపి పిదప దెల్లవార
నుదయ కాల్యముల్ ముగియించి నుత్సుకతను
పయనమై జని యొక ఘోర వనము గనిరి. 115

# తాటక

ఘోరమౌ వని మునివెంట కోసలాధి
పతి కుమారులు జనుచుండ నతి భయంక
రాకృతి దలిర్ప వారల కభిముఖముగ
తాటక యనెడు రాక్షసి తారసిల్లె 116

పుఱ్ఱె కుండలములు గల్గి భువన మదుర
భయదమౌ పర్వతాకృతి బరగియున్న
రక్కసిని గాంచి బాలుడా రాముడపుడు
వెరగు పడ కౌశికుడు బల్కె విశద భంగి 117

గజ సహస్ర బలమ్మును గల్గి తిరుగు
కామ రూపిణి యీ యక్షి – కంట బడిన
తాపసుల జంపి భక్షించు – ధర్మహీన
సుందుడను రాక్షసుని భార్య – శూన్యహృదయ 118

బలితు లైన మారీచ సుబాహు లనెడి
తనయు లిర్వురితో నీమె దర్ప మలర
నివ్వనంబున వసియించి – యిన కులేంద్ర!
భయము సృజియించె నెల్లర బట్టి చంపి. 119

పరమ పాతకి తాటక భయము వలన
నివ్వనమ్మున వసియించు నెల్ల జనులు
ప్రాణ మరచేత బట్టుక పరుగు లిడిరి
యన్య వనులకు జనశూన్య మాయె నిదియు 120

కౌశికుండంత శ్రీరాము కరమునంటి
ఆడు దిది యను సంశయ మంద కయ్యా
ఘోర పాతకి – యజ్ఞముల్ క్రూర గతుల
నాశ మొనరించు కడు చెడ్డ మోస కత్తె. 121

పుడమి శ్రేయస్సు మది నెంచి మును లొనర్చు
క్రతువులను భగ్న మొనరించు కఠిను రాలు
దొసగు దలపక పాతకిం దూల నేసి
తపసి లోకము గావుము ధర్మ మూర్తి. 122

మౌని యిటు దెల్ప నంతలో మహిత శక్తి
కొండ గుహవంటి తననోరు కొసరి దెరచి
మ్రింగగా నెంచి _ రాముని మీది కురుక
నతల కుతలము లదరె నయ్యసురి గనుచు. 123

కినుక రాముండు తడయ ధనువు దీసి
ఒక్క బాణమ్ము సంధించి యుర్వి యదర
విడచె, నంతట నది కడు వేగ మేగి
పిండి యొనరించె తాటక గుండె కాయ, 124

కారు చీకట్ల పెద్ద మేఘమ్ము కరణి
కూలి భూమిని వ్రాలిన కొండ వోలె
ప్రబల జీమూతమును నేల బడిన యట్టు
లసువులను బాసి తాటక యవని గూలె. 125

సంతసిల్లెను దేవతా సంఘములును
ముని సమూహమ్ము లెల్ల సమ్మోద మందె
పాడి యాడిరి కిన్నెర వ్రాత మెల్ల
నఖిల దిక్కుల తేజము లాక్రమించె. 126

అంత ముని రాముగని కడు సంతసమున
రామ! యసమాన వీర! నిన్ రణము నెదిరి
వసుధ గెలిచెడి వీరు లెవ్వరును లేరు
అవనిపై జచ్చి పడియున్న అసురి గాంచి. 127

అతుల భుజ బల గర్వ సంగతుల _జగతి
నదర జేసెడి రాక్షస మద మడంచు
దివ్య శస్త్రాస్త్ర శక్తు లా దేవు కృపను
గలవు నాకడ యని మౌని పలికి మరల 128

రాజ్య భోగాది ఘన సుఖరాజి వదలి
యడవులందు తపోదీక్ష గడపు చున్న
యస్మ దాదుల కావిద్య లనవసరము
గాన నీ కిచ్చెద ప్రజోప కార మెంచి. 129

మంత్ర యుక్తముగా నంత మౌని వరుడు
దివ్య శస్త్రాస్త్ర సంపద దీక్ష తోడ
రామచంద్రున కిడె నాదర మ్మెసంగ
నెల్ల లోకమ్ములును తృప్తి నుల్లసిల్ల. 130

సంతసము నొంది రాముడు సంయమీంద్రు
మ్రొక్కి _ యనె – తాపసోత్తమ! ముదము తోడ
మమ్ము గరుణించితివి గద – మా చరిత్ర
సఫల మయెనంచు భక్తి సాష్టాంగ పడియె 131

మౌని యనుమతి దివ్యాస్త్ర మర్మము లను
తమ్మునకు నేర్పె రాముండు తత్ క్షణంబ
అంత ముని యును వారి నా యడవిదారి
శ్రమము మరపించు కథల నాశ్రమము జేర్చె. 132

## సిద్ధాశ్రమము

దట్టమై యొప్పు ఫల పుష్ప తరుల తోడ
జాతి పై షమ్యము మరచు జంతువులతో
మోద మొనగూర్చు కౌశికముని వరేణ్యు
నాశ్రమమ్మది – పేరు సిద్ధాశ్రమమ్ము. 133

అచటి మునులును ముని పత్ను లాదరమున
స్వాగతము బల్కి రినకుల స్వాములకును
భక్తి తాత్పర్య భావ సంభరితు లగుచు
ఆశిషము లంద జేసినా రతి ముదమున 134

వారి యాదరమును గాంచి వసుమతీశు
పుత్రులూహింపగా రాని ముదమునంది
జగము మరచిరి వట నొక్క క్షణము – నంత
తెప్పరిలి – మ్రొక్కులిడిరా యతీంద్రులకును 135

మరుదినము నుండి యాగము జరుప నెంచి
మునులతో ఋషీశ్వరులతో ముచ్చటించి
గాధిజుడు నాటి రేయెల్ల గడపె – వలయు
యజ్ఞ సామగ్రి గూర్చు ప్రయత్న మందు 136

పరిసర ప్రాంత మునులును ప్రజలు ఋషులు
ఘనులు ఋత్విక్కులెల్ల యాగమ్ము కొఱకు
వివిధ రీతుల సవన వస్తువుల తోడ
చేరి రాశ్రమ వాటిని శీఘ్ర గతిని. 137

రామ లక్ష్మణులను యాగ రక్షకులుగ
జేసి – సాయమై వారు విచ్చేసి యుంట
హృదయ భారము దీరి సమ్మోదము గదుర
బూనె క్రతు దీక్ష కౌశిక మౌని వరుడు. 138

ధనువులను చేత దాల్చి దాశరథులు
కరము మాయావులైన రాక్షసుల కొఱకు
కంట వత్తులు వేసుక గాచి యుండ
యాగ మే విఘ్నములు లేక సాగుచుండె. 139

అంత నొకనాడు మారీచు డా సుబాహు
డతుల మాయా ప్రవీణులై యాగసమున
మబ్బుచాటున నొదిగి య మానుషముగ
యాగ భంగము గావింప దాగినారు 140

దాశరథులది గాంచియు తత్క్షణమ్ము
చూసి దివ్యాశుగమ్ములు వేసినంత
నుదధి బడియెను మారీచు - డుగ్రగతి - సు
బాహు డచ్చటనే గూలి భస్మమాయె. 141

ముదితచిత్తులై రటనున్న మునులు జనులు
ఋషులు - పదునాల్గు భువనాలు - రుత్త గన్నిన
దనుజునింగాంచి దేవతా గణము లెల్ల
పండగల జేసికొన్నారు భద్రులగుచు 142

ఘోర రాక్షసు లీరీతి గూలు నంత
విఘ్న రహితంబుగా యాగ విధులు దీరె
సవన భంగము లికముందు సాగవంచు
ముదితులైనారు సురలును మునులు జనులు. 143

అంత గాధి తనూజు సిద్ధాశ్రమమ్ము
చేరె మిథిలేశుడు జనక క్షితిప వరుడు
జానకికి స్వయంవరమును జరుపుచుండె
నరయ దయచేయుడను శుభాహ్వాన మొండు. 144

## జనక మహారాజు

సర్వ నగరము లందున్నత స్థితి పడసి
పుడమి తల్లికి హారమై పొలుపు గాంచు
'మిథిల' నేలుచు నున్నాడు నృపుల శక్తి
వినుత గుణశాలి విజ్ఞాని జనక నృపతి 145

అతి పవిత్రుడు జ్ఞానియై యలరు నట్టి
ముని శతానందు డారాజు ముఖ్య గురువు
గౌతమ సుతుం డత డహల్య కడుపు పంట
సత్తపఃశాలి సజ్జన సన్నుతుండు 146

జనకు రాజ్యాన శుభములు జరుగు కొరకు
వేద విధులను నెరపెడి విజ్ఞుడతడు
తేరి చూడగ రానిదై తేజ రిల్లె
అతని సత్తపో దీక్షచే నా పురమ్ము 147

మున్ను సవన వాటిక కయి భూమి దున్న
జనకునకు నట నాగేటి చాలు నందు
దైవకృప లబ్ధ మయ్యె సీతమ్మ తల్లి
మేలిమి పసిండి వన్నెల బాల యగుచు 148

లలిత మంగళ రూపము – లక్ష్మి కళల
పేటి – యా బాల – ముద్దుల మాట యనుచు
జనక దంపతు లతి సంతసము వహించి
సీత యను పేర బిలచిరా చిన్నదాని 149

సర్వ సర్వజ్ఞు డైన యా జనకరాజు
విమల విద్యా విషయ శాస్త్రవేది యగుట
వివిధ విద్యా విశేష సంవిన్మహమ్ము
జలజ నయనకు కరతలా మలక మాయె 150

సీత వచ్చిన దాది నా క్షితిపు నింట
సర్వ శుభ సంపదభివృద్ధి జరుగుచుండె
ఋతువు లారును తమ నిజ గతుల చెలగ
రాజితైశ్వర్యముల సొంపె రాజ్యమెల్ల 151

జనక దంపతులే గాక సకల జనులు
హర్ష పులకిత హృదయులై యాదరింప
బాల్య దశ దాటి; నప్పు డబ్బాలికయును
నవ నవోన్మేష యయి క్రొత్త నమయు చుండె 152

అందముల రాసియైన యా సుందరాంగి
భువన మోహన సౌందర్య భూషితాంగి
మృదుల నవమల్లికా సుమ సదమలాంగి
ప్రౌఢ నవ యౌవనాంచిత భాసురాంగి 153

వయను వచ్చిన సీతకై వరుని గూర్చి
మదిని తర్కించు జనక భూపతియు సతము;
జానకిని పెండ్లి యాడగా జాలు నతడు
అర్హుడై యుండ వలె నటంచాత్మ నెంచు. 154

పూర్వ కాలమ్ము నుండియు పూజలంది
ఎట్టి ధానుష్కుడే నెక్కు పెట్టలేని
హరుని విల్లొకటి జనకు హర్మ్యమందు
కలదు – శర్వ దత్తమ్మయి కడు ప్రదీప్తి 155

అ శరాసన మెక్కిడు నట్టి శౌర్య
తల్లజునకు మత్ప్రాణ విత్తంబు నయిన
జానకినిడెద నంచును జనక నృపతి
అవని చాటించె వేగ స్వయంవరమ్ము. 156

సర్వ కాలమ్ము లెరిగిన జ్ఞాన మూర్తి
పరమ గాధేయ ముని భగవాను డంత
ముని వరుల తోడ రామ లక్ష్మణుల తోడ
పయనమై పోవ నెంచు సమయమున నందు 157

అఖిల మునివరు లానంద మంది పయన
మైరి; అగ్ని హోత్రాదు లాయత్త పరచి
నైష్ఠికాచార ధర్మ మనస్కు లగుట
విస్మరింప రాచారము వీసమంత 158

మునివరుడు వేగ రామ లక్ష్మణుల గూడి
పయన మైనట్టి వార్త యవ్వనము నిండె,
అంత ఆశ్రమ మునిబృంద మతి ముదమున
ననుసరించిరి శుభమంచు నమ్మునీంద్రు 159

శ్రమము వాయుగ రామ లక్ష్మణులకు ముని
చిత్ర చిత్ర కథావళుల్ చెప్పె నపుడు
గిరుల గూర్చియు నదనదీ ఝరుల గూర్చి
రాజులను గూర్చి వారి పాలనము గూర్చి 160

## అహల్యా శాప విమోచన

అటుల పయనించు నా కౌశికాదు లంత
గౌతముని యాశ్రమము జేరి గాంచి నారు
పాడు పడియున్న సత్తపో వనము – నందు
ఎండ వానల పడియున్న బండరాయి. 161

పరమ పావనమౌ రామ పాద ధూళి
ఎగిరి పడినంత నా బండ మగువయయ్యె
మాన్య మునివరు లాశ్చర్య మగ్నులగుచు
చూచి – విస్మయ మంది రా చోద్యమునకు 162

కాంత యహల్యయౌ శ్రీరాము గాంచి కరము
భక్తి వాత్సల్య [illegible] భరిత యగుచు
కరుణ కలిగించు తన పూర్వ గాథ – రాము
డడుగ – వినయము దోప – నిట్టుల వచించె 163

ఘన తపఃశాలి గౌతమ ముని మదీయ
ప్రాణవల్లభు డాతని పాద పద్మ
సేవనము దక్క నన్యథా చింతలేని
అఘ రహిత నయ్య నన్ను యహల్య యండ్రు 164

ఘనుడు పూజ్యుడు నైన యా గౌతముండు
పరమ ప్రీతిని నన్నెప్పు డరయు చుండు
నైన నేమాయె నయ్య – నా మేని సొగసు
శత్రువై నన్ను గురిచేసె శాపమునకు. 165

కామమున కన్ను గానని కలుష డింద్రు
డొంటి పాటున నున్న నా వెంట నంట
ననుచితమ్మని బోధించి యా దురాత్ము
నాటి కంపితి మరియొక నాటి రేయి. 166

కపటమున కోడియై కూసె; గౌతముండు
ప్రత్యూషస్సమయ మని స్వ కృత్యములకు
నదికి నేగెను – నింద్రు డా యదను నెరిగి
గౌతముని రూపమున నన్ను గవియ వచ్చె. 167

అతడె పతియను భ్రాంతి నా మతి చలించె
నింతలో గౌతముండుమ నేగు దెంచి
కపట గౌతము – నను గాంచి కలుష మెరిగి
ఆగ్రహావేశుడై – యింద్రు ననియె నిటుల. 168

తుచ్ఛమగు కామ వాంఛచే నుచ్ఛ నీచ
మెన్నగా లేని బుద్ధితో నింద్రః నీవు
దూషితమ్మగు కార్యమ్ము దోష మెరిగి
సలిపితివి– నిన్ను క్షమియింప జాల నంచు. 169

నిబుఫ నిబుపెల్ల పశ్చికల్ గలిగి – తనుపు
చూచు వారలకు జుగుప్స దోచు నటుల
ననుభ వింపుము శాపమ్ము నన మహేంద్రు
డతని పాదాల నంటి క్షమార్థి యయ్యె. 170

కనికరమ్ము వహించుచు గౌతముండు
క్షణము యోచించి శాంతించి యనియె మరల
పరుల కవి కన్నులై దోచు – భవ్యశీల
వంతుడ వగుచు సద్బుద్ధి బ్రతుక మనియె. 171

అంత నను గాంచి యాగ్రహ మంది తపసి
నన్నెరింగియు కోపము నణప లేక
తీవ్ర సంచలి తాత్ముడై దిట్టి దిట్టి
పలికె నాతోడ దయమాలి పాపి – వంచు. 172

తెలియకయె చేసినను మరి తెలిసి యైన
తప్పు తప్పౌను దండన తప్ప దబల
కఠిన పాషాణ రూపము గాంచు మనుచు
గడగి శాపము నిడె నాకు గౌతముండు. 173

కరుణ జూతవె మునినాథ కాంత ననగ
ముని వరుండనె తప్పదు ముదిత యిపుడు
ననుభ వింపక, చెప్పెద వినుము నీకు
కలుష సంహార మైనంత కలుగు శుభము. 174

కోసలాధీశ్వరుని ముద్దు కొమరు డయిన
రామచంద్రుని పాదాబ్జ రజము సోకి
తరుణి! త్రేతాయుగమ్మున ధన్య వగుదు
వంత దనుక పాషాణమై యుండు మబల. 175

అంచు శాపాంతము పచించి మంచుకొండ
కపుడె తప మాచరింపగా తపసి చనియె
మాయ దీ మచ్చ హృదయము గాయ మాయె
దోష మెఱుగని నేనును దోషి నైతి. 176

ధన్య నైతిని ఓ రామ! తావకీన
పాద రజమున నాదు శాపమ్ము దొలగె
యుష్మ దాగమనార్థమై యోర్చి యుంటి
నింత కాలము – నావ్యధ లిపుడు దీరె. 177

నీ కటాక్షము కలిగిన నేరి కైన
యశుభ మన్నది యున్నదే ఆత్మరూప
పద్మ సంభవ భర్గాది పరమ పురుషు
లెల్ల నీ దయకయి నిరీక్షింతురర్థి. 178

పలయు నవతారములు దాల్చి వసుధ బ్రోవ
ధరణి నలయించు రాక్షస తతుల గూల్చి
ధర్మమును న్యాయమును నిల్పి తండ్రి! నీవు
విశదమెరుగగ విప్లవ వీరుడగుదు 179

విప్లవమ్మన యోచింప విలయు కాల
మావహిలు తరి నా రాక్షసాధములను
మట్టు పెట్టి యధర్మము మాపి జగతి
శాంత్యహింపలు వెలయించు సరణి గాదె? 180

దుష్ట శిక్షణ లేనిచో దోషులెల్ల
శాంతి ఘాతకులై – సర్వ జనుల బ్రతుకు
లల్ల కల్లోల మొనరింతు – రఖిల జనుల
జీవనము తీపి చెడి తుద చేదు మిగులు 181

అని అహల్య వచించు నయ్యవసరమున
తపము చాలించియటకు గౌతముడు వచ్చి
కౌశిక మునీంద్రు - రాముని గాంచి మిగుల
సంతసము జెంది - భార్య నత్యంత ప్రీతి 182

గౌరవించెను - పిదప నా గౌతముండు
గాధిజుని - రాజ సుతులను - నాదరించి
మునుల నెల్లర మనసార వినుతి జేసి
యతిథి సత్కృతులను వారి నలర జేసె 183

గౌతము డొనర్చు అతిథి సత్కారములకు
కౌశికుడు నెల్ల మునులును కోసలాధి
పతి కుమారులు దృప్తులై - భర్తృ సహిత
యగు నహల్యను గని ముదమందినారు. 184

పయనమై జను కోసల ప్రభు కొమాళ్ళ
గని కుతూహల ముప్పొంగ గౌతము సతి
చెంత జేరిచి - దీవించి- శ్రేయ మెంచి
అళిక ఫలకాల కళ్యాణ తిలకము లిడె 185

హృదయ ముప్పొంగ నామె - యో సదయు లార!
ఎదురు చూచుచున్నది మిథిలేశు నగరు
పరమ కళ్యాణు లైన మీ కొరకు నంచు
మొలక నవ్వులతో బల్కె తిలక మిడుచు 186

ఆ పతివ్రత పలుకుల కలరి - సిగ్గు
ముంచుకొనిరాగ దశరథు ముద్దు సుతులు
సిరులు తొణికిస లాడెడు చిర్నగవుల
అంజలించి రహల్యకు నమిత భక్తి. 187

# సీతా స్వయం వరం

ఇన కులేశ్వరు సుతులతో ముని వరుండు
పయనమై చేరె జనక భూపతి పురమ్ము
నాదరము మీర స్వాగత మార్గవిధిని
సలిపి జనకుండు వారల సత్కరించె. 188

తగిన బసయందు వారల ధరణి ధవుడు
విడిది సేయింపగామౌని వేడ్క నందె
అంతకును మున్నె చనుదెంచి రా పురమ్ము
దొరలు పెక్కురు ఆ స్వయంవరము కొరకు. 189

తీయ తీయని వలపుల తెరిపి లేక
సీత నాదంచు నాదంచు క్షితిప సుతులు
ఎవరిలో వారె నూహల నెంచు కొంచు
సమయ మరయుచు నుండిరా జనకు నగరి. 190

మరు దినమ్మున నా రాజ మౌళి సభను
దేశ దేశాంతరమ్ముల జనము లెల్ల
వేడుకను జూడగా గుమి కూడి నంత
జనకు డరుదెంచె జయజయ ధ్వనుల నడుమ 191

అంతకును మున్నె వేడ్క స్వయం వరమున
పాల్గొనెడు రాచ ముద్దుల బాబు లెల్ల
శంకరుని చాప మెక్కిడు సంబరమ్ము
హృదయముల నింద నేతెంచి రెలమి సభకు. 192

ఇంతలో వచ్చె కౌశికు డిన కులాబ్ధి
చంద్రు లైనట్టి రామ లక్ష్మణుల తోడ
సభ ప్రవేశింప జనకుండు సంత సించి
వారి యుచితాసనమ్ముల వరల జేసె. 193

విపుల భుజ శక్తిగల పది వేల జనులు
హరు శరాసన మా సభ యందు చేర్చ
పూజ ముగియింప; జనక భూభుజుడు లేచి
వచ్చి నట్టి వారల జూచి పలికె నిట్లు 194

స్వాగతము–స్వయంవర సభాస్థానులార!
వినుడు సావధానత నాదు విన్నపమ్ము
ఈ శివుని చాప రాజమ్ము నెవ్వ డెక్కు
పెట్టు నతనికె నాసుత పెండ్లియాడు. 195

అనుచు చాపమ్ము చూపించె జనక నృపతి;
రాకుమారులు శివచాప రాజము నట
గాంచి_ మిరుమిట్లు గొల్పు బంగారు బొమ్మ
సీత నూహించి హృదయాల చిందు లేసి. 196

ముద్దులను మూట గట్టు యా ముగ్ధ సీత
వశము గాకున్న బ్రతుకెల్ల వ్యర్థ మనుచు
బలముకొలది యత్న మొనర్చి భంగ పడిరి
రాజ సుతు లొక్క రొకరె గర్వాన వచ్చి. 197

కొంద రవ్విల్లు గని యిది కొండ వోలె
నున్న దయ్యారె యని యది యున్న చోటు
దరియ వెరచిరి మగసిరి దరుగు ననుచు
భంగ పాటు భయమ్ము భావమున గదుర. 198

అందరవ్విధి నపజయ మందు చుండ
గాంచి జనకుండు మదియందు కలత నొందె
సభయు నిశ్శబ్ద మాయె నా సమయ మందు
ఎవ్వ డెక్కిడు నని నిరీక్షించి నారు. 199

మునియు కనుసన్నతో రాము మోము జూడ
నానతిడె నంచు నెంచి నిజాసనమ్ము
డిగి నిలచిన శ్రీరాముని దివ్య మూర్తి
శాంతిలగ జేసె నొక్కింత జనక నృపుని. 200

ఇన కులోద్భవు డంత సమ్మునికి మ్రొక్కి
బాల మత్తేభమును బోలి పదము లిడుచు
ధనువు కడ జేరి శివచాపమును గ్రహించి
కడక మోపెట్ట బోవు తత్ క్షణమునందు. 201

ఫెళ్లు మనె విల్లు సభ్యులు తల్లడిలిరి
ఘంటికలు రాజ సభలోన ఘల్లు మనియె
జనకునకు సీతకును మేను ఝల్లు మనియె
పర నృపులకు గుండె గుభిల్లు మనియె. 202

వరలు కౌసల్య ఆనంద వర్ధనుండు
నగు రఘూత్తము సత్వ మేమనగ నగును
అతల కుతలాది లోకము లదల నపుడె
ఆ ధనుర్భంగ రవము దిగంత మంటె. 203

ధనువు తునిగిన గని తక్కు ధరణి పతులు
శిరములను వాల్చి ఖిన్నులై సిగ్గు పడిరి
హృదయములు పొంగె నవనవా భ్యుదయ మొదవ
జానకీ దేవికిని మరి జనకునకును. 204

సురలు మురియుచు గురిసిరి విరుల వాన
పడుచు చెలరేగె మంగళ వాద్యములును
ప్రీతి పొలురాడ సిగ్గుతో సీత యపుడు
బాలరాముని మెడనుంచె పూలమాల. 205

జనక నృపతి యా శుభవార్త సత్వరమ్ము
దశరథున కంప చనుదెంచె దశరథుండు
సచివ వర్గము తోడను సతుల తోడ
హితులతో సుతులతొ పురోహితుల తోడ. 206

పెండ్లి వారల దగురీతి పేర పేర
కుశల మడుగుచు జనకుండు కూర్మి నొసగ
స్వాగతాదర వినయ భాషణము లలర
తగిన విడుదుల విడియించె తత్క్షణమ్ము. 207

దశరథుం డంత భక్తి తత్పరత వెలగ
ముందు కౌశికునకు జేసె వందనమ్ము
పిదప కొమరుల దరిజేర్చి ముదము గదుర
వత్సలత జూపి దీవించె వసుధ మరియు. 208

తనయులకు నాశిషము లిడి తత్క్షణమ్ము
దశరథేశుని రాణులు తరలినారు
కోడలిని జూడ; దేవేరి మేడయందు
ముద్దు జానకినిం గని మురిసినారు. 209

లక్ష్మి వలెనున్న జానకి లక్షణములు
మువురు రాణులకును గొప్ప మోద మొసగె
వినయ వినమితయై సీత వేడ్క గదుర
నంజలించెను మనసార నత్తలకును. 210

వినయులై విజ్ఞులై సీత వెనుక దిరుగు
మువురు కన్నియలం గాంచి ముగ్ధు లగుచు
దశరథేశుని రాణు లాదర్శమతులు
భర్తతో నేదొ 'గుసగుస' బడిరి – యంత. 211

దశరథుడుగోర జనకు డత్యంత ప్రీతి
నూర్మిళాదుల స్నుషలుగా నొసగ నెంచి
దెలిపె తన నిశ్చయమ్మును – దెలిపి నంత
మురిసినారు కౌశికు డాది మునులు – జనులు. 212

అల విదేహులు, నిక్ష్వాకు లిల ప్రసిద్ధ
కులులు – చింతింప సద్గుణ కోవిదులును
ఘన యశఃకాము లమలులు కరుణ మయులు
వారి సము లెవ్వరును లేరు వసుధ యందు, 213

సిరియు వీర్యము శౌర్యమ్ము గురు యశమ్ము
వర బలమ్మును తేజము లిరు కులముల
సమముగా నుంట బాంధవ్య మమల మనుచు
జనకు – దశరథు బొగడిరి ఘనులు మునులు 214

రామునకు సీత ఊర్మిళ లక్ష్మణునకు
తనదు తమ్ముని తనయలౌ తలిరు బోండ్ల
భరత శత్రుఘ్నుల కిడి వివాహ మంగ
ళంబు జరుప నెంచెను మిథిలాధి పతియు. 215

దశరథుడు వల్లె యనినంత ధరణి పతియు
జాతి ముత్యాల తోరణ జాల తతుల
రాజ సౌధము పురము నలంక రించి
వెలయ జేసెను కళ్యాణ వేడుకలను 216

సూర్య చంద్రులు బుధ గురు శుక్ర రాహు
శని కుజుడు కేతువును శుభ స్థానమందు
నుండి శుభ వీక్షణమ్ముల నొప్పు వేళ
రామచంద్రాదుల వివాహ లగ్న మలరె. 217

# సీతా రామ కళ్యాణం

జనకుడంత వశిష్ఠుని గనుచు నుడివె
మునివరా! మీరలీ సర్వ మునుల గూడి
జానకీ రామ కళ్యాణ జయ మహోత్స
వ క్రియను వేగ గావింప వలయు నంచు, 218

పలికి నంతనె ముని భగవాను డతి_ము
దమ్ము విరియగ కౌశికు డాది ఋషుల
యభిమతమ్మున శాస్త్రోక్త మనుసరించి
వేగ నిర్మించెను వివాహ వేదిక లను 219

గంధ పుష్పాక్షతలును బంగారు పాత్ర
లందు సిద్ధము చేసి_రాకేందు వదన
లెందరో జేరి సరసోక్తు లెలమి బలుక
మంగళ స్నాన మొనరించె మగువ సీత. 220

మేలి రతనాల తోరణ జాల మమరి
కనుల విందగు వేదిక కడకు నపుడు
హంస గమనాన విచ్చేసె నవని తనయ
పండు ముత్తైదువల్ చెలుల్ పజ్జ నడువ 221

దశరధాత్మజులును శుభ తరుణమందు
స్నాతులై మేలి పట్టు వస్త్రములు దాల్చి
అమల గంధాది లేపమ్ము లలర_ నపుడె
చేరిరి వివాహ వేదిక చెలువ మలర 222

జనక సుత సీత మృదుపాణి జనకరాజు
సంతసమ్మొప్ప శ్రీరామ చంద్రమూర్తి
పాణి నిడి_తల్లి యానంద భాగ్య వర్ధ
మందు రఘురామ గని జనకుండు మురిసె 223

అమల భూషణ భూషిత అవని జాత
జానకీ దేవి నపుడ; శ్రీ జనక రాజు
రాఘవాభి ముఖమ్ముగా రమణ నిలిపి
పలికె నగ్నిని వేల్చి తా భద్ర మొప్ప 224

ఈమె నాసుత సీత-నే నీమె నిపుడు
నీకు త్రికరణ శుద్ధిగా నిచ్చుచుంటి
ధర్మ పత్నిగ-గైకొమ్ము తరుణి పాణి
అనుచు జలము విడచె రాము హస్తమందు 225

నాయనా! ఈమె నిన్ను నీ ఛాయగానె
అనుసరించును సాధ్వియై యనవరతము
అబల సహ ధర్మచారిణి నందు మనుచు
కాళ్లు కడిగెను కొబ్బరి నీళ్ల తోడ. 226

అమల మంగళ వాద్యమా సమయ మందు
భూ నభోంతరములు నిండి మోగుచుండ
ఒకరి శిరమున చూడ నింకొకరి చేత
జీలకర బెల్లమును బెట్టజేసినారు 227

ఆ ముహూర్తముననె జన కవని పతి
అనుగు సుత ఊర్మిళను లక్ష్మణున కొసంగె
మాండవీ శ్రుతకీర్తుల మాన్య గుణుల
భరత శత్రుఘ్నుల కిడె సంబరము మీర. 228

అరయ పదునాల్గు భువనము లమిత ముదము
నందుచును చూచు చుండగ బంధు జనుల
హర్ష కోలాహలము మధ్య నా నరేంద్ర
సుతులు నల్వుర కళ్యాణ శోభ జరిగె. 229

అది సుమూహూర్త మని పెద్ద లాదరమున
నడిమి తెరతీయగా నరనాధ సుతుడు
సీత ముఖ పద్మము గని హర్షించె; నతని
మోము గని హర్ష ముఖి యయ్యె పృధ్వి తనయ 230

రాము నగుమోము గాంచిన రమణి సీత
కనులు వెన్నెలన్ వికసించు కలువ సొబగు
లొలుకుచును రాము పాదాల నిలచి పోయె
పతి పదమ్ముల ప్రణమిల్లు భావ మలర. 231

జనక సుత మోము తదుపరి చన్నుగవయు
పిదప తనుమధ్య మటుపయి పిరుదములను
నంత నూరువులంగన ఆ నరేంద్ర
సుతుని హృదయము గోరును సన్నితముగ. 232

అమలమై యొప్పు యందంపు కొలను నందు
కలువ లనియెడు జానకి కనుల యందు
వలపు దొలుకాడు శ్రీరామ భద్రు కనుల
కాంతులను గమ్మె హిమధాము కరము లనగ 233

రామ చంద్రుని సొబగు వారాసి లోని
పొగరు బలిసిన మీనుల పొలుపు దెలుపు
జనక సుత కన్నుగవ ప్రావాలె జననుతు పయి
శ్రీమను శశిగూడు ఘన చకోరముల పగిది. 234

మంగళరవమ్ములును వేద మంత్ర ఘోష
సకల దిశల నిండగ ముని సంఘ మెల్ల
సంతసము నొంద శ్రీరామచంద్ర మూర్తి
చెలు వరల తాళి గట్టెనా సీత మెడను, 235

తాళి గట్టిన తదుపరి తంతు లెల్లి
వడిగ ముగియించి – కోసల ప్రభుని సుతులు
పెద్దలకు; వృద్ధులకు; ఋషి ప్రవరులకును;
అంజలించి కాంచిరి; వారి యాశిషముల. 236

హితము మీరగ; రాముండు కుతుక మంద;
జనక నరపతి కౌశిక మునిని – భక్తి–
పూజలం దృప్తు గావింప బొంగి యతడు
వర తపోనిష్ఠగొన; హిమగిరికి చనియె. 237

మునుల పూజించి వీడ్కొల్పి – ముదము మీర
విప్రులకు కాన్కలిడి గౌరవించి బంచె
దశరథునకును జనకుడు తగినరీతి
కనక మణి రత్న చయములు కాన్కలిడియె. 238

పెండ్లి జరిగెను; తదుపరి పెద్ద లాజ్ఞ
జనక నరపతి సంతోష జనకు డగుచు
భూషణాంబర ద్రవ్య విశేష వస్తు
చయములిడి ముద్దు కూతుల సాగనంపె. 239

## పరశురాముండు

జనక నరపతి వీడ్కొల్ప నినకులేంద్రు
డతుల వైభవ మెసార సతుల తోడ
సుతులతో నెల్ల జనులతో స్నుషల తోడ
పయన మాయెను సాకేత పట్టమునకు. 240

వారలా విధి జనుచుండ వనములోన
మధ్య మార్గాన రోషాన మండిపడుచు
పరశురాముండు వచ్చె నవార్య గతిని
తీవ్ర శౌర్య కోపాగ్ని పందీప్తు డగుచు. 241

దశరథేశుండు భయమంది తల్లడిల్లి
ఋషికి సాష్టాంగ పడి; నమస్కృతు లొనర్చె
రాముడును గూడ వినయ గౌరవము లొప్ప
దాశరథి నని జెప్పి వందన మొనర్చె. 242

రాముడెవ్వడు మీయందు? రమణి సీత
కొరకు పశుపతి కార్ముక మరయ విరచి
మేటినని గర్వ మందు యా మేటి జూడ
వచ్చితిని; భార్గవుడనంచు పలికి మరల. 243

జీర్ణమగు శంభు చాపము; క్షితిప వంశ!
భంగ మొనరించి ఘనమని బహు విధాల
విఱ్ఱవీగుచు నుండెడి వెఱ్ఱి రాము
బల పరీక్షను జేయ నే వచ్చితి నన. 244

కినుక యిసుమంత లేక యయ్యిన కులుండు
ముని మహోదయుతో ప్రియమున వచించె
ననఘ! దశరథ సుతుడ నియ్యవని జనులు
ప్రేమ దొలుకాడగా నన్నె రాముడంద్రు. 245

ఆనిన భగ్గున మండి నయ్యనఘు డపుడు
క్రోధ ఘూర్ణిత హృదయుడై కొంత వడికి
రాముడను పేర నేన యీ భూమినుండ
నన్యుడగు రాముడును గీము డాత డెవడు? 246

అనుచు పలికిన-రఘురాము డలుక లేక
పలికె జమదగ్ని సుతునితో ప్రవిమలముగ
తాపసోత్తమ! మాపయి కోప మేల?
ధర్మమా యిది తమవంటి తాపసులకు. 247

తప్పు గలిగిన దండింప దగుదు వీవు
మేము మా త్రోవ నేగుచున్నాము గాని
ఎగ్గు దల పెట్ట లేదు మే మెవరి కైన
ధర్మమా కోప మూనంగ తపసి వర్య. 248

అనిన ఇనుమడించిన కోపమున నతండు
రాముడను నేను– నీవును రాముడవె య
యిన ఇదిగొ కార్ముకమ్ము నెక్కిడుదె? యనిన
రాము డంగీక రించె నిర్భయము తోడ. 249

పరశు రాముండు కోప సంభరితు డగుచు
చేతికిని విల్లు నిచ్చుచు చెప్పె నిట్లు
విష్ణు కార్ముక మియ్యది–వివిధ శక్తు
లలరు నిందు–చే దాల్పగా వలయు నీవు. 250

మున్ను సురముఖ్యు లెల్ల రమోఘ భక్తి
విశ్వ కర్మను ప్రార్థింప వేడ్క నతడు
శిల్ప నైపుణ్య మేపార చిత్ర మైన
చాప యుగళమ్ము నిర్మించె శక్తు లలర. 251

మేరునగ దృఢ మైన యా మేటి ధనువు
లందు హరుకిడె నొకటి; ప్రియాన దాల్చి
హరుడు బలయుతుడై మగ సీరులు గురియ
త్రిపుర జయమును గైకొనె ధీ వశిశస్త్రి. 252

రెండవది యైన దివ్య కోదండ మంత
సమరు లర్పింప నండజ గమనునకును
సకల జనములు వేనోళ్ళ సన్నుతింప
వేడ్క నర్పణ మొనరించె విశ్వకర్మ. 253

శంక లేకంత దేవతా చయ మదెల్ల
నీశ – మాధవ – బలముల నెరుగ గోరి
పద్మ సంభవు ప్రార్థింప – భర్గునకును
విష్ణునకు వైర మొనగూర్చె విధియు నపుడు. 254

అమిత రోషాత్ములై హరి హరులు నంత
ఘోర సంగ్రామ మొనరింప గోరి యెదుర–
స్థబ్దు డయ్యెను ధనువుతో శంకరుండు
పంకజాక్షుని ఘనచాప పటిమ కడను. 255

అనిమిషులు నంత భయమంద నబ్జభవుడు
హరి హరుల ప్రార్థనము చేయ: హరుడు హరియు
పోరు చాలించి మునుపటి పొందు గలిగి
జగము ముదమంద జనిరి స్వస్థానములకు. 256

అంత వాసవుడును – బ్రహ్మ – యమర వరులు
శంభు చాపము కంటె నీ చక్రి చాప
మమిత బలమైనదని తమ యాత్మ లందు
తలచి చనినారు తమ లోకములకు మరలి. 257

శంకరుడు శక్తిగల తన చాప మా వి
దేహు లందుత్తముండైన దేవరాతి
కిడెను – మిథిలలో నీవు నెక్కిడిన చాప
మయ్యదియె రామ! యింకరెండవది యిద్ది. 258

జనకు జమదగ్ని దున్రించిన క్షత్రియుండు
కార్త వీర్యుండు యొుధలుగా క్షరిన రాజ
లోకమును నిర్వధొక్షమూరు ప్రాకటముగ
ధరణి గూల్చిన బలమైన ధను వటంచు. 259

ఘనముగా చేతి విల్లు రామునకు నిచ్చె
పరశు రాముండు రాముని భంగ పరుప
చండ బలుడైన రాముడా చాప మదిమి
పట్టుకొనగ నా మహిత చాపమ్ము నుండి, 260

ధరణి హరియంశ బుట్టిన పరశు రాము
తేజ మరుదెంచె రాముని దేహమునకు
రాము డంతట భార్గవ రాము చాప
మెక్కిడెడు నంత నది రెండు ముక్కలయ్యె. 261

పరశు రాముండు దశరథ బాలకుండు
రాములై పుట్టి రిల ధర్మ రక్ష సేయ
వరలు లోకోపకార సంభరిత మతిని
ఆది నారాయణుం డిట్టు లవత రించె 262

తనదు తేజము నటుల రామునకు నిచ్చి
పరశు రాముండు రాముని బహు విధముల
ప్రస్తుతించుచు తగిన దీవనల నిచ్చి
చనె హిమాద్రికి తపమును సలుపు కొరకు 263

ఘనుడు భార్గవ రాముండు చనిన యంత
దశరథుడు సంతసమ్మంది తనయుల గొని
సకల పరివారములతోడ సతులతోడ
పయనమై చేరె సాకేత పట్టణమ్ము. 264

కొడుకు కోదండ్ర గూడుక పుడమి ఱేడు
దొడరి వచ్చుచు నున్నట్టి దొడ్డ వార్త
ఆ యయోధ్యను వ్యాపించ – నఖిల జనులు
కరము ముదమంది సంతోష భరితు లైరి 265

స్వాగతము దెల్పు తోరణ జాలములును
దివ్య మంగళ సుస్వన స్థితుల వెలసి
యమర పురి శోభలను మించి యలరు చున్న
నగరముం జొచ్చె నా నర నాథు డపుడు. 166

క్రొత్త కోడండ్రకును పెద్ద ముత్తయిదువ
లారతులు బట్టి దీవించి-ద్వార దేశ
భాగముల వారి నిలబెట్టి భర్తృ నామ
ములను పలికించి యానంద పూర్ణ లైరి. 167

జిలుగు బుగ్గల నునుసిరి సిగ్గు లలర
పతుల పేర్లను మెలమెల్ల బలికి వారు
ఉత్సవమ్మున గదలిరి ఊర్మిళాది
సతులు - సీతయు తమతమ పతులు మురియు. 168

కూర్మి రసమయ జలధుల గ్రుంకు లిడుచు
క్రొత్త కోడండ్రతో తమ కొడుకు లెల్ల
స్వర్గ సుఖముల దేలెడి సరణి నరసి
హితము గనినారు రాజ దంపతులు మురిసి, 169

కొడుకు కోడండ్ర క్షేమము కోరుకొంచు
నర్థులకు దానముల నిచ్చి యలతి జనుల
కన్న బిడ్డల రీతిగా గాంచుచుండె
ధరణి కొనియాడగా నట దశరథుండు 170

ఇది శ్రీ గురునాథేశ్వర వరప్రసాద సహజ కవితా సంప్రాప్త
కాశ్యపసగోత్ర పవిత్ర - పార్వతీ అనంతరామ పుత్ర
బుధజనవిధేయ రఘురామ నామధేయ ప్రణీతంబైన
రఘురామ రామాయణమను తేటగీతి కావ్యము
నందు బాలకాండ సంపూర్ణము



# రఘురామ రామాయణం

శ్రీ మదఖిలాంధ్ర విలసిత స్వీయభావ
రాచకీయ యుగంధరా–రామ భక్త!
విశ్వ విఖ్యాత తెన్నేటి విశ్వనాథ
అవధరింపుము నాదు రామాయణమ్ము

## అయోధ్యా కాండ

## నూత్న వధూవరులు

పరిణయోత్సవ కౌతుక స్వాంతులగుచు
[illegible]డి రాజ సౌధముల యందు
వేడుకలు సల్పుచును ప్రణయోత్సుకతను
గడుప నొదవిరి కాలంపు గణన లేక. 1

తావితో గూడి వెలగెడు పూవు పగిది
జానకిని గూడి రాముండు జననుతుండు
నలరె – ఆనంద భావ విహారు డనగ
నవ్య జీవన విభవ మనస్కు డగుచు. 2

రామునకు గుండె మైథిలీ రామ యయ్యె
జానకికి గుండెయును రామచంద్రు డయ్యె
జానకీ రాము లద్వైత సత్వు లంచు
జనము లాదర్శ పౌర వశ్యంబు గనిరి. 3

భామతో గూడి యినకుల స్వామి సతము
రాజితానంద సంపూర్ణ రాగ జలధి
నోల లాడును రసమయ డోల లూగు
ప్రకృతి పురుషుల పుణ్య దాంపత్య మలర. 4

రఘుకులాన్వయ రత్నమ్ము రామ చంద్రుం
డాతత ప్రేమ సీతా ముఖాబ్జ మందు
మధుప సదృశుడై ప్రీతి తన్మయుడు నయ్యె;
ఆమె హృదయము సకలమ్ము రామ మయము 5

జగతికిని తల్లి దండ్రులౌ జంట వారు
మానవతకును జూడ ప్రమాతృ లగుచు
శ్రీ యయోధ్యా పతి గృహ సీమ యందు
చెలగ-కోసల సిరి సంపదలు వహించె. 6

మాయ లంటని పెనుమాయ - మాయ మునిగి
భ్రమల దగలని చిత్త విభ్రాంతి దగిలి
పరమ పురుషార్థ సాధనా వ్రతము పూని
పదియు రెండేండ్లు గడపిరి వసుధ యందు. 7

భరత శత్రుఘ్ను లిరువురిన్ పంక్తిరథుడు
మాతులుని కోర్కె వంది గ్రామమున కనిపె
వార లిరువు రన్యోన్య సౌభ్రాత్ర మలర
ఒకరి వీడి వేరొకరు లేకుండ నుండ్రి. 8

తమ్ము లటు మాతులుని నివాసమ్ము చేర
తల్లి దండ్రులు చింతను దగుల కుండ
సేవ లొనరించి హర్షింప జేసి నారు
రాజ దంపతులను రామ లక్ష్మణులును. 9

రాము డనినంత కోసల రాజ్య మెల్ల
పరవశమ్మంది ప్రణమిల్లు భక్తి తోడ
సకల సద్గుణ రాసి యీ జలజ నేత్రు
డనెడి విశ్వాస మాత్మల నావరింప. 10

రాముడును గూడ విభవైక రతుడు గాక
కరుణ రస పూర్ణ హృదయుడై -గడగి ప్రజల
భద్రమునకు నై సతతమ్ము పాటు పడును
శరణ మన గాచు నెంతటి శత్రునైన. 11

తనకు గలిగిన కష్టము దలప డెపుడు
ఒరుల బాధలు జూచి తా నోర్వ లేడు
అట్టి రామునికి సరిలే రవని నెవ్వ
రంచు దలతురు ప్రజ లెల్ల రాత్మలందు. 12

తన బహిః ప్రాణమైన రాముని గుణంబు
జనులు పొగడగ విని చాల సంతసించి
రత్న దీప మితండు మా రఘు కులమున
కనుచు పొంగును దశరథు డాత్మ యందు. 13

రామునిం జూడకే దశరథు డొకండు
క్షణము నిల్వగ లేడు తన్మన మదేమొ?
అమృత లహరి మునిగి యోల లాడు సతము
రాము నింజూడగనె మహారాజ వరుడు 14

దశరథుండంత నొకనాడు దలచె మదిని
యేలితిని భూమి వేలాది యేండ్లు లింక
నలసి పోయితి; వృద్ధుండ నైతి; రాజ్య
భారము వహింప కష్టమై బరగు చుండె. 15

రమ్య గుణనిధి యగు రాము రాజు జేసి
భారమును వీడి స్వేచ్ఛగా బ్రతుక దలచె;
ఆస చివురించు నవనవోన్మేష ముగను
నెతల పుట్టిల్లు – విడువ వివేక మగును. 16

అంచు మదినెంచి మరు దిన మవని పతియు
హితులను - ప్రజాళిని పురోహితులు – మంత్రి
చయము_నృపులను రావించి పభను దీరి
హితము – వడయగ తన మనోగతము దెలుపె. 17

వడలి పోయిన సింగమ్ము వలెను రాజు
ధీర గంభీర నిస్వన స్థితి వహించి
పలికె నెల్లరు విన తన భావ మందు
నణగి యుండిన కోరిక నంద రెరుగ. 18

ఆర్య జనులార! పెక్కెండు లవని నేలి
జయము లెన్నింటి నో గాంటి జగము మెచ్చ
ముదిమి గదిసెను; నేనింక ముసలి నైతి;
ప్రజల పాలించు బాధ్యత భారమాయె. 19

రాజ్య భారము నే వీడి రామునకును
పట్టముం గట్టి విశ్రాంతి బడయ నెంచి
మాకు హితులగు మీతోడ మనసు విప్పి
దెలుపు చున్నాడ – మీ మది దెలియ గోరి. 20

మహిపు డిట్టుల సభయందు మనసు విప్పి
దెలుటవుయు నెల్ల సభ్యులు దేజరిల్లి
రంద రొక గొంతుతో బల్కి రవని నేల
కడు సమర్థుండు రాముండు క్రమ గుణుడు 21

బుద్ధిమంతుడు; మిత భాషి; పురుష వరుడు;
శస్త్ర శాస్త్రాది విద్యా విశార దుండు;
అమిత తేజస్కు - డసమాను - డమల గుణుడు
ధరణి దశరథ రాముండు పరహితుండు. 22

ఆ నరేంద్రుని సుతుడు దానను దినమ్ము
పెద్దలును గురువులు జ్ఞాన వృద్ధు లైన
సజ్జనుల తోడ-చతురత సంగ్రహింప
శాస్త్ర చర్చలు ప్రీతిగా సలుపు వాడు. 23

అన్ని విధముల మీకు దీటైన వాడు
అఖిల జనులకు నామోద మైన వాడు
భూమి రఘువంశ సత్కీర్తి పొలుపు గూర్చ
యోగ్యుడగు రాము డఖిల ప్రయోజ కుండు. 24

అట్టి రాముని రాజుగా నవని నాథ!
నీవు ప్రకటింప గాదన నేరి కగును?
అమృత మయుడయి అందరి యంతరంగ
ములను వ్యాపించి యుండు రాముండతండు. 25

దశరథేశ్వర! మా పుణ్య వశము వలన
గాదె యీ బుద్ధి నీ యందు కలిగి; పరమ
పావనుండు దయాధర్మ పాల కుండు
రామ చంద్రుండె మా కింక రాజు; రాజ! 26

తడ బడెడు నడుగు లిడు నా డతనిని గాంచి
మాకు సరియైన రాజంచు మనము లందు
ముద్ర పడియెను; నేడది భద్ర మాయె
మాదు వాంఛిత మీడేరె మాన వేంద్ర. 27

అనుచు సభ్యులు దెలుప నయ్యవని ధవుడు
పరమ హర్షము నొంది తా బలికె మరల
సభ్యులును మీరె - ప్రభు హితా చరణ మతులు
గాన మీ అభీష్టమె మాదు కామ్య మెపుడు. 28

అరయ మీ సహకారమ్ము నాదరమ్ము
గలుగుటయె గాదె యిన వంశ గౌరవమ్ము
వరలి యే లోపములు లేక పాలనమ్ము
జరిగె నిన్నాళ్లు; నింకను జరుగు ననుచు. 29

ప్రీతితో రాజు వచియించి ప్రియు మెలర్ప
గురు వశిష్ఠుని సుముహూర్త మరయు మనగ
మరు దినమ్మె న్ని విధముల మంచి దంచు
పలుక - నేర్పాట్లకై మంత్రి వరుల గోరె. 30

అమర గణ పరివృతు డైన యమర నాథు
బోలి యలరారు దశరథ భూ భుజుండు
మంత్రి సామంతులను తమ మందిరముల
కంత వీడ్కొల్పి - గదలె సుస్వాంతు డగుచు. 31

ఊర్వి రాజ్యాభి షేక మహోత్సవమ్ము
మరు దినమ్మున ఘనముగా జరుగు ననెడి
వార్త వడివడిగా పురి వ్యాప్తి జెంది
జనుల నానంద వశులను జేసె మిగుల 32

వీధి వీధుల ప్రతి యింట వేగ గతిని
రాచ బాటల నగరుల రచ్చ లందు
వ్యాప్తి గాంచెను ప్రజల కాహ్లాద మెసగ
శ్రీ రఘూద్వహు పట్టాభి షేక వార్త. 33

అమిత వేగాన వ్యాపించు నా సువార్త
ముపురు రాణులు దాదులు ముఖ్య జనులు
వారు వీరును – వీరును వారు వినిరి;
కుటిల దుష్టాత్మ మంథర గూడ నెరిగె. 34

## మంథర

ఎలమి కైకేయితో పుట్టి నింటి నుండి
వచ్చినది దాసిగా కైక పనులు సేయ
మంథరని యెడు స్త్రీ కడు మాయలాడి
మంచి యెరుగని గడుసైన మనిసి యామె 35

అంద రానంద జలనిధి యందు దేల
మంథ రొక్కతె ఆ కైక మందిరమున
విసము నిండిన మనసుతో వేడ్క లుడిగి
చిడి ముడిని పడుచా కైక చెంత చేరె 36

'వింటివా! కైక!' వీనులు వ్రీలు వార్త
రాముఁడట రాజు మన కందరకును నింక
పరగ పట్టాభిషేకము జరుగు రేపు
జనము లుప్పొంగు చున్నారు సంతసమున. 37

అనిన విని ఆత్మ సంతస మంది కైక
మందరను మెచ్చి నగ బహు మాన మిచ్చి
ఎంత చల్లని వార్త! నీ విపుడు తెచ్చి
నా–పనగ మంథరయు విష హాస మమర. 38

బేల వైతివె; కైక! బెంబేలు పడక
సంతసిలు చుంటి విది కడు వింత యయ్యో!
చెడు దినమ్ములు నీకును చేరు వగుట
సుడులు దిరిగెదు! చీకట్లు చుట్టు నీవు. 39

సవతి కౌసల్య పద సరోజముల చెంత
దాసివై హీన గతి నీవు దోసి లొగ్గి
కొడుకుతో దీన తనమున కొలువు సలుపు
కాల మాసన్న మైనదే వేల నేడు. 40

సవతు లెందేని సవతులే! సవతు లందు
మత్సరము పోదు నటనము-మాయ హెచ్చు
మదిని యోచింపు మిదియని మంథరయును
పలుకగా కైక యులుకుచు పలికె నిటుల 41

ఏమె! యివి యేటి మాటలె? రాము డెవడు?
ఆదరము మెండు రాముని యందు నాకు;
తల్లి కంటెను మిన్నగా దలచి నన్ను
గౌరవించును న్రమతా గరిమ గలిగి. 42

వినుము భరత రాములు రెండు కనులు నాకు
వేరుగా నెంచ లేదమ్మ వారి నెపుడు
ధర్మ మిది కాదు దుర్బుద్ధి తగద టంచు
మంథరను కైక హితవుగా మందలించె. 43

తోక ద్రొక్కిన త్రాచయి కేక బెట్టి
బహుమతిగ నిడ్డ నగ నేల బడగ విసరి
కుమతి; విషతుల్య; మంథర కుటిల హృదయ
నిడుద యూర్పులతో బల్కె నీ విధాన. 44

రాము డేనాడు రాజౌనొ; రమణి నాడె
భరతునకు కీడు తప్పదు- తరుణి వినుము
భరతుడే అడ్డు శ్రీరామ భద్రున కని
దూరముగ నతనిని బంపి నారు కంటె. 45

వసుధ రాజుల కడ్డమౌ వాడెవండు
బ్రతికి బట్ట కట్టగ బోడు పడతి నిజము
రాజ తంత్ర మిట్లుండు ధరా తలాన
బ్రతుక జేతువో చంపుదో భరతు నంచు 46

భయము కలిగించు మాటలు పలికి పలికి
మనసు విరచెను కైకకు మంథరయును
దైవ నిర్ణయ మిది; గాక తల్లి మనసు
విసము మేయునె సుతుపైన వసుధ నెందు. 47

అంకురించిన యనుమాన సంకటమ్ము
అంత కింతయి - వృద్ధియై అతివ మనసు
సంచ లింపగ జేసెను — జగతి నెందు
శంక బహు పాపి - మంచిని సాగనీదు 48

## రామ పట్టాభిషేక భంగము

విసము తల కెక్కె; కైక యేవిధిని నైన
భరతునకు పట్టముంగట్టి—త్వరగ రాము
వనములకు బంపగా తన మనము నందు
నెంచి— కోపము నటియించి మంచ మెక్కె. 49

ఏమి యెరుగని దశరథ భూమిధవుడు
శ్రీ రఘూద్వహు పట్టాభిషేక వార్త
విశదముగ జెప్పి వీనుల విందొనర్ప
కైక సౌధంబునకు బ్రీతి కదలి నాడు. 50

శ్రీఘ్ర గమనాన దశరథ క్షితిప వరుడు
కారు మబ్బులు గప్పి నాకాశ మట్లు
కాంతి విడనాడి యున్నట్టి కైక గృహము
ప్రేమ జొచ్చె పున్నమి చందమామ పోలె. 51

సకల జనులకు సంతోష జనక మగుచు
శ్రీ కరమ్మైన పట్టాభిషేక వార్త
జెప్పి యానంద మొందగా జేయ నెంచి
కైకకై మందిరమ్మెల్ల కలయ గాంచె. 52

మనసు కలగుండు వడిన యా మనుజ నాథు
డెందు కైకను గానక – యిందువదన
కొరకు చెలులను ప్రశ్నింప – కోప గృహము
జాడగా చేయి చూపిరా సఖియ లపుడు. 53

అలుక గదియందు కలతతో నలుగు సఖిని
గాంచి – కలవర మందె భూకాంతు డంత
విభుని రాకను గాంచి యా విరుల బోడి
ప్రక్క కొడిగి నిట్టూర్చుచు పవ్వళించె. 54

తన్వి నరసి నిర్విణ్ణుడై దశరథుండు
మెల్లగా నామె తల్పంబు మీద జేరి
పలుకరించిన; చింత నిప్పుల కనుగవ
బాష్పములు రాల్చు చామెయు పల్కె నిట్లు. 35

చాలు వలపులు! నిను నమ్మి బేల నైతి
గాయమై గుండె యెంతయో గాసి చెందె
దశరథుని నమ్మి చెడి పోయె తరుణి కైక
విడుము; నా పాట్లు నేనింక పడుదు నంచు. 56

జాణ యగు కైక యేడ్వ నిజమ్మటంచు
నమ్మి భూకాంతు డమిత ప్రియమ్ము గదుర
సరస వచనా విశేష ప్రశాంత మతిని
మధుర మంజుల భాషల మగువ కనియె. 57

బేల నీవేల యీలీల జాలి దూల
వగచు చున్నావు; సామాన్య వనిత వోలె
తరుణి! నా గుండె కాయవు ధరణి నీవు;
ఆజ్ఞ యిడు – వేగ దీర్తు నీ యభిమతమ్ము. 58

సవతి కయ్యములా? లేక సఖి – ప్రజన కృ
తాప రాధములా? గాక అప యశమ్మ?
యేమి జరిగెనొ చెప్పు మో యింతి; యిపుడె;
తపన నలయింతు వారల తగిన శిక్ష. 59

వలపు చిలుక! యీ దశరథ వసుధ పతి యు
వసుధ జీవించి యుండగా వ్యాకులమ్ము
బేల నీకేల? దాసుండ; ప్రీతి తొలగి
నన్ను శిక్షింప న్యాయమా? సన్ను తాంగి. 60

రమణి నీయందు నా యనురాగ బలము
నెరిగి యుండియు నీ విటు లెరుగ నటుల
సందియము జెందు టుచిత మే? సత్య దీక్ష
చెలగి నీకోర్కె దీర్తును చెప్పు మబల. 61

అంగ వంగాది వివిధ దేశాధి నాయ
కాళి నాకు వశులయి; నా యాజ్ఞ నిలుచు
టెరుగవే నీవు – నీమది నేమి కలదొ
తెలుపు మేదేశమున నున్న దెత్తు దాని. 62

కాన దుఃఖము వీడి యో కంజనేత్ర!
యెదను దాగిన కోరిక నెరుగ జెపుమ;
జలజ హితు డెల్ల చీకట్ల దొలగ జేయు
నటుల నీలోని చింతల నణతు ననుచు 63

అనునయించుచు శ్రీ కోసలావనిపతి
అడుగు చుండగ కడు సెజ్జ బడిన కనుల
కోప మొలుకుచు పలికె నా కోమలాంగి
దిశలు మార్మ్రోగ మగనితో తెగువ నిటుల 64

కపట వృత్తి నటించి నా కనులు గప్పి
చేసిన చెయిదములు చాలు! కోసలేంద్ర;
కటిక చీకటిలో నింత కాలముండి
భ్రాంతి నన్నియు నావని భ్రమసి యుంటి. 65

బొల్లి కలలయ్యె; నా యూహ పొంగు లెల్ల
భరతుడును నేను నికపైన పరుల పంచ
కొంగు చాచుక పడి బ్రతుకంగ వలయు
యిదియె నీ ప్రేమ ఫలమయ్య - యినకులేశ. 66

ఎవరి కర్మకు యోచింప నెవరు కర్త?
కేకయాధీశు సత్పుత్రి కేలు మోడ్చి
బానిసగ నెట్లు పృథ్విపై బ్రతుక గలదు?
అసువులను బాయు టుచిత మంచాత్మ దెలిపె. 67

అనెడు కైకేయి పలుకుల కదరి పడుచు
అవనిపతి - యంత కష్ట మేమంచు నడుగ
నిడుద నిట్టూర్పు ఘటియించి నిముష మాగి
చెప్పలేక చెప్పెడు నటు చెప్పె కైక. 68

వరము లొక రెండు మున్ను నీ వడుగు మనిన
యపుడు వలదని నా డంటి - యిపుడు నాకు
వలయు నా రెండు వరములు - వసుమతీశ
అనుచు కైకేయి తెలుపగా నవనిధవుడు 69

ఇంత భాగ్యానికా నిప్పు డింత యలుక!
కోరు కొమ్ము దీర్తు నిదె నీ కోర్కె ననగ:
అడి తప్పిన మీ యశ మంత రించు;
కలుగు నపకీర్తి మీకని కైక పలుక. 70

తరుణి! సందియ మేల? యీ తరణి వంశ్యు
లాడి తప్పరు – ప్రాణము లైన విడువ;
అతివ; నా పుణ్యముల పంట యైన-రాము
నాన! నీ కోర్కె దీర్తు సత్యమ్ము గాను. 71

అభి మతమ్మును దీర్తు నటంచు విభుడు
బాస చేసిన-నది దిట్ట పరచి కైక
గోపుగా రాజు సెరికురుల్ కూర్చు చుండి
వలపు దొలుకాడ చిలుకలా పలికె నిటుల 72

బాస చేస్తిరి; నా దగు భయము వీడె;
త్రిదశ కోటులు, పైనుండి దివిజు లెల్ల
సాక్షులై విన-నాకోర్కె సఫలత గన
విన్నవించెద నో రాజ! విశద మిపుడె 73

అని పలికి కైక-దశరథ మనుజ విభుడు
తన వశము కాగ-ముద్దుగా దనరి-పొగడి
అతి ప్రసన్నుని గావించి అలరు బోడి
పాప మతి యయి భర్తతో పలికె నిటుల. 74

దేవ దానవ యుద్ధ మందీవు మున్ను
తీవ్ర బాణ హతిన్ మూర్ఛ దీరి-కడమ
ప్రాణములతోడ గాసిల్లి పృథ్వి బడిన
నాడు నీ ప్రాణముల్ నిల్పినాను కాదె? 75

చతురతను జూపి యానాటి జయమునందు
పాలు గైకొని మఱియు నా వట్టుదలకు
ఎడద సంతస మంది నన్నెంత గానొ
మెచ్చి రెండు వరంబుల నిచ్చినావు. 76

నాడు వలదని యంటిని; నేడు నాకు
వలయు నా రెండు వరములు-వసుమతీశ,
వలసి నప్పుడె యడుగుమో చెలియ యనుచు
పలికి యుంటిరి అదియు జ్ఞాపకము లేదె? 77

కైక యభిమత మీతేర్పగా నృపుండు
కోరు కొమ్మనె నా రెండు కోరికలను
పలుకులను దేనె లొలుక నా కలికి యంత
రాజు నలరించి తన కోర్కెలను వచించె 78

పట్టమును గట్టవలయు నా భరతునకును;
రాము పదునాలుగేడు లరణ్యములకు
పంపవలె ముని వేషాన; వరము లివ్వి!
అనిన రాజు నిర్విణ్ణుడై యట్టె జూచె. 79

వరములా యవి? ప్రళయాగ్ని భయద హేతు
శరములా? భూ బిలము వీడి సత్వ మొప్ప
పైకి వచ్చిన కాల సర్పముల జంట?
కాలకూట విషాగ్ని వికార మేమొ? 80

చేష్ట లుడిగి రా జేమిక చేయ వలెనొ
పాలు పోవక శూన్య దృగ్వలయు డయ్యె
మొదలు నరికిన వృక్షమ్ము విధము దోప
మనసు చెడి నేల గూలె నా మానధనుడు. 81

కొంత వడి కంత స్థిమితము కూర్చి కొంచు
దీన మానసుడై యెద దిగులు దోప
మతి చెడిన వాని గతి పీడ్యమాను డగుచు
తల్లడిల్లెను వాపోయి దశరథుండు. 82

కైక యిటు కోరెనా లేక కలలు గనుచు
నూరకయె భ్రాంత మతిని నే నూహ చేయు
చుంటినా? యని యోచించి యుర్వి విభుడు
అరసి – చిత్త విభ్రాంతి కాదని యెరింగి. 83

రాజుగా భరతుని జేసి రాఘు వనికి
ముని కుమారుని రీతిని పనుపు మనుచు
వరము లడిగితి వివి యేటి వరము లతివ?
మాతృ హృదయ వాత్సల్య మేమాయెనీలా. 84

ఏమి చెడుగు చేసెను నీకు రాము డతివ!
నీకు – నీసుతునకు కలనేని నెపుడు
కీడు దలచెడి దుష్టుడు గాడతండు
కరుణతో రాము గను, మది గాక వినుము. 85

రామ చంద్రుని వీడి నే రమణి! క్షణము
నిలువగా నోప; నియ్యది నిక్కమమ్మ!
గాన దయదాల్చి నాపయి కరుణ జూపి
వరము లుప సంహరింపవే వనిత యనుచు. 86

పలు విధమ్ముల బ్రతిమాలు పతిని గాంచి
సుంత చైనను కరగని సుదతి కైక;
కఠిన వర్తనమును రాజు గాంచి మిగుల
శోక ఘూర్ణిత హృదయుడై శోభ లుడిగె. 87

మాన్యుడు వశిష్ఠుడంప సుమంత్రు డంత
నచటు దశరథు గొనిపోవ నరుగు దెంచి
ఆడు పులి వాత బడు మగ లేడి వగిది
శోక నిర్మగ్ను దశరథు జూచె నాడు 88

తన్ను గాంచి మాటాడని దశరథేశు
జూచి - మూర్ఛిన్నపడి - నిలుచుండ జూచి కైక
వడి వడిగ నాతనింజేరి వసుధ పతి వి
చారముంగూర్చి జెప్పె విస్పష్ట ఫణితి 89

రెండు వరములు నాకు నీతండు జూడ
మున్ను వాగ్దాన మొనరించె ముదితుడగుచు;
వాని నిప్పుడు గోరితి - గాని రాజు
దీర్ప నోపక నీరీతి దిగులు గొనెను. 90

రాజు భరతుడు గావలె; రాముడింక
పదియు నాల్గేండ్లు ముని వృత్తి వనము లందు
బ్రతుక వలె నని నే గోర వాని దీర్ప;
కొంప మునిగిన యుట్టుల కూల బడియె. 91

ధర్మ మెరిగిన వారు సత్యమ్ము మించి
ధర్మ మేదియు నీ భువి దనర దనుచు
పలుకుదురు; వేడు నేను నా వలయు వరము
లడుగ - ధర్మము మరచి యిట్లడరు చుండె. 92

ఆడి తప్పని వానిగా నవని పతిని
చేయ దలచిన రాముండు శీఘ్రగతిని
నార చీరలు ధరియించి నమ్ర బుద్ధి
సిరుల త్యజియించి వనముల కరుగ వలయు 93

అకట – కౌసల్య భయమున నవని ధవుడు
రామునకు చెప్పలేక - వైరాగ్య మొదవ
దీనుడయి యుండె - వరములు దీర్ప లేని
నపయశ భయమ్ము లిపుడు తన్నావరింప. 94

అని వచించుచు మృదువుగా నంబుజాక్షి
తన మనమ్మున భావ మాతనికి దెలియ
బలికి-రాముని కియ్యది దెలుపు మనియె
జనులు మౌనులు మంత్రులు వినెడు నటుల. 95

కనుల గ్రమ్మిన నీరము కనుల డాగ
మదిని రేగిన దుఃఖమ్ము మదినె యణగ
మతివి హీనుని మాడ్కి తా మరలి వచ్చి
నెల్లరకు దెల్పె సంగతు లెల్ల నతడు 96

వినిన యంత వశిష్ఠాది మునులు జనులు
సఖ్యులును తల్లులును మంత్రి సత్తములును
వారు వీరని లే దెల్లవార లపుడు
చిత్తరువు లైరి యెనలేని చింత నొంది. 97

రాము డొక్కడె, చింతాభి రతుడు గాక;
ధీరుడై; నమ్రతను గాంచి తెగువ జూపి
గురు వశిష్ఠుని తల్లుల పుర జనాళి
గనుచు; వినమితు డగుచు తాననియె నిట్లు. 98

తండ్రి యానతి తలదాల్చి తత్క్షణమ్ము
విపిన సీమకు నే ముని వేస మూని
చనుటయే ధర్మమగునమ్మ సర్వ విధుల
ధరణి నివకుల సత్కీర్తి వరలు నటుల. 99

అని వచించుచు శోకాన మునిగి యున్న
తల్లి కౌసల్య దెస జూచి తల్ల డిల్లి;
యూరడిల జేయగా నెంచి - యోర్చి కొంచు
ననియె రాముండు జననితో; వినయ మలర. 100

తల్లి! యిది తండ్రి యానతి; దాట నాక
శక్య మోయమ్మ - యోచింప జగము నందు
తండ్రి యాజ్ఞలు వేర్చుటా ధర్మ మనెడి
బుధుల నుడులను నెరుగవే పూజ్య రాల. 101

తండ్రి యానతి యిడినచో తనయులకును
వసుధ - గోవధయును; మాతృ వధయునైన;
ధర్మమె యగు - పాపము దరికి రాదు;
తండ్రి యానతి సుతు శిరోధార్య మమ్మ. 102

తండ్రి బాసలు దీర్చుటే ధర్మ మవని
పెద్దలను ధిక్కరించుట పెద్ద తప్పు
ధర్మ మందునె జగము తథ్యమ్ము నిలుచు
ధర్మ మాచరింప పురుషార్థమ్ము కాదె. 103

ధరణిపై రాజ్య కాంక్షల - దవిలి నరులు
ధర్మమును వీడి చరియింప దప్పు కాదె?
పరమ ధార్మికు లౌ రఘువంశ నృపులు
ధర్మ భంగము చేయంగ దలప రెపుడు. 104

తల్లి దండ్రుల యాజ్ఞలు ధర్మ విధులు
సమ శిరో ధార్య ములె యైన; జనకు నాజ్ఞ
మొదట పాటించి పాలించు టుత్త మోత్త
మమ్మయిన ధర్మమన్ని యార్యు లనగ వినవె. 105

కాన నో యమ్మ! నాయందు కరుణ జూపి
శోకమును వీడి; నాదగు శుభము నెంచి;
అనుమతింపుము వనికేగ - యని కుమారు
డనిన - కౌసల్య రాముని కనియె నిట్లు 106

కొడుక! నీ తల్లి బహు పాపి- కడు యభాగ్య;
కానిచో నేల ఈ శిక్ష కలుగు వలయు?
కొడుకులే లేని యా చింత కొంత మేలు
నిన్ను విడనాడు కంటె; నే నేమనందు. 107

నాయనా! నిన్ను నెడ బాసియీ యశేష
భోగ భాగ్యము లే గతి పొంద గలను?
నీకు లేనట్టి యీ సిరుల్ నాకు నేల?
వనములకు నేను నీ వెంట వత్తు నన గ. 108

ఏటి మాటలు తల్లి! యిదేటి తలపు?
పతులు గల్గెడి సతు లెప్డు వారి వీడి
సుతుల కడ జీవనము సేయ సుకృత మగునె!
ధర్మ మంగీకరింపని కర్మ మదియు. 109

## లక్ష్మణుని కోపము

లక్ష్మణుడు తక్షణమె యన్న రాము గాంచి;
కోప సంజని తారుణాక్షుండు నగుచు;
గుండె రగిలించు సంక్షుబ్ధ కోప వహ్ని
వెలికి గ్రక్కుచు; నన్నతో పలికె నిటుల. 110

ధర్మమని అన్న! పలుమార్లు తడవ నేల?
జనహితుండును ధార్మికు డనఘు మతియు
గుణ విశిష్టుండు_ముద్దుల కొడుకు నిటుల
వనములకు బంప_ధర్మ ప్రవర్త నమ్మె?. 111

ధూర్తు గతి సంచరించిన—దుష్టులైన
పరమ నిందా స్వభావ భావకులు లైన
వందృ్యలేగాని పృథ్విలో వధ్యు లెపుడు
గారు తలి దండ్రు లరయ లక్ష్మణ యెరుంగు. 124

శాంత మొక్కింత మదినెంచి; క్షమ వహించి;
తల్లి దండ్రుల గౌరవ స్థాన మెంచి
వారి సేవించి—మురిపించి—వారి యాజ్ఞ
పాలనమె ధర్మ మనుచును పలికి నంత. 125

లక్ష్మణుని కోపవహ్ని—శ్రీరాము శాంత
వచన శీతల దారా ప్రవాహ సేచ
నమున చల్లార—ఆ నతాననుడు నగుచు
సిగ్గు పడి అంజలిడి నిల్చె శిరము ఊంచి. 126

అంత రాముండు — తల్లుల; నచట నున్న
గురువులను గాంచి—జనముల గోడు మాన్పి;
ఆజ్ఞ యిడి పంపుడని గోరి—ఆత్మ జనకు
నాజ్ఞ పాలించుటకు సమాయత్త పడుచు. 127

అమ్మ-పదునాల్గు వత్సరాలనగ నెంత?
చిటికలో పూర్తి యగునమ్మ చింత యేల!
గడువు దీరిచి నీ పాదకమల సేవ
నాచరింప గలాడ—నన్నునుపు మమ్మ. 128

తల్లి! నా యెడబాటుకై తగని దుఃఖ
మున మునుంగుచు తండ్రి వాపోవ—నతని
ఆనతిని మీరి వాగ్దాన మాచరింప
కుండు టాతని కెంత దుఃఖోదయంబొ? 129

అనుచు - పలికెడి రాము వాక్యముల; నామె
పొంగి ప్రవహించు నదివోలె - పొరలు చున్న
దుఃఖ మొక్కింత బిగబట్టి; దూర దృష్టి
మదిని వహియించి - శాంతించి - కుదుట బడియె. 130

అంత - సీతయు లక్ష్మణు డార్య! రామ!
ఈవు విడచిన సుఖము లవేల మాకు?
వనములకు మేము నీతోడ వత్తు మనుచు
పయన మయినార లడవికి - పట్టు బట్టి. 131

ఇనకులుడు; కాదు కూడ దంచనుచు - తుదకు
'వల్లె' యనె, వారి గొనిపోవ - వసుధ యందు
తాను జన్మించు హేతువు దలచు కొనుచు
మొలక నవ్వును పెలయించె మోము దమ్మి. 132

రాము డంతట - గురునకు ప్రాంజ లించి;
తల్లులకు ధైర్య మెసగంగ తగ వచించి;
మంత్రులకు తండ్రి సేమము మరల మరల
నప్పగించుచు; ప్రజలకు నంజలించి. 133

కదలె నటనుండి కైకేయి సదనమునకు
తండ్రి యనుమతి - కైక యాదరము వడయ;
ధర్మ సంస్థావనమ్మె పరిధాన మగుట
ధర్మ దేవత - రామావతార మూన. 134

నార చీరలు దాల్చి; ఆననము నందు
దైన్య మిసు మంతయును లేక - దాశరథియు;
లక్ష్మణుడు - సీత తనవెంట రా - నతండు
చేరుకొనె కైక యిలు - పాదచారి యగుచు. 135

స్థాణువయి తీవ్ర దుఃఖాన - దవిలి నోట
మాట మంతియు లేకుండ - మహిని వ్రాలి
దొరలు చున్నట్టి తన తండ్రి నరసి - రాము
డతుల దుఃఖితు డయి బల్కె నతని తోడ. 136

తండ్రి! ప్రాకృతుని వలె నీ తపన యేల?
తప్పకయె దీర్తు మీ బాస ధర్మ విధి - య
సాధ్య మైనను; మీకు నసత్య దోష
మెలమి గలుగక వర్తింతు - నే నటంచు. 137

తండ్రి పదముల కెరగి తాత్పర్య మెసగ
ననుమతిని గోర; ఖిన్నుడై యవని ధవుడు
ఊలుకు పలుకును లేక - నిట్టూర్చె; నంత
నశ్రుధారల కనలేని వయ్యె కనులు. 138

ఇంతలో కైక యచ్చటి కేగుదెంచి;
నీవు వని కేగు నందాక - నీదు తండ్రి
వచ్చి నీరైన ముట్టడు; ప్రతిన బూనె;
గాన కడువేగ నడవికి గదలు మనియె. 139

కైక యీరీతి దెల్ప; నా క్షణము నందె
రాము డతి సహజమ్ముగ - రమణి సీత
లక్ష్మణుడు వెంట రాగ - నరణ్యములకు
పయన మాయెను; ధైర్య పర్వత మతండు. 140

గురువులకు - పెద్దలకు - మంత్రి వరుల కెల్ల
వందనము జేసి; కౌసల్య వర సుమిత్ర
పూర్ణ హృదయుల - బహు ధర్మ పుణ్య మతుల
ఆశిషము లంది; రథ మెక్కి రపుడు మువురు. 141

రాజ వీధిని జనుచుండు రథము వెంట
నంటి-రా బాల గోపాల మాక్షణాన
రాము విడలేక దుఃఖాబ్ధిలో మునింగి
గుండె లవియగ-తండోప తండములుగ. 142

వారి వారించి; శ్రీరామ భద్రుడంత
కదలి సరియూ నదిని చేరె_రథము డిగ్గి
పాపహర మంచు-నదికిని ప్రణతు లిడుచు
జలములను వారు శిరముల జల్లు కొనిరి. 143

పయనమై-గ్రామ సీమల పథము వెంట
జనుచు-వారల-దర్శించు జానపదుల
కుశల మడుగుచు-సాగుచు-కోసలమ్ము
వీడి 'గంగ' జేరిరి-రఘువీరు లపుడు. 144

అటుల పురివీడి యడవుల కరిగి నట్టి
సూర్య కుల దీపకుల-కడు శోక మొప్ప
మది దలంచుచు- విడలేక మగిడిరంత
మొార్వు మది గ్రమ్మ కొనగ-నయోధ్య జనులు. 145

రథము జను మార్గమున-దశరథుడు దృష్టి
నట్టె నిలిపి-చలించెడు నాత్మ తోడ;
శోకమున నేత్రముల నీరు సుళ్లు దిరుగ
చిత్తరవు పోలె నిల్చుండె-చేష్ట లుడిగి. 146

సతము హితుడయి_పూర్ణిమ చంద్రు మాడ్కి
దనరు తనయుని పలుమార్లు దలచి దలచి
తల్లి కౌసల్య-తనువెల్ల తల్ల డిల్ల;
ఘోష గొని_మూర్ఛ నందెను_శోభ దొరగి 147

మూర్ఛ మునిగిన కౌసల్య మోము గాంచి;
అపుకొన లేని దుఃఖాన_ఆ సుమిత్ర
కంట తడిపెట్టి మిక్కిలి కలవరమున
చెలగి శైత్యోపచారముల్ చేసె నపుడు. 148

## గంగానది - గుహుండు

ఇచ్చట నయోధ్యలో వీర లిట్టులుండ
నిర్వికార మనస్కులై_నిఖిల జగతి
వారి గొని యాడుచుండగా–వారలచట
ధీర గంభీర రూపాల దేజరిలిరి. 149

సకల లోక పావన మగు జలము లొప్ప
విష్ణు పాదోద్భవమ్మయి-వెలసి పృథ్వి
పావ కల్మష హరణ స్వభావ భావ
మంగళ తరంగ యైనట్టి 'గంగ' గనిరి. 150

రాము పద పద్మ రేఖల ప్రభల తోడ;
అతని మదివోలె-నిష్పంకమయి చెలంగు
దేవతా నధీ తీరాన తేజరిల్లు
శృంగి బేర పురమ్మును_చేరినారు- 151

అచటి ప్రకృతి–మనోహరమై తలిర్ప
ముదముగొని లక్ష్మణునకు రాముండు నపుడు
నాటి రేయి వసింపగా చోటటంచు
నింగుదీ వృక్షమును జూపె–గాంగ తటిని. 152

లక్ష్మణుని యాజ్ఞ మేర_సారథియు నపుడు
రథము నట నిల్పె-రాముండు రథము దిగ్గి;
అలియును తమ్ముడును గొల్వ నతులప్రీతి;
వృక్ష మూలాన తా విశ్రమించు వేళ. 153

పతిత పావనుడౌ - రామభద్రుడు డెలమి
భార్యతో సోదరుని తోడ వనపథమ్ము
చేరె నను వార్త దెలిసి; యా సీమలోని
జనులు చేరిరి - శ్రీ రామచంద్రుడు జూడ. 154

గుహుడనెడు-నొక్క బోయల కులము పెద్ద;
ఉగ్ర బలశాలి-సన్మార్గ - డుత్తముండు;
బంధు మిత్రులతో గూడి పయన మగుచు
చేరె నచటికి-రాము భజింప గోరి. 155

గుహుని గని-రామ భద్రుండు కూర్మి మీర
అతుల సౌహార్దు డగుచు-స్వాగతము బల్కి
ఆదరము దోప క్షేమమ్ము నడిగి-యతని
గౌగిటం జేర్చి సంప్రీతి గౌరవించె. 156

గుహుడు-తన్మయుడై-రాము కుశల మడిగి
దశరథేశుని-రాణుల - ధరణి జనుల
క్షేమములు ప్రీతి ప్రశ్నించి - చెప్పలేని
యాదరము జూపె-రాముని యందు-నంత. 157

తపసి రూపము దాల్చిన తరణి కులుని
గాంచి - వ్యథ జెంది - దానికి కారణమ్ము
నెరిగి దుఃఖాన హృదయము కరగి పోవ
కడిగె కన్నీటితో-రాము కాళ్లు-గుహుడు. 158

రామునిం గాంచి - ఆ బోయ రాజ వరుడు
కరములను మోడ్చి - రామ! యీ ధరణి కీవె
ప్రభుడ వెప్పుడు నంచర్ఘ్య పాద్య విధుల
పూజ గావించి బల్కె పర్వులును వినగ. 159

ఏలుకొనుమయ్య-రామయ్య!యీ పురమ్ము
నీ పురమ్ముగ నెంచుచు-నిర్మలాత్మ!
నేను నావారు నీ వార మేనటంచు
ఆదరము మీర నుడువుచు నంజలించె. 160

పరమ నిర్మల మగు-గుహు భక్తి మురిసి
చెలిమి దొలుకాడ-రాముండు చెంతనున్న
గుహుని దగ్గియార గౌగిట గుచ్చి-రాల్చె
ఆర్ద్ర నయనాల అశ్రు ముత్యాల మాల. 161

పొసగు స్నేహమ్ము-మదినిండ-బోయ పెద్ద
తన గృహమునకు విచ్చేసి-తగిన రీతి
నతిథి సత్కారమును గొను మని; వచింప
నిన కులేంద్రుడు-గుహునితో నిట్టు లనియె. 162

ఉల్లసము గల్గినది మాకు-ఓయిగుహుడ!
నీ వొసంగు సపర్యల నియతి వలన!
ధర్మ నియమాను బద్ధత తండ్రి బాస
దీర్ప నెంచి నడవులలో దిరుగు చుంటి. 163

ఇదియు సద్వ్రత మగుట-నే నిపుడు నిన్ను
తృప్తి పరుప లేకుంటిని-తృప్తి గల్గె
నీదు వినయాన-భక్తిచే-నిర్మల మగు
భవ దపార సౌహృద్య సపర్య వలన. 164

అనఘ! కడు డస్సియున్న మా అశ్వములకు
ఘాస పానీయముల తృప్తి గలుగ జేయు;
మదియె మా సేవగా నెంచి ఆత్మ తృప్తి
పొందుదుము మేము-సంతృప్తి పొందు మీవు. 165

మూగ జీవాలపై _ రామమూర్తి జూపు
నాదరమ్మును గని; గుహు డమితమైన
సంతసమ్మందె; అశ్వ రక్షణము కొరకు
తగిన వారల నియమించె _ దాశరథియు. 166

కాల కృత్యాది యవసర కార్యములను
జరపి; లక్ష్మణు డిడు నదీ నీరములను
గ్రోలి_ యొక పర్ణ తల్పాన కొలువు దీరె
సరస శుశ్రూష సౌమిత్రి సల్పు చుండ. 167

సీతతో పర్ణ తల్పాన శ్రీ కరుండు
నధి వసింపగ _ లక్ష్మణు డమిత భక్తి
అన్న వదినెల సేమమ్ము నరయు కొరకు
కూర్మి గని_ధనుర్ధారి యై _ గొలిచి యుండె. 168

గుహుడు నుంగూడ_లక్ష్మణు గూడి యుచట
వారి నరయుచు _ నా రాత్రి వారి కడనె
ధనువు దాల్చి తిరుగాడు తరుణమందు
నిద్రితమగు నిష్టా గోష్టి నిరువురుండ. 169

చాల ప్రొద్దైనె లక్ష్మణా! చారు శీల
నిదుర యొక్కింత దలపవు _ నీ మనమున
కూర్చితిని పర్ణశయ్య నీ కొరకు నిచట
నడుము వాల్చు మనుచును గుహుడు వచించె. 170

పూజ్య! సుకుమారుడవు; రాజభోగములను
సతము సుఖియించు సురుచిర మతివి _ నీవు;
మేము _ మావారు గాచి యున్నాము _ గాన
నిదుర గొను _ శ్రమ దీరగ; నీవు గూడ. 171

నీ నెఱుంగని వా వర్వె రీ వనాన
లేరు - భయ మిసు మంతయు లే దటంచు
పలుకు గుహు గాంచి - సౌమిత్రి పలికె గద్గ
ద స్వరుండయి కన్నీరు దాచుకొనుచు. 172

అనఘు! నీ రక్షణమ్మున నలరు మాకు
భయ మొకింతయు లేదు - పాంచవయుతుండౌ
ముజ్జగమ్ముల నర్థు డీ మూల వర్ణ
తల్పమున నుండ; విశ్రాంతి తగునె? నాకు. 173

ఘన తపము చేత - వివిధ యాగముల చేత
దానముల చేత - విమల మంత్రముల చేత;
ప్రాప్తుడయె - గాన యీ రామభద్రు డరయ
తండ్రి దశరథునకు ప్రియతముడు చూడ. 174

అవని రఘువంశ దీపకు డయిన నిట్టి
తనయు డడవుల వెంబడి జనిన యంత;
నిలచునే తండ్రి ప్రాణము? నిలువ బోదు;
దేహమును వీడు నవెడి సందేహ మబ్బు. 175

అమల శుభ వాద్య ఘోషల ననవ రతము
నృత్య గీతాది రవముల నివ్వటిలుచు
మహిని దనరారు మా రాజ మందిరమ్ము
పాడుబడి యుండు - పురి మేము బాయు కతన. 176

అయ్య! మాయమ్మ కౌసల్య యవని ధవుడు
ప్రియము మాయందు పెద్దగా పెంచు కొన్న
వారు గావున - నీ రేయి వారు మమ్ము
గనక నెంతటి దుఃఖాన గనలు వారొ? 177

ఇట్టి ఘోర దుఃఖమ్ము వేధించు చుండ;
మనము కార్చిచ్చుగా పెను మంట లెగయు;
సముద్రమ్మున - నే నెట్లు రొమ్ము పైన
చేయి నిడు కొని - సుఖ నిద్ర చెందగలను. 178

అరయ పదునాల్గు వత్సరా లడవులందు
గడపి-సేమమ్ముగా పురిఁ గాంచు నాడు
తల్లులును-తండ్రి-ప్రాణాల దనరు నాడు
నాడె సుఖ నిద్ర - నిపుడేద? నయ గుణాఢ్య. 179

అనుచు-విపరీత దుఃఖమ్ము గనుచు-గుండె
లవియ శోకించు సౌమిత్రి-అశ్రు పూర్ణ
నయనముల గాంచి గుహుఁడట నాత్ర పడెడు
సమయమున నరుణ కిరణాల సంజ పొడమె 180

భువన నుతు డంత మేల్కాంచి-భువన బంధు
కాంతు లాకసమున నెల్ల గ్రమ్ముటయును
గాంచి-సౌమిత్రి జూచి-వికాస మతిని
పలికె నీరీతి-నినరుల తిలకు డపుడు 181

కాకముల-కోకిలమ్ముల-కేకి గముల;
కల కలమ్ము లఖిల దిక్కులలము కొంచు
భానునకు స్వాగతమ్ము-సు-బలుకు చుండె
బరగ యత్నింపు-మిక-మన పయనమునకు 182

అన్న కోరిక-లక్ష్మణుఁ డా గుహునకు
దెలుప దన పంక్తి పరులకు దెలిపె గుహుడు.
యోగ్య మైనట్టి-కొంగ్రొత్త యోడ నొండు
గరము ప్రియమైన దాని-నేర్పు రచినారు. 183

గుహుని యానతి-మంత్రిలు కూర్మి మీర
మహిత గంగను దాటగా విహిత మైన
నావ నొక్కండు దెచ్చిరి నావికాళి;
తెలిసి యది-రాముడు బయలుదేరె నంత. 184

తడ వొకింతయు లేక తమ్ముడును తాను;
ధనువులం దాల్చి పయనమై దరలి రపుడె
జాహ్నవిని జేర-వడి పాదచారు లగుచు;
జనక సుత యును వెను వెంట జనుచు నుండ 185

రామ! యికను నా కర్తవ్య మేమిటని-సు
మంత్రు డడుగగ ప్రీతి నా మహిప సుతుడు;
హస్తి హస్త సదృశమునై యహరహమ్ము
నొప్పు దక్షిణ హస్తాన-నొనర బట్టి. 186

అనఘ! మను వంశజులకు నీ వరయ పరమ
మిత్రుడవు; నిన్ను బోలిన మిత్రు లిలను
దొరకుటయు దుర్లభంబు-నీ దొడ్డతనము
మరువ శక్యమె? ఎవ్వారు మరువ గలరు. 187

తండ్రి కడు వృద్ధు డాతని తపన కెరిగి
నట్టి మిత్ర వరుండవు-నాత డిపుడు
ప్రియ సుతుని బాసి-దుఃఖాన పిదులు చుండు;
నతని సేమము నొక్కింత యరయు మయ్య. 188

కామ వశుడయి-కైకేయి ప్రేమ మునిగి;
మంచి పెద్దల వేర్పాటు మదిని మరచి;
అతుల దుఃఖ సాగరమున - అనవరతము
దేలు నాతండ్రి నెటులైన దేర్పు మయ్య. 189

ధరణి-రాజులు_సర్వ స్వతంత్రు లగుట
వారి యాజ్ఞాను బద్ధత వలయు_గాని
తద్విమర్శయు మనకు నధర్మ మగును;
అగ్రహానుగ్రహ సమర్థు-లార్య జనులు. 190

రయముగా_నీవు_నిపుడె-పురమ్ము నకును
జని_వికలమతియును-వృద్ధు డనఘు డైన;
జనకు కనిపెట్టు కొని_పరిచర్య సలిపి:
కంటికిని రెప్ప వైె-యుండ గలవు-పూజ్య. 191

పురజనమ్ములు_జననియు_పొంగి పొరలు
దుఃఖమున_తల్లి కై_కను_దూయ బట్టు
వారి వారింప_యత్నింప వలయు నీవు
తల్లి కనుకూలత వహించి తనరు మయ్య 192

పలు విధమ్ముల-నీరీతి_పలికి-పలికి;
భద్రములు చెప్పి-శ్రీరామ భద్రు డప్పు
డనఘ! బహుదూర మేతెంచి_తార్య-ఇంక
జనుము మము వీడి_పురమున కనుచు దెలుప. 193

ఆ సుమంత్రుడు_పొంగు దుఃఖార్తి రేక
బాష్పములు-వరదలుగ-ప్రవాహ మెత్త
రామచంద్రుడు లేని-యీ రథము గొనుచు;
ఎట్లు పురమున కే నిప్పు డేగ గలను? 194

రామ భద్రుడు లేని యీ రథము గాంచి
ప్రజలు దుఃఖ సంతప్తులై_బాధ నొంది;
నా మొగము వంక చూడరు; నన్ను దుష్ట
ఘాతకునిగ-మహాపాపిగా-తలంత్రు. 195

రాము డేడని యడుగ_నే నేమి బదులు
పలుక గలనయ్య? మన పుర ప్రజల తోడ;
గాన నో దేవ! దయదాల్చి కానలకును
నన్ను నీవెంట గొనిపొమ్ము_అన్న యనుచు 196

ఆ సుమంత్రుడు దెలుప, నయ్యనఘ పతి_కు
మారు డాతని భక్తికి_మది విశేష
సంతసము జెంది_చిఱునవ్వు వింత గుర్వ;
మధుర వాక్యము లలర రామయ్య పలికె. 197

తండ్రి దశరథు స్థితియు అంతరము కలచ
ఓ సుమంత్ర! ప్రజా క్షేమ మొందు దలచి;
వ్యాకులత వీడి పురికి నీ వరుగ వలయు!
ననుచు_నోదార్చి_యాతని_ నంపి_పిదప. 198

లక్ష్మణుడు_జానకిని నప్డు రాము నాజ్ఞ
నోడ నెక్కింప_రాముడు గూడ నపుడు
చేయి నూపుచు వీడ్కోలు చెప్పి; గుహుని
కనుమతి నిడి నావ పయి తా నధివసించె. 199

అలితో - ననుజుని తోడ - నలఘు యశుడు
పతిత పావని_గంగా ప్రవాహమునకు;
అంజలించి ముందునకు బో ననుమతి నిడె
నావికుల కంత; శీఘ్రమా నావికులును. 200

పడవ ముందుకు గంగలో గడపు వేళ;
వత్సముల బాయు గోవుల వలెను_జనులు
మౌనమున_దీర్ఘ దుఃఖమ్ము మది వహించి;
బాష్ప ధారల_వీడ్కోలు_బలికి నారు. 201

పరమ పావని — గంగా ప్రవాహ మందు
పడవ పోవుచు నుండగా — పుడమి తనయ
మౌనముగ ప్రార్థనము జేసె — మనసు నందు
భర్త సేమము గూర్చి — యావగను మిగుల. 202

భర్తృ సహితగ — క్షేమాన పట్టణమున
కును తిరిగి వచ్చి నీపూజ కుంకు మాదు
ల — విభవంబుగా జేయ గలను; భగీర
థీ మతల్లి యనుచు — మ్రొక్కె దృఢ మనస్క. 203

ఆమె భక్తికి — ప్రేమకు — నాత్మ యందు
మోద మందుచు; శ్రీరామ మూర్తి యంత
ప్రాంజలించెను — గంగా భవాని కపుడు
భక్తి సౌమిత్రి తోడను — భార్య తోడ. 204

జాహ్నవిని దాటి — తీరమ్ము జక్క — జేరి
సరల నొకసారి గంగను మది దలంచి
వందనము జేసి — యటు పైన ముందు కేగ
నెంచి నావికా బృందమున్ గాంచి — ప్రీతి. 205

సెలవు లిడి పంపి — ధనువులు చేత బూని
జనపదమ్ములు లేని యువ్వన పథముల;
భామి జను మధ్యనిడి రాజపుత్రు లిర్వు
రడవి త్రోవల — నడువగా దొడగి రపుడు. 206

లక్ష్మణుడు ముందు జనుచుండ — రమణి సీత
భద్ర మరయుగ నా రామభద్రు డపుడు
వెనుక నడచుచు గనుచుండె వేయి కనుల;
ఆపదలు చేర రాకుండ నమిత శక్తి. 207

# రాముడు భరద్వాజాశ్రమము చేరుట

అటుల పయనించి – పయనించి – అమ్మహాత్ము
లరయ సంచారమే లేని యడవి కొచ్చి
చేరి రట; పెద్దదగు నొక చెట్టు కడకు;
వేగువర కట గడుప భావించి నారు. 208

ఆ వనస్పతి మూలాన; ననుజ విరచి
తమ్ము మెత్తని వనపర్ణ తల్ప మందు
శ్రమ దొలగంగ వవశించె, రామమూర్తి
సీతతో గూడ నేమియు చింత లేక. 209

తరణి పొడసూపకుండ; కృత్యముల దీర్చి
పయన మొనరించి – చీకటి పడక మున్నె
గంగ యమునతో గలసెడు సంగ మమ్ము
గలుగు స్థలము ప్రయాగను గాంచినారు. 210

శైలజార్థ శరీరుడై చెలగు - వృషభ
రాట్తురంగుని గాత్రంపు రహి వహించి
కనుల విందయి; దర్శించు జనుల కెల్ల
అభిమతముఁగూర్చు స్థలము ప్రయాగ యనిన 211

అచట, నధ్వర ధూమమ్ము లనల కేత
నమ్ము లాకాశ మందు మేఘమ్ము లట్లు
కానబడ; నాట్యములు సల్పు కానవంపు
నెమ్మిగమి జూపె; రాముండు తమ్మునకును. 212

ఆశ్రమమ్మున; ఋషులు నిత్యాగ్ని హోత్ర
ములను వెల్గ జేయుచు మంత్రములు పఠింప;
వేద నాదము స్ఫుటముగా వినగ నాయె
వినుచు రాముడు ముదమంది అనుజు కనియె. 213

వినవె లక్ష్మణ! వీనుల విందు సేయు
వేద నాదమ్ము లత్యంత విస్తృతమ్ము
లగుచు వినుపించు చున్నవి; నరయ నిద్ది
ముని మహేశ్వరు నాశ్రమమ్మని యెరుంగ. 214

వివిధ తరులతా మయమయి; విందొనర్చ
నిందు; మునివరు లెల్ల జితేంద్రి యులయి;
తపము లొనరించు చుంద్రు సంతసము మీర
లోక కళ్యాణ భావనా రూపు లగుచు. 215

మోద మొన గూర్చ నిద్ది యమోఘరీతి
ముని భరద్వాజు నాశ్రమ పుణ్య భూమి
శీఘ్రమమ్మని గొల్చి యాశీస్సు లంది;
ఉదయమున పోదమనె రాము డుత్సుకతను. 216

భద్రి యమునల సంగమ ప్రాంత మందు;
పేర్కొ నల్లంత దూరాన వెలసి యున్న
ముని మహోదయు నాశ్రమమునకు వారు
చిత్త ములరంగ శీఘ్రమే చేరి నారు. 217

శిష్య గణసేవితుండు; విశిష్టు; డనఘు;
డతుల తపనిష్ఠ సర్వదా నలరు ఘనుడు;
లక్ష్య సిద్ధుడు మూడు కాలముల నెరుగు
ముని భరద్వాజు దర్శించి! మోద మంది. 218

వందనమ్ములు సల్పిరి వారు _ ఋషియు
అర్ఘ్య పాద్యాదికమ్ముల నలర జేసి
యోగ మారసి; సంప్రీతి యోజ సలిపి;
పితృ సమాన వాత్సల్యము ప్రీతి జూపె. 219

వారి దీవించి యా భరద్వాజ మౌని
అతిథి సత్కార మొనరించి యాదరించె
రామచంద్రుడు తనదు నరణ్య గమన
చరిత మెఱిగింప సముకట్టు తరుణ మందు 220

అనఘ! నిన్నెఱుంగని వార లవని నెవరు?
రాముడవొ? గాక ఆది నారాయణుడవొ?
తెలుగ కష్టము; సామాన్య నరుల కంచు
నర్మ గర్భముగా మౌని నాథు డనగ. 221

సంతసము జెంది, రాముడు సవినయముగ
జనకు నాజ్ఞను తలదాల్చి, వనుల నుండ
వచ్చినాడను - మాకిట వాస యోగ్య
మైన తెలుపుము - సెలవీయు డనిన మునియు. 222

తీర్థరాజము; సంగమ తీర్థ మరయు
పావనమ్మగు నీ నేల భారతమున
ఇట వసించుట మేలని యినకులునకు
తేట తెల్లముగా - మౌని తెలియ బలికె. 223

మౌనివర! యిట మేమున్న - మా పురజన
మెల్ల వచ్చుచు పోవుచు నెపుడు గూడ
దాన కలుషితమై మీదు తపము చెడదె?
అనుచు రాముండు దెలుప, నయ్యతివరుండు. 224

గూఢమై యున్న - రాక్షస కుల వినాశ
భావ సంస్ఫూర్తి- రాముని భాష నుంట
తెలిసి నట్టి మహర్షి - సందీప్త బుద్ధి
చిత్రకూటాద్రి వసతి సూచించె నపుడు. 226

ముని వరుని కోర్కె; రాము డయ్యనఘు నాశ్ర
మ మున_నాడు వసించి - దుర్మతులు నైన
రాక్షసాళిని గూర్చి చర్చలను సల్పి
వేగుటయు జూచి; యట నుండి వెడల నెంచి. 226

సూర్య భగవాను డిల పొడ సూపకుండ
కాల కృత్యముల్ సలిపి రాఘవుడు ముని వ
రేణ్యు దర్శించి యాజ్ఞ గ్రహించి సతియు
తమ్ముడును వెంబడింపగ; తరలి వెడలె. 227

అతుల కరుణా రసార్ద్రుడౌ నమ్మునీశు
దర్శనమ్మున తమజన్మ ధన్య మాయె
నంచు మది నెంచి మౌని సూచించి నటుల
చిత్రకూటాద్రి వాసము చేర నెంచి 228

అటవులను_ముండ్ల బాటల-ననుసరించి
వన విచిత్రము లను గాంచి; దనిసి—మురిసి
పరవశమ్మొందు సీతతో వనుల నడచి
చేరు కొనినారు కాళింది తీరమునకు. 229

అన్న యనుమతి _ సౌమిత్రి యప్పుడపుడె
ఎంతు పెదురులతో - తెప్ప నొండొనర్చి
మధ్య పర్ణాసనంబొండు _ మహి సుతకయి
అమర జేయుగ నా రాము డతి ముదమున 230

రెండు చేతుల సీతను లేవనెత్తి
తెప్ప నెక్కింప; రాముని తీరు గాంచి
సిగ్గు కన్నుల నిండ_నా సీత మదిని
యేదొ తెలియని యానంద మినుమడించె. 231

అగ్రజుని వెన్క-ప్లవము తా నధివసించి
అతి ఘనోదమును - సంక్షుబ్ధ మైన యట్టి
అలలతో - నల్లకల్లోలమై చెలంగు
నది జలంబుల - సౌమిత్రి నావ నడపె. 232

పొంగి పొరలు తరంగాలు - పూజ్యులైన;
జానకీ రామ సౌమిత్రి జననుతులకు
సదమలానంద మొదవించు సరణి దోచె,
మంగళాలయ యమునా తరంగిణి యట. 233

నావ జనుచుండ - భక్తితో నాతి సీత
పావనమ్మైన యమునా ప్రవాహ మునకు;
చేతులను మోడ్చి-భర్తకు క్షేమ మొదవ
జేయుమని మ్రొక్కులిడుచుండె - చిత్తమందు. 234

తత్తరము లేక - యానది నుత్తరించి;
భీకరారణ్యమున; వారు భీతి లేక
జనుచు-న్యగ్రోధ వృక్షంబు గని మునీశు
నానతియు జ్ఞప్తి రాగ నజ్జనక సుతయు. 235

భర్త యనుమతి - నత్యంత భక్తి గలిగి;
పాదపోత్తము మనసార ప్రస్తుతించి;
క్షేమముగ తా మయోధ్యను చేరునట్టుల
కరుణ దీవింపు మని - నమస్కార మిడెను. 236

శ్యామ నామకమైన వృక్షమున కామె;
మ్రొక్కి - ఫలగొని - ప్రార్థించి-ముదము గాంచి;
భర్త వెన్నంటి రాగ నిర్భయము తోడ
నడువ దొడగెను- ఘోరమౌ నడవి యందు- 237

రాము - డతి చతురోక్తుల- రమణి సీత
మనసు తేలిక పడగ వాకొనుచు-చిత్ర
ములను కథలుగ జెప్పుచు; ముందు కరిగి
హోమ ధూమ సంకలితమౌ సీమ గాంచె 238

భార్యతో - సోదరుని తోడ - పలికె; నిద్ది
ఘన తపశ్శాలి వాల్మీకి ముని వరేణ్యు
నాశ్రమ - మ్మందు ముని దర్శనమ్ము సలిపి
జనుట కర్తవ్య మని రాము-డనిన యంత. 239

వారు వాల్మీకి మౌని పుణ్యాశ్రమమ్ము
జొచ్చి; మునివరు నందు దర్శించి వారు.
తత్తిరాల పేడి ముని సత్కృతు లొనర్ప,
పరమ సంతుష్ట హృదయ భావనులు నైరి. 240

మౌని యాశీస్సులందు-లక్ష్మణుని తోడ;
సీతతో ప్రయాణించుచు శీఘ్ర గతిని
చిత్ర కూటాద్రి శిఖరమ్ము చేరి-పర్ణ
శాల నిర్మించు కొనిరి; వాసంబు కొరకు. 241

ప్రకృతి సౌందర్య మరయుచు - ప్రమద మమర
జానకీదేవియును - రామచంద్ర మూర్తి
లక్ష్మణుడు వజ్ర కవచమై రక్షణ మిడ
వన విహారులు వారు నిర్భయ విధాన. 242

## దశరథుని నిర్యాణము

అవనిజయు రామలక్ష్మణు లడవులందు
ఇవ్విధంబున, కాలమ్ము నీడ్చుచుండ;
పురమునందున దశరథ భూవిభుండు;
శోక సంతప్త హృదయుడై; శోభలుడిగె. 243

రామ! హారామ! రామ! హేరామ! యనుచు
ప్రతినిమేషము రాముని పలువరించి
రోజురోజుకు క్షీణించె రాజుమిగుల
బహుళ పక్షపు శీతల భాను భంగి. 244

ఓర్పు నశియించి కృశియించి యొక్క నాడు
దశరథావని పతి తీవ్ర తప్తుడగుచు
ప్రాణ సముడైన రాముని పలికి పలికి
కన్ను మూసెను రాణు లాక్రంద మొంద, 245

విగత జీవుని దశరథ విభు దలంచి
రాణి కౌసల్య స్మృతి దప్పె - రాజు వజ్జ
పలు విధమ్ముల దుఃఖించి పలుకు లేక
శవము కైవడి పడియుండె పతి సుమిత్ర. 246

రాజు మరణింప కోసల రాజ్య మందు
చీకటులు గ్రమ్మె శోభ విశీర్ణ మయ్యె
జనము లతి తీవ్ర దుఃఖాన మునిగి నారు
మంత్రులును గూడ శోక నిర్మగ్నులైరి. 247

మదిని కర్తవ్య మూహించి వ్యథలు వీడి
మంత్రు లంత వశిష్ఠు నామంత్రణమున
మాతులుని యింట నున్నట్టి మాన్యగుణుని
భరతు దోడ్తేర దూతల బంపినారు, 248

భరతు డరుదెంచి జనకుని మరణ మెరిగి
శోక సంతప్త హృదయుడై శూన్య - మైన
పురము నరయుచు కైక మందిరము జేరి
విగత జీవనుడై యున్న విభుని జూచె. 249

కలత చెలరేగ నశ్రువుల్ కనుల జార
గుండె చెరువయి తనువెల్ల నిండి పొరల
ఉలుకు పలుకును లేకట్టె నిలచి పోయి
బహుళ దుఃఖాబ్ధిలో మున్గె భరతుడపుడు 250

ఎవ్వరిని పల్కరింప కా యినకులుండు
తల్లి పజ్జను జేరెను త్వరిత గతిని
అడిగె నామెను తండ్రి నిర్యాణ విషయ
మంత కైకేయి యిటుదెల్పె నాత్మజునకు 251

తనయ! నీ మంచి గోరి – నీ తండ్రి నాకు
మున్ను వాగ్దాన మొనరించి యున్న రెండు
వరములను గోరితి నిపుడు – వసుధ పతిగ
నిన్ను నొనరింప వనికి నీ యన్న నంప 252

అది తప్పిన దోష మయ్యెనని పతికి
నంట కుండగ శ్రీరాము డడవి కరిగె
జానకీ లక్ష్మణులు సహచరులు గాగ;
వీడె ప్రాణాలు నీ తండ్రి వృద్ధుడగుట. 253

గతము మరచి హితమ్మును గాంచు మన్న
మరణ మందెడి వారింక మరలి రారు
మేదినీపతి వయి పుత్ర నాదు కోర్కె
సఫల మొనరింపు – నామది సంతసిలగ 254

అనెడు కైకేయి మాటల కదరి పడుచు
గుండె వ్రీలగ పలికె నో మొండి తల్లి
పాప బుద్ధిని శ్రీ రామభద్రు వనికి
ననుపు మన నీకు నోరెట్టులాడె నమ్మ! 255

అడవి పాలైన తనయుని విడువ లేక
ఏడ్చి మరణించి యుండు నియ్యన కుతేంద్రు
డనుచు దోచుచు నున్నదో జనని _ రాము
డనిన కడు కూర్మి గాదె మాయయ్య కెపుడు 256

పాపినై యిట్లు శ్రీరామభద్రు నడవి
పాలుగా జేసి భర్త ప్రాణాలు దీసి
యేమి సుఖియింతు వమ్మ ? నాకేల సిరులు!
యింత అపయశ మెట్లు భరింతు నమ్మ. 257

అందరిని జంపి భస్మ సింహాసనమ్ము
గనుచు సంతృప్తి నొందుమో కన్న తల్లి
నీదు కడుపున బుట్టిన నేరమునకు
పాపియైనాడు పృథ్విపై భరతు డిపుడు. 258

తనయు డటు లూహ సేయని తపన మునుగ
గనిన కైకేయి దుఃఖాబ్ధి మునిగి _ సుతున
కెంతయో జెప్పె – వినకుండ చింత గనలి
వినుతి పాత్రుండు భరతుడు వెడలె నపుడు, 259

తల్లి కౌసల్య నరయగా తత్క్షణమ్ము
జనియె – భరతుని గాంచి కౌసల్య యపుడు
నిండు మనమున కన్నీళ్లు నిండు కనుల
శోక ముడుపుచు నోదార్చి సుతున కనియె. 260

జరిగినది యేదియో మున్నె జరిగి పోయె
జరుగ వలసిన దికపైన జరుపు మయ్య
పూర్వ జన్మాన కౌసల్య పుణ్య మింతె
వగవ నేల ధర్మము పలుపంగ వలదె. 261

మంత్రులును బంధువులు మేనమామ — ఆది
పురజనులును వశిష్ఠుండు భరతు తోడ
హితము భాషించి యూరార్చి పితరున కయి
అంత్య కర్మలు జరిపించి రంత వారు. 262

సకల శాస్త్రోచితముగ సంస్కార విధులు
జరుపబడియెను శ్రద్ధగా ధరణి పతికి
శ్రాద్ధ కర్మలు ముగియించి జనియె సంత
రాము గొనిరాగ భరతు _ డరణ్య మునకు. 263

సైన్యములు తల్లులును మంత్రి స త్తములును
సకల పరివారములు వెంట జన — భరతుడు
అన్న పదముల పై వ్రాలి — అమిత వినయ
గుణము దీపింప రాముని కనియె నిటుల 264

అన్న ! యికలేదు ! మనతండ్రి _ అవని బాసి
తనువు విడనాడి నాకవర్తనుడు వయ్యె
కడుపు చెరవగు నన్న _ నా కన్న తల్లి
కారణ మ్మింతకును - నన్ను కరుణ గనుము 265

తండ్రి నిర్యాణమును విని దాశరథులు
అమిత దుఃఖార్ద్ర హృదయులై కుమిలి నారు,
మఱని శోకించె సీతయు మామ గూర్చి
అశ్రువులు రాల్చి నారంద రతని మృతికి 266

ముని వశిష్ఠుని యనుమతి ఘనుడు రాము
డనుజులను గూడి పర్వత మంత దిగ్గి
త్వరగ భాగీరథింజేరి ధర్మ నిరతి
పుణ్య సలిలంబులం గ్రుంకి పూజ్యుడైన 267

తండ్రికిని తర్పణము సల్ప దక్షిణాభి
ముఖముగా తన్నదీ జలములు గ్రహించి
తీవ్ర దుఃఖాత్ముడై జగతీపరుండు
తండ్రి నంత నుద్దేశించి తగ వచించె. 268

క్షితిప కులదీప - పితృలోక గతుడవైన
నీకు నేనిడు నట్టి యీ నిర్మలోద
కమ్ము లక్షయమై యొప్పు గాక యనుచు
తనివి దోసిట జలవిసర్జన మొనర్చె. 269

ఇటుల నుదక క్రియ యొనర్చి ఇనకులుండు
దర్భలందు పిండములిడి తండ్రి దలచి
అధిప యిపుడే నొసంగు పిణ్యాకములను
ప్రీతి గైకొను మని మ్రొక్కె పితరునకును 270

ఆర్షవిధి పిండ దానమ్ము నాచరించి
అశ్రు పూరిత నయనుడై యా మహాత్ము
డతుల దుఃఖాబ్ధి కొట్టు మిట్టాడుచుండ
జూచు వారును మునిగిరి శోక మందు. 271

దశరథుని రాణులందరు తత్ క్షణంబ
మునివశిష్ఠుడు వారల ముందు నడువ
చేరి రద్దేశమునకు విచింత్య మతుల
రామచంద్రుని జూచు సంభ్రమము మెసంగ. 272

తండ్రి కట దాశరథి చేత దత్తమైన
నింగుదీ పిండముల జూచి నినకులేంద్రు
మది దలంచుచు కౌసల్య మహిత దుఃఖ
సంద్రమున దోగి నశ్రువుల్ జార్చి పలికె. 273

చతురతను నాథ! మేదినీ చక్ర మెల్ల
భుజమునం దాల్చి షడ్రస భోజనముల
సతము దృప్తిలు నీవు యీ హితము కాని
భోజనమ్మున నెటు దృప్తి బొంది తంచు 274

తీవ్ర దుఃఖిత స్వాంతయై దిగులు గొన్న
నామె నూరార్చిరి సపత్ను లంద రంత
భోగములు వీడి యున్నట్టి పుత్రు రాము
కడకు గొంపోవ-నట సీత గాంచి - యామె. 275

కుసుమ కోమలి పైన నీనొసట బ్రహ్మ
వ్రాసె నెందుల కీ వనవాస దీక్ష?
అనుచు సీతను రాముని గనుచు గనుచు
ఆపుకోలేని దుఃఖమ్ము నందుమునిగె. 276

తల్లి యీవిధి దుఃఖ సంతప్త యగుట
బాధ గలిగించె శ్రీరామభద్రు నకును
నోర్పు వహియించి తల్లిని నూరడించె
నను నయ మ్మగు మాటల నాడి యాడి 277

భరతు డంతట శ్రీరాము వద్ద జేరి
వలికె నో యన్న - నీవు రావయ్య పురికి
అచట జనములు నీకయి నాత్రపడుచు
వేచి యున్నారు హృదయాలు వేగు చుండ, 278

మహి యరాచక మాయెనో మాన్య చరిత
దిక్కు లేని యట్టు లయోధ్యయు దీన దశల
కాంతులుడిగియు మహితమౌ కళలు వాసి
గ్రాలు చున్నది కటిక చీకటుల నడుమ. 279

"రాజు రాముడె - వేరొక రాజు వలదు
అతడు రాకున్న శూన్య మీ యవని" యనుచు
పలుకు చున్నారు అర్తులై ప్రజ లయోధ్య
రమ్ము గైకొమ్ము - అన్న! నీరాజ్య రమును 280

నిపు రాకున్న భరతుడు నిక్కువముగ
కదల డిటనుండి యని పల్క - సదయు మతిని
కౌగిలించుక పెదవుల కదలి యాడు
మొలక నవ్వుల రాముండు పలికె నిటుల. 281

తమ్ముడా! యిట్లు యోచింప దగదు మనకు
ధర్మ నిరతుడు మన తండ్రి దశరథుండు
ధరణి రక్షింప శాసించె భరత సుతుని
వనుల వసియింప నన్ను ను బనిచెగాన 282

దైవ సముడైన తండ్రి వాగ్దాన గౌర
వంబు వహియించి ఆతని వాక్య తతిని
తలను దాలిచి నడచుట ధర్మమగుట
వన నివాసము. నాది-పాలనము నీది 283

ఈవు కోరిన యటులనే నిపుడు పురికి
రయమునన్ వచ్చి సుఖముగా రాజ్యమేల
వ్యర్థ మగు తండ్రి వరము - నిరర్థ కమ్మె
జనకు గౌరవము - కుల ప్రశస్తి యణగు 284

ఇలను ప్రాణులు రవి యుదయించి నంత
ధనము నార్జించు కొరకు నాత్రము వహింతురు
రాత్రి యైనంత కామేచ్ఛలందు మునిగి
సురత భోగాల కొరకయి పరితపింత్రు 285

తెలియగా నేర రాయువు దిన దినమ్ము
సన్నగిలుచుండు నంచు విషయ విలసన
భోగ మొక క్షణమె యనుచు - పుడమి సౌఖ్య
భోగములు నిత్యములె? మెట్టి పూన్కి గాని. 286

శాశ్వతమ్మైన ధర్మ విశ్వాసము విడి
మనుతులై నీతి విడనాడ కూడదంచు
వేద శాస్త్ర పురాణాలు వెల్లడింప
తగదు మన బోంట్లకును తప్పధర్మ విధులు. 287

వసుధ తమ్ముడ! మనవంటి వారు గూడ
ప్రాకృతుల బోలి సద్ధర్మ పాలనమ్ము
విస్మరింప క్షమింపరు విజ్ఞు లెపుడు
గాన రా నయోధ్యకు రాజ్యకాంక్ష తోడ. 288

రాజు లేకున్న రాజ్య మరాజక మగు
పరమ దౌర్జన్యములు నేల ప్రజలు గాన
ప్రజలు రంజిల్లగా రాజ్యపాలనమ్ము
ప్రీతి గైకొను మిది నాయభీష్ట మనఘ! 289

తండ్రి పరమించె ముదితుడై; తల్లి కైక
కోరె నీనాడు వానిని; కూర్మి దీర్చ
బాధ్యతయు మనయందు సంభావ్య మయ్యె
వంశ కీర్తికి మచ్చ తేవలదు మనము. 290

అరయ పదునాల్గు వత్సరా లనగ నెంత?
కాల గమనంబు చిటికెలో గదలి పోవు
తండ్రి బాసలు నెర వేర్చు తనయు లనెడి
యశము దశరథ తనయుల కబ్బ వలయు. 291

తల్లు లెల్లరు నిన్మెచ్చ ధరణి మరియ
ప్రజల దనియించి మన పూర్వ పరిఖల వోలె
రాజ్యపాలన మొనరించి – రాము మాట
నవధరింపుము చను మయోధ్యా పురమ్ము. 292

ధర్మ విధులెల్ల నీ రీతి తమ్మునకును
నయ విధమ్మున నెరిగించి న్యాయమూర్తి
తల్లులకు మంత్రి గురువుల కెల్ల వినతి
పూర్వకము ధర్మ విషయమ్ము పూని పలికె. 293

అందరును రాము డెరిగించు ఆర్ష ధర్మ
పద్ధతిని విని తెలిసిన వారు గాన
అవన తాననులయి దుఃఖ మందు మునిగి
కారు కన్నీట ఖిన్నులై నారువారు. 294

వారిలో గల్గు దీనత వనట మాన్ప
పరమ ధర్మాత్ముడగు రామభద్రుడపుడు
నిర్మ లాంతఃకరుణుడునై యెనరు దోప
పలికె నెల్లరకును ధర్మ బద్ధ మతిని. 295

దాన ధర్మాది వ్రతములు తపము లరయు
దేవతారాధనమ్ములు దీక్షలు కటి
కోప వాసమ్ము లొనరించి కొమరుల గని
పెంచి తల్లిదండ్రుల వార్వారి పెద్ద సేయ. 296

అష్ట కష్టాల కోర్తురు; అట్టి వారి
కేమి ప్రతికృతి యొనరింప లేము మనము
వారు చేసిన దాన దీర్పను కనీస
ధర్మ మది గాదె! దుఃఖింప తగవె చెపుడి. 297

పరమ సంతోషులై రాజ భక్తి గలిగి
భరతు నామారు సేవించి; భవ్య శీల
వంతులై కోసలమునకు వన్నె దెచ్చి
మసలు డని జెప్పె రాముడు మనసు విప్పి. 298

# పాదుకా ప్రదానము

శ్రీ వశిష్ఠుడు రాముని భావశుద్ధి
సత్య సంకల్ప విభవంబు సన్నుతించి
పలికె నిక్ష్వాకు వంశపు పద్ధతులను
ఆచరింపగ వలసిన అవసరమును. 299

రాజ ధర్మ పరాయణా ! రామభద్ర !
ధర్మ సంబద్ధమై సదా దనరు నీదు
చిత్త నిర్ణయ మెవ్వారు చెరుపగలరు ?
మూర్తి దాల్చిన ధర్మంపు మూర్తి వీవు 300

అరయ నిక్ష్వాకు వంశాన నంకురించు
పూర్వజుడు సింహ పీఠము పొంద వలయు
అంత అనుజన్ములైన వారంద రతని
సతము సేవించి మనుట ఆచార మనఘ, 301

పంక్తిరథు జ్యేష్ఠ సుతుడవై బరగి నీవు
తండ్రి బాసను నెరవేర్చు తలపు గలిగి
ఘోర వనవాస దీక్షను కోరు కొంచు
భరతునకు వీడితివి రాజ్యపాలనమ్ము 302

మెచ్చదగి యున్నదిది యైన-మేరుధీర !
ధరణి నిక్ష్వాకు వంశ పద్ధతి దలంచి
ధర్మ సంరక్షణము సదా దలపునుంచి
మంచి చెడులెంచి నామాట మదివహించి 303

నీదు పాదుకా ద్వయమును నీ వొసంగ
వాని సింహాసనంబున భద్రము నిడి
రాజ్య మేలు నీ పేర భరతుడు; నీవు
వచ్చు నందాక _ వాగ్దాన ఫణితి చెడదు 304

అని వశిష్ఠుడు వచియింప మునివరేణ్యు
సూచనము నొప్పిదమ్మని_సూరిజనులు
ప్రజలు మంత్రులు గొనియాడి ప్రమనులగుచు
సమ్మతిల జేసినారు కౌసల్య సుతుని. 305

భరతు డంతట రాముని పాదు కలను
రామ భద్రుని ముందిడ; రాము డపుడు
పదము లందిడి యొసగిన భరతు డలరి
పెన్నిధిగ వాని గైకొనె ప్రణతు లిడుచు. 306

పలికె భరతుడు శ్రీరామ భద్రు గాంచి
మాట మేరకు జనుచుంటి _ మరలి నీవు
గడువు దీరిన ఉత్తర క్షణము నందు
రాని పక్షాన భరతుండు బ్రతకబోడు. 307

రామునకు లేని సుఖములు రాజ పదవి
భరతునకు నేల? వలదని పట్టు బట్టి
పలుకు తమ్ముని మనసార ప్రస్తుతించి
అభయ మిడి గౌగిలించె నయ్యనఘుడతని. 308

కౌగిలింపగ చెమరించుకండ్ల తోడ
అన్న దెసగాంచి యత్యంత ఖిన్నుడగుచు
జనకునిం బాయ లేని సూనుని విధాన
తల్లడిల్లుచు మరి బల్కె తరణి కులుడు. 309

ఇంద్ర సమ! నిన్ను సమయాంత మం దయోధ్య
యందు గాననిచో మండు టగ్ని జొచ్చి
ప్రాణములు వీడుదును నాదు ప్రతిన ఇద్ది
చంద్ర సూర్యాగ్ను లెల్లరు సాక్షి గాగ, 310

అనుచు దృఢ భక్తి నుడివెడు ననుజు గాంచి
మరల నొక మారు కౌగిట తిరిగి చేర్చి
అవని సంతసమంద మహానురాగ
భరిత హృదయాంత రంగుడై పలికె నిటుల 311

అమ్మ కైకేయి దోసగుల నవల బెట్టి
తొంటి యనురాగమును జూప కుంటి వేని
శప్త డగుదువు నా చేత - జనని సేవ
తప్పకుము ప్రీతి - నామాట దాట వలదు. 312

పురజు మంత్రులు తాపస వరులు మునులు
రామభద్రుని రాజ ధర్మమ్ము నింక
భరతు నిష్కామ పావన వర్తనమ్ము
వినుచి జేసిరి వేనోళ్ల వేడ్క మీర. 313

భరతు డప్పుడా రాముని పాదు కలను
సకల గౌరవ రాజ లాంఛనము తోడ
భద్ర గజమున నిడుకొని బయలు వెడలె
పరిజనము గూడి సాకేత పురము జేర. 314

ముని వశిష్ఠుడు సైనికుల్ మునులు జనులు
తల్లు లాప్తులు తనవెంట తరలి రాగ
చేరుకొని నా డయోధ్యకు చెప్పరాని
మోదమము తోడ భరతుండు విశ్వనుతుడు. 315

చందురుడు లేని గగనంపు చంద మగుచు
వెల వెలం బోయెడి అయోధ్య కలయంజూచి
కుమిలి యేడ్చుచు కైకేయి కొమరు డపుడు
వదనమున జార్చె — వేడి బాష్పముల ధార. 316

అందములు వాసి శూన్యమై అదరు చుండి
బోసిగా చిన్నబోయిన పురము గాంచి
నుండ లేనిట — నిప్పారి నుండు టెట్లు
అన్న రాముండు లేకుండ నని దలంచె. 317

అయ్యొ ! యీపురి సొగసు మహానుభావు
డైన మాయన్న లేక పాడయ్యె నకట
కటిక చీకటి మబ్బులు గ్రమ్మి యున్న
రాత్రి వలె నిద్ది యున్నది రమణ వాసి 318

రాము డిట లేక నల వ్యాఘ్ర రాజు లేని
పర్వతపు గుహ మాదిరి పాడు బారి
యున్న యిన్నగరము వర్ష ముడుగు మేఘ
మటుల నేనాడు హర్షము నందజేయు ? 319

అకట ! యీదుఃఖ మెటుల నే నిక భరింతు
ననుచు మిక్కిలి చింతించి అర్క హీన
మైన దినమును బోలిన — నవని నాథు
డతుగ కళవాడు తంత్రిమందిరము జొచ్చె. 320

పలు విధమ్ముల దుఃఖించి భరతు డపుడు
తల్లులను, దీనులై యున్న నెల్ల జనుల
నిజ నివాసమ్ములకు నంపి — నియతమైన
అన్న వనవాస దీక్షకు నడలి యడలి. 321

గురువులను బిల్చి తన తండ్రి కోసలేశు
డరిగె దివమునకును-రాము డడవి కేగె
తపసియై; యిపు డడవిగా తనరు పురిని
నుండ లేననుచును భరతుండు దెలిపి, 323

అన్న రాకను గోరుచు నన్ని విడచి
మునియువోలె నంది గ్రామమున వసింతు
ననుచు దెలిపిన - మంత్రులు ముని వశిష్ఠు
డతని సోదర వాత్సల్య మభి నుతింప 324

ఆప్తజనములు సామంతు లఖిల మంత్రు
లమర ఋషులును మునివరు లలరునటుల
పాదుకల నప్పు డా సింహ భద్ర పీఠి
పైన నిడి, పాలనమ్ము భరతుడొనర్చె. 325

ప్రజల - మంత్రుల యనుమతి బడసి యంత
కులపురోహితు హితమును కూర్మి వడసి
రామునకు మారుగా కోసలమ్ము నేలె
భరతు డంత నందిగ్రామ వాసి యగుచు. 326

రాముడే స్వయముగ తము రాజ్య మేలు
నటుల సంతృప్తి గాంచి నా రచటి జనులు
ప్రజల యభిమానముల గన్న ప్రభుపులెగద
ధన్య చారిత్రులై భువి దనర గలరు, 327

భరతు డటు బోవ బహు దుఃఖ భరిత మతిని
కొంత చింతించి రాము డత్యంత శీఘ్ర
మచటు వీడగ మది నెంచె - నాప్రదేశ
మందరికి దెల్పె ననియెడు సంతియమున 328

చిత్రకూటాద్రి వడి వీడి చిరయశునకు
దండకావని కరిగెడు దలపు గలుగ
అవని తనయయు సౌమిత్రి యనుసరింప
పయన మాయెను దండకా వనమునకును. 329

వనము నందట్లు రామలక్ష్మణులు సీత
అరుగు చుండగ జూచిన నాటవికులు
వీర లీ శుభ లక్షణోపేతు లిట్లు
వనుల జరియింతు రేలని వగచి రెంతొ. 330

కఠిన వనపథముల యందు కాలి నడక
నిడుమలం బడి తమతోడ నడచి వచ్చు
జనక రాట్పుత్రికకు పథ శ్రమము వాయ
మునుల కథలు చెప్పుచును రాముండు నడచె. 331

# అత్రిమునీంద్ర దర్శనము

ఇలను పరమేష్ఠి సంకల్ప బలము వలన
తాపసోత్తము డౌ అత్రి తపసి వెలసె
పరమ పావనుడౌ రామభద్రుడు దతని
ఆశ్రమము జేరె సతితోడ ననుజు తోడ. 332

అత్రిముని గని వందన మాచరింప
బుత్ర వాత్సల్య యుతుడయి పొంగి యధిక
మోదమును బొందె; నంతమహాదరమున
వారి నాశీర్వదించె తపస్వి ప్రీతి. 333

సంయమీంద్రుడు రాముని సత్య దీక్ష
మేలు మేలని పలుమార్లు మెచ్చు కొనుచు
సద్గుణా! రామ; నీ దగు సచ్చరిత్ర
పుణ్యదమ్మును సర్వోర్వి పూజ్యతమ్ము. 334

అవని కంటక మైనట్టి అసుర సంఘ
మంత మొందును గాక సత్య ప్రతాప!
సత్య ధర్మమ్ములు నహింస జగతి లోన
నీదు కతమున స్థిరముగా నెగడు గాక. 335

అనుచు ముని బల్క సంప్రీతి వినుచు వారు
వినయ వినమిత శీర్షులై విధి విధాన
వందనం బాచరించిరి పరమ భక్తి
నంత అనసూయ సీతతో ననియె నిటుల. 336

తల్లి! సీతమ్మ! సుఖ సంపదలును వయసు
అడవి పాలయ్యె నని చింత నంద వలదు
పతికి పతితోడి వాసమే స్వర్గసీమ.
అడవు లానంద సౌధ గృహాంతరములు. 337

కానలం దుండినను నిజకాంతు నెపుడు
విడక సేవించి భర్తను వివిధ గతుల
నలర జేయుట చూడగా అలనలకును
నూరు క్రతువులు చేసిన తీరు కాదె? 338

సతికి పతి గతి చూడగా సర్వ మతడె
పతికి సతిమించు ఘనతర ఫలము లేదు.
పూవులను వీడి యుండని తావి పగిది
భార్య భర్తను విడకుంట భద్రకరము. 341

అనుచు శ్రద్ధగా దెలుపుచు యవని సుతను
గౌగిలిం జేర్చి అనసూయ గౌరవించి
మంగళాశీస్సు లొసగుచు మాయ నట్టి
వలువలను పూలు భూషణావళి నొసంగె. 343

అమితమౌ మోద ముప్పొంగ నవని సుతయు
యినకులస్వాము లిరువురు మనము లలర
అత్రిమున్యాశ్రమమ్మున నాదినమ్ము
వేడ్క గడపిరి - నంతట వేగుటయును. 344

సూర్యుడాకసమున కాంతి శోభనింప
కాల కృత్యాది సర్వాహ్నికముల దీర్చి
అత్రి దంపతులకు భక్తి నంజలించి
అనుమతిని గోరి రపుడు ప్రయాణమునకు 345

అత్రి దంపతు లాదిగా నఖిల మునులు
కూర్మి నాశీస్సు లిచ్చి వీడ్కొలొసంగ
ముదము నందుచు వారలు మునుల కెఱగి
పయన మైనారు దండకా వనము జేర. 346

ఇది శ్రీ గురునాథేశ్వర వరప్రసాద సహజ కవితా సంప్రాప్త
కాశ్యపసగోత్ర పవిత్ర మావుడూరి వంశ పార్వతీ అనంతరామ
పుత్ర బుధజనవిధేయ రఘురామ నామధేయప్రణీతంబైన
రఘురామ రామాయణమను తేటగీతి కావ్యము
నందు బాలకాండ సంపూర్ణము

# రాఘురాము రామాయణము
## అరణ్యకాండ

శ్రీపదధ్యాను డమలు డాశ్రిత జనాళి
కొంగుబంగారమై వెలుగొంది నట్టి
విమల చారిత్ర ! తెన్నేటి విశ్వనాథ!
అవధరింపుము నాదు రామాయణమ్ము

294.592
RAG

## బుషాశ్రమ సందర్శనము

Acc. No.
10518

ఆత్రి మౌనీంద్రు దర్శించి ఆ నృపాల
సుతులు జనకజా సహితులై అతి గహనము
దండకాటవి జొచ్చి యుద్దండు లగుచు
నడువ దొడగిరి ధర్మయా నైక పరులు, 1

శరభ శార్దూల సింహాది జంతు తతుల
భీకరా రవములు కడు భీతి గొలుప
ధైర్యమిసుమంత సడలని దాశరథులు
కడు ముదంబున ముందుకు కదలు వేళ. 2

కుసుమ కోమలి జానకి కూర్మి దోప
పతిని వెన్నంటి నాయాశ పడుచు నడువ
గాంచి-యావన వాసు లకాల మేఘ
గణము మాదిరి కురిసిరి కనుల నీరు 3

జానకిని గాంచి రాముండు _ జలజ నేత్రు
గాంచి సీతయు _ వారి లక్ష్మణు గాంచి
దుఃఖమును పొంది _ కనులందు దొరలు బాష్ప
ములు కనుల గ్రమ్మి యణగార ముందు కరిగి. 4

తుచ్ఛమౌ కామ వాంఛల దోష మెరిగి
రంభనే పొందఁ గోరితి రామభద్ర!
వికృత రాక్షస రూపాన వెలయు మనుచు
గనలి నన్ శపియించెను ధనదు డంత 17

కలత జెందుచు నే నేడ్వ కరగి యతడు
ఆదినారాయణుడు రాముడై జనించి
బాపు నీశాప మందాక శాప బాధ
ననుభవింపుము తప్పదంచనియె నాడు. 18

నీక తమ్మున శాపము నేడు దీరె
రామచంద్ర! గైకొమ్ము నా ప్రణతు లివియె
జనెద నేనింక ముందుకు జనిన మీర
లరయ గలరయ్య శరభంగు నాశ్రమమ్ము. 19

బ్రహ్మ విజ్ఞానమున సదా పరిఢ విల్లు
మౌనివరు దర్శనము శుభమౌను మీకు,
అనుచు నతి భక్తి తుంబురు డంజలించి
యరిగె స్వర్గము చేరగా నమల మతిని.. 20

ఇన కులీనుడు తనకార్య మిప్పు డిపుడె
శరణి నారంభ మయె నని దలచు కొనుచు
భయము గనియున్న జనకజ పజ్జ నడచి
చనియె శరభంగ మౌని యాశ్రమము కడకు. 21

## శరభంగ మహాముని

శాంత చిత్తుడు ఘన తపఃశాలి మౌని
ఆత్మ విజ్ఞాని దైవత ధ్యాన్య పరుడు
నయిన శరభంగు దర్శించి యమిత భక్తి
శ్రద్ధతో నంజలిడెను కౌసల్య సుతుడు. 22

సాదరామృత విమల వీక్షణము లలర
వారి దీవించి ఆ శరభంగ మౌని
అనియె శ్రీరాముతో రామ! వనుల మునులు
క్రూర రాక్షస బాధల కుములు చుండ్రి. 23

కారణ మున జన్మించి ఓకరుణ మూర్తి!
నీ వెరుంగని దేమి? యీనిఖిల జగము
రామ లీలా విలాసమై రహి వహించి
ధర్మహితమగు - హతమగు దనుజ కులము. 24

స్వాగతము వల్కె నిందుృడు స్వర్గమునకు
నన్ను రమ్మని - యైనను నిన్ను జూడ
వేచి యుంటిని _ కనులార జూచి నాడ
సంతసము కల్గె నిక బోదు స్వర్గమునకు. 25

రామ చంద్రుడు వీడ్కొల్ప బ్రహ్మఋషియు
సదమలానంద పులకిత స్వాంతుడగుచు
అపుడె యోగాగ్ని శిఖలకు నాహుతి యయి
స్వర్గ లోకమ్ము నకు జనె సంతసమున. 26

అవ్వనమ్మున గల మును లసుర వితతి
కలుగ జేయుచు నున్నట్టి కష్టములను
పుచ్చటించిన _ రాముండు _ మొదటు దైత్య
కులము నిర్జించి కుశలము గూర్తు ననియె. 27

మోద మొప్పార రాముని మునిజనమ్ము
వినయ భాషల ఘనముగా వినుతి జేసి
సాగ నంపిన నినకుల స్వామి యపుడు
కదలి పయనించె నా దండకమును జేర. 28

ఘోర దైత్యుల వృద్ధిపై గూర్చి గలుగు
విధము నాలోచనము చేసి వెడలు చుండ
భర్త చేసిన ప్రతినకు భయము నంది
అతి రహస్యముగా సీత అతని కనియె. 29

కినుక బూని దనుజులతో నినకులేశ !
కారణము లేక రణముకై కాలు దువ్వ
ధర్మమా ? జీవ హింసయె దశరథేశు
నాత్మజులకు పాడి యగునె ? నరయు మనిన. 30

కలికి ! సామాన్య మానవ కాంత వోలె
పలుకు చున్నావు వచ్చిన పనిని మరచి
దుష్టజన శిక్షణమ్మును శిష్ట రక్ష
ణమ్మె కద రాజ వరుల ధర్మమ్ములవని. 31

పని ముగింపనిచో మన ఘనత యేమి?
అనుచు రాముండు పలుకగా నవని జాత
మాయ తొలగిన యొక పెను మాయ వోలె
నర్మ గర్భముగా చిరు నవ్వు జిమ్మె 32

మునుల మనముల దలచుచు ముందు కరిగి
ప్రకృతి రమ్యత గని మోదం పడుచు వారు
జనుచు నుండిరి నడచుచు వనుల నంత
డయ్యుటయు వారు గళ మెండి డప్పిగొనిరి. 33

దగ్గరగ నున్న వాగున దప్పి దీర
నీరములు గ్రోలు చుండగా నోరు తెరచి
మకర మొక్కటి వారల మట్టు బెట్ట
మీద కురికిన రామ భూమీశు డపుడు. 34

తడబడక సాహసము మీర మడుగు జొచ్చి
మకరమును జంప నింగికి మకర మెగసి
భీకరాకృతి దాలిచి పృథ్వి పైన
జనక సుత తీవ్ర భయ మందచచ్చి పడియె. 35

అంత వనమార్గమున వారలరుగు చుండ
పరి సరమ్ముల మధు పుష్ప పరిమళములు
మనసు నలరింప భీతిని మరచుటయును
శాంతి యొక కొంత జేకూరె జనకజకును. 36

మంద కర్ణ మునీంద్రుని మహిమ దెల్పు
కొలను పంచాప్సరమ్మును కూర్మి నరసి
ముని సుతీక్ష్ణుని దర్శించి ముందు కరిగి
అరసి నారట వారగస్త్యాశ్రమమ్ము. 37

## అగస్త్యాశ్రమ సందర్శనము

పులులతో మేకలును సింహములతొ కరులు
హరిణములు వాని మధ్యను చిరుత పులులు
అరమరిక లేక నట యూట లాడ గాంచి
చాల సంతస మందెను జనకపుత్రి 38

శుక పికమ్ముల కలగాన శోభ లెసగ
మధుర ఫల తరువులు బహు ముదము నిడగ
అమల హోమాగ్ని గంధము లలరు వనము
వేద ఘోషలు వీనుల విందు గూర్చ. 39

దరిశి అవ్వన వాటిని దాశరథులు
కలిత తేజో విరాజి తానగస్త్య మునిని
బహుళ ప్రజ్ఞా దురంధరు బ్రహ్మతేజు
దైత్య మద భంజనుని గాంచి తనిసి నారు. 40

శ్రద్ధ మీర ప్రణామముల్ సలుప – నంత
ముదిత మానసు డైన నమ్ముని వరుండు
శిరములను స్పృశియించి యాశీస్సు లొసగి
అతిథి సత్కృతు లొనరించి ఆదరించె. 41

అలసటలు దీర నా దినమ్మచట గడుప
దలపు గలుగుట జానకీ దాశరథుల
కా మునీంద్రుడు ఘనముగా నా శ్రమమున
ఉచిత మర్యాదలను విందు లొనరజేసె. 42

రాత్రి విశ్రాంతి సమయాన రామ భద్రు
డవని సుత లక్ష్మణుల తోడ నా అగస్త్య
ముని వరుని బ్రహ్మ తేజము ఘనత శక్తి
వీనులకు విందు గలుగగా విశద పరచె. 43

## ఇల్వలుడు-వాతాపి

భువన హిత కాంక్ష వెలయుచు పుణ్యగతుల
నిత్య తపమున సర్వము నిగ్రహించి
తనరు నిమ్మహా మహుని కతమునగాదె
సిద్ధ ముని గౌరవమ్ము ప్రసిద్ధి నందె. 44

మున్ను యివ్వనమున కడు మూర్ఖమతులు
కపట వృత్తి చరించు రాక్షసులు – నిర్వు
రన్న దమ్ములు మునుల నమాయకులను
మోస వృత్తిని చంపి సమ్మదము గనిరి. 45

ఇల్వలుడు వాతాపి నా నిర్వు రసుర
జనులు మున్యాశ్రమ ప్రాంత వనములందు
విప్ర రూపాల స్వాధ్యాయ వేదు లట్లు
వేద పారాయణంబున వెలసి యుండిరి. 46

శ్రాద్ధ మని తాపసుల బిల్చి శ్రద్ధ మీర
మేష రూపుడౌ వాతాపి మెడను గోసి
ఇల్వలుడు మాంసమును వండి ఋషుల కిడును
తృప్తి భుజియించి వారు సంతుష్టి నంద. 47

అన్న "వాతాపి" రావయ్య యనుచు బిలుచు
శ్రమము లేకుండ మేష రూపము ధరించి
ఖలుడు వాతాపి నిశిత శృంగముల తోడ
ముని వరుల యుదరములు చీల్చు కొనుచు వచ్చు 48

తాపసులు మృతి నొంద గృధ్రముల వగిది
దనుజులా కళేబరమును మనసు దీర
తినుచును - సంతృప్తి నందుచు దినదినమ్ము
ఋషుల జంపుచు నిట సంచరించు చుండ్రి. 49

ఇవ్విధమ్మున కొన్నేడు లేగినంత
దేవ ముని ప్రార్థితుండయి దీప్తి జెంది
ఈ అగస్త్య మహాముని యిచటి కపుడు
తాపసుల బాధలను దీర్ప తరలి వచ్చె. 50

ఇల్వలుడు పూర్వ పద్ధతి నీ మహాత్ము
బ్రాహ్మణార్థ భోక్తగ గోర బ్రహ్మఋషియు
"పల్లె" యునినంత బొల్లింటి వలెనె భోజ
నమ్మె సంగియు "వాతాపి" రమ్మనుటయు. 51

ముని వరుండును మెల్లగా పొట్ట పైన
చేత నిమురుచు "వాతాపి జీర్ణ" మనుచు
పలుక - వాతాపి జీర్ణమై బరగు కతన
బయులు వెడలడు మేష రూపమ్ము తోడ. 52

ముని వరుండంత నిల్వలు మోము గాంచి
యేడ వాతాపి ? యమలోక మేగె నెపుడొ.
అనిన ఇల్వలు డుగ్రుడై యమ్మహాత్ము
చంపగా మీది కురికిన సమయ మందు. 53

తీక్ష్ణమౌ ప్రేక్షణమ్ముల తీవ్రగతిని
వాని బరికింప దందహ్య మాన దేహు
డయ్యె నసురుడు శుష్క తృణాభుడగుచు
లోక హితమాయె – మునుల చీకాకు లణగె. 54

నాటి నుండియు యివ్వన వాటి యందు
ఆశ్రమంబొండు నిర్మించి యతడు నిలువ
అసుర బాధలు దీరె; తాపసులు దీక్ష
తపము లొనరించి ముక్తులై ధన్యులైరి. 55

ఇనకులుం డట్లు ముని కధ నెరుగ బలుక
జానకీ లక్ష్మణు లెద నాశ్చర్య పడుచు.
అంజలించి రగస్త్యునకాత్మ – సంత
సేకు వను దెల్పుచును గూసె కాకి గణము 56

మరు దినమ్మున నుదయాన మహిమ గల్గు
దివ్య శస్త్రాస్త్ర తతులను – దీప్తి మెరయు
పరుష ఖడ్గము – మంత్ర నిబద్ధ మైన
వాని–మంత్రాలతో నిడి మౌని యనియె. 57

ముఖ్య చారిత్ర ! దనుజ నిర్మూలనమ్ము
వసుధ కావశ్య మివియు దివ్యాస్త్రతతులు
మహిత పాటవ వైష్ణవ మంత్ర యుక్త
చటుల తేజో యుతమ్మైన శక్తు లివ్వి. 58

అనుచు దెలుప రాముడును "మహాప్రసాద"
మనుచు నతిభక్తి గైకొని నంజలిడచు
భావి కార్య సాధనములు బ్రహ్మ ఋషి-యొ
సంగి వీని నని కడు నుత్సాహ పడియె. 59

అనఘ! గతరేయి నీ తపోవనము నందు
నతివతో తమ్ముతో సుఖ మంది నాడ!
పుణ్య ధనుడవు నీ పాద పూజ చేసి
ధన్యతను గాంచి నాడ=నాతపము పండె. 60

ఇంక మది భావి నూహించి శంక లేక
యేను వసియింప దగు ప్రాంత మీ వనాన
మూడు కాలమ్ము లెరిగిన ముని వరేణ్య!
అనతిడు డని గోర నమ్మౌని వరుడు. 61

ఒక ముహూర్తము యోచించి యూహ నెరిగి
గౌతమీ తటి వాస యోగ్యమ్ము - నందు
పంచవటి పుణ్య దేశమా పంచ వటిని
జలము ఫలములు దొరకు పుష్కలము గాను. 62

వాస యోగ్యంబ ఆ పంచవటి కుమార!
అరయ పదునాల్గు వత్సరాలందు నపుడె
గడచి పోయెె పదేళ్లింక గడుపు కోల
మదుగనీపంచవటి యందు గడుప శుభము. 63

అనుచు ముని బల్క రాముండు హర్ష మొంది
జానకీ లక్ష్మణుల తోడ మౌని జన వ
తంసునకు మ్రొక్కి యాన తత్పరుడు నగుచు
ఆ శ్రమము వీడి ముందున కరిగి వారు. 64

ముని వచించిన విధముగ జనుచు బహుళ
వృక్ష సంతాన సౌందర్య వివశు లగుచు
వన విలాసము వర్ణించు కొనుచు నంత
చేరినారు గోదావరీ తీర మపుడు. 65

పంచ వట తరుచ్ఛాయలు ప్రబలి యున్న
పంచవటి గాంచి యనుకూలు వాస మంచు
సమ తలమ్మున నొక పర్ణశాల నపుడు
రచన సేయ లక్ష్మణు గోరె రామ విభుడు. 66

అన్నయానతి తలదాల్చి యా సుమిత్ర
సూతి నిర్మించె సౌందర్య శోభ లొప్ప
అన్న వదిసెల కనుకూలమౌ విధాన
సన్నుతంబగు నొక పర్ణశాల నచట. 67

అంద మింపొంద ననుకూల మైన రీతి
డనరు పర్ణశాలను గాంచి జనక తనయ
మిథిల యందయోధ్యను గల మేడ లన్ని
మరచె నొక్కింత తడవు మైమరచి గనుచు. 68

చూడ నద్భుతమై బహు చోద్య మిడుచు
నలరు తత్పర్ణశాల రామయ్య గాంచి
కరము ముదమందితమ్ముని గౌగిలించి
గౌరవించెను-ప్రేమ వీక్షణము బరపి. 69

విభుని చెంత వసించుటే విధి యటంచు
వేడ్క మది నెంచు వైదేహి విసిన సీమ
నందదోద్యాన మని యెంచి-తెంది మందు
సదమ లానందమును బొందు సంతతమ్ము. 70

అరయ సుందర మైన నయ్యాకు టిల్లె
రాజ వైభవముల జిమ్ము రమ్యమైన
చలువ రాళ్ళను పొదిగిన సౌధ మంచు
డెండమున నెంచి పరవశ మందు సీత. 71

శ్రీకరమ్మైన గోదావరీ జలాలు
పరిసరమ్ముల గల పుష్ప ఫల వనాలు
వన్య జలపక్షి సంతతుల్ - వన మృగాలు
హృదయ మోద మొసంగు నా ముదిత కెపుడు. 72

ప్రతి దినమ్మును మరదితో భర్త తోడ
దివ్య గోదావరీ నదీ తీర వన - వి
హార మొనరించుటకు బోవు నవనిజాత
ప్రకృతి సౌందర్య మట గని పరవశించు. 73

వినయమున లక్ష్మణుడు సీత మనసు దెలిసి
వలయు పూవులు ఫలములు వనము నుండి
తెచ్చి యిచ్చుచు నుండును దిన దినమ్ము
తల్లికిని సేవ లొనరించు తనయు డటుల. 74

పవలు రేలును శ్రద్ధయు భక్తి గదుర
గొలుచు సౌమిత్రి సేవల దలచు కొనుచు
గడపె కాలము రాము డా కాననమున
ధర్మ సంబద్ధ చిత్త తత్పరుడు నగుచు. 75

కోరు నట్టి భోజ్యములను గూర్చుచుండి
భక్తి యుసిప్పంగ నేమరు పాటు లేక
అన్న వదినెల లక్ష్మణు డరయు చుండ
కాల మేగెడి సుఖముగా కాననముల. 76

## శూర్పణఖ

అంత నొకనాడు సీతతో నవని విభుడు
పర్ణశాలను గూర్చుండి భద్రముగను
జరిగినవి చర్చ గావించు సమయ మందు
పరుగునను వచ్చె నటకు రావణుని భగిని. 77

చాటుగా నిల్చి రాముని చక్కదనము
గాంచి యుబ్బురంబంది రాక్షసియు నచట
చక్కనౌ చుక్కగా మారి సమయ మరసి
వలపు లొలుకుచు రాముని వద్ద చేరె. 78

వచ్చి రాముని యందమ్ము మెచ్చి - మిగుల
ననుచితమ్మగు ప్రేమ భాషణము లొప్ప
నతి జుగుప్సా కరమ్మగు నట్టి రీతి
పలికె రాముని గాంచి యా పడతి యిటుల. 79

చూడగా రామ ! నీవతి సుందరుడవు
మన్మథుని గెల్వగా దగు మధుర మూర్తి
వగుదు - బ్రహ్మకు బుద్ధి లేదనగ వలయు
కానిచో నీమెయా తగు కాంత నీకు. 80

వయసు కాడవు - నీవిట్లు వల్కలాజి
నముల దాల్చియు నీ కాననముల యందు
మౌని రూపమ్ము ధరియించి-దీనుడ వయి
దిరుగగా కారణమ్మేమి తెలియజెపుమ. 81

అనిన రాముండు నసురతో ననియె నపుడు
పడతి !సాకేత మేలెడి ప్రభు వరుండు
దశరథుడు నాకు జనకు డీ తరుణి సీత
అమిత ప్రేమాను రాగ నా కయిన భార్య. 82

రాముడందురు నన్ను-ఓ రమణి ! యితడు
సర్వ శుభలక్షణా యుత సన్నుతుండు
సకల సద్గుణ రాశి లక్ష్మణుడు పేరు
అనుజు డీతడు నాకు ప్రియాతి ప్రియుడు. 83

తండ్రి చేసిన బాసలు ధర్మ నిరతి
శిరమునం దాల్చి నెరవేర్ప దిరుగుచుంటి
వనములందున - నింక నీ ఘన చరిత్రి
వనిత యెరిగింపు మన నామె యనియె నిట్లు. 84

భీకరాకారు డఖిల లోకైక వీరు
డసుర పతి రావణుండు లంకాధిపుండు
మూడు జగముల శాసించు ముఖ్యు డమర
పూజితుడు - బుద్ధిబలు డుగ్ర భుజ బలుండు 85

రాక్షసుల కెల్ల సామ్రాట్టు రావణుండ
సురగణము లెల్ల నాతని చుట్టు జేరి
దాస్య మొసరించు చుండు నా దైత్య వరుని
అనుగు చెల్లెలిన్ - నన్ను శూర్పణఖ యంద్రు. 86

దాపగా నేల ? ఓరాజ ! దగిలె నిపుడు
నా మనమ్మది నీ యందు - ప్రేమ యనగ
నిదియె కాబోలు ! గాకున్న నింత గాఢ
హృదయ సంసక్తి చెలరేగి యేచునయ్య. 87

నీదు లావణ్యము వయస్సు నీదు సొగసు
గాంచి, నంతనె నిను పొంద కాంక్ష కలిగె
కామకేళికి నావంటి కాంత - రసిక !
దొరక బోదెందు నీకు నిద్ధరణి యందు. 88

కాన జాగేల ? యో వన్నెకాడ ! నేడు
కరుణ నన్నేలి పూవిలుకాని వెతల
దగిలి పొగులుచు నున్నట్టి తరుణి నన్ను
గావగా నీదు ధర్మమ్ము కాదె రాజ ! 89

అడ్డమై యుండి రాలియు ననుజు డనుచు
చింత పడకయ్య వారల చిటికె లోన
నంత మొందించి తొలగింతు నయ్య నేను
హాయిగా స్వేచ్ఛగా రాగదోయి నీవు. 90

అనెడు రక్కసి పల్కుల నినకులుండు
వినుచు వచియించె లో నవ్వు కొనుచు నపుడు
భార్య గలిగిన నను గోర భావ్య మగునె ?
తగిన జోడగు నీకు నా తమ్ము డడుగో ! 91

భార్య యుండియు దరి లేని బ్రహ్మచారి
లక్ష్మణుడు సర్వ సౌభాగ్య లక్షణుండు
నీకు దగువాడు నెయ్యము నేర్పు వాడు
అతని దరికేగ తీరు నీ యభిమతమ్ము. 92

అసుర కామిని శృంగార మభినయించి
లక్ష్మణుని జేరి కులుకు నేత్రముల తోడ
ఓరగా జూచుచును ప్రియమార - మరులు
గొలుపు భాషల కులుకుచు బలికె నిటుల. 93

వలపు దేనెలు జాల్వారు వనజ మేను
మధుర మధువును గ్రోలెడు మధుప మీవు
లీల మన్మథ సామ్రాజ్య మేల రమ్ము
వలచి వచ్చిన వయసైన వనిత ననియె. 94

ఆమె దెస గాంచి లక్ష్మణు డనియె నిటుల
మున్ను కామించితివిగ మా యన్న నతివ
వదినె వగుదువు నిను గోర వరుస దప్పు
కాన నీవు నాయందున కాంక్ష విడుము. 95

లక్ష్మణుండటు బల్కగా రాక్షసియును
మిగుల గోపించి—అడ్డు భూమిజ యటంచు
మది దలంచుచు శీఘ్రమమా మగువ మ్రింగ
లంఘనము సేయ—గోపించి లక్ష్మణుండు. 96

రాము నను మతి తోడ నా రమణి — ముక్కు
చెవులు—తెగగోసి గద్దించి చేత బెట్ట,
శృంగ భంగము నందియ యారీతి నామె
బొబ్బలిడుచు మిన్నదరగ పోయి పోయి. 97

వికృత రూపాన ఖరు దరి వేగ జేరి
సిగ్గు బరువున తలదించి చెప్పె తనకు
వికృత రూపము కలిగిన విధము నపుడు
భంగ పడినట్టి రాక్షసి బావురనుచు. 98

అరయ నా చుప్పనాక సోదరుడు ఖరుడు
కఠిన చిత్తుడు_జన భయంకరుడు-జడడు
కృద్ధుడయి పల్కె నరులకు బుద్ధి చెప్పి
మగువ ! చల్లార్తు నీ యవమాన మనుచు. 99

ఆమె నూరార్చి పదునల్వు రతి బలాఢ్యు
లైన దనుజుల బుత్తెంచె నా నరాధ
ములను బరిమార్చి రండని_సోహరమున
రామ బాణాగ్ని హతులైరి రాక్షసులును. 100

అరసి విషయము కుపితాత్ము డగుచు ఖరుడు
పదియు నాలుగు వేల కాల్బలము గొనుచు
రామ చంద్రునితో తీవ్ర రణ మొనర్ప
వేగ చనుదెంచె – కర్మము వేగిరింప. 101

అవనిజాతకు నండగా ననుజు నునిచి
దాకె వారల రాముండు తత్ క్షణమ్ము
తాపసుల యెద నెలకొన్న తాప మడప
దుష్ట సంహార మొనరింప దొడగె నపుడు. 102

బాణ వర్షము గురియ-తత్ప్రాటవమున
కాగగా లేక ఖర దూషణాది రాక్ష
సాళి సర్వము కుప్పగా నవని వ్రాలి
కూలిరి ఘన తాళ తరులు గూలి నటుల. 103

అతుల భుజ బల సంపన్ను లౌ ఖరాది
దనుజులును గజ తురగ రథాది బలము
లన్ని మసి యయ్యె రామ బాణాగ్ని సోకి
ఖరఖరుడు సోకగా మంచు కరగి నటుల. 104

# అకంపనుడు రావణుని సభ జేరుట

అపుడకంపను డను రాక్షసాధ ముండు
చాపు తప్పి తా రావణు సభను జేరి
రాముని పరాక్రమమ్ము ఖరాది దనుజు
లంత మగుటయు నెరిగింప ననిమిషాంశ. 105

క్రోధ ఘూర్ణిత నయనంపు గొనల రక్త
కాంతు లుజ్వలమై భయంకరము గాగ
ధీర గంభీర వాక్కుల దిశలు బెదర
గర్జనము చేసె ప్రళయ మేఘమ్ము కరణి. 106

అల్పులగు మానవాధము లరయ జృంభి
తాత్ము లయి రావణుని సేన నవని గూల్ప
నెంత ధైర్యము? ఇపుడె నేనేగి రాము
పొంక మణతును - తీవ్రమౌ పోరు సలిపి. 107

అనుచు గద్దింప నా యకంపనుడు నపుడు
దనుజ విభు గాంచి పల్కె నో దానవేంద్ర!
సమయ మెరుగగ వలయు నీ శక్తి మిగుల
గొప్పదే యైన రాముని గుణము వినుము. 108

మేటి విలుకాడు దివ్య డమేయ బలుడు
విమల దివ్యాస్త్ర యుతు డతి విక్రముండు
వినుము; రాము డసామాన్య వీరు డతని
నెదిరి గెల్వ సాధ్యంబు గాదది నిజమ్ము. 109

అతని తమ్ముడు లక్ష్మణు డతి చతురుడు
యుద్ధ విద్యల బహు మేటి యున్నతుండు
రాజి తాతుల ఘన బల రమ్య ముఖుడు
అన్న కుందోడుగా నుండు ననిశ మతడు. 110

వాస వాదుల కైన నవధ్యు లగుదు
రరయుగా రామ లక్ష్మణు లమిత తేజు
లట్టి వారి నుపాయాన బట్ట వలయు
సాహసము చాల దిటువంటి సమయ మందు. 111

రామునిం దెబ్బ తీసి విరాగి జేసి
అతడు తనయంత దానెగా నవని ద్రెళ్లు
కపటమైన యుపాయమ్ము కలదు వినుము
అనుచు వచియింపు నంతలో నచటి కపుడు. 112

గుండెలను బాదుకొనుచును కొండ పోలె
వికృత రూపాన దుఃఖాన వెక్కి వెక్కి
శోకమును గ్రక్కుచున్నట్టి శూర్పణఖయు
అన్న దరి జేరి తన కథ విన్నవించె. 113

కథను సాంతము విని దశకంఠు డమిత
బాధ నందుచు నుగ్రుడై ప్రబలు చుండ
అతని కోప దావాగ్నికి ఆజ్యవృష్టి
యనగ లేని పోనివి జెప్పె నన్న కామె. 114

## శూర్పణఖ సీతను వర్ణించుట

అన్న ఆ రామ పత్ని సీతమ్మ యంద
మువని నెందును గాన మయ్యనిమిషుల
గరుడ గంధర్వ సిద్ధ లోకముల యందు
ఆమె సౌందర్య మతిలోక మై వెలుంగు. 115

మెరపు దీవల గికురించు మేని కాంతి
వాలుగల సౌరు కాల్దన్ను వాలు కనులు
ముగ్ధ మోహన వదనమ్ము మురుపు లొలుకు
రమణి సీతమ్మ యొక అపరంజి బొమ్మ 116

ఘోర వనముల దిరుగుచు కూరగాయ
లారగించెడి నరున కీ యుతివ దగద
టంచు మదినెంచి నీకైన మంచి దనుచు
దలచి యత్నింప నీస్థితి దాపురించె. 117

నా ప్రయత్నము దెలిసిన నరులు నన్ను
ప్రతి ఘటించుచు కోపించి ప్రబలి - ఎంత
మొత్తుకొనుచున్న వినక నా ముక్కు - చెవులు
గోసి పోద్రోలి నారతి క్రూర బుద్ధి. 118

పంపి యుంటిని ఖరుడాది పదియు నాల్గు
వేల దనుజుల - నరు డవలీల వారి
చీల్చి చెండాడి యొకడె నిర్జించె-నవని,
రాము డాఖీల నిరుపమ స్థేము డన్న ! 119

అసుర జాతికి నపకారి యైన వాని
సతిని చెరబట్టి దెచ్చిన చాలు నన్న !
అతడు విరహాగ్ని కృశియించి అతివ కొరకు
మ్రగ్గి నశియించు; వినుము - నా మాట నన్న ! 120

మదను నారవ ములికియై మహి చెలంగు
వసుధ సుత సోయగము గన్న - వదల వన్న !
అట్టి అతిలోక సుందరి యసుర విభుని
బాహు వల్లరిలో జొక్కి బ్రతుక వలయు. 121

శశిని వీడక యుండెడి చంద్రిక వలె
కాయమును బాయకుండని ఛాయ కరణి
తరుణ పుష్పము వీడని తావి పగిది
భర్త నెడబాయ దెప్పుడా పద్మగంధి. 122

ధరణి నెవ్వడా జానకీ తన్వి బొంది
సతము సుఖముల చొక్కునో యతడు జూడ
అమర లోకాధిపతి కంటె నధికు డగుచు
నవని పూజల నందడే యసుర నాథ. 123

ఆకులలములు దినుచు నా యడవు లందు
బడుగు బాపని వలె జడ ముడిని దాల్చి
దీనుడై దిర్గు రాముడా దేవి భర్త
అకట ! విధి యెంత కృతకము నాచరించె. 124

నరుల వంచించి యెటులైన నాతి దెచ్చి
దైత్య కంటకులైన యా దాశరధుల
కాననముల పాల్జేసి యా కాంత గూడి
సురత భోగాల నీ విట స్రొక్క వలదె? 125

నాదు వాక్కులు నిజమని నమ్మితేని
దనుజ పాలక! కడువడి జనుచు నీవు
దండకా టవికింబోయి తరుణి దెచ్చి
మదన సామ్రాజ్య సౌభాగ్య మనుభ వింపు. 126

## సీతాపహారణము.

అతుల పురిగొల్పుచును చెల్లలనిన వాక్కు
ధాపమున రావణుడు వేగ బయలు వెడలి
చేయువలసిన విధి నూహసేసి మదిని
మామ మారీచు జేర విమాన మెక్కి. 127

అట నదీపతి తీరాన ననవరతము
పుణ్య వనిని విరాగియై పూర్ణమతిని
సత్వగుణ మూని నిష్ఠమై జపము సల్పు
మామ మారీచుజేరి నమర విరోధి. 128

మామ! మారీచ! వింటివా మనకులమ్ము
నాశనము సేయుగా నెంచి నరుడొకండు
దండకాటవి నున్నాడు—దశరథేశు
తనయు డట — రాముడట పేరు — తరణి కులుడు. 129

మనకు నపకారి యగు రాము వనిత నెటులో
బలిమి చెరపట్ట దలచితి — పాపమనక
నాకు చేదోడుగా రమ్ము — నరుని కొంక
మణగ జేతును నాతని యతివ బట్టి. 130

పసిడి వన్నెల లేడి రూపమును దాల్చి
పర్ణశాలకు దరిమున్న వచ్చికలను
మినుకు చూపుల నా సీత మనసు గొనుచు
కపట మాయా విశారద ! కదలు మచట. 131

హృద్యముగ గంతులిడు నిన్ను పృథ్వి తనయ
కోరగా రాముడును బట్టుకొను తలంపు
వెంటనా దప్పు గొంపొమ్ము వేగ మతని
అప్పుడా రామ పత్ని నే నపహరింతు. 132

అనుచు వచియింప మారీచు డదరి పడుచు
ననియె రాముని గూర్చి రావణుని తోడ
కాడు సామాన్యు డతడు జగత్ప్రభుండు.
అతని సతిబట్ట నశియించు నసుర కులము. 133

కామ మెప్పుడు కష్టాలు గలుగ జేయు
కామ ముడిగిన మదిలోని కలుష ముడుగు !
కామమునకును లొంగని ఘనుడె _ సర్వ
వంద్యుడై విరాజిల్లు నివ్వసుధ నెపుడు. 134

ఎందుకైనను పరకాంత పొందగోరు
పురుష డిహమున చెడిపోవు; పుణ్య ముడుగు,
నుంత యోచించి నిర్ణయ మంత గొనిన
మంచిదన రావణుండును మండి పడుచు. 135

ఒరను 'ధగధగ' లాడుచు మెరయు నట్టి
కత్తి దూయు మారీచుడు కలత జెంది
కాలమది చేరువయినంత మేలు నిడునె ?
ఔషధము రోగికెందైన అవనియందు. 136

మిడుత దీపముపై - నెంతొ మిడిసి పడుచు
నెగురు చందాన నాశన మెరుగ బోరు
దుష్టులనుచు మారీచు డా దుష్టు వెనుక
పయనమై జనె వడివడి పంచ వటికి. 137

## సీత మాయలేడిని చూచుట

తళుకు బంగరు వన్నెల తనువు గలుగు
చిత్ర మృగరూపమును దాల్చి - సీత మదిని
ముదము మోహము విస్మయమును ఘటించు
జికిలి వన్నెల హరిణియై చెలగు నంత. 138

చెదరు కన్నులు బంగారు శృంగములును
మేలి రత్నాల చిన్నెల మెరయు మేను
కనకమయ దివ్య కాంతులు గడలు కొనగ
సంచరించె హరిణి పర్ణశాల దరిని. 139

మృగము సోయగమును గాంచి ముగుదసీత
హరిణమును బట్టగా మెల్ల నడుగు లిడుచు
దరికి జనినంత – నా లేడి తప్పు కొనుచు
ముచ్చటలు గొల్పె జానకి మోద మంద. 140

పూన్కి విడువక జనక రాట్పుత్రి – హరిణి
నరయుచును – పట్ట జనుచును నలసిపోయె.
యెట్టులైనను దానిని పట్టుకొనగ
రామునింగోరె నప్పుడా భూమి తనయ. 141

హరిణమును బట్ట రాముండు పరుగు లిడగ
దొరికి దొరకక కడువేగ దుముకు లిడుచు
పరుగు లిడుచున్న లేడి వెంబడిని వేగ
లక్ష్మణుని సీత కకు నుంచి రాముడేగె. 142

వెనుక జనుదెంచు రాముని గనుచు – కొంత
భయము నటియించి కడు దవ్వ పరుగులెత్తి
చిక్కినటులుండి చిక్కక చిందు లిడుచు
రామునిం దవ్వ గొనిపోయె రాక్షసుండు. 143

వన మృగంబుల జొచ్చి కన్పడక – కొంత
వడికి గన్పించి – దట్టంపు వననికుంజ
ములను డాగుచు నదరుచు మూల నక్కి
బెదరుచును రాము జిక్కుల బెట్టె హరిణి. 144

ఇట్లు చిక్కక నమ్మృగ మినకులేశు
పెక్కు విధముల నలయింప – విసివి-రాము
డమిత కోపము జెంది – యా హరిణ మొండు
కపట మాయా మృగంబని యపుడు దెలిసె. 145

క్రూర శరమును ధనువున గూర్చి – కపట
హరిణమును గొట్ట "హా ! సీత !" యనుచు "లక్ష్మ
ణా !" యటంచును జీరెను మాయ లేడి
కాననము మారు మ్రోగెడి గళము తోడ. 146

చండమై ధనువు వీడుచు జనిన –"రామ
బాణ" మా లేడి గుండెలు వగుల దగుల
"గిల గిలా" తన్ను కొనుచును నిలను బడియె
రాక్షసాకృతి మారీచ రాక్షసుండు. 147

వాని మారీచుగా బోల్చి జానకీ ధ
వుండు – నాందోళితుండయి – బొగులుకొంచు
సీత లక్ష్మణులకు నయి చింత నొంది
పర్ణశాలను వడిజేర పయన మాయె. 148

# సీత లక్ష్మణుని నిందించుట

అటను ! హా ! లక్ష్మణా ! సీత ! అన్న నాద
మడవి మార్మోగ - జానకి ఆలకించి
చిత్త విభ్రాంతిచే భీతి జెంది - యనియె
రాము సేమము శంకించి లక్ష్మణు గని. 149

అన్న ! "హా సీత !" "లక్ష్మణా !" అనుచు మిగుల
భయము కలుగగ మీ యన్న పలికె - వింటె ?
చేరి వృషభము పులివాత జిక్కి నటుల
అయ్యో ! మీ అన్న జిక్కె నయ్యసురులకును. 150

నన్ను కరుణించి కడువేగ మున్న రీతి
ప్రాణపతి జేరి - యాతడు భయము వాయ
బాసటగ నిల్చి - యసురుల బారినుండి
రాము రక్షింపు లక్ష్మణా ! రయమున జని 151

క్రూర రాక్షసులకు జిక్కి కుమిలికుమిలి
ఎంత దురపిల్లు చున్నాడొ యిన కులుండు.
అకట ! ఆ యార్తనాదము నాలకింప
అతని కెంతటి ప్రాణ భయంబొ దెలియు. 152

జ్ఞాన హీనత నిటు బల్కు జనక తనయ
పలుకులకు నుంత యేనియు కలత గనక
ధీర గంభీరుడై యట దిరుగుచున్న
లక్ష్మణుని గాంచి కోపించె రామపత్ని. 153

అన్న యాజ్ఞను మదినెంచి యట గదలక
స్థిరముగా నున్న మరదిని సీత గాంచి
ఓర్పు నశియింప - దైవనియుక్త బుద్ధి
అశని సదృశోక్తుల బలికె నతని గూర్చి 154

మనసు నిర్మలమై యుండు మనుజు డెవడు
మసలఁగా బోడు నీవలె మహిని నెందు.
పాప బుద్ధులు నీ యందు ప్రబలి యుండ
వలయు - లేకున్న నిట్లుండ గలవె నీవు? 155

స్నేహితుని రూపమున నున్న చెనటి వీవు
అన్న దుఃఖాన తపియించు నవసరమున
నంత సౌభాగ్యతమును మది చింత సేయ
నుంటి విది చూడ లక్ష్మణా! గొప్ప వింత. 156

నటన మెప్పుగ మీ అన్న నమ్మునటుల
కపట వర్తన సల్పిన కపటి వీవు.
ఏదొ మదియందు నూహించి యింతవరకు
కదల విట నుండి బహుపాపకార్య మతివి. 157

కుమతి! నా పొందు మదియందు గోరి యుంటి
వేమొ? గాకున్న నీ యన్న సేమ మెంచి
కదలవా? అతడట క్లిష్ట పథము నుండ
సాయపడ నేగవేల? లక్ష్మణ వచింపు. 158

అనగ విని బల్కె లక్ష్మణుం డవని సుతరొ!
వినుము రాముండు లోకైక వీరు డతని
నసురులన నెంత? గెలువలేరతని నెవరు
భయము వలదమ్మ మన రామభద్రునకయి. 159

మనల మోసము చేయుగా మాయ నసురు
డరచె రాముని కంఠమ్ము ననుకరించి
రాక్షసుల మాయగాక - ఆ రామభద్రు
నెదిరి పోరెడి అరివీరు లెవ్వరమ్మ! 160

ఎరిగి రామానుజుడు పల్కు తెరగు వినుచు
అదరిపడి సీత _ దుఃఖము మది కలంప
కలువ కన్నుల కన్నీళ్లు గ్రమ్మ - మాట
గొంతు పెగలక డగ్గుత్తి గొంచు బలికె. 161

అన్న కరయు నపాయ మాసన్న మైన
భోజ్యమగు రాజ్య విభవముల్ బొంది - నన్ను
బొంద నెంచితి వేమొ ! నా పొందు ఓ కు
లాధమా ! చేకురునె నీ కటంచు బలికె. 162

పతిత పావనుడగు రామ పత్ని సీత
అతని గోరక భువి నొరు నాశ్రయించి
బ్రతుకునే శుంఠ ! యిలపైన బ్రతుక దెపుడు.
అసువులను బాయు దిప్పుడే నగ్ని దూకి. 163

లసువు లున్నంత దనుక యీాయవని తనయ
చిక్కగా బోదు నీ చేత _ చెనటి చెడు త
లంపులను వీడియన్నకై రయము మీర
జనుట మంచిది యని బల్కె జానకమ్మ. 164

జనక సుత పల్కులకు తీవ్ర చలన మంది
ప్రళయ మేతెంచినట్టుల బాధ నంది
మిగుల బొగులుచు దీనుడై విధి దలంచి
కనుల నీరమ్ము గ్రమ్మ లక్ష్మణుడు బలికె. 165

తల్లి ! తనయుని వంటినన్ దారుణముగ
యీా దురూక్తులు బల్క నొప్పించ దగునె ?
ఉగ్ర కాననమందు నిన్నొంటి విడచి
పోవ వెనుకాడు చుంటి వాపోవుచుంటి. 166

లక్ష్మణుండెట్టి మనుజుడో రాముడెరుగు
తల్లి! రాముని యానతి దాట లేక
ఒంటరిగ వీడకుంటి వేరొండు గాదు
దైవ మెరుగును! పంచభూతమ్ము లెరుగు! 167

అమ్మ! నిను వీడి నేనేగి నంత-నిన్ను
ఆపదలు చుట్టి ముట్టు - న య్యసుర మాయ
పొంచి యున్నట్లు దోచెడి - పోవుచుంటి;
స్వస్తి యగుగాక నీకు! ఓసాధ్వి యనుచు. 168

రామునకు ౹మ్రొక్కులిడి-యట లక్ష్మణుండు
అన్న! నీ యాన మీరితి నంచు నన్ను
తప్పు బట్టి దూయుగబోకు ధర్మ విదుడ!
తల్లి దయమాలి బలికె-నన్ దారుణముగ. 169

ఘన తరమ్మైన శోకాన కంట నీరు
జాలు వారగ చింతించు జనక సుతను
గని ౹ప్రదక్షిణమొనరించి - కరము మోడ్చి
అంజలిడి దేవతల కెల్ల ప్రార్థించి. 170

కరుణ రస మొల్క దేవతా గణములార!
పంచ భూతములార! నా బాధ నెరిగి
శోకరస దేవతా రూప శోభిత యగు
నబల - సీతమ్మ సేమమ్ము నరయు డనుచు. 171

వేడుకొని - సీత నొంటిగ విడువలేక
తెగువతో ముందుకరిగెడి తెంపు లేక
కొట్టు మిట్టాడు లక్ష్మణు నట్టె జూచి
కంట తడి బెట్టె దేవతా గణము లెల్ల. 172

అడుగు ముందున కిడి; మరి యంత లోనె
వెను దిరిగి చూచుచును_ ముందు జనుచు చనుచు
తడబడెడు కాళ్లతో సుమిత్రా సుతుండు
అన్న వెదుకగ జనె మది నార్తి పెరుగ. 173

లక్ష్మణుడు పర్ణకుటి వీడి రాముకొరకు
జనుట గని రావణుడు కడు సంతసమున
మిగులు పని పూర్తి యొనరింప తగిన రీతి
కడువడిగ మార్గమును బట్టి కదలినాడు. 174

## రావణుడు సీత నపహరించుట

రూపమును మార్చి సన్యాసి రూపమూని
జడలు_జపమాల _ మేన కాషాయ వల్క
లంబుల ధరించి పాదుకా లంబనమున
కపట యతి వేషమున దశకంఠు డపుడు. 175

'హర హరా!' యంచు పలుకుచు నతి వినమ్ర
భావ వర్తన మొప్పార భవ్యమైన
వేద ఘోషబు సలుపుచు విపిన మదర
సీత వసియించు వటకుటి జేరెనపుడు. 176

గౌతమీ వేగ మొక్కింత కలబెంది
మందమయె రావణుని వనమందు గనుచు
పర్ణములు కదలించవు పాదపములు
కడుభయమ్మున వీవదు గాలి కూడ. 177

హృదయ సంక్షోభమున శాంతి హీనమైన
మొగముతో రాము [illegible]కై దిగులుపడుచు
వట కుటీ మధ్యమున శోక వహ్ని మునుగు
జనక సుత గాంచె రాక్షస చక్రవర్తి. 178

అరయ షోడశ కళల నయ్యుజుడు మేలి
బంగరు పస చాతుర్యాన రంగరించి
రచన మొనరించి యుండు — యీ రమణిమూర్తి
గాక మెయి సోయగ మ్మిట్టి కాంతి గనునె? 179

అనుచు తర్కించి "హర హరా' యనుచు — పర్ణ
శాల ముఖమున నిలచి — విశాల నేత్రి!
సకల భోగమ్ములను వీడి శంభు గూర్చి
తపము చేసెడి యెక పూజ్య తాపసుండ ! 180

భిక్షకై వచ్చినాడ — నీ ప్రియుని గూర్చి
దిగులు పడబోకు శుభమగు నిసురు బోడి!
అనుచు కపట తాపసుడగు అసుడు డెంతొ
మౌని వర తల్లజుని పోల్కి మాటలాడె. 181

అతి పరధ్యానమున నున్న అతివ సీత
జరిగి నట్టి సంఘటనను జ్ఞప్తి గొనుచు
దుఃఖ ముప్పొంగ కన్నీట డోగుచుండి
మోము నరచేత వాల్చి యే మోము మదిని. 182

చింత చేయుచు గానని స్థితిని నుండ
పంచశరు వాత బడిన కపటి యుగుముని
రాగభోగాలు లేని విరాగి పగిది
తాత్త్వికార్థ ప్రధాన మంత్రములు జదివె. 183

సీత విని వ్యాకులత జెంది చిత్తమంత
కుదురు పరచుక సన్యాసి కెదుడు వచ్చి
గాంచి సత్కృతు. లొసగ నాకపట యుక్తియు
మోహ పరవశతను ముద మొందె పలికె. 184

వనిత! యెవ్వారి దాన వీ వనము నందు
నొంటరిగ నుంటి విధి జూడ నొప్పు గాదు.
లేరె యెవ్వారు నీకు? నీవార లేరి?
అనగ బడులుగ బల్కె నయ్యవని జాత. 185

జనకజను సీత యను పేర మనెడు దాన
దశరథుని కోడలిని నేను - ధరణి పొగడ
తండ్రి బాసను చెల్లింప ధర్మ నిరతి
వనుల వసియించు రాముని వనిత ననియె. 186

అరయు పండ్రెండు వత్సరా లత్తయింట
అనఘ! ఘన సుఖ భోగమ్ము లనుభవించి
చింతయే లేని కామ రొప్పు జీవితమును
గడపితిని యంత చిన్న త్త కారణమున 187

రాజ్య భారము చేగొను రామభర్త
ఘోర వనముల పాలాయె; కుమతి కైక
కారణమ్మున_ నతనితో గోరినేను
మరది సౌమిత్రి వచ్చినా మనుచు! బలికి 188

వనము లతి ఘోరమైనవే యైన _ మునుల
వాస మొనరించు చోటులు - వన మృగాల
మాయ మర్మము లేని యమాయ కంపు
తళుకు చూపుల నిన్నాళ్లు దరలె ఘనుడ! 189

రాజకుల భూషణుండైన రామ విభుడు
మేరు గంభీర ధీరుడు దారగుణుడు
సింహ సంహననుడు శత సింహబలుడు
సకల లోక నుతుడు విశాల యశుడు. 190

విల్లు చే బూని నిలచిన-వేల్పు గముల
శక్తిగల వీరు లా రామచంద్రు నెదిరి
భుజ బలాటోప మొప్పగా పోరు సల్పి
జయము గనలేరు! నిజము! ముజ్జగములందు 191

అన్ని గుణముల నన్న కీడైన వాడు
శత్రు దుర్భేద్యు డకలంక శక్తి పరుడు
మరది లక్ష్మణు డత డసామాన్య మూర్తి
ఇది మదీయ చరిత్ర ఋషీశ్వరుండ. 192

యతివరా! నీవు నొంటి నియ్యడవి యందు
సంచరించుట గన ఘన సాహసమ్మె!
కొంత దడయుము - ఖాద్యముల్ గూర్చు కొనుచు
అరుగు దెంచును మత్పతి యనుజు తోడ. 193

వారి యాతిథ్యమును గొని భూరి తృప్తి
నేగెదవు గాక నవల యద్ధేచ్ఛ నీవు
అనుచు ప్రార్థించి జానకి యతని చరిత
మపుడు దెలుపగ గోర-నా కపట యతియు. 194

అతివ! విను-నేను దివిజ కులాంత కుండ
నామమున రావణుండ - నా నగరు లంక
వనిత! నీ యపురూప లావణ్యము విని
నిన్ను గొని పోవగా వచ్చి యున్న వాడ. 195

ఎదిరి భంజించి దిక్కుల నేలుచుంటి
లలన! నను గెల్వ దక్షు డియ్యిలను లేడు
అష్ట దిక్పాలు రాదిగా నమరు లెల్ల
బానిసలు నాకు-జగదేక ప్రభుడ నేను. 196

గాలి తీవ్రత తలిరాకు గదలి నట్లు
బెదరు సుకుమార హృదయలు సుదతు లరయ
కాన నీ కిట్టి వనవాస కర్మ మేల?
నన్ను చేగొన్న నీ కబ్బు నాక సుఖము. 197

రమ్మ! నా పట్టమహిషివి గమ్మ! నిన్ను
పూల యందుంచి పూజింతు పూవుబోడి!
బడుగు జడదారి రాముని కడ - వచింప
కష్టములు దక్క నన్యము గాంచ లేవు. 198

వలచి వచ్చితి - సౌందర్య వతివి నీవు
అవని సకలము పాలించు నట్టి వాడ,
అతను సామ్రాజ్య రాజ్ఞివై వ్యథలు వీడి
రమ్ము! రమ్మని -తత్స్వమీ వమ్మ చేరె. 199

మోసగాడని యెరిగిన ముగుద సీత
గుండె పగిలెను - యెదురుగా కొండ వోలె
తలలు పదిగల్గు రాక్షసాధముడు నిల్వ
కళ్లు బైరులు గ్రమ్మ మూర్ఛల్లె నామె. 200

ఆలసింపక నప్పు డయ్యసుర విభుడు
పృథ్విజ పడిన స్థలమును పెల్లగించి
రథమును పై బెట్టి వేవేగ లంక జేర
పయన మాయెను నాకాశ పథము వెంట. 201

రథము జనుచుండ తెలివొంది రమణి సీత
రామ! హారామ! లక్ష్మణా! రామ! యనెడి
ఆర్త రవములు మార్మోగ - నడవి యెల్ల
దద్దరిల్లగ విలపించి-దనుజు జూచి. 202

ఓరి! మనుజాశనా! దెల్వి మీరి – మిగుల
సంత సిల్లగ బోకు–నీచావు ఘడియ
చేరువైనది – గాకున్న చెనటి! యేల
నీతి మాలిన యీ బుద్ధి నీకు కలుగు? 203

కలుష బుద్ధివి – జడుడవు – కర్కశుడవు
పరమ దుర్మార్గుడవు – నీదు పాప వహ్ని
కుటిల! చెలరేగి రాక్షస కులము నెల్ల
దగ్ధ మొనరించు సమయము – దాపురించె. 204

రావణుని రథ మందున్న రామ పత్ని
తనదు దురవస్థ దలచుక దద్దరిలుచు
మిగుల బొగులుచు నున్మత్త మగువ భంగి
బిట్టు విలపించి విలపించి యిట్టు లనియె. 205

కామ రూపుడు – రాక్షస ఖలుడు – కుమతి
నన్ను గొంపోవు చుండె–నా నాథు తోడ
విన్నవింపుడు నాదగు విషయ మెల్ల
గడగి దయగొని దేవతా గణము లార! 206

ఏది సీతని వెదకు నా నాథు తోడ
కరుణ వన దేవతా ముఖ్య గణములార!
కఠిన దైత్యు పాల్పడిన నా గాథ తెలిపి
నన్ను గాపాడగా బంపు డున్న రీతి. 207

అనుచు ఎలుగెత్తి విలపించు నవని తనయ
ఆర్త నాదము చెలరేగి అడవి యెల్ల
నల్లుకొనె తీవ్రమగుచు–సహాయ పడగ
రారు – రావణు భయమున రమణి కడకు. 208

మూగ వోయెను నింగి - తా మూర్ఛ మునిగె
నవని సర్వము - చూడగా అడవి గూడ
కలత మునిగెను - మృగముల కనులు తడిసె
క్రూర దనుజుడు చేసిన ఘోరమునకు. 209

# జటాయువు

అటుల విలపించు జానకి యార్తి వినిన
పక్షిరాజు జటాయువు త్వరిత గతిని
నిదుర మేల్కాంచి దీక్షగా రథము జూచి
రావణుని బంధమున నేడ్చు రమణి గాంచె. 210

పరమ ధార్మికు డుపకారి పక్షిరాజు
అబల బాధ నివారింప సబలు డగుచు
అడ్డగించెను రావణు నా క్షణాన
క్రుద్ధుడై వానితో బోర సిద్ధపడుచు. 211

యామినీచర! యిది యేమి న్యాయమయ్య!
బలిమి గొంపోవుచున్నావు పరుని సతిని
పుణ్య పాపము లెంచి యీ పుణ్య వతిని
శీఘ్రమే వీడు మటు నీవు సేయ కున్న. 212

ఈ జటాయువు సంగతి నెరుగ గలవు!
భుజ బలంబున నీ వంటి బుద్ధి హీను
లెందరికొ బుద్ధి గరపితి - నెరుగవేమొ?
చెరుపగా రాదు నితరుల స్త్రీల నెపుడు. 213

పరుల భార్యలు ధర తల్లి వంటి వారు
వారి జెరబట్టు వారెంత వార లైన
నిహ పరమ్ములకుం జెడి - హీన గతుల
నంది నరకాన కుములుదు రనవతరము. 214

అదియునుం గాక; దెలిసె యీ అతివ నాదు
ప్రాణ మిత్రుడు దశరథ ప్రభుని సుతుని
సాధ్వి యంచును శోకించు సమయమందు
మదిని ధర్మము దలచి యిమ్మగువ విడుము. 215

రామచంద్రుడు నీ కపరాధ మెపుడు
సలిపి యెరుగడు _ యాతని శక్తియుక్తు
లెరుగ వైతివి _ ముజ్జగా లెరుగు నసుర!
అతి పరాక్రమ భుజ బలోద్ధతు డతండు. 216

అట్టి రిపు గజ కేసరి యైన ఘనున
కెగ్గు దలపెట్టితివి - చేటు నెంచ వైతి
వకట! నీ కారణమ్మున నసుర కులము
సర్వ విధ్వంస మై పోవు జగతియందు. 217

రాము నెదిరించి గెలువ మీ రాక్షసులకు
వశము కాదని ఋజువాయె వసుధ నెపుడొ?
సమతమున దెబ్బ్బిన ఖర దూషణులె సాక్షి!
వేరె వచియింప నేల నో క్రూర దనుజ. 218

అనుచు వచియించి బెదరించు నా _ విహంగ
పతి _ విజృంభణ మణచగ _ బాణ వితతి
నతని నిర్జింప మదినెంచి_యమర వైరి
విల్లు చేబూని విశిఖముల్ విడచి నంత. 219

కుపితుడై పక్షి రాజతీ ఘోర గతి _ ని
శిత నఖమ్ముల దశకంఠు శిరము దన్న
పది శిరమ్ములు గాయమై వరద కారు
రుధిర మొడ లెల్ల నిండ తా రోష మంది. 220

తీవ్ర శరములు ధనువున త్రివిచి విడువ
ఖగపతియు లెక్క సేయక కడు రయాన
వాని దూలించి యుగ్రుడై వంత మూని
రథము హయముల గూల్చి సారథిని జంపె. 221

పక్షిపతి సాహసము గని ప్రమద మెసగ
బొగడి రా వన దేవతల్ ద్విగుణితముగ.
విరథు డయ్యును తన పట్టు విడువ కుండ
నసురు డొక మాయ రథమున నవనిజ నిడి. 222

గగన తలమున కెగసి లంకా పురమ్ము
జనెడు పథమును బట్టి వే జనుచు నుండ
నిలుము నిలుమంచు పక్షియు నింగి కెగసి
పక్ష విక్షేప జాత ప్రభంజనమున. 223

అతని నుడివెట్టి - పయనము నడ్డగించి
పిడుగు వంటి భాషణముల భీతి గలుగ
దిశలు మార్మోగ రాముని దివ్య మహిమ
సాహసో పేత భుజ బల శక్తి దెలిపె. 224

పశు బలమ్మున జడుడవై పరమ మూర్ఖ!
పరుగిడుదు వీవు శ్రీరాము భార్య బట్టి
కొసరి నీనాశనము నీవె కోరుకొనుచు
చేటెరుంగక నుంటి వో చెనటి దనుజ! 225

బంటు తనమున రఘురాము డింట లేని
సమయ మారసి దొంగవై జనక సుతను
ముచ్చ లించితి విక నీకు మూడె చావు
బ్రతుక నిచ్చునె నినుః రామభద్రు డిలను. 226

ధరణి నెంతటి వాడైన ధర్మ మెడరి
చెనటి బుద్ధిని దుష్కర్మ చేయ–ఫలము
ననుభవింపక తప్పదు–నగ్ని నంట
ఆదరించునె? దహియించు నాక్షణాన. 227

ఇపుడు నీవాచరించిన యీ యకర్మ
వీర చరితము గాదు; నీతీరు జూచి
చోర చరిత పథమ్మంచు చోద్యమంది
వీరు లెవరు నిన్ మెచ్చరు విబుధ వైరి 228

తీవ్ర కుపితాత్ముడై పల్కి దీప్తి జెంది
మూపుపై వ్రాలి గజమును నాపగల్గు
మావటీని వలె విహగ మహీపు డపుడు
వ్రణము లొనరింప జూచి రావణుడు నంత. 229

పృథ్వి సుత సీత నప్పుడు పుడమి డించి
విసిగి లయ కాల కాలుడై ముసలి పక్షి
మిడిసి పడుచున్న దంచును మీది కురికి
బాహు యుద్ధంబు సలుప నప్పక్షి కులుడు. 230

రావణుని గారియంబెట్ట – రాక్షసుండు
వాడి ఖడ్గమ్ముతో పక్షి పతిని బట్టి
పలు విధమ్ముల గొట్టుచు బాధ పెట్టి
పక్షములు డుల్చి ఖండించె పాదములను. 231

పక్షి కులుడు జటాయువు భగ్నమైన
పక్షముల తోడ మేనున పారు రక్త
ధార లందున పడి నిజ తనువు దడియ
హా! యటంచును మూర్ఛిల్లె నవని వ్రాలి. 232

అవ్విధంబున తన శక్తి నంత-ధార
వోసి ప్రాణమ్ము లర్పించ నుర్వి వ్రాలి
మూర్ఛ మునిగిన పక్షీంద్రు మోము జూచి
జనక సుత శోక వార్నిధి మునిగె మిగుల. 233

అనఘు డీతడు నను గాచు పనిని బూని
దనుజు ఖడ్గాన నిహతుడై ధరణి బడియె.
పక్షి కులపతి ఋణము నేపగిది దీర్ప
నగును నాకని జానకి బొగిలె మిగుల. 234

చింత నొందుచు నాపక్షి స్థితిని జూచి
సురలు మునివర్యులును పలు తెరగు లగుచు
తలచి రాత్మల యందున దైత్య విభుడు
ధ్వంస మగుకాల మిలపైన వచ్చె ననుచు. 235

## జానకి నగల మూటను జార విడచుట

ముసలి పక్షి జటాయువు మూర్ఛ మునిగి
ధరణిపై వ్రాలినంతట దనుజ విభుడు
ఇంక తన్నడ్డగించు వారెవ్వ రనుచు
పయన మొనరించుటకు సిద్ధ మయిన తరిని 236

భర్తను మరది లక్ష్మణు బహు విధాల
జీరి విలపించు సీతను శీఘ్రముగను
బలిమి జేపట్టి నాకాశ పధమం దందు
సత్వర మ్మేగుచుండెడి సమయమందు. 237

సీత తన నగలను చీర చెరగు నందు
మూటగా గట్టి పుడమి నా మూట విడచె
తనకొరకు చుచూచున్న రాముడు నకు కొంత
తనదు సంగతియు దెలియు ననెడి యాస. 238

అటుల విడచిన ఆ మూట అవని నొక్క
కొండపై నున్న కోతుల గుంపు మధ్య
బడిన - దానిని తమచేని కడకు జేర్చి
నింగిపై తమ చూపులు నిల్పి జూడ. 239

ఎవరు గన్పింపరై రార్త రవము మాత్ర
మవని కంపింప విన్పించి యంతలోనె
సమసిపోయెను; తీవ్ర నిశ్శబ్ద మలము
కొనియె - వానరు లాశ్చర్య మనుచు జనిరి. 240

అంత దక్షిణ దెసబట్టి అన్నిశాటు
డరిగి నదుల - కాననముల గిరుల నెల్ల
గడచి జలనిధి నాటి లంకాపురమ్ము
శీఘ్ర గతి చేరుకొనియెను సీత తోడ. 241

## రావణుండు అంతఃపురము జేరుట

లంకకుం జేరి నంతట రావణుండు
అంతిపురి జొచ్చి వైదేహి నచటడించి
దనుజ వనితల రావించి దర్ప మొప్ప
పలికె నీ రీతి వారితో ప్రభుత మెరయ. 242

అతుల సుకుమారి - సౌందర్యవతి - సురూప
సౌమ్యవతి యైన యీ నాతి సకల భువన
వనితలకు నాణి ముత్యంపు వన్నెగాంచె
స్త్రీ శిరోమణి యనదగు చిగురుబోడి. 243

నాకు నారవ ప్రాణమౌ నాతి యీమె
గాన మీరెల్ల ఘనముగా గౌరవించి
ప్రీతి దొలుకాడ - నీమెకు ప్రియము గలుగ
సంచరించు డటంచు శాసన మొనర్చె. 244

పలపు చిలుకకు ఖేదమ్ము గలుగ జేయు
ఖలుల దండింతు నే కనికరము వీడి,
చింతలను బాప మీరిమె చిత్త మరసి
మసల గలిగినచో బహుమాన మిత్తు. 245

ప్రియము పలుకుచు నీమెకు ప్రియము గరపి
బ్రతుకుపై నాస గల్గించి భయము బాపి
ఆదరము జూపి మరలింపు డామె మనసు
నా పయిని ప్రేమ గలిగించి నయము మీర. 246

# రావణుండు తన వైభవముం సీతకు దెలుపుట.

జానకిని గాంచి - చిరునవ్వు జాలు వార్చి
తనకు గల భోగ భాగ్యాది దర్ప మెల్ల
ఆమె కెరిగింప నెంచి న య్యసుర నాధు
డిటుల వచియించె నవ్వా డయ్యింతి వినగ. 247

బాల! గత జన్మ కృతమైన పాప మెల్ల
దీరిపోయెను వనవాస దీక్ష తోడ,
పొలతిరో! యింక నీ పూర్వ పుణ్యగత-ఫ
లంబు ననుభవింతువుగాక! లంక యందు. 248

త్రిభువనమ్ముల శాసించి దీప్తి నెగడు
మమ్ము బోల్లింక దాసులై మడుగు లొత్తి
సేవ చేయంగ రాజ్యాభిషిక్త వగుచు
నన్ను శాసించి సుఖియింపు నలిన నయన. 249

ఆస విడువుము రాముని యందు - నింక
కడలి దాటి యా నరుడు లంకాపురమ్ము
జేరుటది కల్ల! యొకవేళ జేరుకొన్న
బ్రతుక జాలడు నా ప్రతాపాగ్ని సోకి. 250

చొరగ వెఱతురు నమరు లీ పురము నెపుడు !
నరుడు - దుర్బలుడగు రాము డరయ నెటుల
జొచ్చు నీ లంక ? వెరపేల ! మచ్చెకంటి
ఏలు కొమ్మింక నీ రాజ్య మింత నుండి. 251

మానవుం డల్ప తేజుండు మతి విహీను
డట్టి రాముని యాసించి అలసి పోవ
దగదు నీ యట్టి పరమ సౌందర్యవతికి
గాన నన్ను ప్రేమింపుము ! గనుము సిరులు. 252

సురల నెల్ల జయించి కిన్నరుల గూల్చి
యక్ష గంధర్వ నాగ వీరాది దేవ
గణములను గెల్చి యష్ట దిక్పతుల బట్టి
బానిసల నొనర్చిన జగత్పతిని నేను. 253

నిఖిల లోకములందుండు నిధులవన్ని
జేరె లంకకు నేనాడొ దారిలేక
ధనదు నోడించి పుష్పకమును గ్రహించి
విహరణము సేయు చున్నాడ విశ్వమెల్ల. 254

రమ్ము ! చూడుము ! నాదు భాగ్యమ్మటంచు
పిలువగా సీత వానికి విలువ నీక
నీచ ! నీదగు వైశ్వర్య నిధులవన్ని
రాము కొనగోటికిని సరి రావటంచు. 255

బింకమున వల్కినట్టి యప్పంకజాక్షి
పల్కులకు కోపగించక - పరమ శాంత
చిత్తు డలరార - మోహము చిందులేయ
రసిక హృదయుడై యిటు బల్కె రావణుండు. 256

లలన ! కోపాన - నెఱ్ఱని నళిన మటుల
ముద్దు లొలికెడు నీ మోము మోహ జలధి
మునుగ జేసెను ! నీ మెయి కనిన కొలది
చిత్త మంత నీ యందు వసింప దొడగె. 257

జలక మాడుము పన్నీట - చందనమ్ము
బూసుకొని - గోముగా - దివ్యభూషణములు
దాల్చి మీ పుష్పకమ్మున దర్ప మెఁప్ప
తిరిగి వత్తము రమ్మనె సుర విరోధి. 258

కాంత ! ఆ బ్రహ్మ నా కొరకయి సృజించె
నిన్ను భువి పైన - దలవ నో సన్నుతాంగి
దాసుడను ! నీకు వశ్యుడ - తరుణి నన్ను
బ్రోవుమని మ్రొక్కులిడె నామె ముందు వ్రాలి. 259

నీకు మ్రొక్కితి నని నన్ను నీచు పగిది
చూడగా బోకు - త్రిభువన సుందరాంగి !
చకిత మృగనేత్రి ! రాక్షస చక్రవర్తి
గోరగా రారె ! ముల్లోక నారు లిటకు. 260

ఇలను ఇంద్రాదు లెవనికై నెపుడు భజన
సలుపుదురొ - యట్టి దానవ చక్రవర్తి
వేడుకొన మూర్ఖ చిత్తవై వినక - జనక
తనయ యవివేకి యైన దంచనరె జనులు. 261

## సీత రావణుని నిరసించుట

అనుచు బహు విధముల రావణాధముండు
జనక తనయను తనదు సొమ్మని తలంచి
దర్పమున బల్కగా విని ధరణి పుత్రి
తృణ సదృశునిగ రావణు గనుచు బల్కె. 262

ఓరి నీచ ! శ్రీరాము మహోగ్ర వేగ
శరములకు జిక్కి బ్రతుకంగ జాల వనుచు
కోపమును శోకమును పెను గొనగ ననియె
రావణుని జూచి హేయంపు భావ మొప్ప. 263

అతుల బలసాహసుడు రాము డనగ వినుము
ప్రబల మంత్ర సిద్ధు లతని బాణ తతులు
అతనితో వైర మూని నియ్యవని నెటుల
బ్రతుకగల వీవు ధైర్యాన బట్ట గట్టి. 264

తార్క్ష్యు డుగ్రంపు సర్పము ద్రుచ్చు నటుల
భీమమౌ రాము బాణము - భీతి నీవు
పారినను నిన్ను వీడక బట్టి చీల్చు
సత్యమిది రావణా ! నీవు చత్తు వింక. 265

బ్రతుక నెంచితి వేని యా ప్రభుని కడకు
సన్ను గొంపోయి వినయాన నతు లొనర్చి
అప్పగించుచు నెదుట సాష్టాంగ పడుచు
శరణు వేడుకొమ్ము టైన చావు దప్పు. 266

శరణు గోర శత్రువుపైన దరికి జేర్చి
ప్రీతి రక్షించు త్రిభువన ప్రియు డతండు
ఆత డల్గిన చంద్రార్కు లాకసమున
సంచరింపగ లేరు రాక్షస ! యెరుంగు. 267

జలనిధిని దాట లేదంచు దలచి నీవు
విఱ్ఱవీగుట నిడగు వెఱ్ఱి గాక
[illegible]లగి రాముండె యులిగిన జలధి యందు
[illegible] [illegible]ందు[illegible] ! యుండవే జగతి నీవు. 268

కాల మాసన్నమౌ తరి కర్మ బట్టి
హాని చేకూరు ప్రాణి కీ అవని యుందు
కాల వశుడౌచు తా జేయు కర్మలందు
కీడు మేలుల నా ప్రాణి చూడ బోడు. 269

అట్టి కాలమ్ము సంప్రాప్త మయ్యె నీకు
దనుజ కులనాశ! నన్ను దెచ్చిన కతాన
చెట్టు చెడు కాలమందు నా చెట్టునకును
కుక్క మూతి పిందెలు బుట్టు నిక్కువమ్ము! 270

అమల మానసమున రాజ హంస గూడి
సతము క్రీడించు హంసికి సమ్మతమ్మె
కంటకావృత కల్మష గర్తమైన
కొలను కొంగతో విహరింప క్రూరదనుజ! 271

క్రోధ ముప్పొంగ నీరీతి రోషమునను
దారుణమ్మైన మాటల దనుజు నాతి
కనుల నీరము లుప్పొంగి క్రమ్ము కొనిన
ఓర్పు నశియించి మాటాడ కూరకొనియె. 272

చెవులకును ములుక్కు లట్టుల సీత పలుక్కు
పరుష భాషణముల మది బాధ నంది
అమిత కోపము రేగ తామ్రాక్షు డగుచు
దనుజ వనితల జూచి రావణుడు పలికె. 273

వినయమున నీయమ నశోక వనమున నిడి
యేమరక — ప్రేమ నాయందు నినుమడింప
సరస వచనాల నెయ్యంపు మరులు కలుగ
కార్య మెరిగి వర్తింపుడీ — కాంతలార! 274

అనుచు నానతి నిడ రాక్షసాంగనలును
సకల ఫల పుష్ప భరితమై - సకల జంతు
నిలయమై యొప్పి మోదమ్ము కలుగ జేయు
నా యశోకమ్ము జేర్చి రా యవని సుతను. 275

భయము శోకము హృదయాన పాదు కొనగ
అడవి పులులకు జిక్కిన హరిణి కరణి
జనక పుత్రికయు నశోక వనము నందు
శోక జలనిధి మగ్నమై సురుగు చుండె. 276

## రాముడు అపశకునమ్ముల గని చింతించుట

కపట మృగరూపు డతిశయ కల్మషాత్ము
డైన మారీచునిం దున్మి అడవి త్రోవ
వేగ మరుదెంచు రాముని వీనులదర
వినగనయె నక్క కూతలు విపిన మందు. 227

అకట! జంబుక ధ్వానము లరయ నశుభ
సూచకమండ్రు పెద్దలు - చూడ నిది - య
మంగళమ్మయి - నా ప్రియ మహితనూజ
చిక్కులం జిక్కె నని మది చెప్పుచుండె. 278

బాణహతి చేత నేలపై పడిన రాక్ష
సాధముండు మత్కంఠము ననుకరించి
అడవి మా ర్మోగ లక్ష్మణా! అవనిజా! - య
నెడు రవము చేటు చేకూర్చు నిజము నరయ. 279

ఘోర మగు దుర్నిమిత్తముల్ దారియందు
దోచుచుండెడి నామది తూగులాడ
లక్ష్మణుడు - సీత - పర్ణశాలాంతరమున
నెట్టు లుంటిరో యని మది నెంచు కొంచు! 280

తడబడెడు నడుగు లిడుచు తత్తరపడున
తిరిగి చనుదెంచు రాముండు – తేజ ముడిగి
తనను కలియుగా వచ్చెడి తమ్ముని గని
విభ్రమ విషాదముల నందె వివిధ గతుల. 281

మాట తడబడ తమ్ముడా! మహి తనూజ
నొంటరిగ ఘోర వనమందు నొకతె నుంచి
ఇటుల రాదగునే నీవు? ఏమి యగునొ?
దక్కునే సీత మనకింక? ధరణి మీద. 282

రాక్షసుల మాయ గాక యీ రామ బాణ
హతుడు హా! లక్ష్మణా! సీత యనగ నేల?
అరయు నిది రాక్షసులు సీత నపహరింప
చేసినట్టి మాయగ దోచు చిత్తమందు. 283

అయ్యొ! పలు దుర్నిమిత్తము లన్ని దెసల
దోచె భీకర వైఖరి జూచుచుండ
ఘూక కాకాది జంబుక క్రూర రవము
లడవి పలుమార్లు వినిపించు సనిరా – వినుచు. 284

అనఘ! యీ రాక్షసులు మాయ నవని తనయ
నపహరించియే యుండు ననుచు దోచు
అదరుచున్నది యెడమ కన్నకట! ఇపుడు
జనకజెట్టుల నున్నదొ పర్ణశాల యుండు. 285

ఏల లక్ష్మణ, చెపుమ! నీ విట్లు సీత
నొంటిగా వీడి యేతెంచి యుంటి వంచు
బహుళ శోకమ్ముతో రామభద్రుడడుగ
కనుల నీ రొల్క సౌమిత్రి యనియె నిటుల. 286

అన్న! యేమని దెల్పుదు? నన్ను వదినె
అతిగ శంకించి పరుషము లాడు కతన
చేయునది లేక యిటకు వచ్చితిని నేను
నాకు నీ విడినట్టి యానతిని మీరి. 287

లక్ష్మణుని మది నెరింగిన రామ విభుడు
కలత నొందిన మది – శీఘ్ర గతిని బూని
పర్ణశాలను జేరి తత్ప్రాంత మెల్ల
శూన్యమై సీత లేకుంట జూచి మిగుల 288

కలవరము జెంది దుఃఖంపు జలధి మునిగి
తీవ్ర శోకాత్ముడై కడు దీను డగుచు
సీత కొరకయి రాముండు–సీత! సీత!
అనుచు బిలుచుచు పలు మూలలందు వెదకె. 289

జనక సుత నెందు గానక మనసు చెదరి
గుండె చెరువయి శోకాన కుములు చున్న
పురుష సింహుని రాముని అరసి నంత
కఠిన పాషాణములు గూడ కరగి పోవు. 290

శోక విహ్వలుడై నిల్చు చోటు నందె
మొదలు తెగి పృథ్వి వ్రాలిన కదళి పోలె
నేలపై రామచంద్రుడు గూలె; నంత
లక్ష్మణుడు చింత మునిగెను రాముని గని. 291

కొంత వడి కంత రాముండు కోలు కొనుచు
మూర్ఛ దేర – లక్ష్మణు డప్డు మ్రోల నిలచి
ధైర్య మొసగెడు వాక్యాలు తగ వచింప
రాము డపుడు లక్ష్మణుని జూచి ప్రేమ పొంగ. 292

అమరపతి రాజ్యమైనను అవని తనయు
కాన రాకున్న నాకింపు కాదు సుంత
అనఘ చారిత్ర! నా ప్రాణమైన సీత
కాన రాకుండ నేమాయె ఘనుడ, చెపుమ. 293

అనుచు సంకట పడుచున్న అన్నను గని
ఘనుడు సౌమిత్రియును చాల కలత జెంది
హృదయ వేదన యత్నాన నదుము కొంచు
పలికె నీరీతి శ్రీరామభద్రు గాంచి. 294

ఏది నీ కసాధ్యము భువి? నెందునైన
విల్లు చేబూనుచో జగ మెల్ల వణకు
అన్న! వేదన విడనాడి అతివ వెదుక
రమ్ము – వెదకుద మీ యరణ్యమ్ము నెల్ల. 295

అనుచు తమ్మూరడించెడు ననుజు మాట
వినుచు శోకము దిగమ్రింగి ఇన కులుండు
తత్క్షణమె సీత వెదకెడు దీక్షబూని
గదలె – తమ్ముడు తనతోడ గదలి రాగ. 296

తరణి కులుడంత సామాన్య నరుని వోలె
కలత జెందుచు బాష్పముల్ కనుల జార
చెట్టులను పుట్టలను గూడ చేరి అడిగె
చెప్పు డేయెడ నున్నదో సీత యనుచు. 297

ప్రజల కతి మోదమును గూర్చు ప్రియ రసాల
సాలమా! నన్ను కరుణింప జాల వొక్కొ?
జనక రాట్పుత్రి యేగిన జాడ దెలిపి
నన్ను ధన్యుని జేసి పుణ్యమును గొనుము. 298

మాలతీ జాజి పున్నాగ మల్లి కాది
సకల వనలత లార! ఓ సదయులార!
మీరె హృదయము సీతకు – మీర లామె
నెందు నయిన జూచిన వచియింపు డమ్మ! 299

మంద మారుతమా! సీత మమ్ము వీడి
యెచట గనలుచు నున్నదో యెరుగ జెపుమ!
దీనమయ్యె జీవిత మ్మెల్ల – దిగులు పుట్టి
గుండె ద్రవియించెడిని మంచు కొండవోలె. 300

అమల కమలాకరమ్మున నాట లాడు
రాజ హంసమ! యీ రాము రమణి సీత
యేగి నట్టి జాడను నీవు యెరుగ జెపుమ!
అలిగెనో యేమొ? యెచ్చటి కరిగి నదియొ? 301

వినుడు కీర శారిక లార! పికము లార!
ఏల మౌనము? నా సీత యేగి నట్టి
తెరవు దయగొని నా తోడ దెలుపు డనుచు
అడిగె రాముండు దుఃఖ మహాబ్ధి మునిగి. 302

కినుక వీడి మీరెల్లరు కనికరించి
హృదయ భారము దీర నా యువిద జనిన
మార్గ మెరిగించి కరుణించి మనుపు డంచు
అతి వినమ్రతతో రాము డడిగె నపుడు. 303

సకల పశు పక్షి వన మృగ సంతతులను
జాలి గొలుపగ వేడుచు – జనక తనయ
జాడ దెలియక సామాన్య జానపదుని
వగిచి రాముండు వికలుడై భ్రాంతి జెందె. 304

చెట్లు కరిగి కన్నీళ్లు రాల్చె - మృగ వితతి
కనుల నీలాలు గార్చె - వికార మొందె
పక్షి కులమెల్ల రాముని బాధ గనుచు
గుండె చెరువుగ విలపించె నందరమ్ము. 305

శోకమే రూపమై యొప్పు సూర్య వంశ
దీపకుని గాంచి మృగ పశు ద్విజ గణమ్ము
మూగగా రోదనము చేసె మోము వాల్చి
కనుల కన్నీళ్లు వరదలై పారిపోయె. 306

అచటి గోదావరియు చూడ నమ్మహాత్ము
దుర్దశను గాంచి మిక్కిలి దుఃఖ భరిత
యగుచు నిట్టూర్చె సీతమ్మ యరిగి పట్టి
జాడ తెలుపగ లేక విచార పడుచు. 307

అన్న యున్మత్తుడై యిట్లు లడవి మెలగ
ఖిన్నుడై లక్ష్మణుడు తన అన్న దనిచు
శత్రు తల దన్ను భుజ బలశాలి వీవు
అన్న! దీనత నీవిటు లడల దగునె? 308

చూడు మదె వన్య మృగములు చోద్యమొప్ప
నిన్ను పలుమార్లు జూచుచు నింగి జూచి
దక్షిణాభి ముఖమ్ముగా దరలు చుండె
పరగ మార్గమ్ము సూచించు భావమొప్ప 309

ఆ దెసకు బోయి మనమిపు డవని తనయ
కొరకు గాలింప శుభమని గోచరించు.
అనుటయును దాశరధి గూడ అట్లె తలచి
ముందు గదలెను వెనుక తమ్ముడును గదల. 310

పోవుచుండగ వారికో పూల దండ
గానబడె మార్గ మందున - కంజ నేత్ర
జడను దాల్చిన దదియని జననుతుండు
పోల్చి కొనుచు ఆ దారినే పోవదొడగె. 311

ఎక్క డలికిడి యైన సయ్యిందు వదన
వచ్చినని జూచు రాముండు వాంఛ మీర
చప్పుడెట యైన పిలచెను జానకి యని
వీను లొగ్గి దీక్షగ తాను వినుచు నుండు. 312

అటుల మరి కొంత వడి జనినంత-నచట
జనక సుత - రావణాసుర చరణ చిహ్న
ములును గనుపించె - నట దంరి ముక్కలుగను
విరిగి పడియున్న రథమును వేగ గనిరి. 313

సరసనే యున్న శర చాప శకలము లను
వివిధ మణి హేమ భూషణ వితతి - విరుల
సరుల జారిన పూవులు ధరణి పైన
రాలి పడియుంట జూచిరా రాజ సుతులు. 314

అరయు నెత్తుటి మరకలు నచ్చ టచట
కానుపింపగ రాముండు కలతజెంది
అకట! రక్కసు లిర్వురీ అవని సుతను
పట్టి భక్షించి రను శంక బుట్టె ననియె. 315

చూడ నిర్వురు రాక్షసుల్ సుదతి కొరకు
పెనగు లాడిన విధము ధోచిన దటంచు
చచ్చి పడియున్న సూతుని-ఛత్ర శకల
ములను రాముడు జూపె తమ్మునకు సందుడు. 316

తమ్ముడా! క్రూర మార్గాన దనుజు లరయ
వారిలో వారు సీతకై పోరు సలిపి
చంపి మ్రింగి యుందురు చూడ జనక సుతను
అనుచు విలపింప లక్ష్మణు డన్న జూచి. 317

అన్న! నీయట్టి ఘనులు మహాత్మ లిటుల
క్షణిక దుఃఖము సహింప జాలకున్న
స్వల్ప మతులైన మాయట్టి జనము లెట్లు
తాళ గలరయ్య? ఈ ద్భృశ తాపములకు. 318

అరయ మన వంశ పూర్వులు నమర పతియు
ఆదిగాగల మహసీయు లవని మున్ను
వివిధ గతి దుఃఖములు బొంది వెతలు గరెన?
ఇదియ లోక స్వభావమో యిన కులేశ! 319

జగతికిని వెల్గు లిడుచుండు చంద్రరవుల
కనఘ! గలుగదె అపుడప్పు గ్రహణ భయము.
అఖిల ప్రాణుల కాధారమై చెలంగు
ధరణియును నవ్వ దప్పుడు తల్లడిలదె? 320

సకల శాస్త్రమ్ము లెరిగిన జ్ఞాన మూర్తి
రాము డీగతి విలపింప నేమ నంగ
లాడ ననిరాముతో బల్కి లక్ష్మణుండు
అమిత యత్నాన దుఃఖోపశమము గూర్చె. 321

# రాముడు జటాయువును గాంచుట

ముందునకు బోయి పొదలలో మూల్గు చున్న
రక్త సిక్తాంగుడౌ పక్షిరాజు గాంచి
"పర్వతాకారు డైన యీపక్షి ఖలుడె
అవనిజం జంపి యుండు"నంచాత్మ నెంచి 322

రాము డుగ్రుడై గొనె ధనుర్బాణములను
శరము ధనువున సంధించు సమయ మందు
ప్రాణములు కడ ముట్టిన బాధ తోడ
హీన రవమున పక్షీంద్రు డిట్టు లనియె. 323

రామ! పెరవాడ గాను —నీ రమణి సీత
బలిమి గొంపోవు రావణు ప్రతిఘటించి
యుద్ధ మొనరించి యొనరించి - యిట్లు తుదకు
పక్ష హీనుడనై నేల బడితి నేను. 324

సీత ఆర్త నాదము విని శీఘ్ర గతిని
ముదిమి నెంచక బలమును మోహరించి
పడుచు రావణుతో బోరి - బలము కొలది
రథము విరచి చంపితిని సారథిని గూడ, 325

విల్లు దునుమాడి ధ్వజమును విరచినాడ
ఛత్ర చామరములు చించి శక్తి కొలది
ఎదిరి పోరాడి యలసితి—తుద కతండు
కుటిల గతి నాదు ఱెక్కలు గోసినాడు. 326

ప్రాణములు పిడికిట బట్టి—రఘుకులేశ!
వేచి యున్నాడ నీ కిది విశద పరుప
దశరథుడు నాదు మిత్రుడు ధర్మ మూర్తి
అతని సుతుడవు నాకతి హితుడ వీవు. 327

చలము గొని రావణు డను నిశాటు —డవని
సుతను బలిమిని బట్టి—నే జూచుచుండ
గగన మార్గాన జనియె లంకాపురమ్ము
అనఘ, యిది సత్య మింక నీవరుగు మయ్య. 328

పడిశమును మ్రింగు మీనమ్ము పగిది — రామ!
నీ సతిని ముచ్చిలించిన నీచ దనుజు
డనతి కాలాన నీ బాణ హతిని జచ్చు
కలియుదువు రామ; త్వరగ నీకాంత తోడ. 329

అలకుబేరుని తమ్ము డీ యనిమిషారి
తనయుడా విశ్రవునకని తడబడుచును
క్షాంతి హీనుడై నేమేమొ పలికి పలికి
అసువులను వీడె ఖగరాజు-అంతవారు. 330

ధరణి తలవాల్చి పడిన పతంగ పతిని
జూచి — బహుదుఃఖ మందు ఆ సూర్యకులులు
అకట! మనకయి యితడు ఘోరాజి సలిపి
ప్రాణములు వీడె నని కడు భక్తి మ్రొక్కి. 331

నగర మెక్కడ? వనికి నే నాతి గూడి
వచ్చు టెక్కడ? సీత రావణుని చేత
జిక్కు టెక్కడ? రణమున చిక్కి పక్షి
జీవములు బాయుటది జూడదైవలీల! 332

అనుచు పలుమార్లు దుఃఖించి యిన కులుండు
తమ్ముగని-మన కీతడు తండ్రి సముడు
గాన-ఖగరాజు పుణ్య లోకమును జేర
సత్వరము ధర్మ కర్మలు సలుప వలయు. 333

అనుటయే తడవుగను రామానుజుండు
వలయు పరికరముల జత పరచి నంత
నిర్మలాత్ముడై సంస్కార నియతి జరుపె
పక్షికులు డేగె వైకుంఠ పథము బట్టి. 334

అగ్ని సంస్కార మొనరించి ఆ నృపాల
సుతుడు గోదావరిని జేరి శుద్ధు డగుచు
మంత్ర యుక్తముగా మంచి మనసు కలిగి
సలిల తర్పణ మొనరించె పులుగు పతికి. 335

తండ్రికిని ముఖ్య హితుడయి దనరు నతడు
తండ్రి సముడగు తనకని తలచి మదిని
దహన సంస్కృతి పక్షికి దగిన రీతి
జరిపి రాము డెడద నందె జాల తృప్తి. 336

అవని తనయను గొని యేగు నసుర నతని
నెదిరి – మరణము నకు సుంత బెదరనట్టి.
విహగ నాధుని త్యాగము వినుతి జేసి
అసురు డేగిన దెసకు వారరిగి నారు. 337

రఘు కులాఢ్యులు ధీరులై రమణి వెదుక
భీకరారణ్య దుర్గమ వీధులందు
చేత విల్లమ్ములన్ దాల్చి భీతి లేక
పయనమైనారు దక్షిణా పథము బట్టి. 338

కొంత తడ వేగి నంతట కోస లేశు
లట మతంగాశ్రమము దరి నడవి జొచ్చి
క్రూర మృగరాజి సదలించు కొంచు వేగ
వన పథమ్మున ముందుకు జనిరి వారు. 339

కంట కావృత మగు ద్రోవ గలిగి యుండి
బాటసారులకును జూడ భయద మగుచు
కనులు గానని కటిక చీకటుల యందు
అతి భయంకర ముగ నున్న నడవి అదియు. 340

ఆ వనమ్మున పాతాళ మంటు లోతు
గలుగు గంభీరమగు నొక్క గహ్వరంబు
దాని ముఖమున భీకర దంష్ట్ర తతిని
నలరు దనుజాంగనను వార లరసినారు. 341

వికృతమగు రూపమున భీతి విస్తరిల్ల
క్రకచముల వంటి పండ్లతో గానుపించు
ఉగ్ర నేత్రను - పర్వతోదగ్ర కాయ
నచట గని విస్మయమునంది రంత నసురి. 342

రయమునను వచ్చి శ్రీ రఘురాము చెంత
బరగు లక్ష్మణుం దన బాహు పంజరమున
చేర్చి - బంధించి - అలిగా స్వీకరించి
రతుల దేర్పగ నతని బలాత్కరింప. 343

కుపితుడై శాత ఖడ్గము గొని రయాన
కర్ణ కుచ నాసికలను లక్ష్మణుడు గోయ
ప్రళయ మేఘార్భటుల్ వని చెలగు నటుల
నార్చుచును నేగె దనుజ వనాంతరమ్ము. 344

పిదప సౌమిత్రి రాముని ప్రీతి మ్రొక్కి
అనుజ! నా సవ్య భుజ మిపుడదరు చుండె
చూడ నశుభంబునకు నిది సూచకమ్ము
ఏమి రానున్నదో గదా నింక మీద. 345

## కబంధుడు

అనుచు జనె - వార లాశ్చర్యమున మునుంగ
వనమునంగల చెట్లను - వసుధ - విసరి
కొట్టు - పెనుగాలి చెలరేగి - కోటి పిడుగు
మ్రోతలకు సాటి శబ్దమ్ము మ్రోల వినిరి. 346

కంఠము శిరమ్ము కలసి వక్షమున నమరి
కుక్షి యందున నొక భీకరాక్షి తోడ
పర్వతాకారు డైన కబంధు డనెడి
రాక్షసుని గాంచి రప్పుడా రాజ సుతులు. 347

క్షిప్రముగ రాక్షసుడు యోజన ప్రమాణ
బాహువుల వారి బంధించి – భయము గొలుపు
కంఠ రవమున – 'మీర లిక్కాననమున
కేల వచ్చితి' రన విని యిన కులుండు. 348

సుంత చలియించు లక్ష్మణు చెంత జేర్చి
ధైర్య మొదవించు పలుకుల దగ వచించి
కేల నసి బూని కాలాగ్ని లీల గ్రాల,
జూచి సౌమిత్రి ధైర్యము చూర గొంచు. 349

కేల కరవాలమును బూని శూలి వోలె
లక్ష్మణుడు విక్రమము సూప రాక్షసుండు
ఆకలిం గొన్న శార్దూల మటుల – వారి
మ్రింగగా నోరు దెరువ సుమిత్రి సూతి. 350

అన్నఁగని యనె – వీడు దురాత్మకుండు
త్రిజగముల మ్రింగ గలవాడు - దీర్ఘ దేహు
డాలసించిన మ్రింగునో అన్న! మనల
కినుక గని వీని నింక ముగింప వలయు. 351

అనెడు సౌమిత్రి పలుకులు విని కబంధు
డతుల కోప ప్రపూర్ణుడై **అవని వణక**
ఘోర పాతాళ సమమైన నోరు దెరచి
మ్రింగగా నెంచి వారల మీది కురికె. 352

దనుజు కుడిచేయి రాముండు దునిమె; నంత
ఎడమ చేతిని లక్ష్మణుడేసె - విగత
బాహుడై వాడు భూమిని బడియె - నపుడు
వికృత రూపాన - నమరులు వెరగు పడిరి. 353

నెత్తుటేటిని దేలిన నీరదంబు
భంగి - భీకర మగుచు కబంధు తనువు
భూమి 'గిల గిల' లాడుచు - పుడమి రేని
నెవడు మీరని ప్రశ్నింప - యినకులుండు. 354

తన చరితమెల్ల దెలుపుచు - తరుణి సీత
గాన కిట్లగు దెంచిన కారణమున
చిక్కితిమి నీకు - నికపైన చిత్రమైన
నీ చరిత్ర జెప్పు మన నిశాచరుండు. 355

వికృత రూపము విడనాడి వేగ మపుడు
రుచిర మగు నొక్క గంధర్వ రూపు దాల్చి
పాపరహిత భావమ్మున భక్తి మ్రొక్కి
రామ లక్ష్మణుల కతి నమ్రత దలిర్ప. 356

సజల నయనాలతో తన నిజ చరిత్ర
చెప్పె నిట్టుల - తన దుష్ట చేష్ట లరసి
మును మహేంద్రుడు శపియింప దనుజుడ నయి
తిరుగు చుంటి నీ వనమున తిరుగు లేక 357

మునుల జంపుచు - నిట సాధు జనుల విసుచు
కంట బడు వారి విడువక కఠిన వృత్తి
సంచరించుచు తప్పులు సలిపి సలిపి
పాపములు మూట గట్టుక బ్రతికి నాడ. 358

కంటి నీదయ వలన నా తొంటి రూపు
బహు కృతజ్ఞుడ! నీకు నే పరమ పురుష!
అసుర నిర్మూల నో ద్యోగ మందు సతము
గోరు చున్నాడ జయము చేకూర నీకు. 359

రామ! విను — జానకిని గొని రావణుండు
సమద గర్వాంధ తను సర్వ జగము వణక
భావి నెరుగని — మూర్ఖుడై - ప్రబలి వేగ
లంక ధిశ నేగె నతడు నిశ్శంక వృత్తి. 360

భావి గననయ్యె- నీకింక భద్ర మగును
సూర్య సుతు స్నేహమును బొంది శూరుడవయి
రావణాధము నని గూల్చి- రాక్షసులను
దూల నేతువు - జగతికి మేలు కలుగు. 361

పుడమిని సమాన దుస్థితి బొగులు మీర
లిరువురును పొందు సేయుట యుక్త మగును.
కష్టముల దాటి సుఖము గాంతు — రవల
కార్య సిద్ధియు సమకూడు — కలుగు జయము. 362

అని వచించుచు నతడేగ — నడవి దారి
జనుచు — బహు పుష్ప ఫల తరు సంపదలతొ
సకల జనుల నాకర్షించు సరణి మెరయు
పుణ్య వని నొండు గాంచి రప్పురుష వరులు. 363

# శబరి

అవ్వనమ్మె మతంగ మున్యాశ్రమమ్ము
జాతి వైషమ్యములు వీడి జంతు తతులు
స్నేహ భావాదరము పొంగ చెలగు నచట
నెలమి తిల తండుల న్యాయ మలరు చుండ. 364

చారు భక్తి స్వరూపిణి శబరి యనెడు
నామె బహు కాల మందుండి రాముని కయి
కాచుకొని యుండె – నేనాటి కైన నతడు
తప్పకయె వచ్చు ననియెడి ధైర్య మొప్ప. 365

శబరి యొనరించు తప మెంత శక్తి యుతమొ!
వచ్చె రాముండు తత్సమీపమ్ము నకును
ముదముతో రాము దరికేగి– పదము లంటి
భక్తి యుప్పొంగ- మనసార ప్రస్తుతించె. 366

భక్తి పారవశ్యంబున ప్రణతు లిడెడు
శబరిని గని రాముండు వాత్సల్య మొప్ప
ఆమె యొసగిన ఫలముల నాదరమున
నారగించెను యెంగిలి యైన నతడు. 367

భక్తి తనువెల్ల నిండ శబరియు యెదుట
నిలబడిన యట్టి తన తపః ఫలము గనుచు
కనుల నానంద బాష్ప వాహినులు పార
మనుజ దేవుని పాద పద్మములు కడిగె. 368

దేవ మూర్తివి – రామ! నీ తేజ మెన్న
నవని బ్రహ్మాదులకు నైన నలవి యగునె?
సఫల మయె నాదు జన్మము – సదయ నాకు
లక్షణమ్మగు లోక సంప్రాప్తి కలుగు. 369

ప్రబల మైనట్టి రావణ ప్రముఖ దుష్ట
దనుజ శక్తుల దమమాడి – ధర్మ రక్ష
ణమ్ము సెలకొల్పి భువిని ధర్మమ్ము నిలిపి
జగము కాపాడు దీవని శబరి పలికె. 370

వినయమున నింక బల్కెను వృద్ధ శబరి
రామ! సుగ్రీవుడను కపిరాజు కలడు.
విక్రమోపేత సాహసి - వీరు - డతని
చెలిమి యొనగూర్చు నీకు సు్రశేయ మవని. 371

ఎంత కాలమ్ము నుండియో ఇచట నేను
కాచుకొని యుంటి నీ రాకకై మహాత్మ!
కోర్కె దీరెను - నీ రాక - కొంగు బంగ
రయ్యె - నా పూర్వ తపము ఫలాప్తి గనియె. 372

శక్తి కొలది పార్థించుచు శబరి - రామ
భద్రు పాదములకు కడు భక్తి మొ్రక్కి
ఆత్మ నియమ్ము తోడ యోగాగ్ని జొచ్చి
ముక్తి గనె సర్వ జగములు మోద మంద. 373

రామ లక్ష్మణు లాయమ ప్రేమ నలరి
బాధ నొక్కింత మరచి యవ్వనిని గలుగు
వింతలను జూచుచును కడు వేగ జనిరి
సప్త సాగర హ్రదమున స్నాన మాడి. 374

అచటి వన వీధు లతి మనోహరము లగుచు
సకల సౌందర్య విభవ పుష్కలత జూప
ప్రకృతి శోభల తనివొంది రామ లక్ష్మ
ణు లొక యింత యూరట నంది యలరి జనుచు 375

కమల కుముదాది జలపుష్ప కలిత మగుచు
మత్స్య కూర్మాది జలజంతు మయము నగుచు
విమల జల పూర్ణమై సదా వేడ్క నిడెడు
పరమ సౌందర్య ఖని యగు "పంప" గనిరి. 376

ఆ సరోవర తీరాన నమిత మోద
మొసగు ఫల పుష్ప తరు గంధముల వహించి
పిల్ల గాలులు చలువల ప్రియ మొసంగ
మరచె దుఃఖము రాముండు మనసు నందు. 377

సీతకై వెదకుచు వన సీమలందు
రామచంద్రుడు నొక్కింత శ్రమము మరచి
అనుజు గని బల్కె - లక్ష్మణా! అరయ మనము
ధన్యులము గాదె? - గంటి ముదార మతుల. 378

ఆ అగస్త్యుడు - శరభంగు - డత్రి - శబరి
త్యాగి ఖగరాజు - వీర లుదాత్త యశులు
ఆదరాశయ మధు మూర్తు లమల గుణులు
ధరణి నిరతము పరహితాచరణ మతులు. 379

పరమ మహిమాన్వితములైన వారికథలు
మాటి మాటికి దలచుచు మదిని - వార
లడవి దారుల కడువడి నడచి నడచి
అరసి రెదుటను ఋష్య మూకాచలమ్ము. 380

—[ ० ]—

ఇది శ్రీ గురునాథేశ్వర వరప్రసాద సహజ కవితా సంప్రాప్త
కాశ్యపస గోత్ర- మాపుడూరు వంశ పవిత్ర- పార్వతీ
అనంత రామయ పుత్ర - బుధ జన విధేయ -
రఘురామయ నామధేయ ప్రణీతంబైన
రఘురామ రామాయణము నందు
అరణ్య కాండ సంపూర్ణము.

ఓం

# శ్రీ రఘురామ రామాయణము

శ్రీశు దలచి కృష్ణాశ్రమ సీమ యందు
చింతలను వీడు వడి విలసిల్లి నట్టి
విశ్వ విఖ్యాత! తేన్నేటి విశ్వనాథ!
అవధరింపుము నాదు రామాయణమ్ము.

## కిష్కింధ కాండ

## హనుమద్రామ సమాగమము.

పరమ తేజస్వి రాముండు భార్య సీత
జాడ నరయుచు నారీతి జనుచు జనుచు
కడు శ్రమల కోర్చి ఋష్యమూకాద్రి నికట
మలయ శైల విపిన సీమ మసలు వేళ. 1

పర్వతాగ్రాన నివసించు భానుజుండు
బాణ పాణులై యున్న భూపాల సుతుల
గాంచి భయమంది యయకాల కాలుడైన
వాలి పనుపున వచ్చిన వారటంచు. 2

మది దలంచుచు నటనున్న మంత్రి వరుల
జూచి యనె "మన వనమును జొచ్చి నార
చీరలను దాల్చి శౌర్య విస్ఫార ముఖులు
దివ్య తేజులగను" డంచు దెలిపి మరియు. 3

మౌనివరు తీవ్రతర శాప మహిమ కతన
వాలి రాలేక యిట నను దూల నేయ
వీరలను బంపి యుండునన్ భీత మనము
నన్ను దపియింప జేయుచు నున్న దనియె. 4

భీకరాటవి నిసుమంత భీతి లేక
ఇంట దిరుగాడు నట్టులయ్యైన కులీను
లడవి దిరుగాడ గని విస్మయమ్ము నంది
మదిని యోచించి యనినారు మంత్రులపుడు. 5

ఋక్షకుల భూషణా! యిది ఋష్యమూక
మిందు వసియింప భయములేదెందు నీకు
వాలికయి శంక నీకింక వలదు-వార
లెవ్వరై యుందురో-పంపు మెవరి నైన. 6

అనెడు మంత్రుల బలుకుల కర్క సుతుడు
హనుమ కిట్లనె _ రవి తేజు లైన వార
లెవ్వరో కనుగొని నాకు హితము గూర్చు
మనుచు గోరిన యంత నయ్యనిల జుండు. 7

రూపమును మార్చి-భిక్షుక రూప మూని;
పర్వతాగ్రము డిగ్గి యా భాను కులుల
జేరి-వందన మొనరించి -ధీర మతిని
నర్ఘ్య పాద్యాదికలచే నర్చ లొసగి. 8

వినయ వినమిత దేహుడై అనిల తనయు
డర్క కుల భూషణుల గాంచి _ ఆగమ విధి
మధుర వాగ్వైభవము దోప మాన్య గతిని
కడు మనోజ్ఞమౌ ఆచార క్రమము పూని. 9

పలికెః నార చీరల మాటున నలగి యణగి
భూరి తేజః ప్రపూర్ణ సంస్ఫూర్తి జేసి
వనము వెలుగొంద జేయు నో యనఘు లార!
విక్రమోద్ధతి చూపుల వెలయు మీరు. 10

అరయ రాజర్షులో - గాక నమర వరులొ
తాప సోత్తములో _ లేక దైవ సములొ
ఎవరొ మీరలు? దాక్షిణ్య మింత బూని
తెలుప గోరెద కారుణ్య నిలయు లార! 11

మునుల జుత్తు ముడులు శీర్షములను వెలుగ
మొలక నవ్వుల ప్రకృతినే మురియ జేయు
కరుణ రస మూర్తులగు మిమ్ము గాంచి నంత
భక్తి యుప్పొంగె వినయ భావంబు గలిగి. 12

మునుల వలె నున్న మీరలు మూర్తి గొన్న
వీర రస రూపులై వన వీధి జనుచు
క్రూర మృగరాజి వెరపించు తీరు గనిన
మీరు సామాన్యు లని దోచ దేరి కయిన. 13

అర్క పుత్రుడు సుగ్రీవు డను మహాత్మ
డన్న యా వాలి నిరసింప - నవని నెల్ల
దిరిగి _ యీ ఋష్యమూక భూధరము పైన
వాస మున్నాడు _ మీ సఖ్య మాస జేసి. 14

నన్ను మీ కడ కనుప నే నతి ముదమ్ము
గనుచు చనుదెంచి నాడ - నే వనచరుండ
అర్క తనయుని సచివుడ - నవని నన్ను
అతి ముదమ్మున హనుమంతు డంద్రు జనులు. 15

మూడు లోకాల మూపున మోయు గల్గు
ధీరు లగు మీర లీ విధి ఘోర వనుల
మునుల రూపాన _ విండ్లు నమ్ములను బూని
దిరుగ కారణమును నాకు దెలుపు డనుచు. 16

వినయ వినమిత శీర్షుడై వేడు కొనెడి
తరు చరుని గాంచి దయదాల్చి దాశరథియు
అనుజునిం జూడ — తన యన్న మనము నెరిగి
పలికె లక్ష్మణు డీరీతి పవన జునకు. 17

పరమ భక్తాగ్ర గణ్య - ఓ భాసురాత్మ!
కోసలాధీశు సుతులము — కూర్మి మీర
తండ్రి బాసలు నెరవేర్చు తపము బూని
వనుల మునివృత్తి దిరుగగా వచ్చితి మి. 18

అతడు రాముడు! తమ్ముండ లక్ష్మణుండ!
రాము సతి జనక తనయ రమణి సీత
పొసగ గోదావరీ తీర పుణ్య వనుల
వాస మొనరింప దుష్ట రావణుడు నపుడు. 19

ఇరువురము ఇంట లేకుండు తరుణ మరసి
వంచ నాత్ముడు రావణ వంచకుండు
దొసగు మది నెంచకయె వచ్చి దొంగ రీతి
రమణి సీతను గొని పోయె భ్రమల దవిలి. 20

ఆమె కయి వెదకుచును మేమడవులందు
కలయ దిరుగుచు శబరిని గలసి నాము
ఆమె - సుగ్రీవు మైత్రి మీ కతుల శుభము
నొసగు నని దెల్ప వేగమీ దెసను బట్టి 21

వచ్చినార మీరీతి నివ్వనము నందు
సూర్య పుత్రుని సుగ్రీవు చూచు కొరకు
కాక తాశీయముగ నీవు గలసి నాడ
వెరుగ బలుకుము నీ విధ మిపుడు మాకు. 22

అనిన - వినయము దోప నయ్యిన కులాబ్ధి
చంద్రు లిర్వురి పద పంకజముల కెరగి
వందనము జేసి సుమధుర భాషణాన
కుతుక ముప్పొంగ బలికె మారుతియు నపుడు 23

తపన సుతుడు సుగ్రీవుడన్ కపి రేణ్యు
డన్న చే బాధలంది - ఆ పన్న డగుచు
భద్రతను గోరి ఋష్యమూకాద్రి పైన
తగ వసించెడి - నిట తలదాచు కొనుచు 24

అంజనా దేవి ఘన తప మాచరించి
కనియె నను వాయు దేవుని కరుణ వలన
అర్కజుని మంత్రిగా భువి నలరు వాడ;
'హనుమ' యని బిల్తు రంద రియ్యవని నన్ను. 25

కారణము లేక మనమున కరుణ వీడి
తమ్ము డయిన సుగ్రీవుని తరుణి బట్టి
అతని నావలకును గెంటి ఆగ్రహమున
వాలి పలు బాములను బెట్టి ప్రబలె ననఘ! 26

ఆర్తు డయినాడు సుగ్రీవు డన్న వలన
వైభవము వీడి దీనుడై వనరు చుండె.
అతనితో చెల్మి మీ కిష్టమైన నేను
కారకుడనయి స్నేహ సంఘటన సేతు. 27

రవి కులాలంకృతులు దశరథుని సుతులు
అసమ తేజస్వి రవి సుతు డమిత బలుడు
కలదు మీకును మీకును దెలియ నట్టి
అమల సద్వంశ బాంధవ్య మరయ రామ! 28

వాంఛ నీయము మీ మైత్రి - వసుధ కెంతొ
క్షేమ మొనగూర్చు ననుచును చెప్పె నెడద
భావి ఫలమది సూచన ప్రాయముగను
హృదయమున దోచు నంచు వచింత్రు బుధులు. 29

సమ సమస్యలు గల మీరు సమ్మతించి
సఖ్య మొందిన గలుగును జయము నిజము!
ఆపదలు దీరి కిష్కింధ నాత దేలు;
రాము దేలును కోసల రాజ్య రమను. 30

వలసి నంతటి వానర బలము గలదు
అరయ కిష్కింధ యందు - న య్యవని తనయ
జాడ గాలించి యరయగ జాలు వారు
కలరు వానర గణము లక్షలకు మించి. 31

వాలి కతన సుగ్రీవుడు వాస మున్న
పర్వతము డిగ్గి రాలేడు - భాను వంశ
పూజ్యతము లార - మీ పొందు పొసగ జేయు
దోడు కొని పోదు రండు నా తోడ ననెను. 32

పవన సుతు మాటలకు రాము దవని సుతను
గాంచి నట్టులె ముద మంది - కపి వరేణ్యు
చెలిమి కాంక్షించి - మౌనము జెంది యుండ
వరగ సౌమిత్రి అన్నతో బల్కె నిటుల. 33

అన్న! యీతడు వానరు డైన నేమి?
భాష సంస్కార వంతమై ప్రతిభ నించె
పండితుడు - జ్ఞాని - నిర్మల భక్తు డఖిల
వేద శాస్త్రాల నరసిన విదుని వోలె. 34

మదిని దోచెడి - నితనితో మనము జనుట
యుచిత మగు - గాన మనమిపు డుర్వి ధరము
జేరి - కమలాప్త సుతునితో చెలిమి చేయ
చింత దొలగును శబరి సూచించి నటుల. 35

తమ్ము డటు సూచనము సేయ - సమ్మతమ్మ
రామ భద్రుడు దెలుపగా లక్ష్మణుండు
హర్ష పులకిత హృదయుడై హనుమ వినగ
పలికె సాదరమున లోని బాధ దెలియ. 36

ఏ నరేంద్రుని ధాత్రీశు లెల్ల గొలిచి
గౌరవము నొంది మేలును గాంతు రట్టి
దశరథుని పుత్రు డీ రామ ధరణి ధవుడు
కోరు చున్నాడు సుగ్రీవు కూర్మి నేడు. 37

## రామ సుగ్రీవుల మైత్రి

అనుచు గమనోన్ముఖులు నగు ఆ నృపాల
సుతుల వీక్షించి మారుత సూను డంత
భిక్షు రూపమ్ము విడి కడు దక్షుడైన
వానరుని రూపు దాలిచి - వారి నపుడు. 38

తనదు స్కంధములన్నిడి తనివి చెంది
తన్ను కృత కృత్యుగా మది దలచు కొంచు
తెలియ రానట్టి యానంద దీప్తి నంది
చేరు కొనె ఋష్యమూకాద్రి శిఖర సీమ. 39

మలయ గిరియందు - రామ లక్ష్మణుల భయము
వలన తలదాచు కొన్న యబ్జానుజుండు
వచ్చి - ఘన తేజమున నున్న వారి జూచి
భక్తి భావము మది గ్రమ్మ పరవశించె. 40

అనిల సుతుడంత ననియె నయ్యర్కజునికి
అనఘు డీతడు రాము డత్యధిక బలుడు
అనుజ యుతుడయి యిదె యిట కరుగు దెంచె
మాట మన్నించి నీ స్నేహ మభిలషించి. 41

ఈ మహామహు డిక్ష్వాకు డిన కులేంద్రు
డయిన దశరథ నరపతి కనుగు సుతుడు
తండ్రి బాసలు నెరవేర్ప ధర్మ నిరతి
వసుల వసియింప - నీతని వనిత గొనుచు. 42

ప్రబల మాయావి దుష్ట రావణుడు వీర
లింట లేకుండ జేసి నయ్యింతి సీత
నవహరించుక పోయె - వారార్తు లగుచు
దైవ సంకల్పమున నిట దారసిలిరి. 43

మీకు మీకును దెలియని మిత్ర బంధ
మేదియో యున్న దది మీరు కాదనంగ
రాదు - మీ మైత్రి గని - కపిరాజ! పృథ్వి
పులకరించుటె శుభములు పొసగు - నిజము! 44

అనుచు దెలిపిన సుగ్రీవు డాత్మ మురిసి
భక్తి యుప్పొంగగా రామ భద్రు పాద
పంకజములంటి నమ్రుడై ప్రణతు లిడెను
గాంచి నతులిడి రటనున్న కపులు గూడ. 45

భక్త జనపాలుడగు రామభద్రు డంత
ప్రీతి మెయి నర్కసుత నాదరించి - కరుణ
దొలుక నాలింగనము చేసె దూరదృష్టి
సకల జగములు వేనోళ్ల సన్నుతింప. 46

అదను గనిపెట్టి శీఘ్రమయ్యె నిలజుండు
అగ్ని నెలకొల్ప - రాముండు - నర్కజుడును
అగ్ని కపుడు ప్రదక్షిణ మాచరించి
కరము కరమున నుంచి జగమ్ము లెరుగ. 47

చెలిమి గావించి - రాముడు చేసె నపుడె
ధృఢ ప్రతిజ్ఞను - వాలిని దూల నేసి
అతుల కపిరాజ్యమునకు పట్టాభిషిక్తు
జేతు నిన్నని సుగ్రీవు చేయి బట్టి. 48

అమిత మోదాత్ముడై కమలాప్త సూను
డపుడు రాము పదాబ్జమ్ము లాశ్రయించి
భువము దివములు మార్మ్రోగు రవము చెలగ
పలికె నీరీతి దశరథు పట్టి తోడ. 49

అనతి కాలంబు నందె నిఖిలావని - సప్త
సాగరమ్ములు గాలించి - స్వామి! నీకు
ముదము చేకూర జేయుదు - ముదిత సీత
దెచ్చి నీ పాదముల నుంతు దీక్ష బూని. 50

భూమిజను బట్టి దివియందొ - పుడమి యందొ
అతల కుతలము లందునో - యవని క్రిందొ
గోప్యముగ దాచి యుంచిన క్రూరు బట్టి
వడిగ బడవైతు నీ పాద వనజములను. 51

అగ్ని సాక్షిగ నీవిధి నర్క సుతుడు
పలికి నంతనె శ్రీరామభద్రు డమిత
హర్ష పులకిత గాత్రుడై - అతని నపుడు
కరము యాలింగనము జేసి గౌరవించె, 52

ప్రేమ గదురగ మృదు మధు భాషణముల
ఒకరి కయిన కష్టముల నింకొకరు దెలిసి
పల్కుటయు గల్గె వారికి పట్టుదలయు
మర్మములు లేని యన్యోన్య మైత్రిగూడ. 53

ఏను నీ దాస దాసుండ - నినకులేంద్ర
ఫలము గనె నాదు జన్మ - నీ చెలిమి వలన
జగతి గుర్తింపు గల్గె సజ్జనుల నంచు
పరమ మోదాన నిటుబల్కె భానుసుతుడు. 54

అనఘ! విష సమమైన భోజనము మాడ్కి
రామ వహ్నిని శక్రాది రాజవరులు
తేరి చూడగ వెరతురు రీతివిజ వైరి
నాశనము దెచ్చుకొనెను జానకిని గోరి. 55

ఆతనమ్మున జను రావణాంక మందు
కొట్టు మిట్టాడి శోకించె గుండె లవియ
రామ! హా లక్ష్మణా! యన్ని రమణి సీత
ధరణి ధరములు విక్లలమై దద్దరిలగ. 56

## నగలమూటను రామునకుజూపుట

అట్టి సమయాన యీ పర్వతాగ్ర మందు
నున్న మముజూచి వేగ మా సన్నుతాంగి
చీర చెరగున ముడిచిన హారములను
జార విడిచెను-అవి దాచి నార మేము. 57

అనుచు హరివరు డద్రి గుహాంతరమ్ము
జొచ్చి - నగలున్న మూటను దెచ్చి - రాము
మ్రోల నిడ-సీతవని పోల్చి - జాలి గొలప
కనుల నీరము నించె నక్కరుణమూర్తి. 58

జాలి గొలిపెడు శ్రీరామచంద్రు ముఖము
చూడగా లేత తలదించె సూర్య సుతుడు
హృదయ శోకము తీవ్రమై కుటిల పరువ
సూటిగా రాల్చె రెండు కన్నీటి బొట్లు 59

కపి వరుండంత రాముని తపన ముడుప
సుంత యోచించి-దుఃఖమ్ము కొంతబాసి
వినయ వినమితుడై యిటు విన్నవించె
స్వాంతమున రామచంద్రుడుత్సాహ మొంద. 60

ప్రాణభయ మొనగూడిన-ప్రాజ్ఞు డెవడు
కుంగగా బోడు-కలతకు లొంగి పోడు
అజ్ఞుడదెయైన భీతిని హడలి పోవు
ఉప్పెనను కొట్టుకొని పోవు తెప్ప పగిది. 61

సుఖము నణగించు-తేజంపు శోభ తగ్గు;
బుద్ధి నణగించు- తాలిమి బోవ జేయు
జగతి శోకము-కాన; విజ్ఞాన ఖనుడ!
శోకమును వీడుమని వేడె సూర్య సుతుడు. 62

హితుని హిత బోధ విని రాజ సుతుడెడంద
చింత యొకిక్కింత మరచి ప్రశాంతి నొంద
హితుడ! దైన్యమ్ము వోయె నీ కతన-నింక
దొలగ జేయుదు భవదీయ దుఃఖభరము. 64

రఘువరుడు మోదమున కపి రాజు జూచి
పలికె నతనితో -నుతగుణా! ప్రబల వైర
మేల కలిగెను నీకు నవ్వాలితోడ
దెలుపుమన నర్క సుతుడిట్లు దెలియ బలికె. 65

భ్రాతృ భక్తితో వాలిని ప్రభువటంచు
సతము గొల్చుచు నుంటి-నన్నతడు గూడ
నమిత ప్రేమానుసక్తుడై యాదరించు :
చూపరులసూయ చెందుచు చోద్య మంద. 66

అంత నొకనాడు మాయావి యను నిశాటు
డతుల మదమున కిష్కింధ కరుగు దెంచి
పూర్వ వైరాన వాలితో పోరు సల్ప
సిద్ధ మైనంత వాలియు క్రుద్ధు డగుచు. 67

ఘోరమగు పోరు సలిపెను-వీరుడైన
వాలి ధాటికి దనుజుండు చాల లేక
పార జొచ్చెను - వానిని బట్టనెంచి
వాలి వెడలెను_జనితి నే వాలి వెంట. 68

ఇరువురింజూచి దనుజుండ పరమ భీతి
కొండ గుహసొచ్చి పరుగిడె; కూడ నంటి
దనుజునింద్రుంచి వత్తు నందనుక నీవు
ద్వారమున నుండుమని వాలి పలికి యరిగె. 69

వత్సరమ్మేగె - తెలియదు వాలి జాడ!
గాని యొక నాడు గుహనుండి కాల్వగట్టి
వెలికి ప్రవహించె నెత్తురువెల్లువలయి
ఘోర గర్జనల్ వినబడె గుహను వీడి. 70

దుష్ట దనుజుండు వాలిని దునిమి యుండు
ననెడు శంక యొకడు మది నాక్రమించె.
కొండగుహ నొక్క పెను శిలగూర్చి మూసి
కలత జెంది కిష్కింధకు కదలినాడ! 71

అన్న మరణించె నంచు నే నాత్మ వగచి
పూర్ణ దుఃఖాన కిష్కింధ పురికి జేర
వాలిలేని పట్టణ మెల్ల జాలి గొలిపె;
శూన్య మయి దోచె దుఃఖ మనన్య మగుచు. 72

వాలి వలె కపి రాజ్యమ్ము నేల జాలు
యోధుడ నటంచు మంత్రులు యోజ సలిపి
కట్ట బెట్టిరి రాజ్య మా కపులు నాకు
వేరు మార్గమ్ము లేక నే నూర కొంటి. 73

చండ విక్రముడగు వాలి చావ లేదు
నిజ భుజోద్ధతి "మాయావి" నిఖిల జగతి
జనులు వొగడగ పరిమార్చి జక్క తిరిగి
వచ్చి చేరెను కిష్కింధ పట్టణమ్ము. 74

ఎదురుగా నేగి వినయమ్ము మది చెలంగ
జరిగినది యెల్ల నన్నకు నెరుగ జెప్పి
క్షమను గోరుచు కపిరాజ్య రమను-నతని
చరణముల నుంచి మ్రొక్క-నా సమయ మందు. 75

క్రుద్ధుడయి వాలి నను జంప సిద్ధ పడగ
ప్రాణ భీతిని కిష్కింధ బారి - వచ్చి
నాంత రంగికు లైన యీ హనుమ దాది
సచివులంగూడి యుంటినీ శైల మందు. 76

ఎంత వేడిన వాలి సుంతేని వినక
భ్రాతృ వాత్సల్యమును గూడ బారద్రోలి
కఠిన హృదయుడై నానిజ కాంత "రుమను"
తానె గైకొనె క్రూరుడై ధర్మ ముడిగి. 77

చేయునది లేక నేనతి చింత జెంది
హనుమ దాదుల తోడ నియ్యద్రి జేరి
వాస మున్నాడ ! రాలేడు వాలి యనుచు
కాని యేతెంచె నన్ జంప బూని వాలి. 78

అదుగో ! చూడుము!రామ! యియ్యద్రి యందు
నస్థి పంజర మయ్యది-నసుర వరుడు
దుందుభి యనెడు వానిది - దూల నేసె
బొటన వ్రేలితో వాలి దానిటకు మున్నె. 79

ధ్యాన మగ్నుడై యుండె మతంగ మౌని
తత్తపో భంగమొనరించె దర్పమునను
మునియు శపియించె వాలి యీ భూధరాన
నడుగు నిడి నంత తల ముక్కలయి నశింప. 80

మౌనివరు శాప వశమున ప్రాణ భీతి
వాలి-గిరి చేరలేక నన్ వదల లేక
వేచి యున్నాడు నను జంప-భీతియుతుడ
ననుచు విలపించె నుష్ణ బాష్పాక్షు డగుచు. 81

శాప భయమున వాలి యీ శైలమునకు
రా నశక్యుండు నగుట నే రామభద్ర!
ధైర్యమున నుంటి నిటను నిందనుక నింక
రక్షకుడ వీవె! నాభాగ్యరాశి నీవె! 82

అనుచు సాష్టాంగ పడిన నయ్యర్క సుతుని
గౌరవంబున పైకెత్తి గౌగిలించి
అభయ హస్తాన సంప్రీతి ననునయించి
వెన్ను తట్టుచు ధైర్య సంపన్ను జేసె. 83

వాలి కథ విని శ్రీరామభద్రు డపుడు
సత్య శోధితు డయి మది జాలి తొణక
కపి కులీను సుగ్రీవుని కనికరించి
కలత దొలగగ నతనితో పలికె నిటుల 84

నిజము దెలిసితి మేలగు నీకు - నింక
వగవ బనిలేదు - నీ యన్న వాలి దూలు
ననెడి రాముని కనియె నో అనఘ! సింహ
బలు డ సామాన్యు డా? వాలి బలము వినుము. 85

తప్పకయె వాలి నాల్గు సంద్రముల దోగి
ప్రతి దినమ్మును తరణి కర్ఘ్యమ్ము నొసగు
వేయి తలలున్న ఆ కార్తవీర్యు నెదిరి
గడ్డి కరపించి యోడించె - ఘనుడతండు. 86

గదిసి ఎదిరించు నద్దశకంఠు బట్టి
మూర్ఛ నొందించె మున్నీట ముంచి - ముంచి
వాలి ధాకకు దనుజుండు చాల తేక
పరుగు లిడి లంక జేరె సత్వరము నపుడు. 87

మథన పడుచున్న సుగ్రీవు మది గ్రహించి
చండ విక్రము డగు రామచంద్రు డపుడు
ఘనుడు సుగ్రీవునకు దృప్తి గలుగు నటుల
స్వీయ శక్తిని వ్యక్తమ్ము జేయ దలచి. 88

బొటన వ్రేలిని మీటె నా పొంత మున్న
పర్వతాభ దుందుభి అస్థి పంజరమ్ము
అదియు నూరామడలు దాటి అవల పడియె
అంతతో బోక రాముండు చెంతనున్న 89

చదల నంటెడు పెనుస్థూల నప్త తాళ
ములను భంజించె నొక కోల భువిని గూల
పురుష పుంగవు నస్త్ర నైపుణ్య మరసి
విస్మయంబందె నా కపి వీరు డెదను. 90

శక్తి యెరిగిన సుగ్రీవు జేర బిలిచి
మంద హాసమ్ము మోమున చిందులాడ
వనచరాగ్రణి! రేపె యవ్వాలి బిలచి
అని నొనర్పుము – నేను నీ వెనుక నిలచి. 91

నేల గూల్చెద నొకకోల వాలి ననుచు
రామచంద్రుడు దెలుప_నారామ చరుడు
నమిత మోదము తోడ రామాజ్ఞ పూని
సమయ మారసి అనికి గర్జన మొనర్చె 92

# వాలి సుగ్రీవుల యుద్ధము

అర్క సుతు డప్పు డొనరించి నట్టి గర్జ
నమ్ము విని వాలి కడు విస్మయమ్ము చెంది
తీవ్ర కోపాన జనుదెంచి తీక్ష్ణ బుద్ధి
యుద్ధ మొనరింప వేగ సంసిద్ధు డయ్యె. 93

ద్వంద యుద్ధమ్ము నొనరింప దలచి వార
లొండొరుల ముష్టి బోరుచు నుండు వేళ
రెండు గజము లటుల రెండు కొండ లట్లు
పోరు చుండుట గని భీతి పొంది రెల్ల 94

సాహసమ్మందు బలమందు జవమునందు
శౌర్య ధైర్యమ్ములను వారు సదృశు లగుట
పిరు తివియకయె ఘోర సంగరము సలుప
జాలిరి _ బలంబు దీక్షయు చాల గలిగి. 95

వాలి కథ విని శ్రీరామభద్రుడ డపుడు
సత్య శోధితు డయి – మది జాలి తొణక
కపి కులీను సుగ్రీవుని కనికరించి
కలత దొలగగ నతనితో పలికె నిటుల. 84

నిజము దెలిసితి మేలగు నీకు – నింక
వగవ బనిలేదు – నీ యన్న వాలి దూలు
ననెడి రాముని కనియె నో అనఘ! సింహ
బలుడు సామాన్యుడా? వాలి బలము వినుము. 85

తప్పకయె వాలి నాల్గు సంద్రముల దోగి
ప్రతి దినమ్మును తరణి కర్ఘ్యమ్ము లిడును
వేయి తలలున్న ఆ కార్తవీర్యు నెదిరి
గడ్డి కరపించి యాడించె – ఘనుడతండు. 86

గదిసి ఏదిరించు నద్దశకంఠు పట్టి
మూర్ఛ నొందించె మున్నీట ముంచి – ముంచి
వాలి ధాకకు దనుజుండు చాల లేక
పరుగు లిడి లంక జేరె సత్వరము నతడు. 87

మథన పడుచున్న సుగ్రీవు మది గ్రహించి
చండ విక్రము డగు రామచంద్రు డపుడు
ఘనుడు సుగ్రీవునకు దృప్తి గలుగు నటుల
స్వీయ శక్తిని వ్యక్తమ్ము జేయ దలచి. 88

బొటన వ్రేలిని మీటె నా పొంత నున్న
పర్వతాభ దుందుభి అస్థిపంజరమ్ము
అదియు నూరామడలు దాటి అవల పడియె
అంతతో బోక రాముండు చెంత నున్న. 89

చదల నంటెడు పెను సూల సప్త తాళ
ములను భంజించె నొక కోల భువిని గూల
పురుష పుంగవు నస్త్ర నైపుణ్య మరసి
విస్మయంబందె నా కపి వీరు డెదను. 90

శక్తి యెరిగిన సుగ్రీవు జేర బలిచి
మంద హాసమ్ము మోమున చిందులాడ
వనచరాగ్రణి ! రేపె యవ్వాలి బిలచి
అని నొనర్పుము — నేను నీ వెనుక నిలచి. 91

నేల గూల్చెద నొకకోల వాలి ననుచు
రామచంద్రుండు దెలుప — నారామ చటుడు
నమిత మోదమ్ము తోడ రామాజ్ఞ పూని
సమయ మారసి అనికి గర్జన మొనర్చె. 92

## వాలి సుగ్రీవుల యుద్ధము

అర్క సుతు డప్పు డొనరించి నట్టి గర్జ
నమ్ము విని వాలి కడు విస్మయమ్ము చెంది
తీవ్ర కోపాన జనుదెంచె తీక్ష్ణ బుద్ధి
యుద్ధ మొనరింప వేగ సంసిద్ధు డయ్యె. 93

ద్వంద్వ యుద్ధమ్ము నొనరింప దలచి వార
లొండొరుల ముష్టి బోరుచు నుండు వేళ
రెండు గజము లటుల రెండు కొండ లట్లు
పోరు చుండుట గని భీతి పొంది రెల్ల. 94

సాహసమ్మందు బలమందు జవము నందు
శౌర్య ధైర్యమ్ములను వారు సదృశు లగుట
పోరు సలిపిరి విజిగీష ఘోర గతుల
సాహసమ్మును — బలమును చలము గలిగి. 95

అర్కజుడు _ వాలి యొకరీతి నలరు చుంట
నెవడు వాలియొ ? సుగ్రీవు డెవ్వడో - అని
పోల్చు కొనలేక _ వారలు పోరు నపుడు
శరము విడువడు రాముండు సాహసించి. 96

దివిజ పతి సుతు డంతట రవి తనూజు
పిడికిటం దీవ్ర తరముగ పొడుచుచుండ
తాళగా లేక నాతడు ధైర్య ముడిగి
నలత జెందుచు మనమందు దలచె నిటుల. 97

రాముఁ చే నమ్మి చొచ్చితి రణము నందు
వ్యర్థమయ్యె నేడు నాదు ప్రయత్న మెల్ల
బాస చేసియు - తనకేమి పట్టనటుల
మిన్నకొనె రాముడని మది ఖిన్నుడాయె. 98

అన్న ధాటికి పోరిలో నాగలేగ
ప్రాణ భయమున రణభూమి వదలి_పార
రాము డోదార్చి విషయమ్ము ప్రస్తుతించి
ధైర్య మొదవించె - మరల యుద్ధమ్ము సలుప. 99

శ్రమము వాయగ తనదు హస్తమున నిమిరి
బలము ధైర్యము చేకూర్చి బంపెమరల
వాలితో బోర నొక పూల మాల నరుత
దాల్పగా జేసి నిలచె తా తరవు వెనుక. 100

పుష్పదామమ్ము ధరియించి పోరు సలుప
మరల వచ్చిన సుగ్రీవు మద మడంచి
మట్టి గరపింతునని వాలి పట్టు బట్టి
పోరదొడగెను పొగరు టాబోతు పగిది. 101

తమ్మునిం గుమ్మ చున్నట్టి తరుణ మరసి
చెట్టుచాటున నిలచి యున్నట్టి రాము
డానవాలును గురుతించి - అతి నిశాత
బాణమున వాలినిం గూల్చె - పరమ బలుడు. 102

వాలి ధర వ్రాలి నంత సవ్వన చరులును
జయ నినాదము లొనరించి - శక్తుడైన
దశరథాత్మజు శ్లాఘించి - దర్పమూని
ప్రభువు సుగ్రీవు గీర్తించి ప్రబలినారు. 103

రక్త సిక్తాంగుడై వాలి రణ తలాన
వ్రాలుటంగని రవివంశ వర్ధనుండు
వేగ దరిజేర దుస్సహ వేదనమున
వాలి నుడివెను రఘుకుల వరుని గాంచి. 104

దయయు శమమును సత్యంబు ధర్మ గుణము
కలిగి విలసిల్లు చుండెడి ఘను డొకండె
ధరణి రఘురాము డని వింటి - దయను మాలి
యేల యీ లీల రామ ! నన్నేసి నావు? 105

ఏను నీయెడ దోషమ్ము నేమి జేసి
యెరుగ - నను గూల్ప ధర్మమా ? పరమ పురుష !
తార వలదన్న వినకుండ దగుదు నంచు
వచ్చి రణమిచ్చి మృత్యువు వాత బడితి. 106

అన్న దమ్ముల కును కలహమ్ము లగుట
సహజ మది గాదె వరికింప జగతియందు.
ఎట్టి సంబంధ మును లేని యట్టి నీవు
చంపితివి కనంబడక నిష్కారణముగ 107

క్షత్రియుండవు_నను చెట్టు చాటు నుండి
కూల్చ టేపాటి శౌర్యపు గొప్ప నీకు!
క్షాత్ర ధర్మము వీడి రక్కసుని మాడ్కి
మాయ యుద్ధము సేత నన్యాయ మగును. 108

వానరుడ నేను స్వేచ్ఛగా వనములందు
తిరుగు చుందును పరుల బాధింప కుండ
లలిత వనముల మధుర ఫలాల దినుచు
బ్రతుకు చున్నాడ ననఘ! నా బ్రతుకు నేను. 109

రమణి సీతను చెరగొన్న రావణుడనె?
కుటిల గతి కోసలమ్మెల్ల గొనుచు - వనుల
దిరుగ వెడలింప జేసిన భరతుడ నొకొ?
ఏల పగగొని నను జంపితీవు రామ! 110

అనుచు భాష్పము లొలికెడు కనుల నీరు
దుడుచు కొని మాటలాడక పడియె యున్న
అల్ప చేతను డగు వాలి నంత జూచి
రఘు కులాగ్రణి యిట్లాదరమున బల్కె. 111

వనచరేశ్వర! ధర్మమంచనుటె గాని
దెలియువే నీవు జేసిన తికమకలను
అనుజు సుగ్రీవు కిష్కింధ కవల నెట్టి
అతని సతి చెర గొనుట న్యాయంబె నీకు? 112

పుట్టు గ్రుడ్డగు వారితో పొత్తు జేసి
పట్టు గ్రుడ్డయె నీ దగు పురుష తనము
చపల కపులతో నిత్యము చపల మగుచు
నీతి చెడె నీదు జీవిత నియతి యంత. 113

కలుషములు లోన నిడుకొని గాన లేక
ఊరకయె నన్ను నిందింతు వోయి! వాలి!
యోచనము సేయ నీ తప్పు లొరుల యందు
రుద్దుటయె నీదు మతమంచు రూఢ మయ్యె. 114

నరులు మృగయా వినోదులై - ధరణి యందు
మాంసమున కని మృగముల మడియ జేతు
రైన దురితమ్ము నొందరు! అఖిల ధర్మ
రతులు రాజులు మృగయాభి రతులు గారె? 115

అనుజ ప్రియ వత్ని 'రుమను' కామాంధుడ వయి
బలిమి చెరబట్టి భోగించు కలుష మతివి
రాజులకు దుష్ట శిక్షణ రాజనీతి!
గాన శిక్షింప నర్హుడ - కపివరేణ్య. 116

ఘోర పాపము లొనరించు కుమతు లిలను
రాజ శిక్షితులై సుర రాజ నగరు
జేరి సుఖియింపరే దొడ్డ జనుల వోలె
మహిని నిది ధర్మశాస్త్ర సమ్మతము గాదె! 117

కాన నీవును నా శరా ఘాత మహిమ
నఘములను వాసి కడు నిర్మలాత్ముడ వయి
పుణ్య జన వాస మగు నింద్రపురము జేరి
మాన నీయుడ వగుము - ఓ వానరేంద్ర! 118

అనుచు వచియించు రాముని కంజలించి
వనచరేంద్రుడు వినయాన ననియె - రామ!
ఈ నిశిత బాణ బాధ సహింప లేక
ఏదొ పలికితి నను క్షమియింపు మనఘ! 129

## తార వాలిని జూడ వచ్చుట

ప్రాణ నాథుండు రణభూమి ద్రావె ననుచు
వినిన యవ్వాలి సతి తార మునిగె మూర్ఛ;
కొంత వడి.కామె తెలివొంది గొల్లుమంచు
సుతుని తోడుక వాలిని జూడ వచ్చె. 120

వాలి గని తార – దుఃఖాన దేలి – కనుల
గ్రమ్ము కన్నీటి పొరల శ్రీరాముని గని
పరులతో బోరు సల్పు నా భర్త నిటుల
పొంచి వధియించితివి దోష మెంచ పైతి. 121

వనములో వన్యములు దిని బ్రతుకు వారి
వనితలను_సాధుజనులను_వనచరులను;
గోగణమ్మును_మునులను_కుటిల బుద్ధి
చంప నరకము కలుగు నంచనియె తార ! 122

తలిరు టాకులు మనకు కావలసినపుడు
తరుణ ఫలయుతమై యున్న తరువు గూల్ప
దగునె ? యోచింప_ఓ రామ ! ధరణి తనయ
తోడ సద్గుణములు నిన్ను పీడె నేమొ ? 123

న్యాయ మరయక వాలి నన్యాయ ముగను
జంపి మము వేరు పరచిన స్వార్థ మతివి.
"ఉసురు ఊరక పోదు !" నీ కసలు మదిని
జాలి లేదను మాట యీ జగము తెరుగు. 124

అనుచు నిందించు భార్య నవ్వనచరుండు
దరికి జేరగ బిల్చి యాదర్శ మతిని
"రాము డన నెవ్వ డాది నారాయణుండు
ధర్మ రక్షకు" డంచును తగ వచించె. 125

# వాలి తారాంగదులను సుగ్రీవున కప్పగించుట

రామ బాణాగ్ని తనువున రగులు చుండ
బాధగా మూల్గుచును వాలి – అదరమ్ము
దోవ – రవి సుతు దరిచేర్చి – దుఃఖితు డయి
పలికె నెల్లరు వినుచుండ ప్రీతిముగ. 126

తమ్ముడా! కర్మ ఫలముల ధరణి జీవు
లనుభ వింతురు – సుఖమొ ? దుఃఖానుభవమొ ?
విజ్ఞుడగు వాడు తెలిసి వివేక మూని
సతము శుభకర్మ మార్గాల జనుచు నుండు. 127

అజ్ఞతను గాదె – నేను నీ అనుగు పత్ని
"రుమను" చెరగొని బహువిధ భ్రమల మునిగి
చివరి కిటులైతి ! నిదియు నే జేసి నట్టి
కర్మ ఫలమని నీ మది గాంచు మయ్య. 128

పలు విధమ్ముల నిన్ను నే బాధ పెట్టి
నాడ ! మది తలంచక నీవు నా సుపుత్రు
నంగదుని ప్రేమతో సదా నాదరించి
కన్న కొడుకుగ భావించి గావు మన్న. 129

సూర్య సుత ! తార సుతుడన్ని కార్య తతుల
నీకు బాసటగా నిల్చి నిఖిల జగతి
నుతులొనర్చగ సేవించు సతము నిన్ను :
అభయ మిడి వీని గాపాడు మంచు నుడివె. 130

సౌమ్య ! నాసతి – యీ తార – సకలలోక
వినుత గుణశీల నిన్ను సంప్రీతి తోడ
కొలుచు నిక ముందు – దానికే కొరతలేక
సుకత జీవించు నట్టుల చూడుమయ్య. 131

సాధ్వి – యీ తార ! భానుజ ! సకల కార్య
ధర్మ మర్మార్థ సూక్ష్మ నిర్ధారణమున
నేర్పు గలది – కార్యాకార్య నిర్ణ యజ్ఞ
ధరణి ధర్మంబు దప్పని తరుణి సుమ్మి. 132

క్షేమ మగు నయ్య – వినుము ! సుషేణ పుత్రి
భావ మెప్పుడు విఫలమ్ము బడయు బోదు
ఆమె పనిచిన తీరు నీ వాదరింప
నఖిల సుఖములు నీకు సాధ్యమ్ము లగును. 133

మరియు నింకొక్క హితము నా మదిని గలదు ?
నీ బలమ్మున నాశలు నింపు కొన్న
రాఘవుని కార్య మందున లక్ష్యముంచి
జనకజం గూర్పుమీ రామచంద్రు తోడ. 134

అనుచు వచియించుచును మఘ వాత్మ జుండు
హేమ కంజాత మాలను యిన సుతునకు
కంఠమున నిడి యసె–నిడి కార్య జయము
శుభము నారోగ్యమును గూర్చు – సోదరుండ ! 135

హితము నను జునకును జెప్పి ఇంద్రి తనయు
డంగదుని గాంచి వచియించె నతి ప్రియాన
తనయ ! దేశ కాలంబులు ధర్మ మరసి
సుఖము – దుఃఖము సమముగా జూచి మనుము. 136

సుతుడ ! నీ కింక తండ్రి యీ సూర్య సుతుడె !
ఏను జూపెడి వాత్సల్య మితడు జూపు.
తండ్రిగా–రాజుగా–నింక దలచి యితని
విడక సేవించి మనుటె నీ విధి యటంచు. 137

అర్థియై వాలి యంత తారాంగదులను
సూర్య సుతునకు దశరథ సుతున కెలమి
నప్పగించుచు - ఆనంద మాత్మ నిండ
చివరి నిట్టూర్పు విడచుచు చేరె దివిని. 138

వాలి మరణింపగా గని వానరాళి
శూన్య మానసులై వడి శోక జలధి
మునిగి విలపించు చుండగా మూర్ఛ నొంది
తారయును నంగదుడు కూలినారు ధరణి. 139

# తారా విలాపము

తార యొక్కింత వడికిని ధరణి దెలిసి
మూర్ఛ దేరిన - తద్దుఃఖ మోహ ముడుప
రామచంద్రుడు దరి చేర - ఆమె రామ
చంద్రు గని బల్కె భర్తృ విషాద మొప్ప. 140

నిమిషమైన నన్బాడక నిలువ లేడు
వాలి మద్భర్త - స్వర్గాన వగచు నెంతొ
నన్ను గనలేక - దయ పూని నన్ను గూడ
నొక్క పెనుకోల నిర్జింప నుచిత మగును. 141

ఇంద్ర నందను డో రామ! పొంది దుఃఖ
సాగర నిమగ్నుడై నేను సరస లేమి
వసుధ సుత బాసి గనలు నీవలె నతండు
శోకమున విలపింపడే నాక మందు. 142

భర్తృ మరణమ్ము తోడ యీ భార్య మనసు
గాయమై ముక్కలై పోయె! గాన - రామ!
బ్రతుకు పయి నాస జచ్చె - యీ పడతి కింక
ముక్తి దయసేయు మయ్య నా మొరను వినుచు. 143

వలదు యుద్ధంబునకు బోవ వలదటంచు
నెంత బోధించినను విన కిట్టులాయె!
ధర్మమే దారి తప్పిన - ధరణి- రామ!
మమ్ము గాపాడు వార లిమ్మహిని నెవరు? 144

పొలుపు దెలిపెడి నవ దివ్య భోగ రాజి
సతము నలరు జయంత వసంత కంతు
డాద్యనిమిష సుతుల వోలె నంగదుండు
నింక నే రీతి మనగల డిలను-రామ! 145

దేశ మందున్న కపికుల తేజ మెల్ల
నీ యదియె గాదె! నాథ! గణించి చూడ
అట్టి తేజము వాడి నే డలసి పోయె
రాహు గ్రసియింప ఘన సూర్యరస్మి వోలె. 146

బహు విధమ్ముల గుండెలు పగిలి పోవ
గడగి దుఃఖించు తారను గాంచి - సుంత
జాలి వహియించి శ్రీరామచంద్ర మూర్తి
పలికె; నుపశమనమ్ముగు పలుకు లిటుల. 147

జనన మరణాలు సుఖ దుఃఖ సరణు లెల్ల
జీవి కిడు బ్రహ్మ - తత్పూర్వ జీవిత కృత
పుణ్య పాపాల వాసనా పుష్కలతను
దాని దాటగా శక్తు లిద్ధరణి లేరు. 148

వీర పత్నివి నీవు - వివేక ముడిగి
పరి తపించు టుచిత మౌనె పడతి! భావి
కాలమున భూరి సంతోష గతి చెలంగ
గలవు - యువరాజు గాను నంగదుని గాంచి. 149

కర్మమును బట్టి బుద్ధి సంక్రమము గలుగు
కాల వశ వర్తులై - కర్మ గతిని నడచు
ప్రాణి కోటులు - జూచి ప్రపంచ మందు
వగవ బనిలేదు - సహజ మీ వరుస - భువిని. 150

జనన మరణమ్ము లిల సహజమ్ము - జీవ
తతికి - అనివార్య మైనట్టి మృతికి వగవ
ధర్మమే ! కాల ధర్మంబు దాట వశమె ?
పృథ్వి నీ ప్రాణి కోటికి ? పుణ్యలలన ! 151

నాశనమ్ము లే దాత్మకు లేశమైన
చివికి చివికి దేహమ్ము నశించు - నశ్వ
లక్షణ గత దేహమ్మిది-రాలిపోవు !
అనుచు బోధించె వారల కర్క కులుడు. 152

అంగదుని చేత పితృ కార్య మరయ పైది
క విధి జరిపింప-తారాది కపి గణమ్ము
గోడు గోడున నెలుగెత్తి గోల చేయ
శ్రద్ధగా సాగె వాలి సంస్కార విధులు. 153

అర్కజుండంత శ్రీరాము డాజ్ఞ నిడగ
తారయు రుమము కోతుల దండు లెల్ల
గొలుచు చుండగ విజయంపు ఘోష తనర
చేరె వైభవ యుతుడు కిష్కింధ పురము. 154

# సుగ్రీవ పట్టాభిషేకము

శుభ ముహూర్తము గని కపి స్తోమ మపుడు
సకల వానర లోక రాజ్యాధి పతిగ
పట్టముం గట్టి రానాడు భానుజునకు.
అంగదుడు యువ రాజుగా నయ్యె నపుడు. 155

అతుల బలశాలి సుగ్రీవు డా దినాన
నధిపు పదవిని జేపట్టి యలరు కతన
నిత్య యౌవన శోభల నెగడు పెండ్లి
కూతురై వెల్గె కిష్కింధ కోమలాంగి. 156

రాజ పదవిని చేపట్టి - రాము కడకు
భక్తి తాత్పర్య భరితుడై - పవన సుతుడు
వెంట రా వచ్చి - బుద్ధి వివేక శాలి
అధికమౌ కృతజ్ఞతను సాష్టాంగ పడియె. 157

ప్రేమ రాముడు సుగ్రీవు లేవ నెత్తి
గౌగిలించు కొనుచు మది గౌరవమ్ము
దెలియ జేయుచు దరహాస దీప్తి నెగడి
వానరాధిపు తోడ తా బలికె నిటుల. 158

అనఘ! యీ నాటి శుభము నీ వాత్మ నెంచి
నిర్మలమ్మగు హృదయాన నీదు జనుల
కన్న బిడ్డల వలె సాకి గౌరవించి
ఖ్యాతి వడయుము - ఘన రాజ నీతి మెలగి. 159

అధిప ! వాన కాలమ్ము ప్రస్థానమునకు
సానుకూలమ్ము గాదు - ప్రశాంత మతిని
కార్తికము వచ్చు నందాక గడు ముదమున
పురమునందుండి పిదప సత్వరము రమ్ము. 160

## వర్షబుతువు

సత్వ గుణులగు రామ లక్ష్మణులు ప్రీతి
నర్క సుతు బంపి - ఋష్యమూకాద్రి జేరి
ప్రకృతి శోభలు గనుచుండి - పరవశించి
గడుప దొడగిరి ఆ వర్ష కాల మచట. 161

ప్రావృడంబుదముల గాంచి పరవశించి
లక్ష్మణుని గని పల్కె శ్రీరాము డిటుల
విరహు లకు తీవ్ర మదనార్తి వెలయజేయు
కాల మిది - లక్ష్మణా! వృష్టి కాల మనగ. 162

జలధి రసముల నిన కరములు గ్రహించి
గగన సతి గర్భమున జేర్చ - గగన సతియు
నెలలు తొమ్మిది నిండగా నిలువ లేక
పురిటి నొప్పుల జలములు భువిని విడచు 163

జలద సోపాన పంక్తుల జనులు - నాక
సమ్మునకు బ్రాకి నవ సుగంధమ్ము లలరు
మల్లె మాలలతో నంశుమాలి నిపుడు
తగ నలంకరింపగ శక్య మగును గాదె! 164

తమ్ముడా! ఘర్మ సంతప్త ధరణి జూడ
వర నవోదక సిక్తమై విరహ తాప
తపనమున - జూడ - జనకరాడ్తనయ భంగి
నశ్రువులు రాల్చు చున్నది - అనఘ! కంటె! 165

జలద గర్భంబు వెడలిన సలిల బిందు
బృందముల దోగి కేతకీ గంధములను
వరల జేయుచు సాగు నివ్వనము లోని
పిల్ల గాలుల మనముల్ల సిల్లు - గనవె! 166

కారు మొగిలుల పంచను జేరి - శంప
మిగుల చలియించు రీతి సౌమిత్రి! నేడు
పరమ నిందా స్వభావు డౌ పంక్తి ముఖుని
చెరను నెంత చలించునో యురలి సీత. 167

సతులకును నిట్టి సమయాల పతుల యెడల
మనసు పొంగుట సహజ మా జనక తనయ
నన్ను గనలేక మనమున ఖిన్న యగుచు
నెంత తపియించు చున్నదో యెరుగ వశమె ! 168

తరుణి నా చేయి బట్టిన దాది నేటి
వరకు నను వీడి యెరుగ దీ వరుస నేడు
ఎంత కుమిలెడినో నన్ను నిపుడు వీడి ?
తలచు కొన గుండె చెరువయి తపన మొదవు ! 169

రాక్షసుల బాధ లొక వంక – రమణి నన్ను
కూర్మి గనలేని తాప మింకొక్క వంక
వరుస దపియింప జేయ – మీ వదినె యచట
యెంత దుఃఖించు చున్నదో యెరుగ గలపె ! 170

పలు విధమ్ముల నీరీతి భ్రమల దవిలి
మధన పడుచున్న సోదరు మనమెరింగి
లక్ష్మణుండంత నిట్టూర్చి – రాము గూర్చి
పలికె నుపశమనమ్మైడు పలుకు లిటుల. 171

మనసునం గీడు శంకించి మధన పడగ
నగునె – సామాన్య నరుభంగి నఖిల మెరుగు
విజ్ఞుడవు నీవు – ఓ యన్న ! విధి లిఖితము
తప్ప దెంతటి వారైన దాటలేరు. 172

అన్న ! నీ బల సంపద లఖిల జగము
లెరిగి యున్నవి – దశకంఠు డెచట నున్న
పట్టి బంధింపగా కపి బలము కలదు
దిగులు నీకేల ? నీ విట్లు వగవ నేల ! 173

ఇన కులాగ్రణీ! నీ శక్తి నెరిగి యుంట
తుచ్ఛుడా రావణుడు నాడు ముచ్చు పగిది
జనక తనయను గొని చనె – మనసు లేని
సమయ మారసి సత్వము చాల కుంట. 174

కార్తికము వచ్చినంత నక్కపి వరేణ్యు
డఖిల బలముల గూడి నీ యాజ్ఞ వడసి
జనక సుత జాడ గనుగొని సత్వరమ్ము
తెలుపగల డన్న! దిగులింక చాలు నన్న! 175

అవన తాననుడయి రాము డనుజ వచన
శీత శీకరముల దోగి సేదదేరి
గడువు ముగియగ వచ్చెను – కపివరుండు
వచ్చు జాడలు లేవంచు పలికి మరల. 176

పెక్కు హింసల పాలయి – పెద్ద కాల
మునకు నిజ సతి గలసిన యిన తనయుడు
కొంత కాలమ్ము సతి తోడ గూర్మి గనుట
మంచిదని యెంచినాడ నా మదిని నాడు. 177

వచ్చె కార్తిక-మైన నవ్వన చరుండు
జనక సుత కైన మరసెడు జాడలేదు!
ఇచ్చట శోకార్తి గుందు చే నిట్టు లుండ
నచట కిష్కింధ సుఖుడయి నాత డుండె. 178

భ్రాతృ భయమున కిష్కింధ బాసి-బహుళ
కష్టముల దైన్యమున నుండు కాలమందు
హితము చేకూర్చి మనుప నా యీప్సితమ్ము
మత్తుడై విస్మరించె నున్మత్త వృత్తి. 179

తనివి దీర సుఖమ్ముల ననుభవించి
సంతసమ్మంది-పిదప-తనంత దాసె
సమయ మారసి-చనుదెంచి-రమణి వెదకు
కార్యమున నుండగలడను కాంక్ష నుంటి. 180

అదియె నా బలహీనత యనుచు దలచి
మిత్రి భావమ్ము మరచి తా మెలగు నెడల
వాలి వలె నాశనము నొందు కాలగతిని
అతని గాపాడ లేరు బ్రహ్మదు లేని. 181

అనుచు వ్యధ బల్కు చున్న రాముని నొకింత
శాంత పరచుచు సౌమిత్రి సత్వరమ్ము
అన్న యానతి గైకొని - అర్క తనయు
నరయ కిష్కింధ పురమున కరిగె - నంత. 182

లక్ష్మణుని గాంచి-ఆ కపిరాజు మిగుల
భయము భక్తియు గదుర సత్వర మతండు
రాము కడ జేరి వినతుడై ప్రణతు లిడుచు
వేడుకొనె తప్పు మన్నింప వివిధ విధుల. 183

మహిని-దలుప-ధర్మార్థ కామముల నెవడు
విభజనము చేసి మంచిని విడువ కెపుడు
మర్మమును వీడి నిర్మల మానస మున
సంచరించునొ ! జగమున జయము గనును. 184

సూర్య సుతు జూచి నంతనె సూర్య కులుడు
కరము ముదమందె-కోపము చెరిగి పోయె.
అమిత సంతసమున నత డర్క సుతుని
గౌరవము మీర మనసార గౌగిలించె. 185

అర్క సుతు నాజ్ఞ ఋష్య మూకాద్రి నంత
మూల మూలల గల కపి ముఖ్యు లెల్ల
రామ కార్యాను రక్తులై రమణి సీత
జాడ నరయగ జేరి రుత్సాహ బుద్ధి. 186

## సుగ్రీవుడు సీత వెదుక వానరుల బంపుట

అర్క సూనుండు శ్రీరాము నాజ్ఞ మేర
ధరణి యందున సీత నా దైత్యు డెందు
దాచినను బోయి నెలనాళ్లు దాట కుండ
వెదకి కనుగొని రమ్మని ముదల నిడెను. 187

అప్పుడే చూడగ సుషేణు డాది కపులు
చనిరి ప్రాక్పశ్చి మోత్తరా శలకు కదలి
అంగదుడు సిద్ధపడె దక్షిణాశ వెదుక
జాంబవంతుడు హనుమయు సాయ పడగ 188

అంజనాత్మజు డంతట నతి వినమ్ర
భావ మున - భక్తితో-రామభద్రు మ్రోల
నిలచె-రెండు హస్తముల నొదల ఘటించి
బయలు వెడలగ రామాజ్ఞ బడయ నెంచి. 189

తనకు సుగ్రీవుతో మైత్రి తగ ఘటించి
ధరణి సుత జాడ కనుగొను తలపు మునిగి
నేడు సామీరి తన ముందు నిలువ జూచి
పొంగి పులకించె శ్రీరామ భూ విభుండు. 190

ఉల్లమున నున్న సీతా వియోగ బాధ
అణగి - ముఖ బింబము ప్రసన్న మగుట జూచి
లక్ష్మణాదుల మనము ఉల్లాస మందె
అపుడు ప్రియమున రాము డా హనుమనరసి. 191

ఘనుడ ! నీ జేత కాగల కార్య మిద్ది
మాట దక్కను నీ కంచు మనసు నుడివె !
కాచుకొని యుందు నీ రాకకయి యటంచు
రక్తి గౌగిట జేర్చె నా రఘు వరుండు. 192

విజయమగు గాక ! హనుమంత ! వెడలి రమ్ము
కార్యసిద్ధి-యీ నీ భుజ స్కంధము లను
గలదు గలదంచు పలుమార్లు పలికె రాము
డాదరము మీరనింక దాననియె నిటుల. 193

అవని సుత సీత నిను నమ్మ దంచు తెలిపి
రామభద్రుడు తన చేతి రత్న మయపు
టుంగరమ్మా నవాలుగ నొసగి నంత
హనుమ డద్దాని గైకొని కనుల నద్దె. 194

రామ నామాంకితమ్మును రత్న మయము
నైన ముద్రిక నపుడు వాతాత్మజుండు
భద్రముగ దాచి స్ఫూర్తితో బలికె-రాము
మోము గనుగొని-యతనికి మోద మొదవ. 195

సీత యెందున్న చూచి వచ్చెదను-రామ !
గననిచో లంక నెల్ల బెకల్చి నీదు
పాదముల నుంతు నిదియె నా ప్రతిన యనుచు
పదములకు మ్రొక్కులిడి వడి కదలె హనుమ. 196

జానకీదేవి యున్నట్టి జాడ గనక
వచ్చినన్నైన మిము నేను మెచ్చ వంచు
అర్కజుడు జాంబవంతుని-అంగదాది
ప్రముఖ కపివీరులర గని పలికి వాడు. 197

దక్షిణము బట్టి - నా గతి దరలి - వారు
జలజ హిత సుతు డెరిగించు స్థలము లెల్ల
గనుచు - జనుచును - బహుదూరమునకు బోయి
యరసి రెదుటను వింధ్య భూదరము నచట. 204

ఆ నగమ్మున కపి వీరు లతుల శక్తి
కొలనులను నుగ్రివనులను కొండ గుహలు
సకలమును సొంతముగ జూచి జనక తనయ
జాడ దెలియక-డస్సిరి శక్తు లుడుగ. 205

అడుగు మరి ముందు కిడలేక-అనిల సుతుని
చెంత నెల్లరు జేర-నిశ్చేష్టు డాయె
వారి గని ధైర్య మొదవింప వాలి సుతుడు
మృదుల భాషణముల ముద మొదవ బలికె. 206

దాక్ష్యము మనో బలమ్మును ధైర్య గుణము
కష్టముల తాల్మి-భువి యందు-కార్యసిద్ధి
గలుగ జేయునటంచు విజ్ఞులు వచింత్రు
గాన జనకజ నరయుగా గదలు డయ్య! 207

ప్రాణి యొనరించు కర్మము ప్రాణి వెంట
నంటి ఫల మొనగూర్చును నరయ నెపుడు
కార్య సాధనకై సదా గడగు వాడు
జయము చేగొను తథ్య మిజ్జగతి యందు. 208

శౌర్య గుణయుతు లద్భుత సాహసికులు
అతి బలాఢ్యులు నింద రయ్యవని సుతను
వెదుక చనుదెంచి గానకే-వెను దిరిగిన
చింత దీరునె? జాతికి సిగ్గు చేటు: 208

పర్వతమ్ములు-నదులును-పట్టణములు
కొలను లత్యుగ్ర వనములు కొండ గుహలు
వెదకితిమి గాని మన శ్రమ వితథ మయ్యె
రమణి నెట దాచి యుంచెనో రావణుండు. 210

మనము కిష్కింధ విడి యొక మాస మరిగె
కపి కులేశు డిడిన యట్టి గడువు దీరె
కార్య సాధన యిసుమంత కాన రాదు.
ఎటుల జూతుము రాముని-యిన తనయుని. 211

గడువు మీరిన దను కోప కారణమున
తలలు తెగవేయు రుచిమాలి తనయు డరయ
ఉగ్ర శాసనుడును మహోదగ్రు డతడు!
రిక్త హస్తాల జను టది యుక్త మగునె? 212

కాన నెటులైన జానకిం గాంచి గాని
మనము జనరాదు! ధైర్యము గనుచు-మీరు
కార్య శీలురు-జానకిం గాంచు కొరకు
తట పటలు మాని వెదకుడు! తడయ వలదు. 213

అంగదుని మాటలకు కపులంద రపుడు
శిరములను డించి మిక్కిలి సిగ్గు పడిరి
ప్రాణములు పోయినంగాని రామ పత్ని
జాడ నరయక వెనుకకు జన మటంచు. 214

గంధమాదను దాదిగా గల కపులును
గడగి దృఢ నిశ్చయాత్ములై కదలినారు
తరులు గిరి దుర్గమారణ్య తలము లెల్ల
వెదకి సీతను గనుగొను వేడ్క హెచ్చ 215

అంగదుని మాట పొందిక నవధరించి
వేయి ఏన్గుల బలమున వెలసి-వారు
పటుక రోత్సాహ వంతులై పట్టు దలగ
వింధ్యగిరి దక్షిణమ్మెల్ల వెదకి నారు. 216

వింధ్యగిరి చెంతనే యున్న వెండి కొండ
గాంచి-తన్నగమున నంత కపి వరాళి
తృప్తి-కోద్రి వనమ్మును స ప్త పర్ణ
వనము లన్వేషణము చేసి బడలిక గని. 217

అంద రప్పర్వ తాగ్రము నందు జేరి
కనుల కందెడు స్థలముల కలయ గాంచి
జనక సుత జాడ దెలియక ఘన తరంపు
చింత మునిగిరి-ప్రజ్ఞా విశేష గుణులు. 218

చొచ్చిన వనాలను మరల జొచ్చి చొచ్చి
వెదకి వేసారి పూర్ణ నిస్పృహులు నగుచు.
సీత గానక దుఃఖమ్ము చే నలంగి
చేయునది లేక యత్నంపు సిద్ధి లేక. 219

పర్వతము డిగ్గి యొక చెట్టు పజ్జ చేరి
విపుల చింతాత్ములై కపి వీరులెల్ల
ఒక ముహూర్తము నిలచి యొండొరుల గలసి
సేద దేరుచు సీతమ్మ క్షేమ మరయ. 220

తిరిగి వెదకుచు ముందున కరిగి యరిగి
సింహ శార్దూల మయ వన సీమ-విషమ
భూధర శిఖ రాగ్రములను పోయి చూచి
క్షుత్పిపాసల జిక్కిరా శూరు లెల్ల. 221

డప్పిగొని-దాహ మరయుచు - డస్సి కపులు
వడి వడిగ ముందు కరుగ నవ్వనము నందు
వివృతమును భయదమ్ము నౌ వింత బిలము
కానుపించె నచ్చోట నా కపివరులకు. 222

కటిక చీకట్లచే కన్ను గానరాని
తద్బిలమ్మున సీతను దాచి యుండు
ఖలుడు రావణు డని యెంచి కపులు-దాని
చొరవ గాలింప లోనికి జొచ్చి నంత. 223

కలకలమ్ముల జలపక్షి గణము లెన్నొ
బిలము వెల్వడి రా నట జలములుండ
వచ్చునను నూహ నుత్సాహ వంతులగుచు
బిలము జొచ్చిరి కపులు నిర్భీత మతుల. 224

అందు తిరిగెడి వ్యాఘ్ర సింహాది జంతు
సంతతుల పార ద్రోలుచు సాగిసాగి
అంధకారా వృతమ్మయి యదర జేయు
స్థలము చేరిరి వారలా బిలము నందు. 225

బ్రతుకుపై నాస విడి కపి ప్రవరు లెల్ల
బిలము మధ్యను తనువుపై భీతి గలిగి
కలవరము చెందుచుండ నంగదుడు జూచి
మందలింపగ మరికొంత ముందు కరిగి 226

కోటి సూర్యులు నక్షత్ర కోటి - యొక్క
కుప్పగా కూడి కాంతులు గ్రుమ్మరించి
కనులు మిరుమిట్లు గొలిపెడి ఘన తరంపు
వెలుగు గని వార లాశ్చర్య వివశు లగుచు. 227

వెలుగు గని సంత సమ్మంది వేగ కపులు
డాయ జని కాంచి రటను సౌధముల నొప్ప
పట్టణం బొండు సురరాజ పట్టణమును
తళుకు బెళుకులతో తల దన్ను దాని. 228

వజ్ర వైఢూర్య మణిగణ వైభవముల
చలువ రాళ్లను నొప్పారు సౌధములను
గలిగి యలరు నప్పట్టణాగ్రమున మిగుల
ప్రభల నించెడు నొక దివ్య భవన మందు 229

లేడి చర్మాసనంబున లీల నచట
అరుణ రాగంపు కురులను నలరు చుండి
పరమ దీక్షా పరిపూర్ణ తపంబు నందు
మగ్నమై యున్న యోగినీ మాత గనిరి. 230

హనుమ ప్రశ్నించె నెవ్వతె వమ్మ? నీవు!
ఒంటరిగ నీ బిలంబున నున్న నిన్ను
గాంచ నచ్చెరు వయె-స్వర్ణ కలితరత్న
మందిరము లివి యే మహా మహుని వమ్మ. 231

రామ కార్యార్థులము మేము-రమణి సీత
నడవు లందున గాలించి యరయు చుండి
క్షుత్పిపాసల కును జిక్కి శుష్క కంఠ
ముల జలాశ వచ్చితిమి యీ బిలము సొచ్చి. 232

దివ్య మణి గణ ఘనతర దీధితులను
స్వర్ణమయ సౌధ రాజ విస్తారమగుచు
మేలి ముత్యాల తోరణ జాల ములను
బరగు నతిలోక విభవంపు పట్టణమ్ము. 233

జన రహితమయి యుండ గారణ మదేమి ?
ఏ మహామహు మహిమచే నీ కొలనుల
తళుకు బంగరు పూవులు ? తరులు గూడ
కాంచ నాంచిత మయములై కాన నయ్యె. 234

విమల తర దివ్య గంధమే విధిని నిచట
అమరమై తృప్తి నిడుచున్న దమ్మ మాకు
తెలియు లేకుంటి నో తల్లి - తేట పడగ
దెలుపు మన "యోగినీ మాత" దెలిపె నిటుల. 235

# యోగిని ఋక్షబిల వృత్తాంతము దెలుపుట

అనఘ ! యిది ఋక్షబిల మిట నతి చతురుడు
శిల్ప నైపుణ్య విదుడు - విశిష్ట గుణుడు
ఆర్య సమ్మతు డద్భుతుండగు మయుండు
రచన మొనరించె దీని సంరక్తు డగుచు. 236

వేయి ఘన వత్సరమ్ములు వేడ్క బ్రహ్మ
కొరకు తపమాచరించియు వరము నంది
చిత్ర నిర్మాణ సౌందర్య శిల్ప శాస్త్ర
పాండితీ సముపార్జనా ప్రతిభు డాయె. 237

అతడె నిర్మించె కాంచనాంచితము లైన
భవనములు-సౌధములు - వన ప్రస్తరములు
కమల కుముదాది జలపుష్ప కలిత మైన
రుచిర కమలాకరమ్ములు వృక్ష పంక్తి. 238

హేమ యను నప్సరోంగన ప్రేమ మునిగి
కామ భోగాల నిట చిర కాల ముండె;
మఘవు డంత సహింపక మయుని ద్రుంచె
తనదు వజ్రాయుధంబున - తక్షణంబు. 239

కమల భవుడంత నక్కటి కమ్మ నూని
హేమ కంకిత మొనరించె-నీ సమస్త
స్వర్ణమయ సౌధ వనరాజి - సకల మామె
సఖిని యగు నాకు వీడి తా చనియె దివికి. 240

నను "స్వయంప్రభ" యందురు; నాటి నుండి
యిట వసించి తపోనిష్ఠ నెసగు దాన
నీ బిలంబున జొచ్చిన నెవ్వ డేని
ప్రాణముల తోడ గ్రమ్మర బయట పడడు. 241

ఏను మత్తపో మహిమచే నీ బిలంబు
వెల్వరింతును మిమ్ము నే విధముసైన
అనఘులగు మీరు-రామ కార్యార్థు లగుట
నిదియె కర్తవ్యమంచు నా యెదనుదోచె. 242

ఆమె పలుకులు వినినట్టి అంగదాది
ప్రముఖు లెల్ల కృతజ్ఞతా పరులు నగుచు
ఆమె కభివాద మొనరింప-ఆమె వారి
కనులు మూసుక నిలుడన - గడగి కపులు. 243

కనులు హస్తాలతో నిలకడగ మూయ
సంత తార్జిత నిజ తపః శక్తి వలన
బిలము వెడలించె 'దాపసి' ప్రీతి కపుల
బిల ముఖద్వారమున వారు నిలచి నారు. 244

ఆమె అనుమతి గైకొని అగచరాళి
వింధ్య దిగి-ప్రాంత వనముల వెదకి వేగ
దక్షిణమ్మున వనములు తరులు గిరులు
జన పథమ్ముల నరయుచు జనుచు నుండ్రి. 245

# వానరులు ప్రాయోపవేశము చేయుట

చనుటయే గాని జనకజ జాడ లేదు
విసిగి వేసారి పోయిరి వెదకి వెదకి
జనక సుతఁ గాంచు నాసలు జావగారె
మిగిలె దుఃఖము వారికి మితము మీరి. 246

ఎంత వెదకిన గనమైతి మింతి సీత
ననుచు మిక్కిలి దుఃఖించి అంగదుండు
సూర్యసుతు మోము దానింక చూడ లేక
చెలగి ప్రాయోపవేశ సంసిద్ధు డాయె. 247

హనుమ యొక్కడు దక్క నయ్యంగదాది
సకల కపులును-బొగులుచు-స్వాంత మందు
యత్న మంతయు నిష్ఫల మ్మగుట నెంచి
చింత జెందుచు_చావ-సంసిద్ధు లైరి. 248

సీత నరయక కిష్కింధ జేరి నంత
రఘుకులాగ్రణి మరణించు-లక్ష్మణుడును
అన్ననుం జూచి మృతి జెందు _ నంత నర్క
సుతుడు మరణించు మరణింత్రు_హితులుగూడ. 249

అనుచు ప్రాయోప వేశులై - అగచరాళి
మిగుల దుఃఖితులై మది బొగులుచుండ
నాకటింగొన్న సంపాతి యనెడు పక్షి
చేరె నచటికి వారి భక్షింప గోరి. 250

ఆకటికి తాళలేకను నతి రయాన
వచ్చిచేరిన ఆ వృద్ధ పక్షిరాజు
పేరు సంపాతి వయసున పెద్దవాడు
అలజటాయువు సోదరుండవని నతడు. 251

కపులు పసచెడి శోకించు కారణమ్ము
నరసి సంపాతి రావణుం డనుజు జంపె
నంచు నెరిగి శోకమ్మును నాపు కొనుచు
కంట తడిపెట్టి - మరచె నాకటిని గూడ. 252

పక్షములు పాదములు లేని పక్షికులుని
పర్వతము డించి కపులెల్ల వజ్జ నిలువ
అనుజుకై చింత జేయుచు నా ఖగేంద్రు
డమిత శోకాత్ము డాయెను నాక్షణాన. 253

కొంత వడికంత సంపాతి చింత నుడిగి
అనుజు జంపిన దనుజు నాశనము గోరి
రావణుని జంప నర్హుడు రాముడంచు
సూక్ష్మ దృష్టిని స్ఫుటముగా జూచి - దెలిపె. 254

రావణుడు జానకిని తన లంక లోన
భద్రగతి నుంచె నంచు సంపాతి - కపుల
కెరుగ బలుకుచు - నిజము మీరెరుగ గలరు
మేటి యగువాడు వననిధి దాటి - చనిన. 255

ధరణి సుత లంకలో నున్న దనెడు వార్త
అంద జేయుడు; శ్రీరాము డసురు జంపు
నాడు తమ్ముని గూల్చిన ఆ దురాత్ము
డవని ద్రెళ్లుట ఆనంద మగును నాకు. 256

రామ చరితము దృష్టి నారసి ఖగేంద్రు
డమిత భక్తిని శ్రీరాము నపుడు దలుప
పాప విదళితు డాయె నప్పక్షి రాజు
పక్షములు పాదములు వచ్చె పక్షి కపుడు. 257

# వానరుల తర్కము

పక్షి సంపాతి వివరించు పాఠమెల్ల
వినిన వనచరు లతి ముదమును వహించి
అమల మౌ రాము పాదమ్ము లాత్మ నిలిపి
తర్క మొనరించి రంబుధి దాటు విధము. 258

జలధి మధ్యను నూరు యోజనము లేగి
ఘోర రాక్షస రక్షితా గార మైన
లంక జేరుట యెట్లు? ఆ రమణి సీత
గనుట యెట్లంచు తర్కింప-కపులు నపుడు. 259

గంధ మాదనులు_జూడ_గజుడు దారు
డంగదుడు గవాక్షుండాది యధిక బలులు
జటిల చల దూర్మికల నొప్పు జలధి దలచి
నీరు గారిరి-దాటగా నేర మనిరి. 260

తక్కుగల వానరులును నా తరుణ మందు
అంబునిధి దాటలేమనియనిరి-అంత
జాంబవంతుడు ముదిమిచే శక్తి చాల
దంచు దెలుపుచు నట నున్న హనుమ గాంచి. 261

తెలియు నాకు నీదగు భూరి బలము_చలము
అంజనీ గర్భ సంభూత! అనల తేజ!
యీ మహత్కార్య మొనరింప-యీవె వేగ
పూన వలె-నన్యులకు గాదు-పూర్వ పుణ్య. 262

బాల సూర్యుని గాంచి నీ పసి తనాన
ఫల మటంచును మదినెంచి-పట్టనెంచ
నబ్జభవు డప్డు నిను మెచ్చి యాదరమున
వరము లెన్నింటినో నీకు కరుణ నొసగె. 263

బ్రహ్మచారివి యెనలేని బ్రహ్మ తేజ
కలితుడవు-శీఘ్ర గమనము గలగు వాడ
నస్త్ర శస్త్రము లెవి నీకు హాని సేయ
జాల వెందును-నీ శక్తి జగము లెరుగు. 264

నీదు బలవిక్రమమ్ములు నీకు దెలియ
వంజనీ పుత్ర! దెలియు నాకంచు-జాంబ
వంతు డెరిగించి-యిప్పు డీ వనధి దాటు
సత్త్వుడ వనుచు నాతని శక్తి చాటె. 265

కాన జాప్యంబు వలదింక-కడలి దాటి
లంకలో జొచ్చి ఘనుడు శ్రీరాము భార్య
జాడ నారసి-వేరమ్ము! జయము నీకు!
అనుటయును జాంబవంతున కనియె హనుమ. 266

మీరు చింతింప వలదు నే మేదినీశు
నువిద వడిగాంచి అసురుల నుసురు పెట్టి
సకల దానవ సేనల సత్వ మెరిగి
లంక గాలించి వత్తు నిశ్శంక వృత్తి. 267

ధరణిజను గాన రాకుండ దానవులును
దాచి యుంచిన యెడల-నే దర్ప మూని
లంకనే ముంతు లవణాబ్ధి-రావణు నను
చరులతో గూడ నాదగు శక్తి గూల్తు. 268

ప్రభువు శ్రీరాము దూతనై పావనముగ
పయన మగు చుంటి లంకకు. వసుధ సుతను
కనుల గనుగొని వత్తు నందనుక మీర
లిటనె యుండు డటంచనె చటుల శక్తి. 269

అంగదుడు జాంబవంతుడు నఖిల కపులు
మోద మొందగ-శిరమును మోము వంచి
అతులసద్భక్తి మది గ్రమ్మ;నబ్ధి గడువ
మొదల రఘు రాము పదముల నెద దలంచె. 270

—[o]—

ఇది శ్రీ గురునాధేశ్వర వరప్రసాద సహజ కవితా సంప్రాప్త కాశ్య
పస గోత్ర మావుడూరి వంశ పవిత్ర-పార్వతీ అనంత రామయ
పుత్ర - బుధజన విధేయ రఘు రామ నామధేయ
ప్రణీతంబైన రఘురామ రామాయణము
నందు కిష్కింధకాండ సంపూర్ణము.



# రఘురామ రామాయణము

శ్రీ మహోదార సమభావ – స్నేహశీల
చారు భక్తి స్వరూప – విశాల హృదయ
విశ్వ విఖ్యాత తెన్నేటి విశ్వనాథ
అవధరింపుము నాదు రామాయణమ్ము.

# సుందర కాండ సుందరము

సుందరము లంక – రాముండు సుందరుండు
సుందరియె సీత – హనుమయు సుందరుండు
సుందర మశోక వన మిందు – అందు కొరకె
మునియు సుందర కాండంచు ననియె దీని.

# సుందర కాండ

## లంకాయాన సంరంభము

శ్రీ రఘూద్వహు సతి సీత క్షేమ వార్త
కనుగొనగ లంకకున్నేగ ఘనుడు హనుమ
అంగదుండును జాంబవదాదు లయిన
ప్లవగ వీరులు టురికొల్పు పయన మాయె. 1

భూమిజాత నన్వేషించు రామకార్య
నిర్వహణ దీక్ష తనువెల్ల నిండి యుండ
పవన సూనుని యుత్సాహ భావ మెల్ల
అంబరము దాకె దేవత లభి నుతింప. 2

ఆకృతిని బెంచి గగనమ్ము నంటి నంత
హర్ష పులకిత గాత్రులై యచటి కపులు
హనుమ గనుగొని విశ్వాస మను నయింప
ప్రస్తుతించిరి విజయ సంభావనమున. 3

తాను కుప్పించి యెగసెడు తరుణమందు
ధరణి తన పాద ఘాటికి తాళ దనుచు
ప్రక్కనే యున్న మాహేంద్ర పర్వతమ్ము
నెక్కి లంకకు హనుమంతు డేగ దలచె. 4

అంగదుడు - జాంబవంతుండు - నఖిల కపులు
పోయి రమ్మని వచియింప వాయుజుండు
పటుతరోత్సాహ యోగ విభ్రాజి తాత్మ
డా మహేంద్ర పర్వతముపై కరిగి నిలచె. 5

ఆ మహేంద్రాద్రి యందు నయ్యనిలజుండు
దివ్య మౌ మేని తేజమ్ము దెసలు నిండ
భీకరాకృతి నలరారి బింక మొప్ప
విహరణము చేసె గోపతి విధము దోప. 6

విలసితమ్మగు జలకల్ప ములను నలరు
లలిత వైడూర్య వర్ణ శాద్వలము లందు
ధైర్య మగ్గల మంద యథా సుఖాన
వెలసి విహరించె మారుతి వే విధాల. 7

అరయ మృగపతి కైవడి నా కపీశు
డదర ద్రోలెడి మృగముల నెదురు లేక
వృక్ష శాఖల నలరారు పక్షి గణము
నెగయ ద్రోలుచు క్రీడించె నగచరుండు. 8

వినుత కమలాకరము మధ్య దనరు నట్టి
మత్త గజమును బోలుచు మారుతియును
అమ్మహేంద్రాద్రి సమతల మందు నిలచి
కార్యసాధనకై దేవ గణము గొలిచె. 9

తండ్రి యగు వాయుదేవు నాత్మను దలంచి
రవిని- బ్రహ్మను- విష్ణుని- శివుని- దలచి
జయము చేకూర్చు డంచు నంజలి ఘటించి;
సకల దేవతాళిని భక్తి సంస్మరించె. 10

వాయునందను డయ్యాంజ నేయు డంత
ప్రియ సుహృత్తుల- పెద్దల- ప్రేరణమున
శీఘ్ర గతి నేగి లంకలో సీత వెదుక
నడుము బిగియించె నంబుధి నధిగమింప. 11

మొగము బిగియించి- పాదముల్ పుడమి నూది
వలయముగ వాలముం ద్రిప్పి - బాహు లూచి
అవని కంపింప- భీకర రవ మొనర్చి
కపి వరుండెగసె గిరి సగంబు కృంగ. 12

హనుమ వేగాన మూలమ్ము లదరి పెకలు
తరువు లతి దూర దేశమ్ము దనుక వచ్చి
చుట్టముల నంపకము పెట్టు నట్టి రీతి
హనుమతో కొంత దూరమ్ము నరిగె నపుడు. 13

కొండ కంపింప - అది మీద కూలు ననుచు
గుహలు వెడలిరి తపసులు క్షోభ నంది
సగము దినినట్టి అన్న భాజనములు విడి
పాత్రలను బట్టి యక్ష దంపతులు చనిరి. 14

జలనిధిని దాటి చనగ నిశ్చయ మొనర్చి
సదమ లానంద మయుడయి సంభ్రమ మున
నిండు పర్వాల బొంగెడు నీరధి వలె
పొంగి పులకించె న వ్వాయు పుత్రు డంత 15

చెట్టు కొమ్మల పూవులు పట్టు సడలి
జలజలా రాలె నక్కొండ శిలల పైన
సర్వతః పూలు నిండి యా పర్వతమ్ము
పుష్పగిరి వోలె గన్పట్టె పుడమి నుండి. 16

కొండ యందలి రాళ్లెన్నొ పిండి యాయె
ధరణి క్రుంగెను - మృగములు దద్దరిల్లె
వృక్షములు గూలె- పక్షులు నుపరి కెగసె
సర్పములు రాళ్ల నలిగి విషంబు గ్రక్కె. 17

ఉత్తముండగు నక్కపి సత్తముండు
సత్త్వ మొప్పార కుప్పించు సమయ మందు
గురిసె జలముల నప్పు డగ్గిరి వరుండు
మద గజమ్ములు గురిసెడి మదము మాడ్కి. 18

పీడ్య మానుండు నగు గిరి క్షిప్రిదులు నాద
మపుడు విలయాబ్ధి నిర్ఘోష మనుకరించి
సకల భూతాల గుండియల్ ఝల్లు మనగ
దశ దిశలు నిండి మార్మ్రోగి దడలు పుట్టె. 19

స్వస్తి కాంకిత ముద్రల వరలు చున్న
శిరము లొప్పారు భుజగమ్ము లురలు విషము
వెడల గ్రక్కుచు- రక్తాస్య మడర- శిలల
గరచె గ్రక్కున- గడు భయంకర విధాన. 20

కుపిత పన్నగముల వాడి కోర దవిలి
కొండ యందున్న బహుళమౌ గండశిలలు
పమ్మెటల పోటు దగులగా జలదరించి
పగులు రాళ్లట్లు "పట పట" పగిలె నపుడు 21

ఆ మహేంద్రాద్రి యందలి అహి విషమ్ము
నణప గలిగెడు నట్టి దివ్యౌషధములు
భుజగ చుంబిత శిలలందు భుక్త మైన
సర్ప విషవహ్ని వారింప జాల వయ్యె. 22

రోమములు గగుర్పొడచెడి రూపు నలరి
భూమిధర సమ దేహాన బొంగియున్న
హనుమ - మరియొక మారు రాముని దలంచి
అబ్ధి తరణోన్ముఖత్వమ్ము నంది చెలగె. 23

భీతి లేకుండ నొక చిన్న కోతి వాడు
నన్ను దాటుచు నుండ - నే మిన్న కున్న
లోకుపై పోదు మిక్కిలి లోకులకని
అంబరము దాక యుప్పొంగె నంబుధియును. 24

జనుల హింసించు రాక్షస చయము మీద
ప్రబల గతి నేగు రాముని బాణ మటుల
తండ్రి వాయువు సాయమై దవిలి యుండ
గగనమును చీల్చుకొను చేగె కపి వరుండు. 25

వాయు పథమున జనుచున్న వాయు సుతుడు
రామ కార్య నిర్వహణాను రక్తి మునిగి
దివ్య తేజః ప్రపూర్ణుడై దిశలు వెలుగ
మేరుపర్వత తనుకాంతి మెరయు చుండె. 26

వివిధ సంధ్యల గగనాన విరిసి నట్టి
పుష్ప వర్ణ తుల్యమ్మైన భూతి దనరు
వారి దాకర్షణైక సంపద వహించి
దర్శనీయుండు నై యొప్పె తరుచరుండు. 27

క్రమ కాంతుల విరజిమ్ము కపి కులాఢ్యు
నిడుద బాహువులును గాలి నెట్టు వేళ
శైల శిఖరాగ్ర వల్మీక శిఖల నలరు
పంచ ముఖ సర్పముల భంగి ప్రభల నొప్పె. 28

గగనమును మ్రింగగా జను గతిని- నబ్ధి
నీరముల ద్రాగుటకు నయి కోరి యెగసి
పరుగు లిడు నట్టు లొప్పె - న ప్పవన తనయు
డంబరాంగణ మందున నరుగు వేళ. 29

తీవ్రగతి వాయు మార్గాన దీప్తి నరుగు
హనుమ కన్గవ పొల్చె నత్యరుణ కాంతి
నమల ఘృత యుక్త హోమ గుండముల పగిది
మినుకు మినుకున నింగిలో మెరసి మెరసి 30

గగనమును గప్పి- నా మబ్బు గముల మధ్య
అవనిపతి కార్య మరయంగ నరుగు చున్న
హనుమ కన్నులు దీపించె- నంబరాన
నుదితులగు సూర్య చంద్రుల నొప్పు చుండి 31

తామ్ర వర్ణంపు నాసిక దళుకు లీన
అరుణ కాంతులు విరజిమ్ము హనుమ మోము
అద్భు తాద్భుత శోభల నలరుచుండి
సంజ కెంజాయ రవిబింబ సరణి నుండె. 32

అరయ నరుణాస్య సిత దంష్ట్రి డైన హనుమ
వాల వలయ విలసితుడై వనధి పైన
లీల మెరయుచు మందార మాల దాల్చి
తప్త కిరణుని చందాన తృప్తి నొసగె. 33

అరుణ రాగ రంజిత మైన ఆకసమున
కపివరుం డొప్పె భాస్వర గైరి కాది
ధాతు సంకీర్ణమై సదా తళుకు లీను
వివిధ వర్ణ వర్ణిత గిరి విధము గాను. 34

అనిల సుతు డట్లు త్వరగతి నరుగు వేళ
హర్ష ముప్పొంగ సకల దేవర్షి గణము
'సిద్ధి యగు కార్య' మంచు నాశీర్వదించి
రంత జయ నాట్యములు సల్పి రప్సరసలు. 35

నందనోద్యాన వికసిత నవ్య కుసుమ
గంధముల దోగి విసరెను గాలి - అపుడు
సూర్యుడును చంద్రముం బోలి శోభ లెసగ
శీతల స్పర్శు డాయెను స్నిగ్ధ మతిని. 36

అరయ పదునాల్గు భువనము లందు గలుగు
సకల జీవులు హనుమను సంస్తుతింప
రామ కార్య జయమ్మున లక్ష్య ముంచి
అమిత వేగాన జనుచుండె ననిలజుండు. 37

## మైనాకుడు

అటుల పయనించు మారుతి నచట గాంచి
అంబునిధి యోచనము చేసె - నయ్యొ! యితడు
సగర వంశీయు కార్యాన జనుచు నుండె
సాయ మొనరింప నిది మంచి సమయ మనుచు. 38

సగరు కరుణను గాదె నే సాగరుండ
నయితి - నది గాక గోరె నన్నమర విభుడు
హనుమకును సాయ మొనరింప - అందు వలన
అలసటలు దీర్ప మైనాకు నంప నెంచె. 39

అబ్ధి యానతి మైనాకు డా క్షణాన
గగన మార్గాన నడ్డమై కాన బడిన
తీవ్ర కుపితాత్ముడై మారుతియు జ్వలించి
వక్ష మగులగ కడువడి వాని నేసె. 40

దెబ్బలం దిన్న మైనాక ధీవరుండు
తత్క్షణము మానవాకృతి దాల్చి - కొండ
శిఖరమున నిల్చి - హనుమకు చేతు లెత్తి
మ్రొక్కి - పలికెను - తన మతమును వచింప. 41

అన్న! శతయోజనమ్ము లీ వరుగ వలయు
నొక్క ఊపున - మార్గాన నుదధి దక్క
శ్రమము వాయగ ననువైన స్థలము లేదు
వేడ్క నొక్కింత నావయి విశ్రమించి. 42

అవల జనుమన్న! నీ భుజాగ్రముల నున్న
కార్య మది - లోక కళ్యాణ కార్య మన్న!
ఆకటిని బోవ కడువేగ మలసి - కార్య
భంగ మగునని మాకున్న భయము; వినుము. 43

ఓ కపీశ్వర! గాలిచే మాగులాడు
చెట్ల నీడల్ల నొక్కింత సేద దేరి
మధుర ఫలముల భక్షించి - మహిత శక్తి
సంతరించుక ముందుకు సాగి మయ్య. 44

అబ్ధియును వాసవుండాది- అమరు లెల్ల
నీకు విశ్రాంతి కల్పించు నెపము మీద
నన్ను ప్రేరేపణము సేయ- సన్నుతాత్మ!
వచ్చినాడను వేరొండు వరుస గాదు. 45

అదియు నుంగాక నొక్క నా డమర విభుడు
కొండలకు గల్గు ఱెక్కలు కోయు వేళ
అమిత కరుణార్ద్రి హృదయుడై అనిల దేవు
డరయ గాపాడె నన్ను- నియ్యబ్ధి దాచి. 46

అతని సుతుడవు- నీవు! నాకతిధి వనఘ!
పూజ్యుడవు రామ కార్యము పూని జనెడు
మాన్యుడవు గావె? మన్నించి మాట నిల్పి
నన్ను కృత కృత్యు గావింపు మన్న! మరియు; 47

అతిధి చనుదేర నాతిధ్య మంచితముగ
నీని వాడెట్టి వాడైన కాని వాడె!
గాన- నా విన్నపము విని - కపి వరేణ్య!
అతిధి వగుచు పొందు మిట నా ఆదరమ్ము. 48

అనుచు నర్థించు మైనాకు నభినుతించి
అనియె మారుతి - రామ కార్యార్థ మరుగు
సమయ మిది - వ్యర్థముంజేయ జనదు - గాన
నన్ను మన్నించి పంపుమో అన్న! యింక. 49

గాయ పరచితి నిన్ను రాక్షసుడ వంచు
అరయ నైతి మిత్రుండ వంచద్రి వరుడ!
తప్పు క్షమియింపు మని చేత తడిమి నంత
గాయము లతని దేహాన మాయమాయె. 50

సగరు కరుణను గాదె నే సాగరుండ
నయితి - నది గాక గోరె నన్నమర విభుడు
హనుమకును సాయ మొనరింప - అందు వలన
అలసటలు దీర్ప మైనాకు నంప నెంచె. 39

అబ్ధి యానతి మైనాకు డా క్షణాన
గగన మార్గాన నడ్డమై కాన బడిన
తీవ్ర కుపితాత్ముడై మారుతియు జ్వలించి
వక్ష మగులగ కడువడి వాని నేసె. 40

దెబ్బలం దిన్న మైనాక ధీవరుండు
తత్క్షణము మానవాకృతి దాల్చి - కొండ
శిఖరమున నిల్చి - హనుమకు చేతు లెత్తి
మ్రొక్కి - పలికెను - తన మతమును వచింప. 41

అన్న! శతయోజనమ్ము లీ వరుగ వలయు
నొక్క ఊపున - మార్గాన నుదధి దక్క
శ్రమము వాయగ ననుపైన స్థలము లేదు
వేడ్క నొక్కింత నావయి విశ్రమించి. 42

అవల జనుమన్న! నీ భుజాగ్రముల నున్న
కార్య మది - లోక కళ్యాణ కార్య మన్న!
ఆకటిని బోవ కడువేగ మలసి - కార్య
భంగ మగునని మాకున్న భయము; వినుము. 43

ఓ కపీశ్వర! గాలిచే నూగులాడు
చెట్ల నీడల్ల నొక్కింత సేద దేరి
మధుర ఫలముల భక్షించి - మహిత శక్తి
సంతరించుక ముందుకు సాగి మయ్య. 44

అబ్ధియును వాసవుండాది- అమరు లెల్ల
నీకు విశ్రాంతి కల్పించు నెపము మీద
నన్ను ప్రేరేపణము సేయ- సన్నుతాత్మ!
వచ్చినాడను వేరొండు వరుస గాదు. 45

అదియు నుంగాక నొక్కనా డమర విభుడు
కొండలకు గల్గు ఱెక్కలు కోయు వేళ
అమిత కరుణార్ద్ర హృదయుడై అనిల దేవు
డరయ గాపాడె నన్ను- నియ్యబ్ధి దాచి. 46

అతని సుతుడవు- నీవు! నాకతిథి వనఘ!
పూజ్యుడవు రామ కార్యము పూని జనెడు
మాన్యుడవు గావె? మన్నించి మాట నిల్పి
నన్ను కృత కృత్యు గావింపు మన్న! మరియు; 47

అతిథి చనుదేర నాతిథ్య మంచితముగ
నీని వాడెట్టి వాడైన కాని వాడె!
గాన- నా విన్నపము విని - కపి వరేణ్య!
అతిథి వగుచు పొందు మిట నా ఆదరమ్ము. 48

అనుచు నర్థించు మైనాకు నభినుతించి
అనియె మారుతి - రామ కార్యార్థ మరుగు
సమయ మిది - వ్యర్థముంజేయ జనదు - గాన
నన్ను మన్నించి వంపుమో అన్న! యింక. 49

గాయ పరచితి నిన్ను రాక్షసుడ వంచు
అరయ నైతి మిత్రుండ వంచద్రి వరుడ!
తప్పు క్షమియింపు మని చేత తడిమి నంత
గాయము లతని దేహాన మాయమాయె. 50

అంతయును గాంచి మఘవు డత్యంత ప్రీతి
నగ కుమారుని కృషికి నానంద మంది
వజ్రమున భీతి లేకుండు వరము నొసగి
గౌరవించెను మైనాకు కరుణ నలరి. 51

## సురస హనుమ నడ్డగించుట

త్వరిత గతి నంత హనుమంతు డరుగు చుండ.
సురల పనుపున సురసను ఉరగ మాత
వికృత రూపాన హనుమ వివేక మరయ
నా హరింతును నిన్నని అడ్డు నిలచె. 52

వందనము చేసి నామెతో వాయుజుండు
తల్లి! రామ కార్యార్థము దరలు వాడ!
పని ముగించుక వత్తు నందనుక నన్ను
కనికరింపుము:- విడువు మీ గడియ యందు. 53

రావణుడు - దుష్ట హృదయుడు! రాము సతిని
మాయచే గొని పోయె నమానుషముగ
ఏడ నుంచెనొ? నేనేగి జాడ నరసి
తిరిగి వచ్చి నీ యాకటిం దీర్తు ననగ. 54

అలిగి - కపి జూచి - యా భుజంగాంబ - అపుడు
కను గొనల నగ్నులను రాల్చి - కడు భయంక
రాకృతిని దాల్చి - నిను పీడ నముచు బలికి
నోరు దశయోజనమ్ములు మీర దెరచె. 55

హనుమ వింశతి యోజనాయతుడు నగుచు
బరగి నంతన-యా నాగ పడతి - కినుక
మీర మరి పదింతలు గాగ మేను బెంచి
నోరు దెరచిన యంత సమీర సుతుడు. 56

పెంచె తన దేహము మరింత పెద్దదిగను;
అసురి తన నోరు శతయోజనాయతముగ
దెరచుటయు - కపి తన మేను కురుచ పరచి
నచ్చెరువు గొల్పె నంగుష్ఠ మంత యగుచు. 57

నూరు యోజనములు గల నోట దూరి
గర్భ కుహరము సొచ్చి తా నిర్భయముగ
వెలికి జను దెంచె - నమరులు వెరగు పడిరి;
హనుమ యుక్తిని గాంచిన అసుర రూపి. 58

సురలు కోరిన నీ లావు చూడ గోరి
వచ్చి దెలిసితి నీ యుక్తి వాయు పుత్ర!
రఘు కులీనుని కార్య నిర్వహణ కీవె
దగిన వాడవు! జయము నీ కగు నటంచు. 59

సురస దీవించి నిజ లోక మరిగి నంత
నతుల నవ కాంతి నలరెడు నాకసమున
ధరణి పతి కిన్క రాక్షస తతుల పైన
బరపు చిచ్చర పిడు గట్లు బార దొడగె. 60

అద్భుతాశ్చర్యముల గొల్పు నతి విశేష
మట్టి యిక్కర్మ - రామ కార్యమ్ము నందు
జయము చేకూరు సూచన! జగము మెచ్చు
శూరుడు - వివేకి - మారుత సూను డరయ. 61

# ఛాయా గ్రాహిణి సింహిక

ఛాయ గ్రహియించి జీవుల చంప గలుగు
సింహికా నామ రాక్షసి శీఘ్ర మపుడు
ప్రబల జవమున నరిగెడు పవన సుతుని
గాంచి ముదమంది తనమది నెంచె నిటుల. 62

అబ్ధి వసియించు నా కిట నాహరింప
మృగ్యమై పోయె నలుసంత మృగము కూడ
పెద్ద కాలమ్ము నకు దెచ్చి పెట్టె నేడు
బ్రహ్మ - నాక్షుత్తు దీర్ప నీ పర్బల మేకము. 63

ఈ మేకమ్మును - నిజము! నే నీప్సితమ్ము
దీర భక్షించి_ నాక్షుత్తు దీర్చు కొందు
అని విజృంభించి సింహిక ఆ క్షణాన
హనుమ ఛాయను తిగిచె బిట్టలుక బూని. 64

ఛాయ తిగిచిన యా మరు క్షణము_హనుమ
శక్తి క్షీణించె _ గమనము _ సత్వ ముడిగె;
సింహ శత తేజు డగు వాని చేయి-కాలు
కదలికలు మానె - దేహాన కంప మొదవె. 65

గగన యాన నిమగ్నుడై గదలు హనుమ
ఎరుగ డా సింహికాసురి యెత్తు గడలు;
తీవ్ర సంచలి తాత్ముడై _ దిగులు చెంది
సుంత యోచించె _ చింతించె — నంత లోన. 66

అరయ ప్రతిలోమ మారుత మతి విచిత్ర
గతిని నావను గన ప్రతి హత మొనర్చు
భంగి- యే దుష్ట శక్తియో ప్రబలి నాదు
శక్తి యుక్తుల బోకార్చి - సత్వ ముడిపె. 67

అయ్యో! యిపుడేమి సేతు? మా అయ్య-రామ
భద్రు - డవనిజం గానక బ్రతుక గలడె?
ఆస నాయుందు నుంచె _ నేనైతి నిట్లు;
ఏమి సేయుదు? నికపైన నేది తెరగు? 68

ధైర్య మొదవింప జాంబవదాంగదాది
సఖులు దరిలేరు - నరయ నీ సమయమందు
సూర్య సుతుడును - నా తండ్రి సూర్య కులుడు
దూరమున నుండి రిక యేది త్రోవ నాకు? 69

అనుచు చింతించు నంతలో హనుమ యందు
మేలు కొనె నేదియో శక్తి! లీల మెరసి;
ఆపదలు ముంచు వేళ నిట్టిన- కార్య
సిద్ధి యెటు గల్గు నని కపి చింత చేసె. 70

ఆ పదలు ముంచు సమయము లందు ప్రాణి
మంద_బుద్ధిని విడనాడి మాయ జీల్చి;
స్వామిపై నమ్మకము నుంచి_శక్తి జూప
జయము చేకూరదే! తీవ్ర భయము దొలగి. 71

తీక్షణమె రాము దలపోసి తరుచరుండు
చింత నొందుచు గూర్చున్న సీత జాడ
నరయుటది యెట్లు? లంకకు నరుగు టెట్లు?
సూర్య కుల దీపకుని మోము జూచు టెట్లు? 72

రావణుం గాంచు టది యెట్లు? రమణి సీత
జాడ గాననిచో లంక జలధి ముంచు
కార్య మది యెట్లు? నేను నిష్కారణముగ
చింత జేయుచు కూర్చుంటి - సిగ్గు చేటు. 73

అనుచు; చెంత నెవ్వరు లేమి తనకు దానె
ధైర్యమును గూర్చు కొంచును తక్షణమ్ము
స్వామిపై భారమును నుంచి - శక్తి వరల
దీని నెటులైన నిపుడు ఛేదించ వలయు. 74

అబ్ధి వసియించు నా కిట నాహరింప
మృగ్యమై పోయె నలుసంత మృగము కూడ
పెద్ద కాలమ్ము నకు దెచ్చి పెట్టె నేడు
బ్రహ్మ - నాక్షుత్తు దీర్ప నీ పత్రిబల మేకము. 63

ఈ మేకమ్మును - నిజము! నే నీప్సితమ్ము
దీర భక్షించి - నాక్షుత్తు దీర్చు కొందు
అని విజృంభించి సింహిక ఆ క్షణాన
హనుమ ఛాయను తిగిచె బిట్టులుక బూని. 64

ఛాయ తిగిచిన యా మరు క్షణము-హనుమ
శక్తి క్షీణించె - గమనము - సత్వ ముడిగె;
సింహ శత తేజు డగు వాని చేయి-కాలు
కదలికలు మానె - దేహాన కంప మొదవె. 65

గగన యాన నిమగ్నుడై గదలు హనుమ
ఎరుగ డా సింహికాసురి యెత్తు గడలు;
తీవ్ర సంచలి తాత్ముడై - దిగులు చెంది
సుంత యోచించె - చింతించె - నంత లోన. 66

అరయ ప్రతిలోమ మారుత మతి విచిత్ర
గతిని వావను గన ప్రతి హత మొనర్చు
భంగి- యే దుష్ట శక్తియో ప్రబలి నాదు
శక్తి యుక్తుల బోకార్చి - సత్వ ముడిపె. 67

అయ్యో! యిపుడేమి సేతు? మా అయ్య-రామ
భద్రు - డవనిజం గానక బ్రతుక గలడె?
ఆస నాయందు నుంచె - నేనైతి నిట్లు;
ఏమి సేయుదు? నికపైన నేది తెరగు? 68

ధైర్య మొదవింప జాంబవదాంగ దాది
సఖులు దరిలేరు - నరయ నీ సమయమందు
సూర్య సుతుడును - నా తండ్రి సూర్య కులుడు
దూరమున నుండి రిక యేది తోవ నాకు? 69

అనుచు చింతించు నంతలో హనుమ యందు
మేలు కొనె నేదియో శక్తి! లీల మెరసి;
ఆపదలు ముంచు వేళ నిట్టైన- కార్య
సిద్ధి యెటు గల్గు నని కపి చింత చేసె. 70

ఆ పదలు ముంచు సమయము లందు ప్రాణి
మంద_బుద్ధిని విడనాడి మాయ జీల్చి;
స్వామిపై నమ్మకము నుంచి_శక్తి జూప
జయము చేకూరదే! తీవ్ర భయము దొలగి. 71

తీక్ష్ణమె రాము దలపోసి తరుచరుండు
చింత నొందుచు గూర్చున్న సీత జాడ
నరయుటది యెట్లు? లంకకు నరుగు టెట్లు?
సూర్య కుల దీపకుని మోము జూచు టెట్లు? 72

రావణుం గాంచు టది యెట్లు? రమణి సీత
జాడ గాననిచో లంక జలధి ముంచు
కార్య మది యెట్లు? నేను నిష్కారణముగ
చింత జేయుచు కూర్చుంటి - సిగ్గు చేటు. 73

అనుచు; చెంత నెవ్వరు లేమి తనకు దానె
ధైర్యమును గూర్చు కొంచును తక్షణమ్ము
స్వామిపై భారమును నుంచి - శక్తి వరల
దీని నెటులైన నిపుడు ఛేదించ వలయు. 74

అనుచు మదినెంచి దశ దిశ లరసి నంత
జలధి జలముల నొప్పారు జంతు వొకటి
కంట బడ_ విస్మితుండయి కపి వరుండు
దర్పి తేక్షణుడై మహోదగ్ర వృత్తి. 75

అర్కజుడు నాడు దెలిపిన అసుర రూపి
యిదియె యై యుండనోపు_సింహికయె నిజము!
ఇక నుపేక్షింపగా నాకు హితము గాదు
జంప వలె దీని నాదు దోశ్శక్తి నంచు. 76

వృష్టి సమయాన గగనాన పెచ్చరిల్లు
కారు మేఘమ్ము పోల్కి నక్కపి వరుండు
జృంభితుం డగు చుండుట జూచి యసురి
కరకు బుద్ధిని వాడి వక్త్రంబు దెరచి. 77

అర్చి పేర్చిన_ జూచి; నయ్యనిల సుతుడు
ఘోర భయదమ్ము నగు నొక్క గుహను బోలు
దాని వక్త్రము గాంచి – విజ్ఞాన మతిని
తనువు కొంచము చేసి తత్తరము నణచి. 78

దారుణాశని గతి నంత దాని వదన
గహ్వరము జొచ్చె - భాస్కరు గడగి మ్రింగు
రాహు గ్రహమట్లు యది మ్రింగె; ప్రబల దుఃఖి
తాత్ము లయినార లది గాంచి నమర వరులు. 79

అంతటం గొంత వడికి నయ్యనిల సుతుడు
కరుకు గోళ్లను సింహిక కడుపు జీల్చి
రక్త సిక్తాంగుడై గ్రహ రాజు వోలె
వేగ తన్ముఖమును వీడి వెడలి వచ్చె. 80

నేర్పుగా దాని దేహము నిర్గమించి
చచ్చిపడియున్న సింహిక శవము బట్టి
కొంత దూరము గొంపోయి కోతి బంటు
ద్రోసె నద్దాని వెస సముద్రోదకముల. 81

అద్భుతమ్మైన నిక్కర్మ నరసి - దివిని
సతము చరియించు భూతముల్ - స్వామిదూత
వద్ద కరుదెంచి- చేసిరి వందనములు
తలచు కొను చెద హనుమ సత్కార్యములను. 82

కర్మ లద్భుతములు నాల్గు కపి కుమారు
డాచరించిన - జూచి - నయ్యె నిమిషాది
గగన చర ప్రాణు లెల్లరు కదలి వచ్చి
స్వస్తి బల్కిరి నట "విజయోస్తు"టంచు. 83

## హనుమ లంకను సమీపించుట

వారి మంగళ కరమైన వాక్కు లెల్ల
తలను దాలిచి శ్రీ గరుత్మంతు నట్లు
శీఘ్ర జవమున తా నేగి చేరు కొనియె
కడలి కవ్వలి తీరమా గాడ్పు పట్టి. 84

వివిధ గుల్మ లతా వృత - వివిధ వృక్ష
భూషితమ్మును నుపవన పోషితమ్ము
సాగరా వృత సౌందర్య సార జనిత
శోభితమ్మైన లంకను జూచె హనుమ. 85

అపరిమిత మోదముప్పొంగ - ఆత్మ విరిసె
భూరి వారిద పై ఖరి భువన మెల్ల
వ్యాప్తి జెందిన నిజదేహ మరసి - హనుమ
వెరగు పడి యోచనము చేసె వివిధ గతుల. 86

అకట! యీ దేహమున లంక కరిగి తేని
కార్య భంగము కల్గు – రాక్షసుల చేత
జిక్కుటది తథ్య మని యెంచి – చిన్న రూపు
తాల్పగా నిశ్చయము చేసె తరుచరుండు. 87

జలజ హితుడు పశ్చిమ గిరి సానువులను
చేరుటకు పూర్వమే కపి శేఖరుండు
అంబరము డిగ్గి యట సువేలాద్రి వ్రాలె
సకల ఋషులు ననిమిషు లాశ్చర్య మంద. 88

పవన తనయుని పదహతి పర్వతమ్ము
కదలి కంపింప– సకల వృక్షమ్ము లూగ;
రాలి పడె పూలు– నట ఖచరాళి– మోద
మొప్ప గురియించు సుమ వర్షమో యనంగ. 89

అరయ మైనాక గిరివరు నాశ్రయ మున
కరగి తడయక – సురసకు కట్టు వడక
సింహికరు జిక్కకయె కపిసింహు – డబ్ధి
గడచి – అలయక జేరె లంకా పురమ్ము. 90

ఎక్కడను నాగ కుండగ నేక బిగిని
వేల యోజనములు నేగ జాలు హనుమ
రెక్క లార్పక – పరికింప లెక్క గొనక
దాటె శత యోజనముల సంద్రమ్ము నపుడు. 91

లోక కళ్యాణమును మదిలో దలంచు
స్వార్థ రహితుండు హనుమకీ సంద్ర మెంత?
గ్లాని నందక – నొక్కింత కష్ట మనక;
దాట శక్యమ్ము కాని సంద్రమ్మును దాటె. 92

# హనుమ లంకను గాంచుట

అన్యులకు వీలుగాని మహాబ్ధి గడచి
కాంక్షితమ్మగు శ్రీరాము కార్య మరయ
భాస్కరుడు పశ్చిమాంబుధి గ్రాలక మునె
అలరె హనుమన్న ఆ సువేలాద్రి శిఖరి. 93

లలిత పల్లవ ఫల పుష్ప విలసితములు
గిరి వనంబుల మారుతి కెరలి జూచి
కొంత వడి విశ్రమించి ప్రశాంతి నొంది
కార్య దీక్షా నిమగ్నుడై కనుల యెదుట. 94

ఉన్నతోన్నత శిఖరాల నుదధి తటిని
శ్రీ త్రికూటాద్రి శిఖరిని సిరులు తొణక
నపరిమిత శోభలను గల్గి యలరు చున్న
సురుచిరమ్మైన లంకను జూచె హనుమ. 95

మహిత కాంచన ప్రాకార మండితమ్ము!
కనక గోపుర చుంబితాకాశ పథము!
మణి మయాంచిత ఘన కుడ్య మందిరములు!
అమర పురి బోలు లంకా మహా పురమ్ము! 96

శత్రు దుర్భేద్యమై – సర్వ జగములకును
క్రూర రాక్షస భట కోటి ఘోర కృత్య
కారణమ్మున భయదమై తేరి జూడ
గా నశక్యమ్ము పృథ్వి లంకా పురమ్ము! 97

జాజి కురవక కరవీర చంపకాది
వివిధ సుమలతా సౌందర్య విశ్వ వినుత
పదములో ద్యాన మండితాశ్రయ విభూతి
గలిగి వెలుగొందు చుండు లంకాపురమ్ము. 98

కమలములు కల్వ పూవులు గలిగి వెలయు
వార్ధి గంభీర పరిఖా ప్రవాహములను
శత్రువుల కంతు జిక్కక – జగతి భీక
రా కృతిని దనరారు లంకా పురమ్ము. 99

కమ్ర మణి రత్న ఘన దీప కాంతు లెలయు
బహుళ సుందర ఘన సౌధ ప్రతతి తోడ
పవన పథ మంటి – శోభల పనల జేయి
దీపితమ్మయి వెలయు లంకాపురమ్ము. 100

భీక రాకార రాక్షసుల్ – భీతిలేక
ఆయుధమ్ములు చే దాల్చి యనవరతము
కంటికిని ఱెప్పలా – సెప్ప గాచుచుండ
నేపు దనరారు భువిని లంకా పురమ్ము. 101

కాంచి యరుదంచి – యేరికిం గాన బడక
అకసమ్మంటు చెట్లపై ననిల సుతుడు
దుముకుచును దుముకుచు కొంత దూరమేగి
ఉత్తర ద్వారమును జేరె తత్తరమున. 102

గుప్తముగ నున్న వాకిలి గుమ్మ మచట
కాంచి – రావణు నూహించి – కపియు నపుడు
శత్రు బలమును తర్కించి – జయము కొరకు
మదిని చింతించి యోజించె మరల మరల. 103

అకట! యీ లంక జూచిన – నమర వరుల
కైన సాధింప శక్యమ్ము కాని దగును
కపి బలము లెట్లు వచ్చి రాక్షసుల నోర్చి
అనిని గెల్తురు? గెలువ శక్యంబె తలప. 104

రావణుని లంక సైన్య సంరక్షితమ్ము
విషమమై యుంట రాముడే విధిని నిటకు
నరుగు దెంచును? వచ్చిన నసుర పతిని
సమర మందున నిర్జింప శక్య మొక్కొ? 105

సామ సాధ్యము కాదు రాక్షసుల లంక!
దాన సంప్రసక్తి నిచట దలప రాదు
భేదమున కిద్ది జూడ నభేద్య - మరయు
దండ నోపాయ మొకడె సాధనము తోచు. 106

అనుచు యోచించి మది నెంచి అనిల తనయు
డిప్పు డిది యేటి చింత? నేనేగి జనక
తనయ జాడ నెరింగి రామునకు దెల్ప
నతడె దెలుపు నరిని హతమార్చు విధము. 107

క్రూర కర్ములు ధృడ బలుల్ కుటిల మతులు
రాక్షసులు గాచు చున్నట్టి లంక యందు
వారి కగ పడ కుండగ పగటి వేళ
చొర నశక్యము - రేప్రొద్దు నరుగ వలయు. 108

అని తలంచి హన్మంతు డా యద్రి వనుల
కొలను లను పక్షి గణముల కలయ గనుచు
కొంత వడి వేచియుండిన యంత - నిశియు
దరిసె! నల్లడ చీకట్లు విరిసె మిగుల. 109

ఆకసమ్మందు పొడసూపి నట్టి చంద్రు
డరయు గన్పట్టె సరసిలో హంస భంగి
జగము సర్వము నిండిన చంద్ర కాంతి
పండె మింటను చలువల పంట దోప. 110

సమయ మిది యంచు నమ్మహా సత్త్వ డంత
తనను గనలేని అల్పాకృతిని ధరించి
జనక సుత జాడ నరయు నుత్సాహ మూని
చొర నశక్యమౌ లంకను జూచె - మరల. 111

అకట! అమరావతిం బోలు నంత పెద్ద
నగర మీ లంక! యెటు జూడ గగన మంటు
భవనములు - రాజ మందిరాల్ బంతి దీరె!
నెందు వెదకుదు? జనకజ నేడ గందు? 112

క్రూరు లగు రాక్షసులు గాన కుండ నేను
జొత్తు నేరీతి దీనిని? శోక మగ్న
జనక సుత నెట్లు గాంచెద? సైన్య రక్షి
తమ్ము పురమెల్ల! వెదుక శక్యమ్మె నాకు? 113

లెక్కకును నక్కజమ్మయి దిక్కు లెల్ల
రక్కసులు గ్రమ్మి; ద్రిమ్మరి; రాత్రి బవలు
రక్షణము సల్పు చుండ నీ లంక యందు
నెటుల చొర నగు? జానకి నెచట జూతు? 114

అనుచు పరిపరి చింతించి అగచరుండు
భారమంతయు శ్రీరాము పైన నునిచి
కొంచ మగు రూపమును దాల్చి - కోసలేంద్రు
సతిని వెదుకగ సన్నద్ధ మతి వహించె 115

## లంకిణి

పురము ప్రాకారమును జేర నరిగి నంత
అచట గూర్చున్న 'లంకిణి' యన్న యసురి
అడ్డగించుచు నెవడ వంచరచి - యపుడె
మీద పడబోవ మారుతి మెల్లగ ననె. 116

కాయ గసురులు దినియెడి కపిని నేను!
భేద "మిది యది" యని యెందు లేదు మాకు
గహనములు _ పట్టణమ్ములు - కాయ గసురు
కొరకు దిరుగాడు చుండెడి _ కులము మాది. 117

లోన బహు ఫల వనములు గాన బడుట
చపల మయె బుద్ధి - జిహ్వయు చపల మాయె
చపల తత్వమె _ మా కోతి జాతి గుణము!
తప్పు దలపరు _ మముజూచి ధరణి నెవరు. 118

జరుగ బోదెట్టి హాని ముజ్జగము అందు
కపుల వలన నిజమ్ము _ లంకా నివాసి!
కరుణ గని నన్ను పురిలోని కరుగ నిమ్ము
క్షుత్తు దీర్చక తల్లి! వే వత్తు ననగ. 119

వినక లంకిణి "నిను జంపుదు" నని దుముక
పావనియు దీర్ఘ ఘాపాన ప్రబలి - వేగ
నసురి మొగమున నిరు చేతు లప్పళింప
గిలగిలంబడి రక్కసి నేల కొరిగె. 120

పావనియు లంకిణింబట్టి లేవ నెత్తి
పుడమి యదరగ మఱియొక పోటు పొడువ
గ్రక్కునను తూలి నెత్తురు గ్రక్కు కొనుచు
హీన నిస్వనమున _ నామె యిట్టులనియె. 121

బ్రహ్మయును మున్ను నాతోడ బలికె నిటుల
కోతి యొక దేగుదెంచి నిన్ కొట్టి - గూల్చి
లంక గాల్చును - నటు పయి శంక లేక
లంక నశియించు - నశియించు రావణుండు 122

పరుల భార్యల చెరబట్టి బలుడ నంచు
విఱ్ఱవీగెడి దనుజుండు వెఱ్ఱి గాదె
గ్రహచయమ్ముకు చెడు - కాని కాలమందు
నీళ్ల పై సుళువుగ దేలు రాళ్లు గూడ. 123

అనుచు నెత్తురు ధారగా దనుజ వనిత
గ్రక్కు కొను చుండగా నాభి గాలి యాగె
ప్రబల లంకిణి జచ్చి నేల పయి వ్రాలె
భూత పంచకము భయాన పొగిలి పోయె. 124

లంకిణిం గూల్చి నిర్వృతి రామ దూత
ప్రభుని పాదమ్ములను మది పదిల వరచి
భార మంతయు నాతని పైన నిడుచు
జనక జాన్వేషణమునకై సాగి పోయె. 125

వెన్నెలల వెల్గులో పురి వెలుగు చుండ
గాంచి ముదమంది - యకట! లంకాపురమ్ము
ఎంత సొగసైన దహ! యొక కాంత కతన
బ్రతికి చెడు నిప్పు డీ లంక ధ్వంస మగుచు. 126

క్షితిని నెవ్వారు దీని రక్షింప లేరు!
పాప ఫల మనుభూతమై ప్రబల కున్నె?
వామ పాదము మును పెట్టి వానరుండు
రాజ మార్గాన నడచె భద్ర గతి బూని. 127

అచట నా రాజ మార్గాన ననిల సుతుడు
కాంచె బహు పుష్ప పాదప క్రమ మగుచు
స్వచ్ఛ ముక్తా ఫలాంచిత జాలకముల
పరమ సౌందర్య ఘన సౌధ పంక్తుల నట. 128

దీప్త కాంచన స్తంబాల దీరి - శాత
కుంభ శిఖరాల నందాల గూర్చు సౌధ
రాజి - అంబుదములు గప్ప రక్తి నలరు
గగన మట్టుల గన్పట్టె కనులు సెదర. 129

విచ్చు కత్తులు చే దాల్చి వెరపు వీడి
సతము చరియించు నట్టి రాక్షస భటాళి
వివిధ వికృత రూపమ్ముల వీధి వీధి
దిరుగు చుండుట గనె కపి వరుడు నచట. 130

రాజ మార్గ గతుండయి రామ దూత
భీతి యను మాట లేక నభేద్యమైన
భవనముల నంతి పురము లభ్యంతరములు
కంట వత్తులు దాలిచి కలయ వెదకె. 131

పరుల సంచారమే లేని తరుణ మరసి
సూక్ష్మ తనుడయి మారుతి చూపరులకు
సంశయము గల్గకుండ రాక్షస పురాన
వెదుక దొడగెను బహుశ్రద్ధ వీధు లెల్ల 132

భవన ప్రాకర కుడ్యాల పైకి నెగసి
భవనములు తోటలును సభా ప్రాంగణములును
అంతర గృహాళి సౌందర్య వంతమైన
ప్రభు విహార రంగముల నల్వంక వెదకె. 133

అలజడులు లేని సందుల యందు నక్కి
గుడులు బడు లంగడులు గూఢ గోపురములు
పురము లంతి పురమ్ములు పొంచి వెదకి
జనక సుత నెందు గనక విచార మందె. 134

చింతలో మున్గి ఆ హనుమంతు డపుడు
దీర్ఘ యోచనమున జిక్కి దిరుగు వేళ
సరస సంగీత వాద్యైక శబ్ద భావ
బంధురమ్మైన నొక పెద్ద భవన మందు. 135

వస్త్ర మాచ్ఛాదనము లేని వనితల నట
మధుర మధు సేవనోన్మత్త మతులు - కామ
మున మునింగి నర్తించెడి ముగుదల నట
దూరమున నుండి-గని-యేగె మారుతియును. 136

పూర్ణ విజితేంద్రియుం డతి పుణ్య మూర్తి
సుస్థిత ప్రజ్ఞు డా వాయు సూనునకును
చిత్త వైకల్యమే లేక - సీత కొరకు
తీవ్ర తర యత్న మొనరింప దీక్ష యొదవె. 137

దనుజ పతి సౌధమునకు నద్దమ్ము వగిది
దివ్య వర రత్న రుచులచే తేజరిల్లు
సాధ్వి మండోదరీదేవి సౌధ శయన
మందిరము జేరి ఆశ్చర్య మగ్న డాయె 138

వజ్ర వైఢూర్య మణి గణ వ్రాత రుచుల
హేమ కాంతుల కన్నుల కింపు గొలుపు
భవన మది - చంచలల గూడి బరగు మేఘ
శకలమును బోలియున్నదా సౌధ మచట. 139

బొగడి యద్దాని అందము నగచరుండు
హస్తి రథ వాజి శాలల - వస్త్ర శాల
లాది నవచంద్ర శాలల - నతి విచిత్ర
కలిత నర్తన శాలలం గాంచె హనుమ. 140

అంత మండోదరి దేవి యాంత రంగ
మందిరము పొచ్చి యట మైమరచి - హంస
తూలికా తల్పమున సొక్కి సోలి నిద్ర
మునిగి యున్నట్టి అందాల ముగుద గనియె. 141

చెదరు కురులతో విడివడు చీర ముడితొ
అలసి సొలసిన అపరంజి చిలుక వోలె
గాఢ నిద్ర మునింగిన కాంత గాంచి
'సీత' యని యెంచి - వికలుడై చింత మునిగె. 142

అకట! శ్రీరాము డీలాంటి యతివ కొరకు
క్రుంగి కృశియింప నేల తా కూర్మి మునిగి?
అని దలంచుచు - నంతలో ననిల జుండు
మరల దలపోసె రాముని మగువ గూర్చి. 143

అతుల పతిభక్తి నలరెడు అవని జాత
కుటిల రావణు మంచాన కులుక గలదె?
మందగించెను నాబుద్ధి - మగువ గూర్చి
తప్పు దలచితి - నక్కటా తగదు - తగదు. 144

కాదు కాదీమె జనకజ కానె కాదు!
పరమ పావని సీతా శుభాంగి కాదు!
అనుచు "లెంపలు వేసుక" న నిలజుండు
అమ్మ! తప్పయ్యె క్షమియింపు మనుచు గోరె. 145

కాల యాపన లేకుండ కపి కులుండు
పరమ లఘుగతి సౌధాన పదము లిడుచు
బాహ్యమున పుష్పకము గాంచి - పడతి సీత
కొరకు గాలించె పుష్పకమ్మరసి అరసి. 146

అందు మదనార్తు లయిన కామాంధ జనులు
పాన వశులయి దరినున్న పడతి చీర
చెరగు లాగుచు క్రీడింప - తరుచరుండు
గాంచి కట కటంబడి పుష్పకమ్ము వీడె. 147

అకట! పుష్పకమున గూడ నవని జాత
జాడ లేదు; గాలించి వేసారి తింక
దనుజ పతి సౌధ మొక్కండు దక్క నన్ని
పూర్తి యయె నని నచటికి పోయి - జొచ్చె. 148

అరయ మయు నిర్మితమ్మయి నలరు దాని
సకల ఋతు పుష్ప ఫలవన చయము దాని
దైత్య సుర పూజితమ్మయి దనరు దాని
దనుజపతి సద్మమును జూచె తరుచరుండు. 149

అహహ! యీ శోభ ! ధనదు గృహమ్ము నకును
అమరపతి వీటికైనను - నబ్జభవుని
సద్మమునకైన - ధర్ముని సదనమునకు
గలదె యోచింప - ననుచు నక్కజము నందె. 150

అబ్జభవు గూర్చి ఘనతప మాచరించి
ధనదు డానాడు వడసె నీ ఘన పురమ్ము
అతి భయంకర సమరము నాచరించి
ధనదు నుండి రావణుడు గైకొనెను దీని. 151

సుర జగమొ? బ్రహ్మలోకమొ? హరు పురమ్మొ?
స్వర్గలోకమొ? హరి లోక సామ్య మేమొ?
గాక యెటు గల్గు శోభ లంకా పురమున
కంచు దలపోసె - నాశ్చర్య మంది హనుమ. 152

మణి మయాంచిత ఘన కుడ్య మణుల కాంతు
లరయు వరరూప రుచులతో నతి విచిత్ర
గతిని భవనము పూర్ణమై కనుల విందు
సేయుటకు విస్మితుండాయె వాయు సుతుడు. 153

నిఖిల మణిగణ దంత వినిర్మితమ్ము
తగటు బంగరు పువ్వులు దాపి యున్న
విమల మణిదీప్త భద్ర పీఠము లవెన్నొ
అందములు జిందు చున్నవా మందిరమున. 154

అందు - బంగరు ఛాయల నమరి - సూర్య
సమము కాంతుల నల్దెసల్ జల్లు చున్న
ఇంద్ర నీల మహామణు లిమిడి యున్న
శ్రేష్ఠ పీఠము కన్నులు చెదర - యుండె 155

పలు సువాసన లొప్పు నా భవన మందు
శయన మందిరమందు రాక్షస విభుండు
ఇందు ముఖు లెందరో జుట్టి యింపు గొలువ
మధ్య శయనించె- భోగాభి మత్తు డగుచు 156

తేట యగు మది తోడ నాస్త్రీల యందు
వెదకె సీతకై మారుతి విసుగు లేక
చూడనట్టిది యొక్కింత చోటు లేదు
లంక నల్గడ జూచె నా రామ దూత. 157

అన్ని వెదకుట అయిపోయె - నకట నేను
గానలైతిని జనక భూకాంతు సుతను
ఏమి సేయుదు? తెరవు నాకేది యింక
నెందు వెదకుదు? జానకి నెచట జూతు? 158

# హనుమం ఆవేదన

అనుచు మరి మరి యోచించి వనచరుండు
ఆమె యుండెడి స్థానమ్ము నరయ లేక
శాంతమును వీడి దుఃఖిత స్వాంతు డగుచు
మథన పడి తీవ్రగతి తన మది దలంచె. 159

ప్రబల మాయా బలుండైన రావణుండు
పట్టి తెచ్చిన నాడె యప్పడతి యతని
భీకరాకృతి గని కడు భీతి జెంది
అసువులను బాసె నేమొ యంచాత్మ దలచి. 160

క్రుద్ధుడయి - యెల్ల జగముల గుండెలవియ
భీషణాకృతితో తీవ్ర భాషణముల
వాయు గుండమ్ము కలచిన వనిధి పగిది
భయదుడై వాయు తనయుండు బల్కెనిటుల. 161

సత్వరమె ద్రుంచెద విధాత జందెములను
ననిమిషాధిపు - నరుణుని - నగ్ని దేవు
దనుజు డాదిగ నున్నట్టి ఘనుల నెల్ల
కనికరింపను జనకజం గానకున్న. 162

లంక బెకలింతు - రావణు పొంక మణతు;
శివునితో గూడ కైలాస శృంగ మదర
హస్తమున బట్టి తేలింతు నంబు నిధిని
గ్రహములను గూల్తు జనకజ గానకున్న. 163

జనక సుత జాడ గనక నే చనుట యెట్లు?
వేచి యుండెడి రాముని జూచు టెట్లు?
అతుల విశ్వాస మెన్న నాయందు నుంచి
జూచు సుగ్రీవు ముఖమింక జూచు టెట్లు? 164

ఇంత కాలము వెచ్చించి యిపుడు నేను
రిక్త హస్తాల జనిన వారికిని – నాకు
క్షేమ మెదవునె? గుండెలూ చెరువు గాగ
జూచు కపులకు నా మోము జూపుటెట్లు. 163

సీత గానక రాము నే జేరి నంత
బ్రతుక డాతడు; సౌమిత్రి బ్రతుక బోడు;
మిగుల డర్కజు డటుపైన మిగుల దింక
కపి కులము సర్వ మిదియ నిక్కంబు జూడ. 164

కాన జనకజ యునికిని గానకుండ
మగిడి జనరాదటంచు నెమ్మది దలంచి
ఎత్తుగా నున్న సౌధమ్ము నెక్కి – చుట్టు
ప్రక్క లన్నియు పరికించె పవనజుండు. 165

## అశోక వనము

అనతి దూరాన గనిపించె ననిలజు నకు
పక్వ ఫల పుష్ప భరితమై ప్రబలి యున్న
వన మశోకము; సౌందర్య ఘనత నొప్పి
పుష్ప ఫల వనముల కెల్ల పూజ్యతమము. 166

రసిక వరుడైన రాక్షస రాజు కలిమి
కద్దమై యొప్పుచున్నట్టి యాయశోక
వనము గన నిశ్చయించె న వ్వన చరుండు
చివరి యాశగ నందులో సీత వెదుక. 167

జానకీ రాములను మది సంస్మరించి
అష్ట దిక్పాలురకు బ్రహ్మ కంజలించి
పంచ భూతమ్ములకు తలవంచి మ్రొక్కి
కార్య జయమిడ దేవతా గణము గొలిచి. 168

ఒక ముహూర్త మాలోచన మొనర జేసి
మదిని కృతనిశ్చయుండయి మహిత శక్తి
రావణుని హర్మ్యమును కపిరాజు వీడె
నవని జాతను కనుగొను నాస తోడ. 169

ఉదయ కాలార్క శోభల నుజ్వరిల్లు
నా యశోక వనమ్మున నవని సుతను
వెదుక మదిసెంచి నుత కపి వీరు డంత
ధను వినిర్ముక్త శరము విధాన వెడలె. 170

కల్ప తరు తుల్య బహు వృక్ష గణ విశోభి
తంబగుచు - పక్షి గణ కూజి తమ్మ నగుచు
నందనమ్మను మరపించు నా యశోక
వనము గనుగొని ముదమందె వనచరుండు. 171

సకల సుమ ఫలయుత వృక్ష సౌష్టవమున
షడృతు ఫల వృష్టి నొకట దర్శన మొసంగి
కాంచ నోత్పల పద్మ సుమాంచి తంపు
బహు సరోవర కలిత మా వనము గాంచె. 172

వెండి బంగారు కాంతుల వెలయు నట్టి
వృక్షములు వాని నొప్పు వివిధములైన
యండజంబులు పెంపుడు హరిణ తతులు
చూడ ముచ్చట గూర్చె నశోక మందు. 173

చూచె మారుతి చందన చూత వృక్ష
శాఖలన్ నిల్చి చూపులాశలకు ద్రిప్పి
విరులతో నిండి చెట్లెల్ల వేడ్క నింపె
శ్రీ వసంత శోభ యొకచో చేరినట్లు. 174

అది వసంతము కాకున్న నన్ని చెట్లు
పుష్ప సంపన్నమై యొప్పె - పుష్ప మధుర
వాసనా మనోజ్ఞతను నివాళు లిడుచు
అడుగిడిన యంత యుత్సాహ మావహిల్ల. 175

కోయిలలు చిగురులను మేసి కొమ్మ లెక్కి
మధుర గానాలు సలుపు; తుమ్మెదల రొదలు
శ్రుతులు మీటుచు నుండును _ గతి విలాస
ఘుల నెమిళ్లట నర్తన ముల నొనర్చు. 176

అవని జాతను వెదకు ప్రయత్న మందు
కదలు కపి వల్ల నిద్రలు చెదరి - పక్షి
గణము లెగురగ _ పూల్ రాలి కపి వరేణ్యు
పైన గురిసెను బహు పుష్ప వర్ష మట్లు. 177

విరుల ప్రోవుల నక్కపి వరుడు మునిగి
పుష్ప గిరివోలె గన్పట్టె _ భూరుహాల
దిరుగు నా కోతి వీక్షించి దిక్పతులును
వర వసంతు డటంచు బల్ మురిసి నారు. 178

పూవులన్నియు నవ్వన భూమి రాల
పరగె నది పుష్ప భూషిత భామ వోలె
వృక్ష శాఖల తిరుగు కపివరు గనుచు
ఆకసమ్మున కెగిరె విహంగ తతులు. 179

పూవు లాకులు రాలగా - పులుగు లెగుర
మోడు లయినట్టి భూజముల్ మోద ముడిపె
సర్వ మోడియు వలువలు సహిత మోడి
నిలచి యున్నట్టి జూదరి వలెను దోచి. 180

పూల జ్యోతులు రమ్య సంస్ఫూర్తి నిడగ
పక్వ ఫలములు రత్నాల భంగి వెలుగ
నందనము చైత్రరథముల క్రిందు పరచి
ఆ యశోకము సంతతాహ్లాద మొసగె. 181

చూచె నతులిత సౌందర్య శోభ నొప్పు
ఫల సుమాంచిత భాసుర వనము లెన్నొ
ఇట్టి సుందరారామమ్ము నెందు గూడ
గాంచ నందున – హనుమ యక్కజము నందె. 182

అకట! నివ్వన శోభను నరసి నంత
సందియము లేదు రాక్షస చక్రవర్తి
పతిని మరువంగ నివ్వన భాగమందు
జానకిని నుంచియే యుండు – శంకలేదు 183

ఈ అశోకము తగును వసింప సీత!
యనుచు భావించి సంతోష మంది కపివ
రుండు సీతకై వెదుకంగ రూఢ మతిని
దలచి – యుత్సాహ ముప్పొంగ తత్ క్షణమ్ము. 184

కడగి దిరుగుచు మారుతి గగన మంటు
నొక్క చెట్టెక్కి నలుగడల్ చక్క చూడ
కాను పించెను సౌందర్య ఖని యనంగ
ఉజ్వలంబైన ప్రాసాద మొండు కపికి. 187

ఆ వనంబున మధ్యస్థ మందు – వేయి
స్తంభముల తోడ నొప్పు సౌధం బొకండు
స్వర్ణ విద్రుమ మణుల సోపాన పంక్తి
వింత వెల్గులతో కంటి వింధు గూర్చె. 188

అది సుగంధ బంధురమయి అతి విచిత్ర
గంధ మాదన శైలమ్ము కరణి నొప్పి
పాండు రమ్మయి కైలాస పర్వతమును
బోలి యలరారు చుండు నప్పుణ్య వనిని. 189

అలసింపక తత్క్షణ మగచరుండు
నచటి ప్రాసాదమును జేరి - యంతలోన
శింశుపా వృక్ష మూలాన చెలగి యున్న
మణి మయాంచిత సౌవర్ణ మంటపమున. 190

మలిన చేలమ్ము ధరియించి - మహిత దుఃఖ
భార మెద గ్రమ్మి శ్వాసంపు బరువు చేసి
వదన కమలమ్ము వసివాడ ముదము బాసి
నశ్రువులు ధారగా గార్చు నతివ గాంచె. 191

చదల మబ్బులు గ్రమ్మిన చంద్రు పగిది
పొగలు గ్రమ్మిన ప్రళయాగ్ని సెగ విధాన
పంక మలమిన కాంచన పద్మ మట్లు
కళలు వాడిన యొక పుణ్య కాంత గనియె. 192

శ్వానముల మధ్య జిక్కిన దీన - హరిణి
కరణి బహు దుష్ట రాక్షస కామినులకు
జిక్కి యుపవాస నియతి కృశించి యున్న
ఏక వేణీధర గనె వనైక చరుఁడు. 193

తీవ్రమగు దుఃఖమున మున్గి దిటు లేక
కంటికిని మంటికిని ధార గాగ నేడ్చు
దీన మగు మోము నరచేత నాని యున్న
మగువ నొక్కతె నట జూచె యగచరుండు. 194

అకట! ఎవరీమె? శోకించు నీ విధాన
మలిన వస్త్రము తోడ నా మార్గిను మొదల
పతిని నెడబాసి దుఃఖించు పడతి వోలె
గాన బడుచున్న దిచట; నిక్కాంత యెవరొ? 195

మలిన వసనమ్ము దాల్చుట వలన - మగువ;
కురిసి వెలసిన వర్షాన గుములు కొన్న
నీరదాంతరమున జిక్కి నీరసించు
కలువ రాయని వలె వాడి - కాంతి దొరగె. 196

పతిని బాయగ గలుగు నా పదల కంటె
వెడగు రాక్షస మాయల వేగి - నలిగి
యెంతయో వాడి యున్నదీ యింతి యకట!
యెవ్వరో యీమె? దెలియుట యెట్లటంచు. 197

మది దలంచుచు - శింశుపా మహిజ శాఖ
నెక్కి - కడు సూక్ష్మ రూపాన నక్కి-యామె
స్థితియు చర్యలు గమనించి - సీత యనెడు
నాస పొడ సూప - సంతస మంది కపియు. 198

కఠిన చిత్తలు రాక్షస కామినులకు
నడుమ భయమంది బెగడు నీనాతి జూడ
చిరుత పులులకు జిక్కిన హరిణి వోలె
చెలువమును బాసి వ్యధలను నలిగి యుండె. 199

పవన సూనుడు నత్తన్వి వదన లక్ష
ణమ్ము పలుమార్లు పరికించి; నాతి దాల్చు
చీర కొన లేక యుంటచే సీత యే యు
గునను ధృఢ భావ రంజిత మనము నొందె. 200

ఇంత దుఃఖాన నుండియు యింతి జూడ
శిరము నెత్తక - దీనయై - చిత్తమందు
సతము నెవ్వరి నామమో జపము సేయు
చుంట గని వాయు సూనుండు చోద్య మందె. 201

రామచంద్రుడు చెప్పిన లక్షణములు
గొన్ని యగు పింప - దృప్తుడై - కోతి బంటు
సంశయము బాసి గట్టి నిశ్చయము జేసె;
ఈమెయే సీత శ్రీరాము భామ యనుచు. 202

భాస్కరుడు రాని దినలక్ష్మి భంగి వడలి
చంద్ర విరహిత యగు రాత్రి సరణి నొప్పి
మలిన పద్మము వలె కాంతి మాసియున్న
పరమ సాధ్వి యీామెయే రామ పత్ని సీత! 203

ఈమెకయి గాదె పెండ్లినా డినకులుండు
భవుని విల్లెత్తి యవలీల భంగ పరచె
అసమ బలశాలి యావాలి పసనడంచి
స్వర్గమున కంపి నాడొక్క బాణమునను. 204

తగిన వాడీమెకును రామ ధరణి ధవుడు;
ఈమెకును భళా ! ఆరాఘవేంద్రుడొప్పు
ముద్దు లొలికించు నీజంట - మొండి విధికి
చూడ కనుకుట్టి యుండు గాకేడ నిద్ది ! 205

పెట్టి వాని విధము నేను "విధిగిధి"యని
దలపగానేల? ఆ దుష్ట దానవుండు
మూర్ఖ చిత్తుడు - సీతను మోసగించి
దెచ్చె - దోసమ్ము నెంచక తెగువగలిగి. 206

జానకియు రాము నెడబాసి దీన యగుచు
నిర్వనంబున దిక్కు లేకిటుల నుంట
రావణుని మూలమున గాదె? రయము మెరయ
వనధి ముంతు వాలము జుట్టి వాని నిపుడె. 207

అనుచు మదినెంచి – అంతలో నామె యెవరొ
తెలియకయె నేడు నాకిట్టి తలపులేల?
ఆమె దరికేగి ప్రశ్నించి – అరసి పెనుక
నపుడుయోచించు టుచిత మంచాత్మ నెంచె. 208

## రావణుడు జానకిని జూడ వచ్చుట

అంతలో కాంతు లంతట నలము కొనగ
వేల దివిటీలు చే దాల్చి పెలదు లెల్ల
చుట్టి కొలుచుచురా_భూమి సుతను జూడ
రావణుడు వచ్చె – నయ్యర్ధ రాత్రమందు. 209

సీత దరి జేరి _ హాయలుగా చిర్న గవులు
దొలుక పాపపు చింతతో వలికె నపుడు
కుటిల హృదయుండు దనుజుడు కూర్మితొలకు
పలుకు లందున కల్మష మ్మొలుకు చుండ. 210

"రామ" "రామ" యటంచిటు రాత్రి బవలు
చింత సేయగ నీకేమి చిక్కు ఫలము?
రాము డెటు వచ్చి రక్షించు రమణి నిన్ను
ఏల దుర్భమ జెందెదో బేల యిటుల! 211

జడలు ధరియించి ముని వృత్తి బడుగు వోలె
అడవులను కూర గాయలు గుడుచు–వెట్టి
రాముడే రీతి యత్నించు? లంక జేర
దమ్మునిం గూడి వననిధి దాట గలడె? 212

జలము లింకింప జేయగా జాల రరయ
నెగిరి రాలేరు-వార్నిధి నీదలేరు;
హీన సత్వులు మానవు లే విధమున
చేరుకొనగల్గుదురొకొ ? యోచించినావె ! 213

దానవుల గెల్చు శక్తి యీ మానవులకు
నెందు నూహింపగా గన మింత వరకు
మానవుల జంపి భక్షించు దానవులను
గెలువ నరులకు వశమౌనె? జలజ నయన ! 214

జగతి నొక యల్ప మానవ జంతు వొకడు
నన్ను "ఢీ" కొనుటది కల్ల ! నగరె జనులు?
శంభుడో శక్రుడో గాక శక్య మగునె?
కదన రంగాన రావణు నెదిరి నిలువ. 215

కుడువ కూడును_నిలువగా గూడు లేని
వనుల దిరుగాడు నల్పుడౌ మనిసి కొరకు
వెఱ్ఱిగా కాచుకొని యుండు వెఱ్ఱిదాన;
సుఖము లందుము నను పొంది శుభ్రనయన. 216

## అసురచక్రవర్తికి అవనిజ సమాధానము

చెవులకును ముల్కు లయిన యా చెనటి పల్కు
లాలకింపగ జాలక నతిరయమున
గడ్డిపోచను దీసి యా కంజనేత్రి
చేత ధరియించి కన్నులు జేవురింప. 217

తెగువను వహించి యాక్రూర దితిజు గాంచి
పలికె నిట్టుల-ప్రౌఢ సంభాషణముల
నితర వనితల చెరబట్టు బ్రతిన గొన్న
పాపి! నీతోడ మాటాడ పాప మనుచు. 218

దుష్ట వర్తనుడవు నీవు దోస మనక
పరుని భార్యను నను చెర బట్టినావు
పురుష లింటను లేకుండు తరుణ మరసి
దొంగ వలె జొచ్చు నొక గజ దొంగ వీవు. 219

యోధుడవె యైన భర్త నా యొద్ద లేని
తరుణ మారసి ముచ్చిల దగునె నీకు?
ఎందులకు చేత కాని యీ పంద పలుకు
లతని నెదిరించి నిలువ నీ యబ్బ తరమె? 220

చంద్ర శేఖరు కంటె దేవేంద్రు కంటె
ఘనుడు రాముడు నీవు న య్యనఘు కరుణ
పొంది బ్రతుకుము-గానిచో పొంక మణచి
చంపి నిన్నంపు నా యమ సదనమునకు. 221

రాము డల్లుట ఖరుడాది రాక్షసాధ
ములు నశించుట దెలిసియు నులుకదేల?
శరణు గోరిన నెంతటి శత్రువైన
కరుణ తోడ రాముండు రక్షణ మొసగు. 222

తాటకిని దునిమి-రాక్షస తతుల గూల్చి;
తపసి యాగము గాచిన ధైర్య మూర్తి
రాజ మాత్రుడె? సజ్జన రక్షకుండు
రామ జనపాలు డాతి వారాయణుండు. 223

సంద్రమును దాటి ఘన పౌరుషంబు తోడ
ఘోర రణభూమి నిను డాసి క్రూర గతిని
తలలు పది నేల పడగొట్టి-తరటి కులుడు
భుక్తిగా నీ యుడే వాని భూతములకు. 224

# రావణుండు నిజబలంబును జానకి కెరింగించుట

గద్దిపోచగ కడుహీన గతిని తన్ను
పంద జేయుచు భాషింప-పండ్లు కొరికి
మీస ముందిప్పి-కోపము మింటి కెగయ
రమణి సీతతో ఇట్లనెను రావణుండు. 225

తెలియ జాలవు కలికి నా బలము నీవు
మేలి తపమున నా బ్రహ్మ మెప్పు వడసి
చావు లేకుండు వరములు చాల గొంటి
సకల లోకమ్ములకు నేనె స్వామి నైతి. 226

భువనములు మూడు గెలిచియు పొందరాని
వైభవములంది యలరు నా బాహు పటిమ
జగములన్నియు నెరుగగా సాహసమున
నెత్త గల్గితి కైలాస పృథ్వి ధరము. 227

అలరి చెరబట్ట గల్గితి నమర-యక్ష
భుజగ గంధర్వ కిన్నెర ముఖ్య సతుల
నింత సామర్థ్య మెన్నగా నెవరి కుండు?
భువిని రావణునకు దక్క భూమి తనయ 228

అతివలను జంప పాపమంచరయు చుండ
నన్ను నెదిరింప నొక పేద నరుని జూపి
తీవ్ర గతి నింద సేయుచు తిట్టు నీదు
నాలుకను గోసి వైతును చీలికలుగ. 229

అనుచు తన చంద్రహాసము నతడు దూయ
ధాన్య మాలిని యను కాంత దనుజు నాపి
పరమ తేజస్వి వీరికి వనిత తోకి
గౌరవము బాసి దుష్కీర్తి గాంచ తగునె? 230

లేరె? నీ కయి తపియించు నీరజాక్షు
లెందరో అందముల జిమ్ము సుందరులును.
తరుణ యౌవన శృంగార తనులు జూడ
లెక్కయా? వారి కడ సీత లేశమైన. 231

అని వచింపగ-శాంతించి; అసుర రాజు
కామ వశుడయి జనకజం గాంచి పలికె
కలికి! యొక రెండు మాసాలు గడువు నీకు
నొసగు చున్నాడ పొత్తంత పొసగ దేని. 232

కాపుగా నున్న రక్కెసల్ ("కండ-కండ")
కోసి భక్షింత్రు తు నాతృప్తి కొరకు నిన్ను;
ముగియు నీ గాధ దానితో ముద్దరాల!
తెగును రాముడు నీ చావు దెలిసి నంత. 233

హెచ్చరించుచు రావణుడేగినంత
పట్టరాని దుఃఖ భావమున మ్రుగ్గి
మిగుల వెతజెంది జానకి మగని గూర్చి
యేడ్చె బోరున-చేయునదేమి లేక. 234

కలత జెందిన సీతను గాంచి హనుమ
క్రుద్ధుడై రావణుని పిడి గ్రుద్దు గ్రుద్ది
చంప నెంచియు; అది కాదు సమయ మనుచు
మిన్నకుండెను-తానెంతొ చిన్న వోయి 235

# రాక్షసాంగనల మధ్యా సీత

రావణుండేగి నంతట రమణి సీత
గాంచి, యచ్చటి రాక్షస కాంత లెల్ల.
చుట్టు ముట్టి సీతను భయ పెట్టినారు.
పలు విధమ్ముల పరుష సంభాషణముల. 236

ఒకతె చంపుదు నంచు; నింకొకతె చీల్చి
భక్షణము చేతు నంచును; బహు విధాల
భయము గొలుపుచు రాక్షసప్రభు వరింప
కున్నఛో నంచు_తర్జింప-యువిద సీత. 237

గద్గదిక యౌచు-బాష్పముల్ గారు కనుల
ననియె వారికి-రామభద్రాంకి తమ్మ
నా మది - యది మారదు-గాన నన్ను మీర
లిచ్ఛ వచ్చిన యట్లు ఛేదించి తినుడు. 238

అనుచు మందను విడనాడి అడవి మధ్య
ఆడ తోడేళ్లకును జిక్కు హరిణి యగుచు
నంగములు ముడ్చుకొని భీతి యావహిల్ల
"వడవడ" వణంకుచును నేడ్చె వసుధ తనయ. 239

ప్రళయ ఝంఝూ మరుజ్జవ తీవ్ర గతికి
కంప మొందెడు అరటాకు కరణి_కలవ
రము పడి వివర్ణయై యొప్పి-రామ పత్ని
దైన్యమున మున్గి నిష్ప్రహత్వము వహించె. 240

తలుప గతజన్మలో నెట్టి కలుష కర్మ
చేసితినొ ? యిట్టి బాములు చెందు చుంటి
ప్రబల శోకాన నేనింక బ్రతుక గలనె ?
బ్రతుక నిత్తురె ? నన్నింక దితిజ వరులు. 241

రాముడే లేక నేనెట్లు బ్రతుకు దాన
రండు రక్కెసలార ! నా కండరముల
కోసికొని తినుడంచు నాకోశ మందె;
బ్రతుకుపై నాస వీడి యా రామపత్ని. 242

ప్రబల దుఃఖార్తయై సీత పలుకులాడ
భీకరా కారములు గల్గి-భీతి గొల్పు
రాక్షసాంగన లెందరో-రమణి సీత
పట్టి భక్షింప నుంకించు నట్టివేళ. 243

# త్రిజటకల.

త్రిజట యను దనుజాంగన దిగ్గురంచు
నిద్ర మేల్కాంచి శ్రీరామ భద్రు వనిత
మోము నొకమారు వీక్షించి-ముద్దు సీత
మొగము నందేమొ చదువుచు మోద మంది. 244

దనుజ వనితల నెల్లర దరికి చేర్చి
కాదు యీ సీత సామాన్య - కడు రహస్య
మైన విషయము-చూడు డీ! జానకమ్మ
కారణమ్మున చెడును లంకా పురమ్ము 245

పరమ సాధ్వీమ తల్లి యీ పడతి సీత
పతియు మరదియు పటుతర బాహు బలులు
వర పతివ్రతలను చెర బట్టి యెవడు
వసుధ బ్రతికెను? సుఖముల బాముకొనెను. 246

కంటి నొక కల ప్రత్యూషః కాలమందు
అట్టి కలలెల్ల నిజమగు నంద్రు బుధులు!
సుప్రసిద్ధ వాక్య మిది; యో సుదతులార!
వినుడు నే గన్న కలయంచు విశద పరచె. 247

కదన సీమను దశకంఠు గర్వ మడచి
ఉన్నతాసనమున రాము డొప్పి యుండ
రుధిరముల జిమ్ము రాక్షస రోదనముల
కలవరము జెందు లంకను గాంచి యుంటి. 248

ధవళ వస్త్రములును విరి దండ లలర
జనక సుత సీత శ్రీరామచంద్రు పజ్జ
పాల సంద్రాన తేలిన పర్వతమున
కొలువు సింగారమై యుండు కలను గంటి. 249

తరళ హారాల సిత చతుర్దంత దంతి
నధివసించిరి శ్రీరాము డవని సుతయు;
దనరె సౌమిత్రి గూడ యా దంతి పైన;
హసిత ముఖులయి యూరేగి రందరపుడు. 250

పుష్పకము మీది రావణున్ ముష్కరుండొ
కండు-దిగలాగ-బడి రక్త గంధ వస్త్ర
పుష్పములు దాల్చి గోమయ పుష్కరిణిని
జొచ్చి జచ్చిన యటు కలం జూచి తేను. 251

పాడు వారెను లంకయు, భద్రుడగుచు
రామచంద్రుడు సీతతో లంక వీడి
పుష్పకమ్మెక్కి కోసల పోవునట్లు
కలను గంటింక లంకకు కలుగుచేటు. 252

కాన; సీతను నిక ప్రేమ గనుటే యుచిత
మనుచు మది దోచు-నింక నీ వనిత యెడల
చెలిమి జూపుటె మనకెంతొ శ్రేయ మనుచు
త్రిజట వచియించ రక్కెసల్ దెలివి గలిగి. 253

జనక సుతయందు తమ నెమ్మి యినుమడింప
చెనటి తనమును వీడి యా క్షణము మొదలు
పలుకులందున తేనియ లొలుకు నటుల
పలుక దొడగిరి; రాక్షస భామలెల్ల. 254

# రావణుని మాటలు దలచి సీత దుఃఖించుట

అంతటను రాక్షసాంగన లలసి సొలసి
గాఢ నిద్రను మునిగిన కారణమున
జానకియు తీవ్రమగు బాధ మానసమున
గ్రిమ్మ; యెలుగెత్తి-నీరముల్ గ్రమ్మ కనుల. 255

బంధువుల బాసి-నిరుపేద బడుగునైతి
పెడగు కోర్కె రాముని లేడి వెంట బంప
ఫలిత మిది! ఇంక చేయంగ వలయు నేది?
మరణ మొక్కటె శాంతికి మార్గ మయ్యె. 256

దైత్య విభుని కటూక్తుల దలచి తలచి
హృదయ దారుణ బాధ భరింప లేక
రాక్షసాంగనా భయ తరార్భటుల కలగి
ఆపుకోలేని దుఃఖము నంది యేడ్చె. 257

రామ! మాయ లేడికయి కోరంగ నేల?
కీడు గనక లక్ష్మణు దూల నాడ నేల?
అతడు వ్యథజెంది నన్వీడి యరుగ నేల?
అల్ప భాగ్యను గాకున్న నగునె యిట్లు? 258

అనుచు దలపోసి కనలు దుఃఖాగ్ని మరగి
తనువు త్యజియింప దృఢ బుద్ధి దలచి సీత
చీర చెరగును కుత్తుక జేర్చి బిగియ
గట్టు యత్నముం గనుచు నా కపివరుండు 259

అయ్యొ! యిపుడేమి సేయుదు? నవని జాత
అసువులను బాయు సాహస మాచరింప
సిద్ధ మగుచుండె; నా యత్న సిద్ధి యెల్ల
నేల పాలౌను - ఇంక నే నాలసింప. 260

అనుచు హనుమ చింతింపగా నంతలోన
దైవికంబుగ గన్పించె దేవికపుడు
శుభ నిమిత్తమ్ము లాశా ప్రసూచకముగ
నెండి వాడిన నేల వర్షించి నట్లు. 261

## హనుమ సీత నూరడించుట.

ఆలసించిన చెడును కార్యంబటంచు
సీత నపు డూరడిల జేయ చెట్టు నుండి
పవన సూనుడు శ్రీరామభద్రు చరిత
మాలపించెను సీత కాహ్లాద మొదవ; 262

రామ నామము చెవిబడ్డ, భూమి తనయ
మండుటెండ నెడారిలో మంచి నీటి
నరసి నంతటి సంతస మంది చూచె
నాత్మ హత్యా ప్రయత్నమ్ము నాపి-పైకి. 263

అంతతో బోక - మృదువుగా ననిలజుండు
రామ భద్రుడు-తమ్ములు లక్ష్మణుండు
భరత శత్రుఘ్నులును గూడ; ధరణి భార
మణప జన్మించి నట్టి - మహాత్మ లనియె. 264

భూతలమ్మున దశరథ భూమి ధవుడు
కోసలము నేలు షడ్గుణ కోవిదుండు.
పూజ్య తము డుత్తముం డతి పుణ్యగణ్యు
డవని రాజర్షి తేజస్వి యైన ఘనుడు. 265

బలము నం దెన్నగా-సురపతికి సముడు
అతుల గుణశీలు - డిక్ష్వాకు - ధవమల యశుడు
లక్ష్య సిద్ధుడు - స్వాభ్రమాట్టు - లక్ష్మి యుతుడు;
అతని పుత్రులు భువి నల్వు రమల గుణులు. 266

జ్యేష్ఠుడగు రాము డఖిల లోకేష్టు డగుచు
తండ్రి దశరథునకును సంతసము గూర్చ;
ముఖ్యుడై - ప్రాణమై - యెల్ల మునుల జనుల
నలర జేయు మహాత్ము - డత్యంత గుణుడు. 267

ఇల నవతరించి నట్టి సర్వేశ్వరుండు
అప్రతిము డతడు ధైర్య శౌర్యముల యందు
పుడమి నరుడయి దశరథ పుత్రుడాయె
లోకముల నేలు కరుణా విలోలు డగుచు. 268

జగము మెచ్చగ శివువిల్లు జంకులేక
భంగ పరచి జానకిని చేపట్టె నతడు
తండ్రి యానతి తలదాల్చి తరుణి గూడి
తమ్ముతో దండక వనవాసమ్ము జేసె. 269

అట జనస్థానమున ఖరుడాది దనుజ
వితతినిం జీల్చి చెండాడి విశ్వ వినుత
యశము నార్జించి తమ్ముతో నాలి తోడ
అసురులకు సెల్ల హృదయ శల్యంబు గాగ. 270

దండకాటవి నుండెడి తరుణమందు
రాము సతి జానకమ్మను రావణుండు
మాయలను బన్ని ముచ్చిలి పోయె - రాము
డామె నరయుచు ఋష్యమూకాద్రి చేరె. 271

అర్కజుని తోడ సఖ్యము నాచరించె
దుష్టుడైనట్టి వాలిని దునిమె - పిదప
సూర్య సుతు రాజుగా జేసి సూర్యవంశ
ఘనత దశదిశల్ చాటి ప్రఖ్యాతుండయ్యె. 272

మాల్యవంతమ్ము నందున మర్కటేంద్రు
స్నేహి తుండయి రాముండు సేమ మిపుడు.
అనుజు సహితముగా - నింక నవని జాత
యునికి దెలియమి బొగులుచు నున్నవాడు. 273

అప్పు డర్కజు నాజ్ఞచే నతి రయముగ
కామ రూపులు వేనవేల్ కపులు వెడలి
వెదకు చున్నారు - నల్దెస్థల్ - వెదకు వారి
యందు నేనొకండను - దక్షిణాశబట్టి. 274

అంగదుడు జాంబవంతుడు నాది గాగ
కపులు భల్లూకముల తోడ గడగి-వింధ్య
పర్వతము - ప్రాంత వనములు పట్టి వెదుక
పక్షి సంపాతి దెలిపె - రావణుడు సీత 275

లంకనిడె-సేమమే నన - రహి వహించి
దక్షిణాశకు పయనించి దక్షిణాబ్ధి
తటము దరిజేరి దాటెడు దారి గనక
చింత మునిగి-మావారు నన్ జేర బిలచి. 276

హనుమ ! యీ సంద్రమున్ దాటు ఘనుడ వీవె !
నీ కసాధ్యము యోచింప నిలనులేదు
పోయి రమ్మని బురిగొల్ప - పుణ్యమూర్తి
రామ చంద్రుని మది నిల్పి రహి వహించి. 277

అరసి శతయోజనమ్ముల - యబ్ధి దాటి
లంకలో జొచ్చి శ్రీరాము రమణి కొరకు
వెదకి - వేసారి - గానక - తుద కశోక
వనము చేరితి జానకి గన దలంచి. 278

చేరి యీ యశోక వనాన చెట్టు క్రింద
రాము డెరిగించి నట్టి వర్ణనము గల్గి
దనరు సౌభాగ్యవతి-సాధ్వి-తరుణి యొర్తు
కంట బడె సీత లక్షణాల్ కలిగి యుండి. 279

అని పలికి యూరకున్నంత వనచరాఖ్యు
నతి మధుర మంజు భాషణ మాలకించి
పరవశమ్మందె-రాముని భవ్య చరిత
మాలకించిన యట్టి సీతమ్మ తల్లి ! 280

శ్రవణ సుఖముగ నానాధు చరిత మెల్ల
కనుల చూపట్టకయె-పుణ్య ఘను డెవండొ
మధురమగు మాటలందున మనసు మురియ
తగ వచించెను నాదగు వగపు దీర. 281

ముఖ సరోజము గప్పిన ముంగురులను
ప్రక్కకున్నెట్టి-గనె చుట్టు ప్రక్కలెల్ల;
ఎవరు గన్పింప కునికి నయ్యింతి మోము
పైకి నిడి జూచె మెల్ల నశోక మపుడు. 282

పూర్వ దిక్పతి - నిడుదంపు బొత్తులందు
ముద్దు గులికెడు భాస్కర మూర్తి భంగి
వరలు వానిని-కింశుక వర్ణు-విద్రు
మాభ వదనుని - చామీక రాక్షుడైన 273

పవన పుత్రుని - రఘువంశ ప్రభునిదూత
ననిల జవు-దీక్ష హృదయుని - నర్కజాత్మ
మంత్రి సత్తము డగు హను మంతు సూక్ష్మ
రూపమును సీత కొమ్మల లోన గాంచె. 284

కనికరమ్మిన్ని నాళ్లకు కల్గె విధికి
గాక యీ రామ చరిత నా కర్ణ పుటము
లందు బడు టెట్లు? కడు ధన్య మాయె జన్మ!
అనుచు బహు సంతసంబంది-అంతలోన. 285

కపిని స్వప్నమ్ము నందున గాంచు టరయు
దోష మందురు విజ్ఞు లా దోష మిపుడు
కలుగ కుండును గాక! నా కాంతున కని
వేయి దేవుళ్లకు హృదయ వీధి మ్రొక్కె. 286

మరల దలపోసె నసురుల మాయ లంచు
గాక _ మనుజుని విధముగా కపి యొకండు
మాట లాడునె? రాక్షస మాయ గాక;
అనుచు జానకి యోచించు నవసరమున 287

సాధ్వి సీతను దర్శించు సమయ మిదియ।
మృదుల మధురోక్తులను రామమూర్తి సేమ
మెరుగ బలుకుచు వగ మాన్ప తరుణ మనుచు
మదిని నిశ్చయ మొనరించి మారుతియును. 288

తండ్రి - కగ్నికి - భారతీ ధవున _ కవల
పాక హరునకు-శివునకు-భాస్కరునకు
శిరము గీలించి మ్రొక్కి విశేష ప్రీతి
సీతతో మాట లాడగా చెట్టు దిగుచు 289

# హనుమ సీతకు పొడచూపుట

మృదుల రఘురామ పదములు మది దలంచి
సీత ముందుకు దూకె నా కోతి బంటు
కరములను మోడ్చి _ తగుభక్తి _ శిరము వంచి
వందనము చేసి సంతస మంది నిలచె. 290

విద్రుమము వంటి మోమొతో - విపుల తేజ
వంతుడై - చెట్టు దిగి - తన వద్ద జేరు
కపిని జూచుచు_నిది_కలకాదంచు
దలచు సీతకు నవ్వు ద త్తరు చరుండు. 291

మానినీ మణీ! యీ లీల_మలిన వసన
ధారిణివి యౌచు - శోకాన ధార గట్టు
నశ్రువుల తోడ దోచు నీ నలిన వదన
మెట్టి బడియుండె-కారణమేమి? తల్లి! 292

ఏ సతివి తల్లి - దిక్కులే కిచట నిట్టు
లేడ్చు చున్నావు - లేరె నీ కెవ్వ రిలను ?
ధీరతను వీడి - దైన్యము - దిగులు దోప
ఏడ్వగా నేల ? నీ నాధు డెచట నమ్మ ? 293

తొడరి హరి భామ లక్ష్మిలా దోచుచుంటి
వటుల గాకున్న కిన్నెర వగుదు వేమొ!
యక్ష గంధర్వ సుర పన్న గాంగనా-మ
ణివొ ? గరుడ భామినివొ ? వేరె నెలత వొక్కొ ? 294

సాహసమ్మున దివి వీడి చంద్రు బాసి
వసుధ చేరిన రోహిణీ వనిత వేమొ ?
చిలిపి కోపాన భర్త, వశిష్ఠు వీడి
ధరణి వసియించు శ్రీ అరుంధతివొ ? నీవు! 295

పుణ్యము క్షయించి - ఆ స్వర్గ భూమి వీడి
యిచటి కరుదెంచి యుందు వహీన చరిత!
అరయ తల్లిదండ్రు లెవరు ? నీ ఆత్మ ధవుని
పుణ్య నామంబదెయ్యది? పూజ్యురాల. 296

కాంతు దలచుచు సారెకు కంటి జెప్ప
వేయుటయు - నూర్పు పుచ్చుట - మేన ఘర్మ
జలము పండుట - మూర్ఛిల్లి యిలను బడుట
నెన్న గా దేవతా సతి వీవు గావు. 297

రూఢమౌ నీదు మంగళ రూప చిహ్న
ములను పరికింప నొక రాజు ముద్దు సతిగ
తోచు-నా జనస్థానాన దొంగి లించి
అసురపతి దెచ్చి యున్నట్టి అవని సుతవొ ? 298

ఎవతెవో నీవు ? నేనిప్పు డెంచలేను !
లక్షణమ్ముల పరికింప రాము భార్య
సీతపై యుందు వనుచును చెప్పె మనము !
మగువ ! మా రాము మహిషి వీవగుట నిజమె ? 299

# జానకి హనుమకు నిజ చరిత్ర దెలుపుట

అనగ-విని; భర్త కీర్తన హర్ష మీయ
నతని పద సరోజమ్ముల నాత్మ నిలిపి
మంచి చెడులను రామునందుంచి - యంత
దెలిపె హనుమతో తన కథాదేవి యిటుల. 300

రాజితైశ్వర్య కోసల రాజ్య మేలు
అల దశరథుని ముద్దు కోడలిని నేను !
రాజ ఋషి - దివ్య కీర్తి విరాజితుండు
జనక సుతను జానకి నండ్రు జనము నన్ను; 301

అఖిల రాజన్య మకుట విన్యస్త భవ్య
నవ్య మణికాంతి విలసిత దివ్య పాద
పద్మ కలితుండు - ప్రఖ్యాత పౌరుషుండు
పతిత పావనుడగు రాము పత్ని నేను ! 302

అరయ పండ్రెండు వత్సరా లత్తయింట
కొరవడని దివ్య భోగాల గుడిచి - మిగుల
కుతుకమున నుండ - ప్రేమతో కొడుకు రాము
ధరణి పతి జేయ నెంచెను దశరథుండు. 303

మంచికిని నెన్ని విఘ్నముల్ మహిని గల్గు
నన్న జనసూక్తి నెరుగవో - యన్న! దుష్ట
చిత్తయయి చెడగొట్టె చిన్నత్త కైక
ఉర్వి పట్టాభిషేక మహోత్సవమ్ము. 304

చెనటి పలుకుల దశరథు మనసు కలచి
రాజ్యమును గొన - కైకేయి - రాము నడవి
పాలు జేయగ తా రెండు వరము లడిగె
తండ్రి బాసను నెరవేర్ప దాశరథియు. 305

మారు పలుకక - కోసల మహిని వీడి
అడవి పాలయ్యె - వెన్నంటి యతని తోడ
మరది లక్ష్మణుడును నేను పురము వీడి
వచ్చి నారము - దండక వనములోన. 306

వాస మొనరించి యుండ - రావణుడు వచ్చి
కపట ముని వేష ధారియై గడగి - రాము
డింట లేకుండ - మాయ - నన్నొంటి జేసి
మోసమున దెచ్చి - యిటనుంచె; మోహ మతిని. 307

అనుచు నిజ చరిత్రంబును జనక తనయ
వాయు సూనున కెరిగించి - బాష్ప పూర్ణ
నేత్రముల రుద్ధ కంఠయై నెగడె - తల్లి!
ఆమె గని హర్ష ముఖుడౌచు హనుమ బలికె. 308

# హనుమ దాశరథుల సేమము సీతకు దెలుపుట.

వేద వేదాంగ విద్యా ప్రవీణ మూర్తి
రామచంద్రుడు నీ భర్త క్షేమ మమ్మ!
బలవ దానీత వైనట్టి లలన! నీదు
కుశల మారయ నన్నంపె - కోమలాంగి! 309

అనఘు డగు రాము డమ్మరో! తన కుశలము
దెలుప మనె నీకు; తానును దెలుప మనియె
తనదు సేమము మరది లక్ష్మణుడు - తల్లి!
భక్తి తాత్పర్య వినయ సంబద్ధు డగుచు. 310

పురుష సింహుడు రాముండు కరము కుశల
మనుట విని పొంగి-పులకించె-జనక తనయ;
మనసు తేలిక పడుటచే వినుత మతిని
హనుమతో నిట్లు పల్కె నయ్యవస రాన. 311

"బ్రతికి యుండిన సుఖములు బడయ నగును
వరగ నూరేండ్లకైన నాపదలు తొలగి"
అనెడు వృద్ధుల వాక్యమ్ము లవితథముగ
సార్థకమ్ము లౌచు నాయందు సత్యమయ్యె. 312

అనుచు కాలముఁ గొనియాడి అతివ సీత
హనుమ దాగమనమ్మున నతి ముదమ్ము
గాంచె-రాముడే తనముందు కదలినట్లు
భావమున తన్మయత్వ సంభావ యయ్యె! 313

ఆత్మ హత్యా ప్రయత్నాన నవని తనయ
మసలు సమయమ్ము స్మరియించి మారుతి-తన
చేతులను మోడ్చి భక్తితో సీత తోడ
పలికె కన్నుల బాష్ప ప్రవాహ మురల. 314

తల్లి ! జనకజ ! యెట్టి భాధా ప్రసక్తి
ప్రాణములు వీడు తలపులు బాయుమమ్మ !
అతుల బలశాలి నీ రాము డనుజు గూడి
జేర గలడు లంకాపురి - శీఘ్ర గతిని. 315

పిశితభుక్కుల నవలీల నిశిత బాణ
చయమునం గూల్చి రావణు జంపి - నిన్ను
ప్రాజ్య విభవాన కోసల రాజ్యమునకు
దోడుకొని పోవు నిక్కమ్ము ! దుఃఖ పడకు. 316

## జానకి - హనుమన్ను శంకించుట.

అనుచు తన్ను సమీపించు హనుమ గాంచి
రామ కుశల కథనమున తృప్తి గనియు
నతుల మాయా విశారదు నసుర విభుని
వంచనమ్ము తలంచి యా పడతి మిన్న. 317

అకట ! నను మోసగింపగా నసురు డిట్టి
మాయ వేషము దాల్చి నన్ డాయ వచ్చి
యుండు ననియెడు హృద్భీతి యుద్భవింప
అనుపముగ సీత భయకంపి తాంగి యయ్యె. 318

అధిక భయ కంపితాంగియౌ నామె గాంచి
నమ్మకము పుట్ట నప్పుడు నగచరుండు
పరమ సద్భక్తి పాదాబ్జ వందనము-వి
నమిత శీర్షు డగుచును యొనర్చి పలికె. 319

రాక్షసుల మాయల బొక్కు రమణి ! నీవు
సందియం బొందుటయె యిట సహజ మమ్మ !
తల్లి ! నమ్ముము ! శ్రీ రఘూద్వహుడు పంప
వచ్చినాడను - శంకింప పనియు లేదు. 320

అనుచు ప్రణమిల్లి-కడు వినయాన నిల్చి
యున్న హనుమ నెగాదిగ గన్నన గని
అపుడు విశ్వాస మొక్కింత అనునయింప
హనుమతో దీనయై బల్కె యవని తనయ. 321

మాయ లేడి తెచ్చిన కీడు మదిని మెదలి
రావణుని దుష్టబుద్ధి కారణము చేసి
శంక పొడమెను ప్రాణంబు లింక బారె
ధైర్యము నశింప నెడద సంతాప మొదవె. 322

స్వప్నమున వృక్షచరు గాంచు జనములకును
శుభము గలుగ దనెడి బుధ సూచనాళి
శుభము లందింపగా కడు చోద్యమొదవె
స్వప్నమిది కాకపోవుట సర్వశుభము. 323

అకట! నుపవాస కృశనయి - అతుల శోక
మగ్న మానసనై యున్న మన్మనాన
'మంచి' మృగతృష్ణ యైపోయె - మానసమ్ము
నిత్య సంశయా స్పదమయి నెగడు చుండె. 324

ఎవ్వరిని నమ్మగా వలె? ఏది నిజమొ?
ఎరుగగా కష్టమై పోయె - నింత వరకు
జరిగినవి జ్ఞప్తి కెలయించి - జలదరించి
మాట పెగలక - కంపించె - మగువ సీత. 325

# హనుమ రాముని వర్ణించుట.

అవని సుత నమ్మలేకున్న దని యెరింగి
పవనజుడు సందియము బాప భవ్యమతిని
ద్విగుణితోత్సాహ వంతుడై-దీప్తి నెగడి
పరమ భాసుర వదనుడై పలికె నిటుల. 326

సూర్య సమ తేజు - డకలంక శూరు డఖి
లోక పాలుర సముడు - జనైక హితుడు;
ఆశ్రితావన దీక్షితు-డమల గుణుడు;
వాగ్వివేకుడు - నీ భర్త - వసుధ తనయ. 327

అల కుబేరుని మాడ్కి తా నధిక ధనుడు;
జలజ నేత్రుని చందాన శౌర్యగుణుడు;
శుభ్ర తనుడును-కందర్ప సుందరుండు
సత్య రతుడమ్మ-నీ భర్త-జనక తనయ. 328

అమర పతి బాహు బలమును-నాశ్రయించి
వీత దుఃఖాత్ము లయినట్టి వేల్పులట్లు
అమ్మ ! నీ భర్త భుజబల మాశ్రయించి
హర్ష పులకితు లగుచుందు రవని జనులు. 329

చంద్ర-చంద్రికా కాంతుల జల్లువాడు;
ఘన గుణాన్వితు-డాగురు ఘనుడు - విబుధ
వత్సలుండును-సుస్మిత పూర్వ భాషణుండు;
పద్మ నేత్రుడు-నీపతి-పద్మ నయన ! 330

అట్టి కాకుత్థ్సు - కపట మృగా కృతినిన
సుర విభుడు వంచనం చేసి-సుదతి ! నిన్ను
దొంగిలించి తెచ్చె-నదెంత దుష్ట బుద్ధి !
కట్టి కుడుపడె-వాని నా కర్మ ఫలము. 331

సర్వ సౌజన్య భావ విశారదుండు;
అరి భయంకరు డార్త జనావనుండు;
శాస్త్ర విజ్ఞాని శ్రీరామచంద్రమూర్తి
శౌర్య వారాసి - కరుణా ప్రశాంత మూర్తి. 332

కలికి! నను నమ్ము - నేను రాక్షసుడ గాను
నిజము! నీ పతి బంపగా - నిన్ను వెదకి
కనుగొనెడు నాసతో వచ్చి - దనుజ రాజ్య
మందు కన్గొంటి - నాదు భాగ్యమ్ము కతన. 333

శుభము గలిగింప వచ్చిన సుకృత మతిని
తల్లి! నను విశ్వసించి - నీ తపన విడచి
భాషణము చేసి నను వేగ బంపు మంచు
వేడుకొనె - హన్మ వినయ వివేక మొప్ప. 334

## హనుమంతు రామలక్ష్మణుల రూపవిశేషములను దెల్పుట

రామ చరితము దెల్పి యా రమణి యెద్దుట
భక్తి సంభరి తాత్ముడై బరగి యున్న
వాయు సూనుని గనుగొని వసుధ తనయ
మృదు మధుర భాషణముల వచించె నిట్లు. 335

హరి వరాగ్రణి! ప్రత్యక్ష మందు నీవు
నిజము మాట్లాడినను నమ్మ నేరకుంటి
సాధు హృదయాన నాదు కష్టంబు దెలిపి
ఉచిత రీతిని వర్తింపు మోయి నీవు. 336

వినుము హనుమన్న! నిను నేను విశ్వసింప!
విభుని విధమును నీ కథ విశద పరుపు
మనగ - పావని వినయము కనుల దొలక
వందనము చేసి జానకి ముందు నిలచి. 337

భక్తి పులకిత గాత్రుడై భద్ర మతిని
పరమ మోదమ్ము నిండార - కరయుగమ్ము
మోడ్చి - మానస మందు రాముని దలంచి
నమ్మకము బుట్ట పల్కె సీతమ్మ తోడ. 338

చారు మేచక నీరద శ్యామ తనుడు
నిడుపు లౌ బాహు యుగళంబు నెనరు ఘనుడు
కమల పత్రాక్ష శుభగ నేత్రముల వాడు
రమణి! రాముండు ప్రియ భాషణముల వాడు. 339

నిత్య నిర్మల హృదయుడు-సత్య రతుడు
ధర్మ నిరతుడు-సాహసి-ధైర్యశాలి
పరమ కారుణ్య హృదయుడు-పండితుండు
పురుష సింహుడు - రాముండు - పుణ్యమూర్తి. 340

కంబు కంఠుడు-గంభీర గళయుతుండు;
అర్క నిభతేజు-డకలంకు-డఖిల లోక
పాలనా దక్షు-డపురూప ప్రాభవుండు;
ఓర్పునకు భూమి కీడయి నొప్పు వాడు. 341

శస్త్ర శాస్త్రాది విద్యా విశారదుండు
ధరణి గొనియాడు నద్భుత ధన్వి - సెమ్మి
సిరుల నలరారు రవికుల శేఖరుండు
సాటి రారెవ్వ రతనికి సాటి యతడె. 342

వేద వేదాంగ పారగు - డాదరమున
నెల్ల జనముల హితము రక్షించు వాడు
దనర తనయందు నఖిల భూతముల యందు
సమహితత్త్వంబు నెంచు ప్రజ్ఞాన ఘనుడు. 343

అనఘు డాశ్రిత జనముల కాప్తు డుగ్ర
రణ విశారదు డత్యంత రాజనీతి
వరుడమ్మ - శ్రీరామభద్రు డవని
సాటి లేనట్టి ఘన రాజచంద్రు డమ్మ. 344

రామ సదృశుడు-గుణరాజి-లక్ష్మణుండు
దివ్య బంగారు ఘనవన్నె దేహు డతడు;
ననవ రతమును రామ పాదాంకి తైక
భావు డమల తేజుండు సౌభ్రాతృ ఘనుడు. 345

జనకు బాసను నెరవేర్ప జడలు దాల్చి
తాపసుల రీతి నయ్యన్న దమ్ము లరయ
వల్కలాజినములు దాల్చి వనములందు
హరి హరుల భంగి దోచు చూపరుల కెపుడు. 346

వనచరేంద్రుడు ప్రీతి సేవల నొనర్చి
భక్తి గొలువగ నామాల్య వంత మందు
లక్ష్మణుని తోడ గుశలుడై లక్షణముగ
రఘు కులాంబోధి చంద్రుండు రాముడుండె 347

నిన్ను బాసిన దాదిగ నిముస మైన
కన్ను మూసి యెరుంగ డా కరుణమూర్తి
నిన్ను మరువకు సంతోష మన్న పదము
మరచె-నా తండ్రి రాముడు మగువ నిజము. 348

తెలిసి యున్నవ్వా డైనను కలను నైన
మగువ నీ రూపమే తండ్రి మదిని మెదలు;
గాక నీ కయి నతడేల కలత నొందు?
నుడువగా జాల నీకయి పడెడు బాధ. 349

వినుత ధీరుండు విక్రమోపేతు డతడు
అరి భయంకరు డఖిల లోకైక వీరు
డమ్మ! నిను బాసి సతము దుఃఖాబ్ధి మున్గి
వగచు నెప్పుడు నది చెప్ప వశము గాదు. 350

నాడు కళ్యాణ మందున నాధు వేళ్లి
కేను దొడగిన దివ్యమౌ నుంగర మిది
అహా ! నా భాగ్య మేమందు ? నవని ధవుని
జూచి నటులాయె ముద్రికం జూడ-నిపుడు. 363

అమిత సంతోష వదనయై అవని జాత
హనుమతో బల్కె నీవు నా కన్నె దెలిపి
భవ దుదార వృత్తాంతమ్ము వానరేంద్ర
తెలుప సైతి వనంగ తా తెలిపె నిట్లు. 364

అనిలు కరుణకు పాత్రురాలగుచు_నడవి
తీవ్ర తపమాచరించిన దివ్య చరిత
అంజనాదేవి నాతల్లి ! అనిల సుతుడ !
అర్కజుని మంత్రి _ హనుమంతు డనెడు వాడ. 365

## సీత అనవాలుగా తన శిరోభూషణ మిచ్చుట.

ఉవిద ! శ్రీరామ డంపిన యుంగరమ్ము
దొడరి గొని వచ్చి యిచ్చితి_ దూతలకును
ఉత్త చేతులతో బోవు టుచిత మగునె ?
ఎలమి నిను గన్న యాన వా లిమ్ము - తల్లి. 366

నమ్ము నటుల ప్రభుని కా నగను జూపి
ధైర్య మొదవించి మాన్పింతు దైన్యమమ్మ !
రామచంద్రుడు నీ దగు సేమ మెరిగి
గొప్ప యుత్సాహమున మమ్ము గూడ కట్టి 367

జలధి లంఘించి - లంక నిశ్శంక జొచ్చి
దుష్ట రావణు ద్రుంచి - నీ కష్టములను
దొలగ జేసి యయోధ్యకు దోడు కొంచు
పోగలాడమ్మ - ప్రభువు - నిన్ పూజ్యగతిని. 368

సీత యది విని-నానాథు క్షేమవార్త
ధీనిధీ ! వింటి-నీ వల్ల దెలిసి కొంటి
ఇదిగో ! నా శిరోభూషణ మిచ్చుచుంటి
గుర్తుగా రామునకు నీయ గోరుదాన. 369

భద్రముగ కండ్ల నద్దుక పవన సుతుడు
భద్ర పరచెను దానిని భద్రముగను
అమిత హర్షాతి రేకుడై - ఆ క్షణాన
పలికె జానకితో రాము ప్రతిభ గూర్చి. 370

తెలిసె నీ జాడ - ఇంక నా ధీరవరుడు
క్షణములో వచ్చి-రావణు జంపి-లంక
భస్మ మొనరించి-యానంద భరితు డగుచు
నిన్నయోధ్యకు గొనిపోవు నిక్కవముగ. 371

అంత సంతృప్తి నొంది నయ్యవని జాత
కనుల నానంద బాష్పముల్ గ్రమ్మ కొనగ
ర క్తి బలికె ! నో హనుమ ! నా రామభద్రు
సేమమును విని బ్రతుక నాశించు చుంటి. 372

చెనటి రావణు డేతెంచి - మనసు కలచి
గర్వమున నిష్ఠు నన్నెన్ని కారు లాడె
వినిన వాడవు గాన - మద్విధి కృతంపు
బాధలను దెల్పుమా రామభద్రు తోడ. 373

రెండు మాసాలు గడువిడి యుండె రావ
ణుండు - దెల్పుమీ మాట ముమ్మందు - రామ
చంద్రునికి - ఆ గడువులోన సంద్రమును - త
రించి రానిచో సీత జీవించ దనుము. 374

ధీర గంభీరుడౌ కపి వీరు డంత
కలవరము చెంది _ జానకిం గాంచి_పలికె
ఇప్పుడే నబ్ధి దాటించి యిన కులేశు
చెంత జేర్చెద నిను_తల్లి ! చింత విడుము ! 375

అనువుగా నాదు వీపుపై నధివసింపు
అంబునిధి దాటి చిటికెలో నీకసాన
శక్రునికి హవ్యమును నగ్ని జేర్చు నటుల
తల్లి; నిను రామభద్రుని దరికి జేర్తు. 376

హనుమ యిట్లుని బల్క నయ్యతివసీత
తీవ్ర దుఃఖాన మున్గియు తెప్ప రిల్లి
ఇదియె నీకపిత్వ మని హసించె నుంత
అదియె తనకు పరాభవ మంచు_తలచి 377

తల్లి! నా శక్తి నెరుగని దానవగుట
అల్పునిగ నెంచి నీవు నా ఆత్మ రూపు
భయము చెందక గను మంచు పవనజుండు
సీత యక్కజ మందగా చెలగి యపుడు. 378

## హనుమ సీతకు నిజస్వరూపమును జూపుట

చుక్కలే తల పూవులై పొగను గూర్ప
మేరు నగ సమముగ తన మేను బెంచి
ఆకసము నంట వ్యాపింప_హనుమ గాంచి
మదిని ముదమందె సీత య మంద గతిని. 379

ఒప్పిదమ్ముగు తనదు హామహోన్నతమ్ము
నైన రూపమ్ముజూపి_యా పైన మరలి
సూక్ష్మరూపము దాల్చి_ఆ సుదతి కంత
వందనము చేసె నమ్రుడై వానరుండు. 380

తల్లి నిన్నోయు టెంత? నే దలచు కొన్న
కోట పేటలు గుడి గూఢ గోపురములు
గలుగు లంకను పెకలించి కట్ట గట్టి
రాము దరి బడవైతు సరాక్షసముగ. 381

వట్టి మాటలు పలికెడి-వానరుండ
నని-తలంపకు మనినంత నవని తనయ
తెలిసితిని నీదు బల సత్త్వ తేజములను
కానిచో రాము డేల నా కడకుఁ బంపు. 382

ఏను నీతోడ రాగూడ దెందు కనిన
పరుల నంటని నియమంపు వ్రతము నాది
తస్కరించిన దశకంఠు దర్ప ముడిపి
అర్క వంశుండు నను గొనుటర్హము కద. 383

అమిత భుజ బల శౌర్య గుణాధికుండు
నలఘు తేజుండు సమర కౌశల రతుండు
నైన రఘువరు సరిపోల రవని నెవరు
హరి-హరాదులు తుదకు బ్రహ్మదులైన. 384

హితము వచియించి-కపివర! యిచటి కీవు
రవి కుమారుని-లక్ష్మణు-రామ విభుని
సకల కపిబల ప్రతతితో సత్వరమ్ము
దోడుకొని వచ్చి పృధుకీర్తి దొడరు మనియె. 385

# హనుమ ప్రయాణోన్ముఖుండగుట.

అటుల వచియించు జానకి నభినుతించి
తరలుటకు చాల తడవాయె-తరల వలయు
సెలవు నిడుమని గోరగా - వెలది సీత
నిడుద నిట్టూర్పు ఘటియించి-నెమ్మిగదుర. 386

మహిపునకు నాకు మారు నమస్కరించి
తెలుప గదవయ్య -నాపాట్లు-దితిజ తతుల
ఆగడమ్ములు-సౌమిత్రి ననునయించి
విన్నపము చేసి-రక్షింప వేడితినను. 387

తల్లివలె నన్ను నిత్యము దలచు వాడు
నిర్మలాత్ముడు సౌమిత్రి-నేరకేను
కించ పరచితి నది మది నుంచు కొనక
కూర్మి మానము గాపాడ గోరితి నను. 388

ఆడ గూడని పరుషమ్ము లాడి యుంటి
వాని ఫలమిది రాక్షస వనములోన
వత్సమును బాసి పులివాత వనట జెందు
దీన గోవునయితి నని తెలుపు మయ్య. 389

కమల పత్రాక్షు - సౌమిత్రి - కపి కులేశు
సేమ మడిగితి ననుము-శ్రీరామ విభుని
సత్వరము వచ్చి లంక ధ్వంసమ్ము చేసి
నన్ను గొనుమంటి ననుచును విన్నవింపు. 390

హృదయ వేదన తగ్గె నొక్కింత నాకు
నే యుపకృతిని నీకొనరింప గలను ?
యైన నీవీ జగాన నిత్యమ్ము గాను
వర్థిలుము బ్రహ్మకల్పముల్ వాయుసుతుడ ! 391

అనుచు దీవించి హనుమను గనుచు సీత
ధరణి నాయకు శ్రీపాద సరసిజముల
వీడి జానకి మనదని విన్నవింపు
కరుణతో నాథు హృదయమ్ము కరగు నట్లు. 392

అనుచు దైన్యంబునం బల్కు నవని తనయ
ననునయించుచు-నోదార్చి-ఆంజనేయు
డామె యనుమతి నర్థించి యచటి నుండి
నిష్క్రమించుచు యోచించె - నీ విధాన. 393

# అశోక వన విధ్వంసము.

ఈ సముద్రము లఘించి - యిన కులేశు
రాణి గనుగొంటి-నా రఘురాము దయను
కాని-మిగిలిన దింకొక్క కార్య మరయు
దానినిం బూర్తి జేసియే దరల వలయు. 394

లంక యెంతయొ ? రావణు బింక మెంతొ ?
సాహస మ్మెంతో ? రాక్షస సైన్య మెంతొ ?
కనుగొనుట మంచిదొకధా-కదన-మందు
నుపకరించును - కార్య ప్రయోజన కయి. 395

దనుజ విభు దర్శనంబును దనుజ భృత్య
వర్గ మనుతింపరు క్రౌర్య భావ మతులు
సౌమ్య రీతులు నిష్ప్రయోజనము కూర్చు
సమయమును వ్యర్థ పరచుట జనదు నాకు. 396

రాక్షసుల మూక తోడ కలహ మొకండు
గలుగ - వారి బల విశేష కలన నెరుగ
వచ్చు-రావణుని కడకు వారె నన్ను
పట్టుకొని పోక యుందురే పట్టుబడిన. 397

రావణుని జూడ వచ్చు; తద్రాజ్య సభను
మంత్రులం జూడ వచ్చును-మాటలాడి
నాదు నాగమన ప్రయోజనము వచింప
వచ్చు-నెదిరి బలము గ్రహింపంగ వచ్చు. 398

అని తలంచి అశోకాన హనుమ-పుష్ప
ఫలయుత తరుల పెకలించి-ప్రళయ మట్లు
ప్రేళ్ళతో నేల పడగొట్టి వివిధ గతుల
ధ్వంస మొనరించె_రాక్షసుల్ దద్దరిల్ల. 399

అచట వన రక్షకావళి యైన వారు
పరుగు పరుగున నేతెంచి పవన సుతుని
ప్రతి ఘటింపగ-క్రుద్ధుడై వారి నెల్ల
గ్రుద్ది చంపె భయావహ రూపుడగుచు. 400

సీత నట కాపు గాచెడి స్త్రీలు కొంద
రాతురత మీర రావణు నంతి పురము
చేరి-వినమిత శీర్షలై-చెప్పి నారు
పలుకు వణకగ దేహంపు పట్లు సడల. 401

దేవ ! యొక కోతి ఉదయాన తెంపు జేసి
ఆతురత మీర మాటాడె సీత తోడ
చిన్న కోతిది మననేమి చేయునంచు
నూర కొంటిమి_అదియె మా నేరమాయె. 402

పుడమి బ్రిద్దలు గొట్టెడి భూతమటుల
పెరిగి యా కోతి తదుపరి పెద్దదాయె
ప్రళయ మేఘాలు గర్జించు భంగి యొక్క
సింహనాదము చేసెను; క్షితి పగులగ. 403

అమ్మహా నాదమును విని యసురు లెల్ల
చేష్టలుడిగిరి యొక్కింత సేపు_పిదప
వానిపై బడి బంధింప బయలుదేర
అతడిట్లు గర్జించె సింహమ్ము పగిది. 404

బలము కలదేని రండు! నన్ బట్టు కొనుడు!
బ్రతుక దలచిన వెంటనే పారిపొండు
అనుచు దనుజుల కవ్వించి-అదర గొట్టి
తోరణ స్తంభ మెక్కె నా తోకవాడు. 405

అంత మనవార లాతని చెంత జేరి
ప్రతి ఘటింపగ - వనచర ప్రముఖుడపుడు
రామదూతను నేను-మీ రావణుండు
సముడు గాడంచు తొడ గొట్టె సంబరమున. 406

భీతి యిసుమంత లేక నా భీమబలుని
దాకి-మనవార లెదిరింప దక్షు డగుచు
పెద్ద వృక్షమ్ము నొకదాని పెరికి తెచ్చి
కూల్చె పై చెను నెల్లర గొట్టి కొట్టి. 407

అలసించిన నింకేమి యగునొ ? రాజ !
వేగ మనసేన లీ కపి వీరు బట్టి
ప్రతిఘటింపనిచో లంక ప్రేతభూమి
యగుట నిజమని నుడివితా అతివలెల్ల. 408

# పవనజుని బంధించు ప్రయత్నము

దనుజపతి విని భీకరా వనుడు నగుచు
రోషమతుప్పొంగ-శాంతము రోసి-తీవ్ర
కోప భరితారుణాక్షుడై - క్రూరులైన
దనుజ లెనుబది వేల్ బంపె-హనుమ పైకి. 409

వారశోకము చేర నవ్వాయు జుండు
గాంచి రాముని-లక్ష్మణు-కపివరేణ్యు
మానసమున దలంచి నమస్కరించి
అసుర భటకోటితో నిట్టులనియె నపుడు. 410

అతిబలుడు రామభద్రున_కతని తమ్ము
డతుల బలశాలి సౌమిత్రి కమిత జయము!
రఘు వరుండగు రాముని రక్షణమున
సతము దనరెడి వానర పతికి జయము! 411

కోసలాధిపు డగు రాము దాసవరుడ;
మారుతాత్మజుడను_శత్రు మారకుండ!
వాసవుడు-బ్రహ్మ-యముడాది వరుల వలన
వరము లందిన శౌర్యుండ-వాడి మగడ! 412

అని ముఖమ్మున వేయి రావణుల సైన
రాము కరుణా విశేష సరంభమూని
భూరి తరు-శిల లాయుధ ములుగ జేసి
మోది నిర్జించి_విజయమ్ము పూని గాంతు. 413

రాము డక్లిష్ట కర్ముడు_రమ్య గుణుడు
కోసలేంద్రు డాతని గూర్చి కూర్మి దూత
అర్క సుతు మంత్రి నవని నేనతి బలుండ
నరి భయంకరుడ "హనుమ" యండ్రు నన్ను. 414

అని వచించెడు నంతలో నసురు లెల్ల
ఊరులయి వాయు సూనుని చుట్టు ముట్ట;
ప్రబల తరు శిలాయుధముల పట్టి-కొట్టి
భస్మ మొనరించె వారల పవనజుండు. 415

అది యెరింగిన రావణు డతి భయంక
రాకృతిని బూని_పంపె ప్రహస్తు సుతుని
జంబుమాలిని భువనముల్ సంచలింప
అనిల సుతుతోడ తీవ్రమౌ అని యొనర్ప. 416

అత డరుదెంచి యొక పది యస్త్రములను
వింట సంధించి హనుమపై విడచి నంత
నేర్పుగా తప్పుకొని హన్మ-నేల నున్న
బండరాతిని రాక్షసు పైన విసరె. 417

బాణ తీవ్రత చేత నా బండరాయి
పిండి పిండయ్యె; బాణాల పీడ వదలె;
హనుమ వాలము ద్రిప్పుచు నాన్నృశంశు
జంబు మాలిని తెగమోది జంపెనపుడు. 418

ఈ యుదంతము విని దనుజేంద్రు డదరి
మంత్రిసుత పంచకమ్మును-మహిత సైన్య
సాయమిడి బంప-వారల సమయ జేసె
యుద్ధమందున సామీరి యోద్ధృగరిమ. 419

రావణుండంత చండ విక్రమము మెరయ
భయదు లగు సైన్యనాథ సప్తకము నంపె
పవన తనయుడు వారల బట్టి మోది
జంపె నందరి నొక పెట్టు జగము లదర. 420

# అక్షయ కుమార వధ

సైన్య నాథాదు లనియందు సమసి-పృథ్వి
బడిన వార్తను విని మండి పడుచు-దనుజ
విభుడు-గలుగు వికారము వెలికి దోప
నీక-యోచించి హృదయాన నిప్పు లూరల. 421

క్రోధ ఘూర్ణిత హృదయుడై గొంకు లేక
చిన్న కొమరు నక్షయు నంత జేర బిలచి
కోతి పైనము నెరిగించి-కొడుక! వాని
జంపు మెటులైన-నీ కీర్తి జగము లెరుగ. 422

అనెడు తండ్రికి కేల్మోడ్చి అక్షయుండు
తీవ్రతర శౌర్య ముప్పొంగ తేరు నెక్కి
ఆయశోకము చేరిన యంత పవన
తనయు డగుపించె తోరణ స్తంభమందు. 423

కరులు హయములు కోకొల్ల కాల్బలములు
వెంట రా నేగు రాక్షస వీరునకును
హనుమ గనుపించె హేమంత దినమునందు
తీవ్ర కాంతుల నిడు సూర్య దీప్తి నెగడి. 424

శ్రమము లేకుండ శత్రు కూటముల ద్రుంచు
విక్రమోపేతు డగు కపి వీరు గాంచి
అక్షయుడు వాడి బాణాల నపుడె దూసి
యేసె నిజ భూషలు చలింప నీప్సితాన. 425

అర్కసుతు సచివుడు నగు హనుమ-అక్ష
కొమరు శర పాటవమ్మునకును మదిం-ప్ర
శంస చేసి-స్వతనువును - జవము పెంచి
యుద్ధ సన్నద్ధుడయి యెదురొడ్డి నిలచె. 426

అక్షయుండేయు బాణాల హనుమ శిరము
గాయ మయ్యెను; రక్తమ్ము గారుచుండె
రక్తధారల దడిసి యా రామబంటు
వదన ముదితార్క బింబమై పరిఢ విల్లె. 427

పరమ సౌందర్య మూర్తియై భాను భంగి
ననిని గన్పించు నక్షయు-హనుమ జూచి
మదని ముచ్చట పడె-మోద-మనసు రాక
కినుక విడి యిటు నటు జూచు హనుమ గాంచి 428

కొండపయి దండి వర్షమ్ము కురియ జేయు
వర్ష మేఘమ్ము వలె తీవ్ర బాణ తతిని
అక్షయ కుమారు డంతట హనుమ పైన
గ్రుమ్మరించెను భయదు ఉగ్ర ఘోషణముల. 429

బాల సూర్యుని వలె రేగి బహు శరముల
వక్షమగులగ గొట్టిన నక్ష సుతుని
నిక నుపేక్షింప దగదని ప్రకట మతిని
దొడరె వానర శార్దూలు డడలు పుట్ట. 430

అమిత తేజాన వీరుడై అవని గలచు
అక్షసుతు గాంచి గర్జించి హనుమ వాని
శరములను బట్టి కోపాన విరచి వైచి
మబ్బు దొలగిన భాస్కరు మాడ్కి వెలిగె. 431

వీర తేజో బలాఢ్యులౌ వారు సలుపు
పోరు గని నాశ్చర్యము నెంతొ పొంది రమరు
లవని కంపించె - స్తంభితు డయ్యె పవను
డదలి వెలుగడు సూర్యు డెల్లెడల - నంత. 432

పవన పథ మధిరోహించె పవనజుండు;
రాళ్ల వర్షము రాక్షసు రథము పైన
కురిసె; రథమంత నురుమయ్యె - హరులు జచ్చె;
విరథుడయి - యక్షయుడు-పడి -వివశుడాయె. 433

ఖడ్గమును కేల గైకొని - కపివరేణ్యు
డాక మింటికి నెగసె నద్దనుజ సుతుడు;
మునులు సత్తపః శక్తిచే పృథ్వి వీడి
బొందితో పుణ్యలోకము పోవు భంగి. 434

అటుల జని-అక్షయుడు వేగ హనుమ దాకి
వీరు డగుచు విజృంభించి - వెరగు దోప
పవన సుతు బట్టి నలయింప- పావని యును
అవని పగులగ భీకర రవ మొనర్చి, 435

వాలమును బెంచి-క్రుద్ధుడై-వాయు సూను
డక్షయుని చుట్టగా జుట్టి-అతి రయాన
గిర గిరం ద్రిప్పి-స్థిరమతి ధరణిగొట్ట
అక్షయుడు జచ్చి - సున్నమై అవని బడియె. 436

అమరులును - దివ్య సంఘంబు - యక్ష తతులు
అల జయంతుని సముడైన అక్షసుతుడు
నప జయంబరది-మృతుడయి- అలఘు వీర
స్వర్గమున కేగుటం గాంచి సంత సిలిరి. 437

దనుజ కుల నాథు గుండియల్ దద్దరిల్ల
అసమ రణవీరు డైన-ఆ అక్ష సుతుని
గూల్చి - ప్రళయ కాలాగ్ని డై - క్రోధ మొంది
అనికి సన్నద్ధుడై యుండె-హనుమ మరల. 438

# రావణుడు ఇంద్రజిత్తుని హనుమ పైకి యుద్ధమునకు పంపుట

అక్షసుతు డీల్గెనని విని-అసుర విభుడు
మిగుల శోక తప్తాత్ముడై - మేఘనాథు
వేగ రావించి-విషయమ్ము విశద పరచి;
వానరుని బట్టి తెమ్మనె -దానవుండు. 439

పుత్ర! యా బ్రహ్మ మెప్పును- బొంది తీవు!
దివ్య శస్త్రాస్త్ర విద్యా ప్రదీప్త మతివి!
అనిని నిను దాక వెరచును అమర విభుడు
సత్యమిది గాదె! యెవడు నీ సముడు భువిని. 440

నీదు విక్రమ స్ఫూర్తికి నిలచు వాడు
గలడె పలునాళ్లు భువనాలు కలయ గనిన;
దేశ కాలమ్ములెరిగిన- దీక్షితుడవు
ధనువు చేగొన-జగములు దద్దరిలవె ? 441

నీ తపోబల దివ్యాస్త్ర నిపుణ మంత
గుర్తునకు రాగ_మదిలోని గుబుల దెల్ల
తొలగి పోయెను ; ఇట నొక్క తోక వాడు
రామ దూత నటంచు నీ లంక జొచ్చె. 442

పాడు పరచె నశోకమ్ము_ప్రబలు డగుచు
కింకరుల-జంబుమాలిని-నింక మంత్రి
సుతుల-ఘనులగు సేనాధి పతుల-తుదకు
అనుజు డక్షకుమారుని నవని గూల్చె. 443

బాహు బలము పటు చతురుపాయ బలము
దనరి-శాత్రవ వ్యూహ భేదన మొనర్చె.
యుద్ధ నైపుణి గలిగిన యోద్ధ వీవు
జగము లన్ని యెరుంగు నీ శక్తి బలము 444

దానవుల రాజనీతిని దప్పకుండ
మంత్ర శస్త్రాస్త్ర యుతుడవై మహిత శక్తి
సంతరించుక-నక్కపి సత్వముడుప
సిద్ధమై యేగు మని కింద్రజిత్కుమార! 445

బట్టుకొనుట కతీతుడై బరగె నేని
దోసమెంచక వనచరు దూల వేసి
సంతసింపగ జేయుము_సంతసించు
తండ్రినగు నన్ను _ నిద్రజిత్తనయ ! శూర ! 446

అనుచు మదిలోని తపన మా దనుజ విభుడు
తెలిపె_దేశకాలమ్ములు దెల్ియు ఘనుడు
పొందు యోధుడు-శూరుడు_ఇంద్ర జయుడు
సమర దుర్జయుడైనట్టి కొమరు నకును 447

రణ విశారదు డింద్రజిత్తనయు డంత
తీవ్ర కుపితాత్ముడై_కడు దీప్తి జెంది
తండ్రి కతి భక్తి దనర ప్రదక్షిణమ్ము
సలిపి_వందన మొనరించె _ జనగననికి. 448

మేరు పర్వతాకారుడై మేఘ నాథు
డసుర సేనలతోడ నయ్యవసరమున
పర్వముల బొంగు ప్రళయాబ్ధి భంగి-పొంగి
కపివరుని దాక రథమెక్కి గదలి వచ్చె. 449

కదలు రథచక్ర ఘోషణ క్రమము జూడ
భీకరార్భటి పదునాల్గు లోకములను
కలచి వైచుచు-భయదమై_గడలు కొనుచు
విపుల శక్తిని నెలకొని విస్తరింప. 450

దిశలు కలుషంబు లయ్యె-నల్దిక్కులకును
పారె పక్షులు-మృగములు పరువు లెత్తె
అతల కుతలాది లోకాల కడలు పుట్టె
దనుజపతి సుతు రథఘోష వినిన యంత. 451

అతుల జృంభితుడై వచ్చు నసుర వీరు
గాంచి – మై పెంచి – గర్జించి – కపివరుండు
యుద్ధ సన్నద్ధుడై నిల్వ_ఇంద్రజిత్తు
ధనువు గొని-నారి సవరించి _ దాకె నపుడు. 452

ఎప్పు డపజయ మెరుగని ఇంద్రజిత్తు
కినుక మీరగ దలపడి హనుమ పైన
విశిఖములు వింట సంధించి విడచి-విడచి
బాణ వర్షము గురియించె బహు విధాల. 453

ఆ శరమ్ముల విరచుచు అనిల సుతుడు
కుపితుడయి వీకమెయి పెనుకొండ రాళ్లు
ఇంద్ర జితు పయి వేయ నయ్యింద్రజితుని
రథము నురుమయ్యె నశ్వ-సారథులు పడిరి. 454

తీవ్ర కోపాన దనుజుండు తెంపు చేసి
ద్వంద్వ యుద్ధమ్ము సేయగా దలచినంత
చెట్లతో-రాళ్ళతో_వాని చిదుక గొట్టి
నొవ్వ జేసెను సామీరి-నివ్వటిల్లి. 455

ఓర్పు నశియింప-రాక్షసు డుగ్రు డగుచు
తీవ్ర శరములు హనుమపై తిగిచి నంత
గగన పథమున కెగసి నక్కపి వరుండు
వమ్ము గావించె-విరచె-నయ్యమ్ము లెల్ల. 456

మేఘనాథుడు వ్యథ జెంది_మింటి కెగసి
కపివరుని దాక వారు దిక్కరుల భంగి
ఘోరమగు పోరు సలుపుచు-గుద్దు కొంచు
నొండొరుల మోదుకొనుచుండి రుగ్ర గతిని. 457

నిశిత శరతతు లన్నియు నేలపాలు
కాగ _ బహు చింత మునిగి - ఆ మేఘనాథు
డితడ వధ్యుడు-నేగతి నితని నింక
గెలువ గలనని-మది యందు కలత గొనుచు. 458

ఎపుడు గనలేదు జగతి నే నింత బలుని;
ధైర్య వంతుని-అని గూల్ప దరమె యనుచు
వెరగు జెందుచు-మార్గము వెదకి వెదకి
హనుమపై ప్రయోగించె - "బ్రహ్మాస్త్ర" మపుడు. 459

త్రిదశ కోటులు భయమంద-త్రిజగముదర
మంత్ర పూరితమైన బ్రహ్మాస్త్ర మపుడు
నిప్పులను గ్రక్కుచును పోయె-నింగి యదర
దాకె హనుమను-దనుజ సంతతులు మురిసె. 460

మహి సమస్తము గాల్చు బ్రహ్మాస్త్ర మదరి
బంధితుని జేసె-జంపక-బ్రహ్మ దయను
ప్రబల బ్రహ్మాస్త్ర పాశ సంబద్ధు డగుచు
ధరణి బడె-చేష్టలుంటక్కి-తరుచరుండు. 461

ధరణి బడి-చింతితుండయి-ధాత వరము
దలచి కీడేమి లేదని తరుచరుండు;
పద్మ సంభవుపై గల భక్తి కతన
పట్టు బడె; రాక్షసులు వేగ గట్టి రతని. 462

ఏడు లిప్తలు మాత్రమే యా మహాస్త్ర
మహిమ పవనజు బంధించి మరుగువడియె
పరమ మంత్రము పఠియించి బ్రహ్మ దలచి
బంధ ముక్తుడై వరలెను పవనజుండు. 463

దనుజపతి జూచి మాటాడు దలపు కతన
బంధమూడు టెరింగియు-పట్టు నటుల
రక్కసుల గాట్లు పోట్లకు లక్ష్యమిడక
భయము నటియించె హనుమ నిర్భయుత నడరి. 464

అపుడె బ్రహ్మాస్త్ర మహిమ నా హనుమ డెదరి
యుండ-గనుగొని యింద్రజిత్తుల్ల మందు
గరము నాశ్చర్య మంది-మర్కటుని దెచ్చి
తండ్రి సభ నుంచె; నతని సంతాప మణగ. 465

## హనుమ ద్రావణ సంవాదము.

కడు మదించి యలసిన దిగ్గజము భాతి
పరమ నిర్లక్ష్య భావాన పలుకు లేక
కట్టువడి యున్న కపిని రాక్షస భటాళి
మోసికొని తెచ్చి రావణు మ్రోల నిడిరి. 466

రావణుని జూచి హృదయాన రామ దూత
చూడ నీ రూప విభవము-పొంపు-బెంపు;
బాహు బల సంపదయు-నుగ్ర వదన రీతి
కలవె యెవ్వరికైన నిక్కముగ జగతి. 467

తలప గుణమొండు వీనికి తక్కువయ్యె!
గాక_బలసూదనాదుల_కాల దన్ని
త్రిభువనమ్ముల నేలడే? తివిరి యలుగ
భువనముల ముంప నోపడే భూరి వార్ధి. 468

ఇతని క్రూర కర్మమున సతమత మయి
దేవ జాతులు-నరులును_దీప్తి దరగి
సుఖము చెడి యున్న వారు-ఆ సుఖము లింక
పొందుదురు వారు రాముని పుణ్యమునను. 469

అనుచు బహు భంగిమల రావణుని బలమ్ము
నమిత తేజము-దీప్తిని-నసుర రాజ
దివ్య ప్రతిభా విశేష కీర్తిని తలంచి
విస్మయం బందె తత్ప్రభా వీధి హనుమ. 470

రావణుడు కూడ వెఱగందె-రామదూత
తేజ మరయుచు-మును నేను తెగువ మీర
నగము కైలాస మెత్తగా-నన్ను శాప
మునకు గట్టిన నందీశ మూర్తి యంచు. 471

అదియు గాకున్న-బలి పుత్రు డైన ఘనుడు
అతుల బలశాలి - అల్ల బాణాసురుండు
వచ్చె-కపి యయి-యంచు రావణుడు-శంకి
తాత్ముడయి-ఆత్మనిగ్రహ మవధరించి. 472

తన యమాత్యుని దెస జూచి-తక్షణమ్మె
లంకలో నేల జొచ్చె నిశ్శంక నిట్టి
కోతి యెవరి పంపున కను గొను మటంచు
బల్కినంత బ్రహస్తుండు పవనజు గని. 473

ఎవ్వడవు నీవు? యిచ్చటి కేవిధాన
వచ్చినాడవు? పంపె నెవ్వాడు నిన్ను?
అని ప్రహస్తుండు ప్రశ్నింప అనిలజుండు
రావణుని దిక్కు మొగమయి ప్రతి వచించె. 474

మండు కోపాగ్ని ప్రబలిన రెండు కనుల
నంజనీ పుత్త్రి గాంచెడి నసుర పతిని
క్షణము వీక్షించి-దృఢతర చేత మొప్ప
ఆ ప్రహస్తుని గని యిటు లనియె హనుమ. 475

అనిల తనయుండ! హనుమంతు డనెడి వాడ!
అర్కజుని మంత్రి వరుడ! నో అసుర వరుడ!
పూజ్య చరితుండు దశరథ పుత్రు డంప
దూతగా వచ్చినాడను-సీత వెదుక. 476

దనుజ కులనాయకా ! రామ ధరణి విభుడు
తన సతిని దనుజుడొక్కండు తస్కరింప
ఆమె నట_నిట వెదుకగా నంపె నన్ను
రావణా ! గంటి నామె నీ రాజ్యమందు. 477

నిన్ను జూడగ నెంచి నీ నిష్కుటమ్ము
భగ్న మొనరించి నాడ-నన్ బట్టి చంప
సత్త్వలగు రాక్షసులు రాగ_చావ గొట్టి
అనిని గూల్చితి నాత్మ రక్షణము నెంచి. 478

పద్మయోని నిస్తుల వర ప్రాభవమున
నసురు లమరులు నను చటులాస్త్ర బంధ
నముల బంధింప జాలరు-నన్ను నీకు
పరిచయము చేసికొన గోరి పట్టు వడితి. 479

బలము దెలివియు గల నీదు భ్రాత-అల్ల
కీశ వంశాధిపుండు-సుగ్రీవు డతుల
ప్రీతి_నీ సేమముం గోరి-ప్రియ మెలర్ప
బంప వచ్చితి-తుదకిట్లు పట్టుబడితి. 480

నీకు సేమమ్ము సుఖమును నిచ్చు నట్టి
అతని మాటల వినిపింప నరుగుదెంచి
నాడ; ధర్మార్థ హితములై జూడ నవియు
నుభయ లోక ప్రీతి కరము లభయదములు. 481

జనకు నానతి సతితోడ-అనుజు తోడ
వన నివాసము సేయు-రాముని సతీ మ
ణిని-నఖిల లోక మాతను-కినుక బూని
మ్రుచ్చలించుట తగునె నీ బోటి కరయ. 482

నిర్మలుడ విట్టి బహుజన నిందితమ్ము
లతుల కులనాశ కరములు-నైన నిట్టి
ధర్మహీనములయిన దుష్కర్మములను
చేయ పాడియె? లంకకు చేటు గాదె. 483

తపము లొనరించి-తేజము దనర వడసి
పూజ్యుడగు బ్రహ్మ కులమున బుట్టి-యొప్పి;
నట్టి నీయట్టి మేటికి స్వాత్మ కీర్తి
కుల వినాశంపు చిలిపి చేతలు గుణంబె? 484

బ్రహ్మ తత్వ మెరింగిన ప్రౌఢ బుద్ధి
పైన-నీ కిదేమి విచిత్ర మైన చేష్ట?
రాముడన నెవ్వ డనుకొని రాము సతిని
బలిమి చెరపట్టి నాడవు-బ్రతుక గలవె? 485

బొటన వ్రేలిని నదిమి నీ భుజ బలమ్ము
డుల్ల జేసిన ధూర్జటి విల్లు విరచె;
వాలమున జుట్టి-నినుగట్టి వదలి నట్టి
వాలి నొక్క బాణాన తా కూలనేసె. 486

భూమి భారము బాపి-యీ పృథ్వి యందు
ధర్మమును నాల్గు పాదాల తనర జేయ
ఆది నారాయణుండె-యీ అర్క వంశ
రాముడయి పుట్టె-తెలియుము! రాక్షసేంద్ర! 487

అతనితో వైర మనగ మీ అసుర జాతి
కంత మంచిది కాదని-యరయుమీవు!
మూర్ఖతను వీడ కీవిటు పొగరు జూప
కలుగు లంకకు చేటు-నీకతన నిజము! 488

పుణ్య జన్ముడజేయుండు-పురుష సింహు;
డసమ భుజశాలి-కోవిదు-డసదృశుండు;
భూవరేంద్రుడు-త్రైలోక్య పూజ్యు డరయ
రామచంద్రుండు-వినుము ! ఓ రాక్షసేంద్ర ! 489

అసమ సాహసుడు దశరథాత్మ జుండు
పటుతరోదగ్రచైతన్య బాహు బలుడు
సీత నర్పించి-శరణన్న-చిత్త మలర
నిన్ను క్షమియించు రాముడు-నిజము ! నిజము! 490

అనిన విని కోప ఘూర్ణితా ననుడు గాగ;
నెఱ్ఱనయె మోము-అధరమ్ము లెఱ్ఱబడియె !
తనువు సకలమ్ము సందీప్తతను వహించె
రావణుండు గ్రీష్మకాల మార్తాండు డయ్యె. 491

ఓరి ! వనచరా ! వినుము-నీ యుక్తి నేర్పు
మెచ్చ దగి యుండుటయు నేను మెచ్చుకొంటి !
దొంగగా వచ్చి-నీ వొక దొరయు వోలె
భావనము చేసి వదరుట పాడిగాదు. 492

అనుమతిని పొందకుండ నీ వా-అశోక
వనము జొచ్చుట-సీతను గనుట-జూడ
దోసమే యైన-మాయందు దొసగు జూపి
వదరు చున్నావు-నీతులు వల్లె వేసి. 493

అదితి సుతులను బంధించి-అఖిల దిశల
గెలిచి జగమేలు రావణు కొలువు నందు
మాన మర్యాదలను వీడి మహిష మట్లు
సంచరించితి విక నీదు చావు నిజము. 494

దుర్మదాంధుడు-చెనటియు_దుష్ట బుద్ధి
స్వాభిమానుండు_దురితుండు-స్వార్థగుణుడు
దోషయుతుడైన-రావణు దుష్ప్రలాప
ములను నోర్వక_హనుమంతు డలుక బూని. 495

పురుషు లింట లేని తరిని-పుణ్యశీల
సీత చెరబట్టి నట్టి దుశ్శీలు డవుర!
నీదు పాపమే అగ్నియై-నీకులమ్ము
ఖలుడ! దహియించు-రామలక్ష్మణుల కతన. 496

రాము డలిగిన నీవగు రాజ్యమెల్ల
సపరివారమ్ముగా-నింకి-సమసిపోవు
సాధ్వి-భూసుత బట్టు దుశ్చర్య కీవు
దిక్కు లేకుండ జత్తువు-దీనుడవయి. 497

## రావణుడు హనుమను వధింప బోవుట

అదురు బెదురును లేకట్లు వదరు చున్న
అంజనీ పుత్త్రు మాటల కసుర రాజు
కోప దీపితు డగుచు_నో_ కొంటె కోతి!
కడగి నిను గూల్తునని యొర కత్తి దూసె. 498

వినయ వినమితు డగుచు విభీషణుండు
అగ్రజుండగు రావణు జేరి-యాదరమున
దూతలం జంప తగ దది_నీతి బాహ్య
మైన పని గాన_జంప ననర్థ మనియె. 499

పౌరులను_స్త్రీల-వృద్ధుల_బాలకులను
దూత-లలతుల జంపుట దోష మధిప!
రాజసము గల్గు నీ యట్టి రాజ వర్యు
డల్పుడగు కోతి జంపుట అర్హమగునె? 500

అనుచు శాంతింప జేయ-దా నాగ్రహమ్ము
పట్టజాలక-రాక్షస ప్రభువరుండు
యుక్తమగు దండనమునకై యోజ సల్పి
తుదకు మది నిశ్చయించెను-తోక గాల్ప. 501

వాలమే భూషణమ్ము యీ వనచరులకు
గాన తోకను గాల్పింప-గరిమ ముడుగు
దగ్ధవాలమ్ము గాంచిన దనుజ కులులు
నమిత తృప్తి నందుదురం చాత్మ నెంచె. 502

రావణుడు ముష్కరులు నైన రాక్షసులకు
"యీ వనాటుని తోకకు-నెల్ల తైల
సిక్త వస్త్రములను జుట్టి శీఘ్రముగను
అగ్ని దరి గొల్పి పురి ద్రిప్ప" నాజ్ఞ నిడెను. 503

## లంకా దహనము

పటుతరోత్సాహ వంతులై ప్రభుని యాజ్ఞ
శిరములం దాల్చి-తైలావ సిక్తమైన
జీర్ణవస్త్రములం జుట్టి-చిచ్చు రేపి
మంట లెగయగ-సంతస మంది వారు. 504

తామసమ్ముప్ప చటుల మృదంగ తూర్య
భీకరారవ రవముల నాకసమ్ము
బీట వడ రాక్షసులు రేగి-భీమబలుడు
రామదూతను ద్రిప్పిరి రాజవీధి 505

వారి నదలించు శక్తి యవ్వనచరుండు
గలిగి యుండియు-పురమును గలయ జూడ
నణకువను జూపి-బద్ధుడై-నసుర భటుల
వెనుక జనుచుండె-భయ మొందు వెఱ్ఱి వోలె. 506

అత్తరిని బాల వృద్ధులు-నసుర మహిళ
లందరును గుంపులై-మేడలందు నిలచి
దీప్త వాలాన పురవీధి దిరుగు చున్న
హనుమ గని గేలిగా-'ఫక్కు' ననుచు నగిరి. 507

ప్రజ్వలిత వాల యుతుడైన పవన తనయు
జూపి-యీ "వింత కోతిని" జూడు డంచు
అమిత కోలాహలం బొప్ప నసుర భటులు
విడక ద్రిప్పిరి లంకలో వీధివీధి. 508

కుతుక మొప్పార దైతేయ సతులు కొంద
రవని సుత జేరి-ఇంచాక అతివ! నిన్ను
గలసి ముదమున నీ నాధు కధను జెప్పి
నట్టి మర్కటు వాలాస నసుర భటులు. 509

దారుణాగ్నిని దరిగొల్పి-ధైర్యమొప్ప
పురము నల్దిక్కులను వాని వరల ద్రిప్పు
చుండిరని దెల్ప-జానకి శోక తప్త
హృదయయై-నగ్ని దేవుని నెద దలంచి. 510

సతము పతిసేవ యనియెడు వ్రతపాన
నలరు సాధ్వని జగతి నేనైతి నేని
శీతలుండవు గమ్ము-నా సేమ మెంచు
ననిలజుని యందు-అని మ్రొక్కె నగ్ని కామె. 511

త్రిజగముల గాల్చ గల్గెడు దిట్ట యయ్యు
నిజ ప్రతాపము జూపక-నిశ్చలతను
వహ్ని దేవుడు పవనజు వాలమందు
అమల చందన శీతలు డయ్యె-నపుడు. 512

లంక విభవము గంటి-నే నింక-నాడు
విక్రమము దైత్యులకు జూపు వేళ దరిసె
నని దలంచుచు నంగుష్ట మంత రూపు
దాల్చె మారుతి-బంధాలు తలగి పోయె. 513

బంధములు వీడినంతనె పవనజుండు
మదిని చింతించె-యీ వహ్ని మహిత శక్తి
గలిగినది యయ్యు-నన్నిట గాల్ప కునికి
చిత్ర మయ్యె కారణము యోజింప వలదె? 514

రాముదయ చేతనో-కాక రమణి సీత
కరుణనో-లేక నాతండ్రి గాడ్పు దయనొ
శాంతమును బూని వివశమౌ చల్లదనము
దహన దేవుడు జూపె-చోద్యమ్ము గాదె? 515

మేలు నా యందు జూపిన మేటి-దహన
దేవుడుల్లా సమంద యుత్సింప వలదె?
ఒప్పు చున్నట్టి లంక సౌధోత్తమముల
కగ్ని సంతర్పణమ్ము సేయంగ వలదె? 516

అని మనమ్మున జింతించి-యనిల జుండు
పావకుని చిత్తమందున బ్రస్తుతించి
శ్రీ రఘూద్వహు నెడదలో చింతజేసి
తండ్రి యనిలుని-జనకజం దలచి-దలచి. 517

ప్రజ్వరిలు వాల వహ్నితో-పవన సుతుడు
నగర సౌధాగ్ర భాగ మున్నతుడు నగుచు
ప్రళయ కాలానల జ్వాల లలము కొనగ
గాల్ప మొదలిడె దైత్య లంకా పురమ్ము. 518

అల ప్రహస్తుని హర్మ్యమ్ము నపుడు చేరి
వహ్ని నెలకొల్పి-నమ్మహా పార్శ్వ మంది
రమ్ము జేరి హుతాశను రహిని నిల్పి
కుంభ కర్ణుని బంగారు గృహము గాల్చె. 519

వజ్ర దంష్ట్ర-మహాబాహు ఖాసకర్ణు
డాది రాక్షస మణి మయాద్యాది స్వర్ణ
నిలయముల నగ్ని నిడ-నవి నింగి నంటు
మంట లెగయుచు 'భగ భగ' మండు చుండె. 520

అమల మణిమయ సౌధము లంగణములు
చప్పరమ్ములు నవచంద్ర శాల లింక
నశ్వ శాలలు గజశాల లన్ని గూడ
అనల సంప్రీతి గావించె ననిలజుండు. 521

అదియు నిదియని లేకుండ నా పురాన
భవనములు మేడమిద్దెలు-భర్మ్య హర్మ్య
గోపురమ్ములు-మంటల గూలిపోయె;
నాగి విభీషణు మందిర మొండు దక్క. 522

కనక నగమట్లు శోభల గ్రాలు దాని
హేమ మణిజాల రాజితానేక చిత్ర
శిల్పభాజన మగు దాని-శ్రీవిలాస
మయము రావణు దివ్య విమాన మంత. 5 3

జేరి వాలాగ్ర గతమైన చిచ్చు నిలిపి
హనుమ ప్రళయాభ్ర గర్జన మపుడొనర్చె
అనిలు సహకార మొందుచు నా కృశాన
నుండు-చెలరేగి నట భీషణుండు నగుచు. 524

చటుల విక్రమ మొప్పార-శక్తి మెరయ
అగ్ని దేవుడు తరుణత్వ మంది-ఛటఛ
టార్చటుల విస్ఫులింగమ్ము లాకసమ్ము
నిండ ప్రళయమ్ము సృష్టించి నెగడజేసె. 525

భయము చెలరేగ-పురిలోని పౌరు లెల్ల
పరుగు పరుగున పురివీడి బార దొడగి
రపుడు హెనుమంత లాకస మంటి మండ
గోడు గోడున నేడ్చిరి గోల పెట్టి. 526

గాలి చెలరేగి వీచెడి కారణమున
నగ్ని కణములు విపులమై-ఆ పురాన
నుగ్రగతి గ్రమ్ము కొనుచుండ-నుల్కలములు
రాలు చున్నట్లు భీకరారావ మెసగె. 527

అకట ! యెక్కడి వానరు-డనలు డిట్టి
మర్కటాకృతి నీ లంక మంట గలిపె
ననుచు రాక్షస భామిను లనల శిఖల
గాసి జెందుచు-ఘోషించి శోష గొనిరి. 528

భీషణాకృతి గొన్న యాభీల శిఖల
భయతరాకృతి గని తీవ్ర భయము నంది
గొప్ప ముడి వీడి పడ మరి కొంద రసుర
భామ లటు నిటు తడబడి పరుగు లిడిరి. 529

అప్పురమ్మంటు మంటల నా పురాన
గోపురమ్ములు మేడలు గుడులు బడులు
అంగడులు-చిత్రశాలలు-అన్ని గాల;
తృప్తి యిసుమంత లేని వాతూల సుతుడు. 530

వెండి బంగరు రాసులు_వివిధ రత్న
రాసులును–పూర్ణమయ ధాన్య రాసులెల్ల
తీవ్రతర కోపరూపుడై_దిక్కులదర
అనలునకు నాహుతిం జేసె అనిలజుండు. 531

వీధి వీధికి దూకుచు వీర హనుమ
రామ ! శ్రీరామ ! యనెడి నార్భటి యొసంగ
అసుర పురి నెల్ల గాల్చె వాలాగ్ని శిఖల
సకల దేవతా గణములు సంతసిల్ల. 532

రాక్షసేంద్రుని సౌభాగ్య రాసి యైన
పురము సర్వము తృటిలోన బూడిదయ్యె
రావణుని మూర్ఖతకు నిదర్శన మనంగ
బావురనిరి యాబాల గోపాల మపుడు. 533

కాదు–యీతడు_యొక కోతి కాదు! కాదు !
మువురు మూర్తులలో నొక్క మూర్తి_దైత్య
నాశనార్థమై కోతిగా నవతరించె
నంచు దనుజులు నెలుగెత్తి అరచి రపుడు. 534

బహుళ శోకాన పురమెల్ల బండబార
భయ–వి హృదయాల రాక్షస చయము మొనర్చు
ఆర్తనాదము లాకస మంటి మ్రోగియు
లంక సర్వము గాల్చె నా రామ దూత. 535

రత్న గృహమాల యైన_యా లంక నెల్ల
దీప్త లాంగూలమున నుత తేజు డగుచు
భస్మ మొనరించి హర్షించి–పవన సుతుడు
చేరె నపుడు త్రికూటాద్రి శిఖరమునకు. 536

ఆ త్రికూటాద్రి శిఖరాన నాంజనేయు
డరుణ కిరణ దీధితులతో నంశుమాలి
కరణి వెలుగొందు చుండగా గాంచినట్టి
యక్ష-సురసంఘములు గొనియాడి రపుడు. 537

లంక సర్వము గాల్చి వాలానలంబు
అంబునిధి ముంచి చల్లార్చి అనిలజుండు
పొడు పడి-బావురనుచున్న-పట్టణమును
మరల నొకమారు మోదాన తిరిగి చూచి. 538

పోలికలు లేక భాగ్య విస్ఫూర్తులుడిగి
దీన తనమున విధవలా దిగులు దోప
మోద మెడబాసి విలపించు ముగుదవోలె
గాననయె నప్పు డాలంక కపివరునకు. 539

ముదము వాయగ పొడసూపె మదిని శంక
హనుమకును నంత సీత యే మాయె నంచు;
కిన్కగొని గాల్చితిని లంక కీడెరుంగ
నట్టి కోపాన - నవివేకి నగుచు నేను. 540

ఎట్టులున్నదొ ? మాతల్లి ఏమయినదొ ?
చింత లేకుండ లంకెల్ల చిచ్చు రేపి
గాల్చినాడ-నశోకము గూడ గాలెనేమొ ?
అనుచు పవనజు డతి దుఃఖితాత్ముడాయె. 541

కుపితుడెవ్వాడు పాపపు కూడు దినును
కుపితుడగువాడు హింసించు గురువునైన
తీవ్రతర శస్త్ర సన్నిభ దీప్త మతిని
సాధు జనముల తెగటార్చు సాహసుండు. 542

మంచి చెడు లెన్నగా లేని మలిన మైన
మనసు గలవాడు కుపితుడు మహిని నెపుడు
కార్య భంగము కలుగును గాని-జూడ
కలుగునే-వాని చేతల కార్యజయము. 543

అరయ లంకాపురమ్మున నగ్ని చేత
భస్మమయె నన్నియుం గూడ-పడతి సీత
వహ్ని శిఖలకు జిక్కక వసుధ బ్రతికి
యున్నదని నిశ్చయింపగా నోపకుంటి. 544

జరుగ కూడని దేదియో జరుగ-జనులు
దూయ బట్టరె మామక దోష మెంచి
కుపితులయి యంగదుండాది కపులు-స్వామి
కార్య ఘాతకుడంచు వ్యాఖ్యాన మిడరె ? 545

సీత యొక వేళ మరణింప- శ్రీ రఘూద్వ
హుండు మరణించు-విని అర్కజుండు మఱియు;
భరత లక్ష్మణ శత్రుఘ్న భ్రాతృ వర్గ
మెల్ల నశియించు-సుగ్రీవుడే నశించు. 546

మువురు తల్లులు మంత్రులు మూల సైన్య
మెల్ల ప్రాణాలు త్యజియించు-తెల్ల మిద్ది
అనుచు పరిపరి విధముల ననిల సుతుడు
మదిని తర్కించు నట్టి సమయము నందు. 547

కరుణ రసపూర్ణ హృదయ సంకలితుడైన
శ్రీ రఘూద్వహు కరుణా విశేష మొప్ప
"సేమమే సీత" యను శుభ చిహ్నములును
గానవయె హన్మ కప్పుడు కనుల ముందు. 548

అకట ! తప్పు దలంచితి-నవని జాత
ఆత్మ తేజో విరాజిత ! అతి పవిత్ర !
ఆమెనుందాక నోపునే అనలు-డరయ
అగ్ని నిందాకునే-అగ్ని ? అవని నెందు. 549

ఏమి నా వెఱ్ఱి ? సీతమ్మ యెవరు ? అగ్ని
హోత్రు డామెను దాకుట ఒట్టి మాట !
సాధ్వి సీతమ్మ యున్నట్టి ఛాయలను
నేగునే యగ్ని ? యేగి దహింప గలడె ? 550

పరమ తైజసు డగు రామభద్రు పత్ని
పతిత పావని జనక భూపాల పుత్త్రి
ఆమె తను వంట నోపునే -యగ్ని యనుచు
పలికె "నశరీరవాణి" విస్పష్ట ముగను. 551

శీఘ్రమే మారుతియు సీత క్షేమ మరయ
నయ్యశోక వనమ్మున కరిగి-యచట
శింశుపా వృక్షమూలాన చింతనొందు
జానకింగనె హనుమ-అక్షత శరీరి. 552

కాంచి-సంభ్రమమున మ్రొక్కి కపివరుండు
తల్లి ! నిన్నిట్లు జూతునన్ తలపు లేదు
అనల సంప్రీతి యయ్యె లంక-అందశోక
వనము బూడిదమై యుండు వని దలచితి. 553

కలవరము జెందినాడ-యకారణముగ
అసువులను వీడ నెంచితి-నంతలోన
శుభ నిమిత్తంబులుం దోచె-జూడ నిన్ను
వచ్చి నాడను; నాదగు వనట దీరె. 554

క్షేమముగ నున్న నినుగంటి-చేత మెల్ల
హర్ష సంప్లుత మాయె-మా యయ్య రాము
డమిత మోదము నంద-నే నరిగి-నీదు
సేమ మెరిగింతు తల్లిరో! శీఘ్రముగను. 555

అని వచించెడు హనుమను హర్ష పులకి
తాత్మ యయి-హర్ష బాష్పాల నక్షులలర
గాంచి-రాముని మది నెంచి-కమల నయన
హృదిని యానంద ముప్పొంగ నుడివె నిటుల. 456

మారుతాత్మజ! యీ కార్య భారమెల్ల
ఒక్కడవె పూని గౌరవ మొందినావు!
రఘుకులాంబోధి చంద్రుడౌ రాము తోడ
నెటుల సీతను గూర్తువో యింక మీద. 557

ఏమి బోధింతువో? రాము నెటుల నిటకు
దోడి తెత్తువొ కపిసేన తోడ-హనుమ!
కోసలేశుడు నా యందు కోపమూన
నెటుల సవరింతువో యనె నిల తనూజ. 558

ప్రశ్రయాన్విత ధైర్యంపు పల్కులకును
వాయు సూనుండు సంతోష భరితు డగుచు
రావణుని జంపి నీ భర్త రామ విభుడు
తప్పకయె నిన్ను గొంపోవు తల్లి! యనియె. 559

అబ్ధు లింకిన-పర్వతా లవని కూలి
తారకలు రాలి-భువనముల్ తల్లడిల్లిన
రామ విభు పరాక్రమము నిర్వక్ర మగుచు
రావణుని జంపి-నిన్గొను-రమణి! నిజము. 560

హనుమ-తా లంక నొనరించి నట్టి పనులు
చెప్ప విని భూమి సుత సంత సించె మిగుల
పవన సూనుని గీర్తించి పలు విధముల
పయనమగు వేడ చాల దీవనల నిడియె. 561

రాము జేరినంతనె సాగరమ్ము దాటి
కపి వరేణ్యులు మీరు లంకకును జేరి
రాక్షసాధము రావణు రణమునందు
హత మొనర్చి శోకాగ్ని చల్లార్చు డనియె. 552

ఆలసించిన నేమౌనొ అవని జాతర
అనుచు నాధున కెరిగింపు మయ్య! నీవు
నీదు సాన్నిధ్యమున నేను బాధ మరచి
యుంటి-నీ వేగ నా శోక మంటు నింగి. 563

మిగుల శోకార్త యైన నా మగువ జూచి
పలికె మారుతి-కపిబల ప్రతతి తోడ
రామ లక్ష్మణాదులను శీఘ్రముగ నేను
తోడి దెత్తును; దుఃఖమ్ము వీడమమ్మ. 564

ధైర్య సంతోష భరితయై ధరణి పుత్రి
మరల నాశీర్వదింప నత్తరు చరుండు
పరమ సంతృప్త హృదయుడై బయలు వెడలె
నతిరయమ్మున రాముని మతి దలంచి. 565

## హనుమ తిరుగు ప్రయాణము

తల్లి వీడ్కొల్పి-ముదమంది తరుచరుండు
స్వామి దర్శనోత్సుకుడునై సత్వరమ్మ
రమ్య సాగర ఘన తట ప్రాంత సీమ
వన పరీవృత మగుశైల మున వసించి. 566

ఉత్తరాభి ముఖమ్ముగా నుదధిపైన
తీవ్రతర వాయు యానంపు తెప్ప వగిది
వాయు వేగాన పయనించి వాయుసుతుడు
కడలి గడచి మహేంద్రాద్రి గాలు నిడియె. 567

పక్షములు గల శైలమ్ము వగిది హనుమ
అభ్ర భీషణ ఘోషల నార్చు చుండి
అబ్ది గడచుచు నుండగా నగచరాళి
గాంచి-ధ్వానముల్ సల్పిరుత్కంఠు లగుచు. 568

హర్ష పులకిత ముఖుడైన హనుమ జూచి
జనకజను చూచి యుండు_నిశ్చయ మటంచు
హనుమ గిరి చేరగా సెల్ల రతని చుట్టు
మూగి రతిప్రీతి వృత్తాంతమును వినంగ. 569

హనుమ-అంగద జాంబవవాది ఘనుల
కప్పు డభివాద మొనరించి-అగచరాళి
నుచిత రీతి సంభావించి-యోర్పు గదుర
జనక సుత గంటి వని బల్కె వినయ మొప్ప. 570

కడలి నతి తీవ్ర గతి దాను గడచుటయును
సురస-మైనాక-సింహికాసురి విధమ్ము
లంకలో జొచ్చి జానకి రమణి నచట
అరసి భాషించుటలు దెల్పె ననిల సుతుడు. 571

రాము దేవేరి జూచుట-రాముడిడిన
యుంగరము నామె కొసగుట_యువిద యిడిన
రమ్య చూడామణిని రఘు రాము కొరకు
ఆనవాలుగ దెచ్చుట-హనుమ దెలిపె. 572

శోభలను మీరి యలరు నశోకవనిని
పాడు పరచుట-వారికి పట్టుబడుట
రాక్షసేంద్రుని జూచుట-రామచంద్రు
పొగడి - బుద్ధులు సెప్పుట-నొగి వచించె. 573

పరిభవింపగ నప్పు డా సుర విరోధి
తనదు వాలము గాల్పగా దనుజ భటుల
కాజ్ఞ నిడుటయు - తాను వాలాగ్ని - లంక
ననల సంప్రీతి జేయుట - హనుమ దెలిపె. 574

అంతయును విని ముదమంది అంగదుండు
చూడు గాల్చి వచ్చిన మన శూరమణిని !
ఇంక జాగేల ? కడువేగ మేగి మనమె
రావణుని జంపి వచ్చుటరయ ఘనంబు. 575

ఆదరమ్మున నటు బల్కు అంగదునకు
జాంబవంతుడు బల్కె యోచనము మీర
సీత నరసెడి కార్యమ్ము చేత బెట్టి
మనల నంపెను సుగ్రీవు మహిపు డెలమి. 576

రాముడును రావణుని జంపి లంక బట్టి
ప్రతిన జేయుటచే మన ప్రజ్ఞ లిపుడు
జూపు సమయము గాదు - ఆ సూర్య కులుడె
జంపు రావణు పరివార సహిత మింక. 577

వర పతివ్రత - నిర్మల - వసుధ తనయ
కలగి యలిగిన దైత్యుండు నలిగి పోడె ?
భర్తచే వాని జంపించు ప్రతిన గాక
కోప మడచుక యుండునే - కుముద నేత్రి 578

కపి కులాగ్రణి! నీ మాట కాదనంగ
రాదు; ఈ హిత కార్యమ్ము రామునకును
అందజేసియు - ఆ ప్రభు నాజ్ఞమేర-
తారుటయె జూడ మనదు కర్తవ్య మనఘ! 579

అనెడు భల్లుకేశుని పల్కు లాలకించి
అదియె కర్జంబుగా కపుల్ మది దలంచి
కార్య జయ కారకుండైన గాడ్పు సుతుని
సత్త్వ మభినుతించిరి తరుచరులు ప్రీతి. 480

జనక సుత భర్త దర్శనా సక్తు లగుచు
వనచరులు హనుమ బొగడుచు - వయన మైరి
మాల్యవంతమ్ము చేరగా మతి వహించి
మద గజమ్ముల రీతిని వదము లిడుచు. 581

అపుడు భల్లూక పతి వెంట నంగదాది
కపులు పయనించి - కిష్కింధ గాంచి - మున్ను
మధువనము జూచి ఆకొని మరియు - మరియు
వేడికొని రంగదుని - వనిన్ వేడ్క చొరగ. 582

అంగదుడు కార్య సఫలత నాత్మ నెంచి
అనుమతి నిడియె మధువన మందు చొరగ;
తోడనే సముత్సుకులైన ధూర్త మతులు
కపులు జొచ్చిరి - మధువని నపుడె-జూడ. 583

పండ్లు తేరగ దిని-తదుపరిని మధువు
పొట్ట పగలగ ద్రావియు - పట్ట - చెట్టు
లన్ని పెకలించి రెలమి - కాకున్న ధరణి
కోతి మూకలి అనిపించు కొమట యెట్లు? 584

వారి యాగడములు గాంచి వనట జెంది
అర్కజుని మామ 'దధి ముఖు' డనెడు వాడు
వారి వారింప-అవమాన పరచి - దేహ
శుద్ధి గావించి కపులెల్ల బుద్ధి సెపిరి. 585

దధి ముఖుం - డుగ్రుడై యర్క తనయు కడకు
జేరి - జరిగిన దంతయు జెప్పి-ధూర్త
కపుల దండింప గోరగా - కపి వరుండు
సుగ్రీ మతి గాక - సంతోష హృదయు డయ్యె. 586

అటకు సౌమిత్రి - కడువేగ మరుగు దెంచి
దధి ముఖుని - గాంచి విషయమ్ము - తరచి నంత
అమిత సంతోష హృదయుడై అర్క సుతుడు
పలికె సౌమిత్రితో మనో భావ మిటుల. 587

దక్షిణమ్మున కేగిన తరుచరాళి
మగిడి చనుదెంచి - ధూర్తత మధు వనాన
జొచ్చి పాడొనరించుట జూడ - దోచు
అవని సుత సీత జాడ వారరసి రంచు. 588

అనగ విని లక్ష్మణుండనె - అర్కజునికి
అమిత సంతోష సూచకమ్మరయ నిద్ది;
హనుమదాదులు జానకి నరసి యుందు
రనగ - దధిముఖుతో బల్కె నర్కజుండు. 589

వేగ మీ వేగి - వారిని వేడ్క నిటకు
బంపు - సౌమిత్రి - శ్రీరామ భద్రు డేను
వారికై వేచి యుండెడి తీరు జెప్పి
అనుచు నానతి యిడె నప్పు డర్కజుండు. 590

# హనుమదాదులు శ్రీరాముని దర్శించుట

అధిపు సుగ్రీవు నాజ్ఞలు - అందినంత
బయలు వెడలిరి - అంగద ప్రముఖ వీర
వనచరోత్తము లంతట హనుమ తోడ
సత్వరమ్ముగ శ్రీరామచంద్రుదు జూడ. 591

రామునకు - అర్క సుతునకు - లక్ష్మణునకు
హర్ష ముఖులైన కపివరు లంజలించి
జయ నినాదమ్ములన్ సల్పి సప్రశ్రయము
వందనము లాచరించి రానంద మతులు. 592

రామ సుగ్రీవులును మరి లక్ష్మణాదు
లవనిజను గూర్చి - అనిలజు డంగదుండు
నేమి పల్కుదురో - మనమేమి వినగ
వలయునో యన్న యుత్కంఠ పరులునైరి. 593

వారి ఆత్రము గ్రహియించి వాయు సుతుడు
ఒక్క మాటలో వారెల్ల రుత్సహింప
'గంటి' సీతా మహాసాధ్వి కన్నులలర
సేమమే! అమ్మ - శ్రీలంక సీమ ననియె. 594

"అమ్మ సేమమే" అను పల్కు లాలకించి
పరమ సంతుష్టమైన భావమ్ము చెలగ
బహుళ బహుమాన దృక్పరంపరల వారు
పరపి హనుమను - గౌరవ పరచినారు. 595

అంత రాముడు వారల నాదరమున
గాంచి - జనకజాన్వేషణ కథను నడుగ
జానకీ కథా కోవిదుడైన - మారు
తాత్మజుని ముందునకు త్రోసె నంగదుండు. 596

రామునకు నర్కసుతునకు _ లక్ష్మణునకు
వంగి వినయాన గౌరవ వందనమ్ము
నాచరించిన పిమ్మట – అనిల సుతుడు
సీత వెదకెడు విధమెల్ల చెప్పె నిట్లు. 597

అధిప ! భవదాజ్ఞ పూని మేమందరమును
దక్షిణాభి ముఖమ్ముగా తరలి – తరలి
జన పథమ్ములు _ కొండలు - వనపథమ్ము
లన్ని గాలించియును – సీత నరయ లేక. 598

వింధ్యగిరి _ ప్రాంత వనములు – వెండి కొండ
నంటి _ పోయి గాలించుచు – నరసి–యరసి
సీత గనక _ దుఃఖింప - పక్షీంద్రు డొకడు
పేరు సంపాతి మాకట తారసిల్లె. 599

అతని కతమున లంకలో నవని జాత
కలదు రావణు వశమున – కష్ట జలధి
నని యెరిగి దాటగా లవణాబ్ధి నంత
యత్న మొనరించి దాటితి నలయ కుండ. 600

అతి ప్రయత్నాన లంకలో నవని తనయ
సేమ మారసి - యిచటి మీ క్షేమ వార్త
దెలియగా జెప్పి యూరట గలుగ జేసి
ఉంగరము నీయ దాని నయ్యువిద గాంచి. 601

రామ ! నిను గాంచి నంతటి రహి వహించి
తృప్తి జెందెను _ సీత - సంతప్త హృదయ
రామ నామ జపమున నీ రాకదలచి
వేచి యున్నది - ఆ దానవేశు నగరి. 602

వహ్ని దాకిన సుమవల్లి వలెను వాడి;
మబ్బు గ్రమ్మిన చంద్రుని మాడ్కి - తల్లి
రామ! శ్రీరామ! జపసంస్మరణ మొకండె
ఆశ్రయమ్ముగ - శోకించు ననవరతము. 603

మనసు నీ యందు లగ్నమై మసలు చుంట
కన్నుగవ బాష్పముల నిండి - కలత గనిన
దేహమున - మోము నరచేత దీర్చి - వరమ
దైన్యమున బొక్కు సతము సీతమ్మ తల్లి. 604

నిరత ముపవాస దీక్షను నెరపు చుండి
మలిన వసనము తోడ రామా! యటంచు
దైత్య భామల నడుమను దద్దరిలుచు
నిన్ను ధ్యానించుచునె యుండు - కన్ను మూసి. 605

ఏమి చెప్పుదు? మీ శుభ నామ మెదను
సతము స్మరియించు చుండి భూ శయన యగుచు
నేక వస్త్ర ధారిణియు - నేక వేణి.
యు - నయి భర్త తపము సలుపు నహరహము. 606

నన్ను నమ్మిన పిమ్మట నలిన నేత్ర
అర్కసుతు - లక్ష్మణుల సేమ మడిగి - మరది
మనసు గాయము గాగ - నాడిన దురూక్తు
లెల్ల మరువగ గోరె దుఃఖించు చామె. 607

వృక్షము ననుండి వింటిని - రాక్షసుండు
గడువు నిడెనెల - తన్ జేర - గడువు చనగ
రాక్షసాళి భక్షింత్రు నిర్దయ నటంచు
వదరె! నా తల్లియుం గడు బెదరి పోయె. 608

గడువు చనకుండ - మన నట-గాన కున్న
అసువులను బాయు సీత తథ్యమ్ము; రామ!
ఆలసింపక కడువేగ మబ్ధి గడచి
చేరవలె లంక - వైదేహి క్షేమ మరయ. 609

## హనుమ శిరోమణిని రామున కిడుట

అని వచించుచు శీఘ్రమ య్యనిల జుండు
భూమి జాత యిచ్చిన శిరో భూషణమ్ము
రామభద్రున కిడ-ననురాగ మెసగ
హత్తుకొనె గుండెలకు ప్రేమ నామె నగను. 610

సీతనే గాంచి నట్టులా క్షితిప సుతుడు
నగను జూచుచు - శోకాన వగచి - వగచి
కొంత వడికి హృదయ మంత కుదుట పడగ
చింత విడి గుండె రాయిగ జేసు కొనియె. 611

మొదట సుగ్రీవు - తదుపరి - ముదము గదుర
అంగదుని - నంత జాంబవదాది ఘనుల
ఆదరమ్మొల్క బాషల - నాంజనేయు
వినుతి గావించె రాముడు వేడ్క మీర. 612

కార్య నిర్ణయ సన్నాహ కారియగుచు
వనచరాధిపు డాడిగా వానరులను
ప్రీతి సంధిల్ల జూచి - కపివర శ్రేష్టు
వీరహనుమను గని రామ విభుడు పలికె. 613

సీత జాడలు దెలియక చింత మునుగు
తరిని - మము జూచి సుగ్రీవు దరికి జేర్చి
కథను నడిపించి - సీతను గాంచి వచ్చి
నన్ను సంతృప్తి పరచె - నీ సన్నుతుండు. 614

అనుచు హనుమను కౌగిటి యందు జేర్చి
గౌరవించెను రాముండు కడు ముదాన;
అర్కజుని యంత గని మన మబ్ధి గడచి
చేరవలె లంక – జానకి చెరలు సడల. 615

రాము నానతి నక్కపి రాజు – వేగ
సకల బలముల వారి నాయకుల తోడ
సిద్ధ మొనరించి – యుద్ధ సంసిద్ధ గతిని
రామునింగూడి వెడలెను లంక వైపు. 616

అంగద హనుమ జాంబవదాది వీర
వరులు తన వెంటరా మాల్య వంత – మంత
వీడి – లక్ష్మణార్కజులను గూడి – వేగ
చేరె రాముండు లవణాబ్ధి తీరమునకు. 617

ఇది శ్రీ గురునాథేశ్వర వరప్రసాద సహజ కవితా సంప్రాప్త కాశ్యపస
గోత్ర – మావుడూరు వంశ పవిత్ర – పార్వతీ అనంతరామయ
పుత్ర – బుధజన విధేయ – రఘురామ నామధేయ –
ప్రణీతంబైన రఘురామ రామాయణము నందు
సుందరకాండ సంపూర్ణం.



# శ్రీ రఘురామ రామాయణము

## యుద్ధకాండ

శ్రీ ఘనాద్భుత గంభీర – శ్రీ "విశాఖ
ఉక్కు ఆంధ్ర జనావళి హక్కు" అనిన
విశ్వ విఖ్యాత తెన్నేటి విశ్వనాథ
అవధరింపుము నాదు రామాయణమ్ము.

## కదనకుతూహలము

సమధి కోత్సాహ భరిత నిస్వనము లెగయ
పోటు తనమున దైత్యుల గీటడంప
భండనోన్ముఖు లగుచు నుద్దండలీల
తిరుగుచుండిరి కపులు సాగర తటాన. 1

కొందరాడుచు – పాడుచు కొంద రచట
వాదులాడుచు – నొండురుల్ మీది కెగసి
ఆట పాటల దేలుచు నబ్ధి తటిని
నేల యీనినయటు కపుల్ నెగడు చుండ్రి. 2

వేలు – లక్షలు – కోట్లయి – వెలయు గపుల
సముదయమ్మును గని రామచంద్రమూర్తి
కరము సంతృప్తి నంది – రక్కసుల లంక
చేరు టెట్లని హృదయాన చింత జేసె. 3

ఘోర గంభీర నినదమై – గుబులు గలుగ
దాటగా వీలు కానిదై – దంభ మొప్ప
తీవ్ర చలదూర్మికల తోడ దీరి – యచట
నడ్డమై యున్న యట్టి మహాబ్ధి జూచె. 4

పొంగి పొరలుచు నుత్సాహ పూర్ణు డగుచు
నిఖిలమై యుబ్బు కెరటాల నింగి నంటి
భయము కలిగించు నాకృతి ప్రబలి యున్న
జలనిధిని గాంచి శ్రీరామచంద్రమూర్తి. 5

అర్క సుతు బిల్చి చూచితే అబ్ధి నిపుడు
ఘోర గంభీర నాదాల గుబులు కొలుపు;
నల్ప యత్నాన దాట సాధ్యమ్ము గాదు
అధికతరయత్న మిందు నత్యవసరమ్ము. 6

కూర్చి యొక చోట వానర కులము నెల్ల
అందరము గూడి - యోజించి - యబ్ధి గడచు
విధము తర్కింప నదియె వివేక మగును
అని వచించిన యంత నయ్యర్కజుండు. 7

సకల వానరయూధ నాయకుల బిల్చి
అధిపు నానతి దెల్పిన అందరపుడు
నబ్ధి తటమున గుమిగూడి - నబ్ధి నుత్త
రించు మార్గమ్ము నప్పు డూహించుచుండ్రి. 8

అచట గుమిగూడు కపిసైన్య మందు బుట్టు
నుగ్రతర భూరి నిర్ఘోష మప్పరాన
వినగ నయ్యె - చంద్రోదయ వేళ రేగు
సాగరపు ఘోష కెంతయు సాటి యగుచు 9

వారి గనిన రాముునకు నవ్వసుధ తనయ
గుర్తునకు రాగ - దుఃఖమ్ము గుబులుకొనగ
హనుమతో వచ్చి - దరిజేరి అర్కసుతుడు
పలికె రాముని యోచనావధు లెరింగి. 10

దేవ! యీ భువి నన్నియు దెలిసి యుండి
చింతిలగ నేల నిట్లీవు చిత్తమందు
అనతి కాలమ్ము నందె నయ్యసురు జంపి
చేరగల వయోధ్యాపురి - సీత గూడి. 11

కోట్ల కొలదిగ కపులదే గుంపు గూడి
ప్రాణముల నీయ సిద్ధులై - ప్రతిన జేసి
యున్న వారలు - యోధ మహోగ్ర మూర్తి!
చింత వీడక కార్య సంసిద్ధి యగునె? 12

వార్ధిపై సేతువును గట్టి వార్ధి గడచి
కపుల గూడుక మనము లంకా పురమ్ము
చేరుటే గద - కర్తవ్య చింతనమ్ము!
అనుమతి నిడుము సేతు బంధనము కొరకు. 13

అర్కకులమణి నీరీతి నర్క సుతుడు
ప్రార్థనముసేయ - శ్రీరామభద్రు డనెను
శక్యమే యది? మనకును సలుప నగునె?
సేతుబంధన మేరీతి జరుప గలము? 14

అనిన విని - సంది యమెరింగి అర్కజుండు
నీవు తల పోయ కానట్టి దేది కలదు?
అనుమతింపుము - చిటికెలో నగచరాశి
సేతు నిర్మాణమును పూర్తి చేయగలరు. 15

రవి కుమారుని పల్కుల కవని పతియు
వల్లె యనినంత - నటనున్న వానరాశి
అమిత సన్నాహ సంరంభ మాత్మ పూని
కడగి రా సేతు బంధన కార్యమునకు. 16

అపుడు కనుగొన నంబుధి యంతరిక్ష
మునకు దాకుచు నుండెను - ఘన తరంగ
మాలికల తోడ నుప్పొంగి - మహి వణంక
నాకసము తోడ మంతనా లాడు నటుల. 17

పర్వతోన్నత భంగ సంపాత వితతి
కడగి యొనరించు ఘోర భీకర రవమ్ము
దిగ్దిగంతము లందు వ్యాప్తిని వహించి
ప్రళయ కాల భయమ్ము సంభవము చేసె. 18

పాప ఱేడును తన వేయి పడగ లెత్తి
భువన భవనము మ్రింగగా బుసలు కొట్టు
మొలుపు దోచెడి నవ్వేళ - పొంగి పొరలు
తీవ్ర కెరటాల సాగరు తీరు గనిన. 19

దుర్గమంబైన యీ జల దుర్గమందు
సేతు వెప్పుడొ? ఎప్పుడో సీత గనుట?
అని దలంచుచు - శ్రీరాము డార్తి జెంద
మోము వాడెను " దుఃఖాన మోదముడిగె. 20

భానుకుల దీప్త నోదార్చ - భాను తనయు
డనిలజుడు - లక్ష్మణుడు రాము నపుడు జేరి
ఊరడిల జేయ - నాతండు నుత్సహించు
తరిని - అస్తాద్రి జేరెను తరణి యంత. 21

అరుణ కాంతులు నా పశ్చి మాశ నలమె
సకల దిక్కుల వ్యాపించె చల్ల దనము
ఒక్కటొకటిగ పొడముచు చుక్కలపుడు
లక్షలును కోట్లునై యంబరమ్ము నిండె 22

అమర వనితలు గగన గృహాంగణాన
పైడి ప్రమిదెల పెట్టుదీపము లనంగ
తారకలు రత్నకాంతుల తళుకు మంచు
దోచు నాకాశవీధిని జూచి నంత. 23

విలసితానందములు పృథ్వి వెల్లివిరియ
చల్లనౌ వెల్గు రేఖలు జగము నిండ
దేవతా స్త్రీ లిడెడి పెద్ద దీప మనగ
వెలిగె చందురు డాకాశ వీధి నపుడు. 24

అరయ ప్రతి బింబితమ్మయ్యె నబ్ధి యందు
గగన రంగము నక్షత్ర గణము తోడ
చంద్రికల యంద చందాలు జగతి విరియ
భువికి దిగి వచ్చె నాకాశ భూమి యనగ. 25

కలకలము హెచ్చె రేయౌట జలధి యందు.
అలసి నిదురించె వానర కులమ దెల్ల
సందడులు సద్దు మణిగె ప్రశాంత మంత
గగన భూతలముల నెల్ల గప్పి వేసె. 26

## రావణుని మంత్రాంగము

అట్టి సమయాన లంకలో నసుర విభుడు
తీవ్ర సంతాపమున ముఖ తేజ ముడుగ
చింత మునిగెను - నొక కోతి చేరి - పురము
పాడు చేసిన విధము భావమున దలచి. 27

అంతలో వేగులరుదెంచి - అబ్ధి కవలి
తటమునందున - "రాముండు - తరుచరులను
గూడి విడిసెను - లంకకు గుబులు కలుగ"
నంచు దెలిపిన - విని - యంత నమరవైరి. 28

అఖిల మంత్రుల రావించి - అబ్ధి కవలి
వివరములు వేగు లెరిగించు విధము దెలిపి
దాశరథుల వృత్తాంత మంతయు వచించి
మంత్రుల ముఖమ్ములను జూచి మరియు బలికె. 29

వచ్చె నొక్కడు- నీచుండు - వనచరుండు
జలధి లంఘించి లంకకు సాహసాన
పురము గాల్చి యశోకమ్ము నురుముజేసి
మడియ జేసెను నక్ష కుమారు మొన్న. 30

కోతి గాడని కరుణించి కోరి విడచు
కారణమ్మున లంకెల్ల గాల్చి నాడు;
చిత్రమిది యొంటిగాడయు-చిన్న మొత్తు
బెదురు లేక దైత్యుల దున్మించి కదలినాడు. 31

ఇప్పు డట్టి కోతుల తోడ నిన కులుండు
అనుజయుతుడయి లంకలో నడుగు పెట్టి
ఏమి చేయునో? మనమిప్పు డేమి చేయ
వలెనో? సూచింపు డనుచు రావణుడు - పిలచె. 32

మన రహస్యము లెరిగిన మర్కటుండు
తప్పుకొని పోయె తగిన యత్నమ్ము తోడ
జలనిధిని దాటి వారు రాగలిగి రేని
చేటు తప్పదు - రాక్షస కోటి కంచు. 33

పలుకు రావణు పలుకుల భావ మెరిగి
హానెరుగని యుక్తాయుక్త హీన మతులు
మంత్రులని రిట్లు - రాజ! యీమహిని నిన్ను
నెదిరి-నిలచి జయించు వారేడ గలరు? 34

నలిన సంభవు మెప్పించి - బలయుతమ్ము
లయిన శస్త్రాస్త్రములు పొంది - యలరు నీవు
అష్ట దిక్కుల గెలిచి నీ అంగణమున
బలిమి నుంచితివి గద - దిక్పాల వరుల. 35

సూర్య చంద్రాది బలయుత సురగణాలు
దాసులై గొల్చు నిన్ను నావేళ ముడిగి
ఖండనోర్వని జూడ నుద్దండుడవు-త
లప నరులు వానరులు నీకు లక్ష్య మొండె? 36

కోతి మూకలతో - ఎల్లు గొల్ల తోడ
గలిసి యని సేయగా వచ్చు నలతి జనులు
రామలక్ష్మణు లేడ? వీరాధి వీర
దనుజ పతి వంశ మదియేడ? దలచి చూడ. 37

చింత వలదయ్య -దనుజేంద్ర! శీఘ్ర మీవు
ఆనతిడు మయ్య - రాముని - అగచరాళి
వన్యమృగముల వడి మేము వసుధ గూల్చి
సంతసము గూర్తు మనిన రాక్షస విభుండు. 38

అమిత మోదము నందెడి అవసరమున
వినయ గుణ భూషితుండు-విభీషణుండు
అన్న దరిజేరి దుఃఖ విపన్న మతిని
అగ్రజన్ముని తోడ తా ననియె నిట్లు. 39

## విభీషణుండు రావణునకు హితము బోధించుట

స్వభుజ సారాన స్వారాజ్య భరము దాల్చు
దనుజ కుల చక్రవర్తి వి_జనుల నన్న!
రక్షణము సేయుటే కద రాజ ధర్మ
మది దలంచుచు కర్తవ్య మవధరింపు. 40

ఎంత బలవంతలమె యైన నెదుటి వారి
నల్పులని యెంచ పాడియా? అసుర రాజ!
ధర్మమునకె విజయము! తథ్యమ్ము వినుము
సర్వ సమ్మత మిది- శాస్త్ర సమ్మతమ్ము. 41

ధర్మ రతుడయి రాముండు - తండ్రి మాట
క్రమము దప్పక పాటించి ప్రమద తోడ
రాజ్య భోగాలు వీడి విరాగి పగిది
వనములం దిర్గు చున్నాడు మునుల పగిది. 42

బలము గలవాడ నని మహా భ్రమను మునిగి
అతని సతి సీత చెరబట్టి-మితమ్ము మీరి
ఇచ్ఛ చరియించి నీవతి స్వేచ్ఛ బూని
ధర్మ మిసు మంతయును మది దలప వైతి 43

ధర్మ రక్షణమే ప్రభు ధర్మ మంచు
దెలిసి యుండియు నీవిటు దెలియ నటుల
హీను గతి నంచరించు టదేమి పాడి?
పౌరుషము గాదు పరభార్య బలిమి బట్ట. 44

బలుడు మన శత్రువని మున్నె దెలిసి పోయె;
పంతమున కేగి పోరాడు పనిని బూని
ఆత్మ వంచన చేసుక నజ్ఞు పగిది
సాహసము చేయ సోదరా! జనదు మనకు. 45

రాము డెవ్వడొ తెలియక రాక్షసేంద్ర!
అతని సతి బట్టి తివి-జూడ నామె సాధ్వి;
సాధ్వి బట్టుట ఘన భువి సాహసమ్మె
అసుర కులమును దహియించు నగ్ని యద్ది. 46

ఇంద్రియాలకు లోనయి ఇంగితమ్ము
మరచి జడులు గ్రహింపరు మంచి చెడులు
నాశనము గాదె? మంచిని జాసి చనిన-
నిది యదార్థము - నరయుమీ విప్రుడైన. 47

మించి పోలేదు - రాముడు మంచి వాడు!
అసమ కరుణా మహోదధి! - అతని జేరి
జనక సుత నర్పణముచేసి - శరణు వేడ
కనికరము పూని కూర్మితో గావ గలడు. 48

ధర్మ శీలుడు -కరుణా పథాను వర్తి
నిత్య నిర్మలు డంచిత సత్యమూర్తి
అతడు కరుణించె నేని యీ అసుర కులము
భయము దీరును-గట్టెక్కి బయట బడును. 49

చంప దగినట్టి యెంతటి శత్రు వైన
శరణు జొచ్చిన - కరగుచు-సదయ హృదయు
డగుచు - రక్షించి కాపాడు టతని బిరుదు
జాగు పేయక నర్పింపు జనక సుతను. 50

మనకు నెగ్గేమి దలపని మాన్య గుణులు
దశరథేశుని తనయు లుద్దండు లతుల
బల పరాక్రమ ధైర్య ప్రభావయుతులు;
వారితో నివ్వు డీ వృధా వైరమేల? 51

## విభీషణ పరాభవము

హితము నిట్లు వచింప సహింపలేక
రావణుడు రోషభీషణా రావ మెసగ
గర్జనము చేసి-యనుజుని కలత పరచి
నీచు గతి వల్కితివి గొప్ప నీతు లనియె. 52

కాక-దుర్బల నిస్సార కపి బలమ్ము
తోడ గూడి నరాధముల్ తోయ రాసి
గడచు టెట్లగు --నరయ లంకాపురమ్ము
జొచ్చు టెట్లు? రావణు పైకి వచ్చుటెట్లు. 53

ఊరకే భీతి గొలిపెడి సారహీన
భాషణము లాడి-పెద్రతోవ బట్టి జేయు
సాహసము సల్పుచున్నావు - స్వామి యెదుట
నక్క వినయాలు జూపెడి కుక్క వీవు. 54

దాయ యను వానికెవ్వడు దలయు తోక
యనక యుండును విషము - నీయందు నిజము;
శత్రువుల నెప్డు బొగడెడి - శక్తి హీన !
చెప్ప వచ్చితి విది కడు సిగ్గు చేటు. 55

పరమ విషము గ్రక్కెడి త్రాచు పాము నైన
చంక నిడవచ్చు; క్షేమమే ! శంక లేదు.
శత్రు కీర్తన మొనరించు జడుడు తోడ
బుట్టువైన ప్రమాదమే పృథ్వి నెపుడు. 56

అనుచు హుంకార మొనరించి అసుర విభుడు
తమ్ము నిందింప ఖడ్గము దాల్చె నంత
అడ్డుగా ప్రహస్తుడు వచ్చి - అసుర నాథ!
తగునె యీపని? యతడు నీ తమ్ము డధిప! 57

సోదరుడు మేలు వచియింప- నాదరమ్ము
మరచి - యావేశ పరుడవై మంచి చెడుల
దలపకయె వాని వధియింప తగునటయ్య?
కాకు లీ లోకులని మది గాంచ వలదె? 58

సద్గుణుండైన మన విభీషణుడు లేని
లంక యేటికి? మనమేల? రాజ్యమేల?
సైన్య వైభవ మేల ? యీ సంపదేల?
కోప ముపసంహరింపుము - తాపముడిగి. 59

అని ప్రహస్తుడు రావణు ననునయింప
కోపమును చంపుకొన లేక క్రూరు డగుచు
డిగ్గున నిజాసనంబును డిగ్గ నురికి
తమి విభీషణు నురమున దన్నె - నంత. 60

వివశుడై పృథ్వి బడుచు విభీషణుండు
శీఘ్ర-ఘట మూర్ఛ నొక్కింత సేపు మునిగి;
తెప్పరిలి లేచి - చింతించి - తెలివి నొంది
తండ్రి సముడైన యన్నను దలచి యంత. 61

గగనమును జేరి - యంతరిక్షమున నిలచి
అధిప! తండ్రి సముడవు-నాకగ్రజుడవు
ధర్మ మెరిగింప - చేటని దలచి-నన్ను
కాల దన్నితి వకట! నిష్కారణముగ. 62

కాల పాశాన విధి చేత కట్టబడిన
యట్టి నీక్షేమ మాసించి - అసుర నాథ!
హితము వచియించితిని; నీవు-మితము మీరి
శిక్ష నిడితివి ధర్మ వివక్ష లేక. 63

ప్రియుల వలె నయోగ్యము లెన్నొ పెక్కుగతుల
గరపు దుర్గుణుల్ పెక్కురు గలరు నీకు
యప్రియములైన - ప్రియమాడు నట్టి గుణులు
దుర్లభులు! పృథ్వి నొకడైన దొరుకుటరిది. 64

బలుడ! యిలపైన కాలాభి పన్నుడగుచు
జీవి చెడిపోవు _దుర్బుద్ధి జెందు కతన
అధికుడైనను - బలుడైన - నస్త్ర శస్త్ర
మర్మ విదుడైన - నాతడు మాసి పోవు. 65

అనుచు హిత బోధనము చేసి _ అసురనాథు
భావ పరిణామ మందున ప్రగతి గనక
అచటు వీడుట యుక్త మంచా విభీష
ణుండు _ రావణు గని మరి నుడివె నిట్లు 66

మధువు నందియ విషమని మదిదలంచు
కృతక మతి వీవు_నేనుండ కూడ దిచట;
జనెద నాయిచ్చ వచ్చిన స్థలము కనుచు
అచటు వీడి మంత్రిత గూడి నరుగనెంచి 67

హితము విషమయి తనవారు మితము దప్ప
నచట తా నుండ రాదని అనుచరులతొ
ప్రభువు శ్రీరాము పాదాల బడగ నెంచి
వీడిచనె లంక _ నపుడె. విభీషణుండు 68

తల్లి కైకసి యాపీస్సు తల ధరించి
సాగరము దాటి శ్రీరామ చంద్రు జేర
భక్తి యుప్పొంగ కేల్మోడ్చి భవ్యగుణుడు
అల విభీషణు డరుదెంచు నవసరమున. 69

తనదు మంత్రులతో నట్లు తరలి నీల
మేఘ సముదయ మన నభో భాగమందు
శీఘ్ర గతి చేతు తెత్తుక చేరవచ్చు
అవ్విభీషణు గనుగొని _ అర్కసుతుడు. 70

రావణుండంప నెవడొ నిర్భయత దనరి
మాయలంబూని మనలావు మతము దెలియ
వచ్చు చుండె నటంచెంచి - వనచరులకు
వారి శిక్షింపగా జెప్ప; వారలపుడు 71

తరులు గిరులను చే దాల్చి తమక మొప్ప
సంభ్రమించుచు దనుజుల చావ మోద
సిద్ధమై యుద్యమించెడి స్థితి దలంచి
భీతి నెలుగెత్తి యపుడు విభీషణుండు. 72

శాత్రవుడ గాను-రాముని శరణు గోరి
వచ్చు చున్నాడ-దోషి రావణున కేను
తమ్ముడను- నింక రాము పాదాల వ్రాలి
బ్రతుక దలచితి నమ్ముడో ప్లవగులార. 73

వంచనమున సీతను గొని వచ్చి తేల?
అన్న! కుల నాశనమ్మిది అరయు మనిన
నన్ను నిరసించి _ నిందించి - కన్ను గనక
తన్ని _ వెడలించె సభనుండి దనుజ విభుడు 74

గౌరవము లేని చోటుల కాపురమ్ము
నుండగా దగ దందురు పండితాళి
శరణు గోరెడివారి రక్షణము నరయు
పతిత పావను కడ వేను బ్రతుక వస్తి. 75

అనుచు నెలుగెత్తి చనుదెంచు నసురు నందు
నమ్మకము లేక నర్కజుం డమ్మహాత్ము
రాము దరిజేరి - "వేగులా రాక్షసాళి;
మన రహస్యాలకై" వచ్చెనని వచించె. 76

కామ రూపులు - మాయలు కలుగు వారు
తిమ్మనిం బ్రహ్మ జేసెడి దిట్ట లసురు
లగుట నమ్మగ రాదు వీరరయ మనల
మోసగింపగ వచ్చిన మూర్ఖు లనియె. 77

రాక్షసుల నమ్మరాదంచు రవి సుతుండు
పలుకగా విని శ్రీరామభద్రు డంత
'నిజము లేదన లేను నీ నిర్ణయాన
పైన - ధర్మము గాదె యదార్థ మరయు" 78

ఇన సుతుడు రాము మాట కాదనగ లేక
జరుగు చున్నది_ జరిగెడి - జరుగబోవు
నన్ని దెలిసిన దివ్య మహాత్మ డీవు
అవధరింపుము కర్తవ్య మనుచు బలికె. 79

ఎట్టి వాడైన - వైరి దండెత్తు వేళ
స్వజనులను వీడి యీరీతి జారు కొనునె?
తప్పు కితని విచారింప దప్పు దనుచు
నంగ దాదులు రాముని కనిరి _ యపుడు 80

అధిప! నే పట్టుబడినప్పు డన్న కితడు
దూతలను జంపరాదని నీతి జెప్పె;
దనుజ భావము దోపదీ ఘనుని యందు
అనుచు సెరిగించె నమ్మారుతాత్మ జుండు 81

అన్న వాలిని జంపి మీరర్క జునకు
రాజ్య మిడిరని యెరిగి యీ రాక్షసుండు
రావణుని బాసి _యర్థియై - రాజ్య కాంక్ష
నిటుల మిమ్మాశ్రయింపగా నేగుదెంచె. 82

కాక - మనలను వంచింప గడగె నేని
కపుల మధ్యను బ్రతుకంగ గలడె - యాత
డనెడి పవనాత్మజుని పల్కు లాలకించి
సత్య మని యెంచె రాముండు స్వాంత మందు. 83

అంత సౌమిత్రి తనయన్న నను నయించి
తగ వచించెన్ను రావణు తమ్ము డితడు
దనుజులకు పెక్కుమాయలు - తలపు నుంచి
తగినట్లు నిర్ణయ మొనరింప తప్పదనియె. 84

కోరి శరణని మనదరి జేరు గాక
నమ్మ దగినట్టు లితడు కన్పడడదేమొ
క్లిష్ట సమయము మనకిది - కీడు దలచి
ఇతని దరిజేర్చ మనకది హితముగాదు. 85

అని వచించెడి లక్ష్మణు నాలకించి
చిర్నగవు మోము నందున చెన్ను గూర్చ
ననియె రాముడు - నశ్వమేధాదులకును
నభయ దానము సమమంచు ననుజు తోడ 86

ఈతడే కాదు - రావణుడేని వచ్చి
శరణ టన్నను దరి జేర్తు; శంక దక్కి
ఆలసింపక గొని రండు నసురు నంచు
నానతిడె రాముడప్పు డయ్యర్కజునకు. 87

సద్గుణమ్మును ధైర్యమ్ము సచ్చరిత్ర
కలవరము లేని చతురత-గడుసుతనము
ఆర్త రక్షణ గుణముల నలరు రాము
గాంచి విస్మయ మందె నా కపి వరుండు. 88

శత్రువర్గము వాడని జంతు లేక
అభయ మిడి మిత్రవర్గము నందు జేర్చి
ఆదరించెడి రాముని అమల శీల
మెవని కుండు నటంచనె పవనజుండు. 89

## సుగ్రీవుడు విభీషణుం దోడి తెచ్చుట

అర్క సుతుడు విభీషణు నపుడె చేరి
మొదట నాలింగన మొనర్చి - ముదము గూర్చి
అభయ మిడె రామమూర్తి నీ కంచు నుడివి
దోడి తెచ్చెను రాముని నీడ కతని. 90

రామ చంద్రుని గని భక్తి ప్రేము గదుర
నమిత వినయము దోప కృతాంజలియయి
దండ మొనరించి రావణు తమ్ము డలరి
పలికె నిలచి రాముని పురోభాగమందు. 91

అర్కకుల శేఖరా! నీదు నాదరమున
మాసె రావణానుజు డన్న మచ్చ నాకు;
ధన్యుడను నేను - నీదు పాదముల చెంత
ఉత్తములగు నీ కపులందు నొకడ నగుదు. 92

వినయ మొలుక నీ రీతి విభీషణుండు
పలికి నంతనె విని రామభద్రు డలరి
సదయ హృదయాన నాతని కుదుట బరచి
కుశల మడిగెను; మదిలోని కూర్మి దెలియ. 93

రాము నాదరమును గాంచి రాక్షసుండు
పరవశమ్మంది యరుదగు భక్తి మీర
మరల నొక మారు - విస్మిత మతుడు నగుచు
పాద పద్మాలు స్పృశియించి ప్రణతు లిడెను. 94

# రాముడు విభీషణుని ప్రశ్నించుట

అన్నదమ్ములు మీరలత్యైక మత్య
మున మెలంగెడి వారని మొదల వింటి;
నెందులకు వైర మది గల్గె - నీకు నతని
కచును ప్రశ్నింపగా విభీషణుడు - పలికె. 95

ప్రభువ! యేమని దెల్పుదు? ప్రబలుడైన
అన్న రావణు మౌఢ్యము! నెన్న లేము?
హితము గరపిన విషమయ్యె నతని యందు
రుచి నిడునె పథ్య మెపుడైన రోగి కిలను. 96

నీతి విడనాడి - సతతము నిప్పు ద్రొక్కు
క్రూర మతియైన రావణు డేరి చేత
చావ కుండెడి వరములు - జలజభవుని
దయను పొందె-చరించు నిర్భయత నడరి. 97

పరమ పావనమగు బ్రహ్మ వంశ మందు
ప్రభవ మందియు నీచుడై ప్రజ్వరిల్లి
సుందరాంగియై నట్టి యే సుదతి యైన
కంట బడినచో చెరచగా కాంక్ష సేయు. 98

తెలివి గల మూర్ఖు డాతడు తెగువ హెచ్చు
జ్ఞాన ముండియు లేని యజ్ఞాని - యతడు
నీతి దెలిసిన యొక అవినీతి పరుడు
మనసు నెరుగని కడు దుష్ట మానసుండు. 99

అమర కంటకుడైన దశాస్యు బలము
బ్రహ్మ వరముల ద్విగుణమై ప్రబలు చుంట
లోక కంటకుడై మూడు లోకములను
సతము పీడించు క్రూర పిశాచ మధిప! 100

తమ్ముడగు కుంభకర్ణుండు - తనుజ తతియు
పరమ దుర్మార్గులై వాని పజ్జ నుండ
ప్రబల దోర్బల గర్వుడై ప్రబలి పోవ
పరిణమించె విపత్తు ప్రపంచ మునకు 101

మేఘనాధుడును సురేంద్రు మీద కుటీకి
చిత్తు జేయుట నతడింద్రజిత్తు డయ్యె;
తండ్రి కీడైన తయుండు - తపమొనర్చి
పొంది నాడు మహాస్త్ర సమూహములను. 102

శక్తి సంపన్ను లత్యంత సాహసాత్ము
లైన పదివేల కోటుల అసుర భటులు;
ప్రబల విక్రమ గర్వ దుర్వారులైన
అనుగు తమ్ములు - దనయులు - నమరు కతన 103

ముజ్జగముల కజేయుడై - సజ్జనులను
సతము హింసించుచును హరి స్మరణ జేయు
మునుల - భక్తుల బాధించి మోద మందు
కుటిల హృదయుండు మా యన్న! కోసలేంద్ర 104

'అన్న' యని చెప్పు కొనుటకో అధిప! నేను
సిగ్గు జెందుచు నున్నాడ - ఛీడ పురుగు
దనుజ కులమున కాతడు - తరచి చూడ
దనుజ వంశ మెల్ల నశించు నాదనుజు కతన. 105

పర సతుల చెట్ట బట్టుట పాప - మరయ
కుల వినాశన కరమంచు - గుచ్చి చెప్ప
సభను వెడలించె - నన్నట చావగొట్టి
పరమ నీచుడు మాయన్న - ప్రభు వర్యేణ్య! 106

అని విభీషణు డన విని అర్క కులుడు
తీవ్ర సంచలితాత్ముడై దిక్కులదర
పలికె; వీర రసావేశ మొలుకు నటుల
ఆత్మ నిశ్చయ మాదైత్యు డాలకింప. 107

దనుజ కుల దీపకా! నీవు దాపకుండ
తెలియ బలికితివి దాశాస్యు తెరగు నెల్ల
వనజభవు డడ్డు వడిన నే వాని విడువ
పరువమున ద్రుంతు వాని సబాంధవముగ. 108

మింటి కెగసిన - కులగిరి మీద నున్న
తమిని పాతాళ లోకాన దాగి యున్న
సింధు జలరాసిలో ప్రవేశించి యున్న
విడువ నాతని నేను విభీషణుండ! 109

కడగి బ్రహ్మాది సురలు - ముక్కంటి - వేల్పు
లడ్డు పడినను విడువ నా అసుర విభుని
నీచు డా మూర్ఖు వధియించి నిఖిల జగతి
భయము బాపెద రఘుకుల ప్రతిభ వెలయ. 110

రావణుని జంపి రాక్షస రాజ్యమునకు
మునులు దేవర్షు లమరులు మోద మంద
భువనములు మూడు వేనోళ్ల బొగడు నటుల
నిన్ను నభిషిక్తు జేతు నే నెన్నికగను. 111

అనిన వారి సంభాషణ మంతయు విని
అర్కకుల సోమ! రావణు డరుగు దెంచి
శరణు వేడిన నపుడేమి చేయు దనఘ!
అనుచు సుగ్రీవు డడుగగా నవని విభుడు. 112

వంశ మర్యాదగాను నా వంతు వచ్చు
కోసలము రావణునకు నే కూర్మి నిత్తు
తనివి నని రాము డనగ నాత్యాగ మరసి
బొగడి రానందమున కపి బృంద మెల్ల. 113

రాము నానతి గొని యంత లక్ష్మణుండు
ఉదధి జలముల తోడ మహోత్సవమున
రాక్షసాధి పత్యమున కా రాత్రిచరుని
వేగ నభిషిక్తు గావించె వేడ్క మీర. 114

దేవతలు సంతసిల్లిరి – దివము నుండి
పుష్ప వర్షము గురిసిరి – పూజ్యు డైన
రాము భద్రునిపు – లోక రక్ష మెల్ల
అర్కకుల దీక్షయంచు వారాడి నారు. 115

అంగదుడు – జాంబవంతుండు నర్కతనయు
డంజనీపుత్రుడాదిగా నఖిల కపులు
వేడ్క నభినందనోక్తుల వినుతి జేసి
రా విభీషణు – నవేళ – నాదరమున 116

## రాము వర్గాగమనకై సవుందుని ప్రార్థించుట

అర్క తనయుండు – మరియు నా అనిలజుండు
అవ్విభీషణు గనుగొని – అసురనాథ!
మనము చుట్టాల మైత్రిమి – మనము రాము
కార్య మీడేర్చ మార్గము గాంచ వలయు. 117

అఖిల వనచర బలము లీ అబ్ధి గడచి
ఏ యుపాయమ్మునను లంక కేగ గలవు ?
ద్వీప వాసుడ వీవు - నీ దెలిసి నంత
విశదముగ దెల్పు మనిన విభీషణుండు. 118

సాగరుల కష్టమున గాదె సాగరుండు
తనువు దాల్చెను - శ్రీరామ ధరణి విభుడు
లోన దలచిన మాత్రాన తానె వచ్చి
హితము నం దెల్పు- తన్ను త్తరించు విధము. 119

అని వచించిన విని వారలవని పతిని
జేరి - సర్వజ్ఞుడును రాక్ష సేంద్రు భ్రాత
ఆ విషభీణు పలుకుల నవితథముగ
విన్నవించిన - రాముండు వేడ్క నంది. 120

ప్రాకటమ్ముగ నంత నిక్ష్వాకు కులుడు
అంబుధిని నాత్మ నెంచి నయ్యసుర పురికి
దారి నిమ్మని వేడగా దర్భ శయను
డాయె- నొక మూడు దినము లత్యంత నియతి. 121

లక్ష్యమే లేక -పొడసూప రాక అబ్ధి
పొంగి పొరలు తరంగాల నింగి దాకె
తీవ్ర భయదుగ్రగ కోప సందీప్తు డగుచు
పలికె లక్ష్మణుతో రామభద్రు డంత. 122

తమ్ముడా! సముద్రుని యాగడమ్ము గంటె?
మిడిసి పడుచుండె కెరటాల మింటి కెగసి;
తెమ్ము కోదండ మిటు - నబ్ధి తేజ ముడిపి
ఇంక జేయుదు - మున్నిటి పొంక మణతు. 123

క్షమము - శమమును - ప్రియము నార్జవము-నరయు
జాలక-నెడంద లో దుర్విచారు లెంతు
రదియె నిజమాయె సాగరు నందు నేడు
ఇతని నికమీద నే నుపేక్షింప రాదు. 124

అలిగి కోదండ మెత్తెడి నంత లోన
మిసిమి బంగరు కాంతుల మేని తోడ
మోము వినయాన వాల్చి సముద్రు డపుడు
లీల నుడిగి రాముని జేరి కేలు మొగిచి. 125

కరుణ గను రామ! పాహి! నిన్ గాంచు కతన
హృదయ ముప్పొంగ పొంగితి-ముదము దోప
సగర కులుడవు; నేను ఆ సగరు దయను
సాగరుడ నైతి మరువ నాసాధ్య మొక్కొ? 126

రామ కార్యంబు గతమయి రహి వహించు
లోక కళ్యాణ కుశలత - ప్రకటముగ;
నన్నియు నెరిగి నీవను కొన్న యట్లు
పంచరించుట క్షేమమే జగతి నాకు. 127

లంక జేరగ వలయు మా రామభద్రు
డసమ భుజ బలులౌ కపు లనుసరింప
తీవ్రతరు డగు దశకంఠు దీటడంచి
పరగ ముల్లోకములను గాపాడ వలయు. 128

ఇనకులేశ్వరుతో నట్లు - వనధి నాథు
డను నయోక్తులు బలుకుచు - వినుతి జేసి;
సేతువును నిర్మితము సేయ శీఘ్ర గతిని
క్షేమముగ - లంక - మీరెల్ల చేరగలరు. 129

అనుటయును రామచంద్రుడా యబ్ధి జూచి
వారధిని గట్టుటది యెట్లు! వనధి నాథ!
అనుచు సందియ మెరిగింప నబ్ధి వినుచు
సందియము బాయ నసె_రామచంద్రుతోడ. 130

కపులలో నలు డనువాడు కలడు రామ!
విశ్వ కర్మ సుపుత్తు డవ్వీరు చేత
సేతు బంధన మొనరింప –జలధి యందు
మునుగ దేదియు నత డిడ్డ – ముని వరాన. 131

సాగరుని మాట విని రామచంద్ర మూర్తి
నలుని రావించి యాదర మొలుక బలికె
సాగరుడు దెల్ప దెలిసె నీచరిత మెల్ల
కడలిపై సేతువును నీవె కట్ట గలవు. 132

అనుచు రాముడు బలుక నా వనచరుండు
ఇన కులేశ్వర ! శిరసా వహింతు–నీదు
నానతిని – లంక దాక నే నడ్డు కట్ట
నిర్మితము సేతు ననఘ! నా నేర్పు కొలది. 133

అనుచు నలుడన – సుగ్రీవు నాజ్ఞ మేర
శీఘ్ర మవ్వనచరులేగి–చెట్లు గూల్చి
పెద్ద గిరులను బలముచే పెల్లగించి
తెచ్చి– నలునకు వేడ్క నందిచ్చి నారు. 134

నలుడు సాగరమున కడు సులువు మీర
కూర్చి పేర్చుచు నుండె నా కొండ రాళ్లు
తరులు – లతలును – ఘనమైన గిరుల నెల్ల
వంతెనను గట్టు వేళ నవ్వనధి యందు. 135

నలుడు జలముల జేర్చిన శిలలు లతలు
తరువితతి దేలుటయు జూచి దాశరథులు;
నా విభీషణ సుగ్రీవు లమిత మైన
విస్మయంబందసాగిరా విధము జూచి. 136

కాలయాపనలేకుండ కపివరాశి
యతి ముదమ్మున త్వరగతి నవనిజముల
శిలల – పెద్దవౌ కొండల – సులభముగను
నలున కందీయ సాగిరి బలము కొలది. 137

శిలలు తరులును గిరులు నా జలధి యందు
పడెడు తరి రేగు కల్లోల మడలు గొలువ
జలధి వసియించు సకలమౌ జలచరాశి
ప్రాణ భీతిని నటు నిటు బారదొడగె. 138

హనుమయును – అంగదుడు– నీలు డాది వీరు
లొక్కరొకరు మూడు గిరుల నొక్క మారె
కడగి దెచ్చుట – వారధి గట్టు పనియు
మూడు దినముల లోనసె ముగిసి పోయె. 139

ధైర్య సాహసులును కార్య దక్షులైన
కపుల దీక్షతో నత్యల్ప కాల మందె
కట్ట బడియెను లవణాబ్ధి– కపులతోడ
రామచంద్రు డబ్ధిని దాటి లంక జేర. 140

వారధిని జూచి పదునాల్గు వసుధ లలరి
ముదము గాంచెను - రక్షః ప్రభుండు - క్రూర
కర్ముడు–కుమతి – సత్ప్రజా కంటకుండు
రావణు పతనమునకు నారంభ మంచు. 141

పూర్ణ మతి రాము డంత సముద్రు జేరి
'యేను నీమేలు మరువంగ లేనటంచు
సంతసము దెల్ప - వినయాన సాగరుండు
రామునింగాంచి భక్తియు శ్రద్ధ మీర. 142

ధర్మమా యిట్టి మాటలు - ధరణి వినుత!
రామ! మీ తాత ఆ భగీరథ నృపుండు
దీర్ఘ తపమాచరించి యు త్తీర్ణు డగుచు
దివిని ప్రవహించు గంగను భువికి దెచ్చె. 143

అంత మున్ను జీవనము లేకలసి యున్న
నన్ను కరుణించె మీతాత సన్నుతుండు
శివుని దయగాంచి - గంగను భువికి జేర్చ
సగర సుతుల కుత్తర గతుల్ సాధ్యమయ్యె. 144

స్వామి! మీపూర్వ పురుషుల శ్రమను గాదె
సాగరుడ నైతి; జగతినే సార్థకముగ
అదియు మరచుట నా సాధ్య మగునె? ఘనుడ!
అరయ వే జేసినది నలుసంత గాదె? 145

జలములే లేక తడబడు జగతి కింత
జీవ ధార లిడిన ధన్య జీవు లిలను
భాను కులజులు గారె? నాభాగ్యగరిమ
చెలగె నొక్కింత నీదగు సేవజేయ. 146

అనుచు వినుతించు సాగరు నాదరించి
యనుప - లేచిన - శ్రీరాము నరసి - వనధి
పతి యొసంగెను మహిత దివ్యాస్త్ర తతులు
మణుల నలరెడు దివ్య భూషణము లెన్నొ. 147

రాఘవా! నీవు జగతి కారాధ్య మైన
దైవమవె యయ్యు - నా దుష్ట దనుజు తోడ
భూషణాదులు లేకుండ పోరు సలుప
దగదటంచు నిచ్చితిని సాత్రండి! గొనుము. 148

యుద్ధమున కేగు వేళల యోద్ధ లెపుడు
రమ్య మణి భూషితాంగ విరాజితులయి
దివ్య ధను రస్త్రముల బూని దీప్తి ననికి
గదల; జయమది తనయంత యదియె వచ్చు. 149

అనుచు వాక్రుచ్చి సాగలు దమ్మహాత్ము
సెలవు గైకొని తనదగు సెలవు జేరె.
రాము డంతట కపులతో లంకజేర
సంభ్రమము జూప యత్నాలు సాగుచుండె. 150

# రావణుడు ససైన్యముగా - లంకాయాన మొనరించుట

భూరి బలుడగు పవనజు భుజముల వయి
నధి వసించుచు పయనించి రన్నదమ్ము
లంద మింపొంద కపిసేన ముందు నడువ
అసుర సంహార సన్నద్ధు లగుచు వాట. 151

అందరకు ముందు కౌతుక మతిశయింప
అరుగుచున్నాడు మన రావణానుజుండు
అదుగో! కనుగొను” మని రాము డర్కజునితో
పలికె మోమున దరహాస మొలుకు చుండ. 152

ధర్మ దూరుడు - జనుల బాధల నలంచు
నుక్కు మిగిలిన దశకంఠు నుక్కడంప
మహిత గతి నేగు కపిసేన మధ్యమందు
వలరె రాముండు తరుణార్కు డనగ నపుడు 153

తీవ్ర గతి సిరిహ గర్జల దెసలు బెదర
మ్రోగు రణభేరి జగతి కామోద మొసగ
త్రిదశ వైరి ధైర్యమెల్ల చెదరి పోవ
కదలి జనుచుండె లంకకు కపిబలమ్ము. 154

ప్రేమతో భక్తితో రామ నామ మెలమి
మది జపించుచు - ధైర్యమ్ము హృదిని పొంగ
పర్వతాకారముల నొప్పి భద్ర గతుల
కపులు నడచుచు నుండిరి కదనమునకు. 155

ఊరు గలని నవ్వు డక్కపి యూధ మరయ
నల వినిర్మిత సేతువు కలన నడచి
రుగ్రతర ఘోర వారాశి నుత్తరించి
జేరి రవ్వలి తీరము శ్రీఘ్ర ముదను. 156

రామభద్ర విభీషణ లక్ష్మణార్క
సుతులు వనచర సైన్య సంహతుల గూడి
రావణుని గుండె పగుల్లంగ లంక జేరి
వనధి తటమున భార్గులై వరలినారు. 157

అర్కజుని యాజ్ఞ నవ్వి డయ్యగచరాళి
యతి మనోహర మైన పర్వతమునందు
వివిధ ఫల పుష్ప భరితమై వెలయు చోట
గమన శ్రమ వాయ విడసిరి - కౌతుకమున. 158

# రాముడు లంకాపురమును జూచుట

సంజ కెంజాయ లప్పు డాశలకు బ్రాకి
దారుణారుణ కాంతుల దడిపె - గగన
తలము - వ్యాప్తమైనట్టి రక్తంపుఝుఘల
వహ్ని వర్షము వర్షించు భంగి దోచె. 159

అమల మణి రత్న రుచిర సౌధముల తోడ
మించు తళుకుల నలరారు మేఘ మటుల
కనుల విందువు సేయుచు గానుపించు
లంక విభవమ్ము గాంచె శ్రీరాము డపుడు 160

కంటె లక్ష్మణ ! వర రౌప్య కనక మయము
లైన మందిరములు గల్గి - యలరు లంక;
మేరు - కైలాసముల బోలి మెరయుచుండె;
గు వడ దీని నిర్మించె విశ్వకర్మ. 161

విమల ఫల పుష్ప పల్లవ వితతి యగుచు
సకల పశుపక్షి గణముల సముదయముల
క్షితిని నలరారు - నందన చైత్ర రథము
నా ప్రకాశించు - నీ పట్టణమ్ము మిగుల. 162

అద్రిపై నుండి తా జూచె నర్కకులుడు
గోపురమ్ములు - ప్రాసాద కుడ్యతతులు
కనుల మిరు మిట్లు గొల్పెడు కట్టడములు
లంక శోభలు సౌభాగ్య లక్షణములు. 163

ఆకసము నంటు కోటలు -నతుల రత్న
సౌధములు - దివ్య కాంతుల సాటిలేని
శత్రు దుర్భేద్య మగు దుర్గ చయము తోడ
లంక గను పించె నలకాపురమును మించి. 164

లంక గని - విస్మయము చెంది రామ నృపుడు
అకట! కడు సుందరమ్మయి నలరు నిద్ది
పాడు వారెడు కాలమ్ము ప్రబలి వచ్చె
నంచు - ఖేదించు విధము తా నాత్మనెంచె. 165

## రాముడు సైన్యమును విభజించుట

అనల సంపాతు లంత నత్యంత ధిషణ
వేగు నొనరించి దెలిపిన విషయ మెంచి
రామభద్రుడు ననుకూల రచన మొందు
నెంచి - తన సైన్యమును విభజించె నపుడు. 166

అతని కితడె సముడగు - నతని కితడె
నెక్కుడగు వాడటంచు - తా నొక్క వల్క
పవన సుతు - నీలు - నంగద ప్రముఖ బలుల
ననికి సంసిద్ధులంజేసె నివకులుండు. 167

వరలు శాస్త్ర ప్రకారమ్ము - వర గుణుండు
గారుడ వ్యూహ మొనరింపగా తలంచి
ఉచిత మగు స్థానముల కపులుండు నటుల
సూచనము చేసె రాముండు సూక్ష్మ బుద్ధి 168

తమ్ముడును దాను నల దశకంఠు డుండు
నగను దాకెద మంచెల్ల కపిబలమ్ము
విభజనము చేసి యుక్తమౌ విధులు దెలుపు
నంతలో భాను డస్తాద్రి యందు చేరె. 169

తళుకు మను తారకా హార తతులు దాల్చి
జిలుగు నును పట్టు వెన్నెల వలువ గట్టి
మందమధుర స్మితాస్యయౌ మహిళభంగి
రతి విలాసిని వలె నొప్పె రాత్రి కాంత 170

యుద్ధ శాస్త్రను సారము యోద్ధ లెవరు
కోరి నిశి శత్రువుల దాక కూడ దనెడి
నీమ మెరిగిన శ్రీ రఘురామ మూర్తి
వేచి యుండ నానతి నిడె వేగు వరకు. 171

# రావణుని వ్యూహ రచన

భద్రమై దుర్గమ మగు సముద్ర తరణ
మమర నొనరించి - కపులతో నబ్ధి దరిని
రమ్య వనముల విడిసెను రాము డంచు
వినిన రావణు డతి భీతి గొనియె నపుడు. 172

కడలి గమియించి యమిత నిగ్రహము గల్గి
కోట్ల కొలదిగ కపులను గూడి వచ్చి
లంక ప్రాకార మవతల రాముడుండె
నని యెరిఁగిన రావణు కినుక హెచ్చె. 173

వేగులను బంపి - రిపు సంఘ వివరములను
సేకరించిన యద్దను జేంద్ర విభుడు
తరుచరుల గూల్చ సులభ పద్ధతుల కొరకు
కొలువు దీరి యమాత్యుల బిలువ బంపె. 174

అందరును కొల్వు కూటాన నతివినమ్ర
స్థితిని నుండగ రావణు డతి గభీర
స్థితివహించుచు వేగులు చెప్పి నట్టి
విషయమెరిగించి కర్తవ్య విధము నడిగె. 175

తరుచరు లొనర్చు సింహ నాదమ్ము - లపుడు
కడలి ప్రళయాన గర్జించు గర్జ లటుల
పరమ భీకర మౌచు నభంబు నంటి
భయ విచలితుని జేసె రావణుని మిగుల. 176

విలయ గతి రేగు శబ్దమ్ము వృద్ధ మంత్రి
మాల్యవంతుడు - వినుచు రావణుని జేరి
అనుభవజ్ఞుండు నగుట - తా మనసు లోని
భావమిటు దెల్పె నసుర సామ్రాట్టు తోడ. 177

అఖిల విద్యల శిక్షితుడైన రాజు
నీతి విడనాడి ధర్మంపు నియతి దప్పి
పాడు పనులకు బోకున్న ప్రబలు డగును
పగరగెల్చును; నైశ్వర్య పటిమ పెరుగు. 178

సంధి విగ్రహముల తగు సమయ మెరిగి
చేయ వలెనని విజ్ఞులు చెప్ప వింటి
శతృ బలమెంచి – వారల శక్తు లెరిగి
విగ్రహము మాని సంధికి వెడల శుభము. 179

ధాత యిడినట్టి వరముల దైత్యనాథ!
నరులు – భల్లూక వరులు వానరులు లేరు
గాన యోజించి రాముని కాంత నతని
కిడుట శ్రేయ మటంచు నాయెడద నెంతు. 180

అనుచు వృద్ధుడు పలుక నయ్యసుర నాధు
డాదరము వీడి తీవ్రమౌ నాగ్రహమున
"చాలు ! నీ వింక పలికిన చావు మూడు"
నంచు దుర్దయుడై హెచ్చరించె నపుడు. 181

తక్క గల మంత్రి లెల్లరా దైత్యపతికి
నెదురు మాటాడ నోడి యింకేమి యనక
చేయునది లేక – రాముని చేత తాము
జచ్చుటయె శ్రేష్ఠ మను కొని స్వస్థ పడిరి. 182

దనుజ విభుడంత నిజ సైన్యమును దలంచి–
పొంగి – దక్షిణ పశ్చిమ పూర్వ దిశల
నింద్ర జిత్తు – ప్రహస్తాది సాంద్రి బలుల
రక్షణము సేయు నియ మించె నాక్షణాన. 183

తాను శుక సారణుల గూడి _ తమి వహించి
వేచి యుండగ నె చె నుదీచి దిశను
మధ్యమ స్కంధమున విరూపాక్షు డుండి
పోరు నని వ్యూహ రచనమ్ము పూర్తి జేసె. 184

## రాముడు రావణుని జూచుట

వేగి నంతనె కపులు వివేక మతులు
తనువు లుప్పొంగ నాయకు ననుసరించి
ముట్టడించిరి లంకను చుట్టు ముట్టి 185
సురలు దివినుండి ముదమున జూచుచుండ.

వైరి బలముల జూడ రావణుడు – దివ్య
రత్న మణిమయ భూషణ రాజి నలరి
గోపురాగ్రమ్ము నన్నిల్చి కుపిత మతిని
కనియె విలయాబ్ధి వలె నున్న కపి బలాల. 1 6

నీల ఘనవర్ణ భాసుర నీల గిరిని
బోలి _ మణిమయ వర భూషణాళి తోడ
శోభితాకారుడై యొప్పు సుర విరోధి
నచట గని – యెంచె నెద_రాముడప్పుడట్లు. 187

అహహ! ఏమి యీ బ్రహ్మ దీప్త్యాననమ్ము!
గలుగ వశమౌనె నెవ్వారి కైన భువిని?
శౌర్య భావుండు గాకున్న కలరె సములు?
చాలడే మూడు భువనాల నేల నితడు! 188

అని వితర్కించి రావణు నభినుతించి
ఇట్టి నీచత్వ మీతని కెవ్విధాన
కలిగె నని మది రాముండు తలచి_తరచి
చాల విస్మయమును జెందు వేళయందు. 180

# సుగ్రీవుడు రావణుని పరాభవించుట

సౌధమున రావణుని గాంచి సారసాప్త
నందనుడు - తాల్మి విడనాడి - నయము గరువ
నతుల వేగాన కుప్పించి - యచటువీది
దనుజపతి యున్న దివ్య సౌధమున కెగసె. 190

అచట కొలువున్న రావణు నపుడు గాంచి
కోప పరవశుడై - గెంతి - కూల దన్నె
రావణుని గురిడె తగుల తీవ్రముగ - నంత
ధరణిపై బడె నాతండు తత్తరమున. 191

తోకతో గట్టి - నిను వాల్గు తోయధులను
ముంచి విడచిన యవ్వాలి భూరి బలుని
నొక్క బాణాన గూల్చిన యుక్కు మనిషి
రాము డాతని హితుడ నేనంచు బలికె. 192

కొంచె మేయిది - తప్పొప్పు కొంచు నీవు
రాము పాదాలపై బడి - రమణి నిచ్చి
శరణు వేడుము - లేకున్న చత్తు వీవ
టంచు గర్జించె సుగ్రీవు డాగ్రహమున 193

అర్కజుని యాగడముగని అసుర విభుడు
ప్రబల కోపాన చెలరేగి పైకొనంగ
మదగజంబులు దలపడు మాడ్కి వారు
కసిమసంగి పోరిరి కొంత కాల - మంత 194

అలసి నిజ సౌధమున కేగె నసురకులుడు
భానుకులు జేరుకొనె నంత భాను సుతుడు.
కమల మిత్రుడు గగనాన గడచి గడచి
గ్రుంకె నపరాబ్ధి - సందెయు కొమరు మిగిలె. 195

# రాముడు సుగ్రీవుని మందలించుట

మగిడి క్షేమాన వచ్చిన యగచరాధి
పతిని కనులార గని రామభద్రు డలరి
ప్రీతి దొలుకాడగా కౌగిలించి - యంత
మంద మధురాననుండయి - మందలించె 196

వీర కపిముఖ్య! వచ్చితివి సరె! వేరు
విధమె యైన; జానకి యేల? విశ్వమేల ?
లక్ష్మణుండేల? అతుల సామ్రాజ్య మేల?
పౌరుషమ్మేల? నా కింక బ్రతుకదేల? 197

ఆప్తుడవు ప్రాణమిత్రుడ వదియు గాక
నాకు మనసైన వాడవు - నన్ను బాయ
బ్రతుకుదునె నేను? అది వృధా భ్రాంతి గాక
ప్రాణ మిత్రుడ! నిను బాసి బ్రతుగ గలనె ? 198

అని విచారము వెలిబుచ్చ - నర్కసుతుడు
నవ్వు మొగమున; నార్య! నీనాతి బట్టి
విట్టి వీగుచు -దానొక వీరుడ నని
యెగుర - నేగితి దశకంఠు పొగరడంప. 199

తప్పు గలిగిన దండింపు తండ్రి! నన్ను
ననుచు - మ్రొక్కుచు నిలచిన - అర్క సుతుని
సంతసమ్మొప్ప గని రామచంద్ర మూర్తి
హితము దొలుకాడ మరల పరిష్వజించె. 200

# అంగద రాయబారము

అంగదుని సంధికిం బంపి -యమరవైరి
మనసు నెరుగుట యువసర మనుచు - రామ
చంద్రుడెంచి - చెప్ప వలయు సంధి వచన
ముల వచించి పంపెను ధర్మ మూర్తి యపుడు. 201

# రాముడు సుగ్రీవుని మందలించుట

మగిడి క్షేమాన వచ్చిన యగచరాధి
పతిని కనులార గని రామభద్రు డలరి
ప్రీతి దొలుకాడగా కౌగిలించి - యంత
మంద మధురాననుండయి - మందలించె 196

వీర కపిముఖ్య! వచ్చితివి సరె! వేరు
విధమె యైన; జానకి యేల? విశ్వమేల ?
లక్ష్మణుండేల? అతుల సామ్రాజ్య మేల?
పౌరుషమ్మేల? నా కింక బ్రతుకదేల? 197

ఆప్తుడవు ప్రాణమిత్రుడ వదియు గాక,
నాకు మనసైన వాడవు - నన్ను బాయ
బ్రతుకుదునె నేను? అది వృధా భ్రాంతి గాక
ప్రాణ మిత్రుడ! నిను బాసి బ్రతుగ గలనె ? 198

అని విచారము వెలిబుచ్చ - నర్కసుతుడు
నవ్వు మొగమున; నార్య! నీనాతి బట్టి
విట్టి వీగుచు - దానొక వీరుడ నని
యెగుర - నేగితి దశకంఠు పొగరడంప. 199

తప్పు గలిగిన దండింపు తండ్రి! నన్ను
ననుచు - మ్రొక్కుచు నిలచిన - అర్కసుతుని
సంతసమ్మొప్ప గని రామచంద్ర మూర్తి
హితము దొలుకాడ మరల పరిష్వజించె. 200

# అంగద రాయబారము

అంగదుని సంధికిం బంపి - యమరవైరి
మనసు నెరుగుట యువసర మనుచు - రామ
చంద్రుడెంచి - చెప్ప వలయు సంధి వచన
ముల వచించి పంపెను ధర్మ మూర్తి యపుడు. 201

పొగరు విడువక ఖలుడవై పోరు సల్ప
దిక్కు లేకుండ జత్తువు దీనుడవయి
శాశ్వతమె ? రాజ్య భోగాలు జగతియందు
రావణా ! విభీషణుడేలు లంక ననెను. 208

తనయ - హిత - మంత్రి - భట సమేతముగ నిన్ను
యుద్ధమున నాదు బాణాగ్ని యుజ్వలించి
దగ్ధ మొనరింతు - నపుడు నిన్ దలచి యెవరు
బొగిలి విడువరు కన్నీటి బొట్టు గూడ. 209

విశదముగ నంగదుండిట్లు విన్నవింప
చెలగు రౌద్రాన మోములు జేవురింప
రావణుండును కుపితుడై రాత్రి చరుల
కపుడు సైగలు చేసె నక్కపిని జంప. 210

అంగదుని జంప నొక వల్వు రసురు లపుడు
ముందునకు రాగ - తోకతో మోది - బాది
బాహువుల వారి బంధించి పైకి నెగసి
ప్రాణములు వాయ పుడమిపై బారవైచె. 211

బుద్ధి - కర్మాను సారిణి పుడమి యందు
చెడెడు కాలమ్ము జీవికి చేరువైన
'మంచి' విషమగు - నిజము! అమర విరోధి
అనుచు నినకులు జేరె నయ్యంగదుండు. 212

## వానర సైన్యములంకను ముట్టడించుట

అంగదుని రాయబార మయ్యసురు నెడల
విఫల మగుటను గని రఘువీరు డెదను
తప్ప దిక యుద్ధమని యెంచి - తాదలంచె
సంధియత్నాలు నింక నిష్ఫల మటంచు. 213

విహిత శస్త్రాస్త్ర పాణులై మహిత దీక్ష
సాగర తరంగముల భంగి వ్యజనరక్ష
ణాశయమ్మున బరగు సైన్యాళి చెలగు
లంక నట ముట్టడించెను రామవిభుడు. 214

నలుడు – మైంద ద్వివిదులను గలసి – కోట్ల
కొలది వానర సైన్యమ్ము గూడి చనియె
నల ప్రహస్తుండు రక్షించు నట్టి పూర్వ
గవనిరోధింప రామాజ్ఞ గనుచు నపుడె. 215

గజ – గవయ – ఋషభులను–నంగదుని వెన్క
తరలి జన – నాత డమ్మహోదరనిరోధ
దక్షిణ ద్వారముందాత్ తన్ క్షణమ్ము
కోట్ల వానర వీరుల గూడి కొంచు. 216

ప్రముఖ బలిముఖ వరసైన్య వ్రతతి యుతని
ననుసరింపగ వేడ్క నయ్యెదను నందె
యింద్రజిత్తున్న పశ్చిమ మ్మెనకులేంద్రు
నానతిని మారుతాత్మజు డధిగమించె. 217

పరమ దుర్జయుడయిన రావణుని రక్ష
ణమున – నిక్షేపమౌ దక్షిణము – ప్రతాప
దీపితుండగు వానరాధిపుడు దాకె
ప్రభువునానతి వనచర వరుల తోడ. 218

పరమ భీకర పాషాణ పాణులైన
సమద భయదావ్రఖ గతి నద్రిచరుల చేత
ముట్టడింపంగ బడె లంక – చుట్టు ముట్టి
కములభవుకైన జొరనశక్యంబు గాగ. 219

మలయ హిమ వింధ్య కుధరముల్ మారు మ్రోగ
వరుస నష్ట దిక్కుడ్యముల్ వ్రక్క వార
వ్రళయ నీరద రవముల భంగి పొరలె
భీషణోదగ్ర వనచర ఘోషణములు. 220

అమిత కపి ఘోషణముల దశాస్యులంక
శైల - వన - దివ్యగోపుర - సౌధ రమ్య
హర్మ్య - ప్రాకార - మందిరో ద్యాన తతుల
మిగుల కంపము చెలరేగె మిన్ను ముట్టి. 221

# వానర రాక్షసుల ద్వంద్వయుద్ధము

తరుచరుల మదమడచెడి తలపు గలిగి
బలము లంపెను రాక్షస ప్రభుడు ధనలి.
గిరి తరుల గ్రుమ్మి వారల గీటడంచి
రసము యోధులు కపి వీరు లప్పుడపుడె. 222

వారు దెగటారినంత రావణుడు మరల
త్రిశిర దేవాంత కాది మదేభ బలుల
నంపగా వారు రామ బాణాగ్ని శిఖల
కాలి నశియింప - నంటతి కాయుడొకడె. 223

తప్పు కొని యేగి; రావణు దరిని జేరి
వానరుల తీవ్ర సంగ్రామ పటిమ దెలుప
తీవ్ర క్రోధుడై కాకలు దీరినట్టి
ఘన బలుల బంచె కపులతో కదనమునకు. 224

కుంభు నెదిరించె నీలుండు - కోరి హనుమ
జంబుమాలిని వడి దాకి సత్వ ముడిపె
నవ్విరూపాక్షు వదలించె నంగదుండు
సూర్య తనయుండు ప్రఘసుని స్రుక్కడంచె. 225

లక్ష్మణుం డుగ్రుడై క్రూర రాక్షసులను
గాయ పరచెను మంత్రిత సాయకముల
వారలకు సాయముగ నట వచ్చి నట్టి
క్రూర దంష్ట్రుని సౌమిత్రి గూలనేసె. 226

వజ్ర దంష్ట్రి మహోదరుల్ వనచరాళి
ధాటికిని నోర్వ జాలక తత్క్షణమ్మ
అద్రి నిభులైన శుక సారణాది దనుజ
వితతితో యుద్ధరంగమ్ము వీడి చనిరి. 227

కనగ హతశేషులైనయాదనుజ భటులు
అగచరుల తీవ్ర ముష్టి వాలాభిఘాత
ములకు వెతజెంది - నిలువక - మోసుతెత్తి
పారి రటు నిటు వేరొండు దారి గనక. 228

తీవ్ర గతి నంగదుండంత దివిజ విభుని
పరమ శత్రు నరిభయంకరుడునైన
ఇంద్రజిత్తుని వడి దాకి - యిలను గూల్చె
నతని సారధి నరదమ్ము నశ్వములను. 229

అంగ రక్షకులంజంపి నర్కసుతుడు
ఖర నఖంబుల నాతని గాయ పరచి
జంప సంసిద్ధుడై యున్న సమయ మరసి
దనుజ సేనలు ఘొల్లున దద్దరిల్లె. 230

## ఇంద్రజిత్తు మాయా యుద్ధము.

ఇంద్రజిత్తంత నుగ్రుడై - యిలను వీడి
గగన ముంజేరి యేరికి గాన రాక
నిశిత సాయక శతముల నిగుడజేసి
వానరుల నొవ్వ జేసె నవార్య గతిని. 231

అంతలో శోక నా రావణాత్మజుండు
మంత్రితమ్మైన నాగాస్త్ర మపుడు దీసి
వింట సంధించి - క్రూరుడై విడచి - రామ
లక్ష్మణుల - మూర్ఛితుల జేసె - రణమునందు. 232

మహిని మగతగా బడియున్న మహిప సుతుల
వివిధ నారాచములను నొప్పించి - యేరి
కంట బడకుండ తిరుగు రాక్షసుడు - చేయు
గర్జనమ్ములు భువి కలకలము రేపె. 233

కట్టు వడి-కాళ్లు సేతులు కదల కుండ
రక్త సిక్తాంగులౌ రామలక్ష్మణులను
విష శరమ్ములు వేసవేల్ విడిచి విడిచి
వివశులంజేసె నింద్రజిద్వీర వరుడు. 234

చలన మిసు మంతయును లేక యిలను బడిన
రామ లక్ష్మణులంగాంచి రవి సుతుండు
శోక వ్యాకులుడై కంట శోణితమ్ము
చిమ్మ - దీనత గనియున్న స్థితిని గనుచు. 235

ప్రీతి మెయి దరిజేరి విభీషణుండు
"ఆర్య! అర్కజ! మనబోంట్ల కభయ మిడుచు
నాదరించెడి రాముని కరయ హాని
కలుగునే? కలుగంగ జగమ్ము సెడదె? 236

అరయ నిది మాయ గాక నో యనఘ! వశమె?
రామ లక్ష్మణులను జంప రాక్షసులకు.
వలదు వైక్లబ్యమును బొంద - వానరేశ!
అనుచు ధైర్యము గరపుచు ననియె మరల. 237

ఇపుడు తక్షణ కర్తవ్య మిది యొకండు
వీరు తెలివొందు నందాక వేవిధముల
అరసి రక్షింప వలె మన మసురు వలన
కీడు జరుగ కుండగ శ్రద్ధ చూడ వలయు. 238

వీరవర! మృతు లైనట్టి వారి మేన
కనగలమె యట్టి యపురూప కాంతివన్న
సత్యముగ వీరు జీవింత్రు - శంక లేదు;
ఊరడిలు మంచు నూరార్చె వీరవరుడు. 239

చింతలో మున్గి మనకపి సేవ లిపుడు
చెదరి పోకుండ ధైర్యము చెప్పు మనుచు
అను నయించుచు వంపించె - నర్క సుతుని
వర విభీషణు - డంత-రావణ సుతుండు. 240

విజయ గర్వాన తండ్రిని వేగ జేరి
ధరణి దొర్లిరి దశరథ తనయు లంచు
విశద పరచిన రాక్షస విభుడు మిగుల
సంతసము జెంది తనయుని శక్తి బొగడె. 241

రాక్షసాంగనలను బిల్చి రావణుండు
జానకిని దెచ్చి రణభూమి జచ్చి పడ్డ
రాముని జూపి యిక నన్ను రహి వరింప
జేయుడని దెల్పె - రాక్షస స్త్రీల గుంపు. 242

మూర్ఛముగ పుష్పకమ్మున భూమి సుతను
దోడి కొని వచ్చె - ప్రాణాలు పోడి నట్లు
పృథ్వి బడియున్న శ్రీరామ భూమి విభుని
జూప_నపుడామె తీవ్రమౌ శోక మందె. 243

రణము నొనరించి రణభూమి వ్రాలి పడిన
గుట్టలౌ వానరాళిని - చుట్టు ముాగి
రాము - లక్ష్మణు - కయి విచారమున గుములు
హనుమ దాదులనటగనె నవని తనయ. 244

ధరణి సొగిలిపడియున్న దశరథేశు
తనయులను జూచి జానకి దద్ద రిల్లె;
తెలివి దప్పెను - చైతన్య దీప్తి తొలగె
తెపి రిల జేసి యిటు బల్కె త్రిజట యపుడు. 245

కను మదే హర్ష కోపాలు కలిగి కాంతి
కలితమై యున్న కపుల ముఖమ్ము లబలః
గీవిభుడు ప్రాణముల్ గల్గి నిక్కువముగ
నున్న వాడమ్మ - సీతమ్మ! కన్ను విప్పు. 246

రామ చంద్రుడు మరణింప రమణి! వీర
లివ్విధమ్మైన తేజాన వెగడ గలరె?
వీరి ముఖములు వరికింప వీస మంత
దుఃఖ మేనియు గన్పింపదో శుభాంగి. 247

పడతి! యిది పుష్పకము-గత భర్తృలైన
వారి నిది మోయగా బోదవార్య గణని
నిన్ను మోయుచు నున్నదే పన్నతాంగి
సంశయము లేదు - నీ భర్త చావలేదు. 248

అనుచు బోధించి త్రిజటయ య్యవని సుతమ
గొని యశోకమ్మునకును దా జనిన పిదప
కొంత వడికిః శ్రీరాముడు కోలు కొంచు
మూర్ఛ దేరెను - కపులెల్ల మోద మంద. 249

మూర్ఛ దేరియు బద్ధుడై - మోము దిప్పి
ప్రక్కనే మూర్ఛలో నున్న భ్రాత గాంచి
పరమ దుఃఖిత స్వాంతుడై బాధ నొంద
వాయు దేవుండు మనుజుడై వచ్చె నటకు. 250

ప్రబల బలులయి-విష శస్త్ర బద్ధులైన
అన్నదమ్ముల గని వాయు వపుడు పలికె;
మీర లవతార పురుషులు; మిమ్ము మీరు
మది నెరింగిన గలుగును మంచి మీకు. 251

తరణికుల శేఖరా! వినతా సుతుండు
తార్క్ష్యు డొకపరి నీ మదిదలచినంత
నకడు చనుదెంచు-దొలగు నీఅహి విషమ్ము;
ప్రబల నాగాస్త్ర మహిమమ్ము బాసి పోవు. 252

అనగ విని శ్రద్ధగా రాము డపుడు దలచె
భక్త-పన్నగ వైరిని-భావమందు
తలచి నంతనె ప్రళయ వాతమ్ము రేగ
వచ్చె ఖగరాజు రాముని వద్ద కంత. 253

భయముతో బారె భీకర ఫణులు-శస్త్ర
రూపములు వీడి-బంధాలు రూపు మాసె
గాయములు వారి దేహాల మాయ మయ్యె;
వారి గని మోదమందిరి వానర రాశి. 254

దాశరథు లంత తమ నిజ తనువు లలర
భూమి నిలచిన గనుగొని పొంగి పొరలి
హర్ష పులకిత గాత్రులై అగచరాళి
సింహనాదులు చేసిరి - క్షితి వణంక. 255

# రావణుండు ధూమ్రాక్షాదుల బంపుట

సంకటము దీరి భువన భయంకరముగ
తరుచరులు సల్పు సింహ నాదాలు వినుచు
తీవ్ర సంచలితాత్ముడై దేవవైరి
పంపె ధూమ్రాక్షుని కపుల వసనడంప. 256

వాయుజుడు వాని వధియించె - వజ్ర దంష్ట్రి
నంపె రావణు డప్పు డయ్యంగదుండు
వాని దెగటార్చి కూల్ప - రావణుడు దగ్రు
డయి యకంపను బంపగా - హనుమ జంపె. 257

కినుక బూని ప్రహస్తుని దనుజ విభుడు
పనుప - నాతడు చెలరేగి భయదు డగుచు
వానరుల బట్టి చంపగ - వాలి సుతుడు
పరమ కుపితాత్ముడై వాని పైకి గవిసె 258

ఆ ప్రహస్తుడు లాఘవ మతిశయించ
అంగదుని మూర్ఛితుంజేసి యపుడె జంప
సిద్ధ పడువేళ నీలుండు క్రుద్ధు డగుచు
అంత మొందించె త్రుటిని ప్రహస్తు నపుడు. 259

అల ప్రహస్తాది బలులెల్ల రంత మొంద
రావణుడు తానె స్వయముగా రణమొనర్ప
కదన భూమిని జేరె - లక్ష్మణుడు వాని
దాక రాముని నాజ్ఞ నొదలను దాల్చె. 260

అంతలో నర్కజుడు నీలు డంగదాది
ప్రముఖ వీరులు రావణు వటు రయాన
నెదిరి పోరాడ; వారల నదర గొట్టి
నిప్పు లుమిసెడి బాణాల సెగడ జేసె. 261

వారలను మూర్ఛితుల జేసి - వరలు చుండ
రావణుని నిల్వరించుచు - లక్ష్మణుండు
పలికె; నీచుడ! వండె నీపాపమిపుడు
కండకావరమున క్రొవ్వి కన్ను గనవు. 262

అనికి చనుదెంచి యీ వనాటాళి తోడ
పోరు సలుపుట -గన-నొక్క పోటు దనమె?
శూరుడవె యైన నాతోడ పోర రమ్ము
రావణా ! రాము తమ్ముడ! లక్ష్మణుండ! 263

అనుచు శౌర్యాగ్ని కురిపింప-దనుజ విభుడు
ప్రళయ మేఘమ్ము గర్జించు వగిది-ధనువు
నారి మోయించి - కాలాగ్ని నా చెలంగి
పండ్లు 'పటపట' కొరుకుచు పలికె నిటుల. 264

లక్ష్మణుండవ నీవ! ఆ రాము కెపుడు
అడుగులకు మడ్గు లొత్తెడి అల్పగుణివి!
రావణుని దృష్టి బడిన శాత్రవుడెవండు
బ్రతుకుటది కల్ల ! నీవింక బ్రతుకబోవు. 265

అనుచు తెగ బీరముల్ పల్క దనుజ పతిని
గాంచి సౌమిత్రి - 'మాటలు కాదు ఖలుడ !
మాయ లిక చెల్లబోవు లక్ష్మణుని కడను
దమ్ము గల్గిన రమ్ము నీదర్ప మణతు. 266

అనుచు లక్ష్మణు డన విని నమర వైరి
చాప నినదమ్ము దారుణ శబ్ద మెసగ
సప్త దుర్వార శరముల సత్వరమ్ము
దూసి యేసెను సౌమిత్రి దూలు నటుల. 267

మెరుపు లిడు దీప్త శరముల త్వరగ దూసి
వాస వాభుండు సౌమిత్రి ప్రతిభ దెలియ
దనుజ పతి తీవ్రతర బాణ తతుల దూల్చి
సింహ గర్జన మొనరించె -సేనలదర. 268

శక్తి మంతములౌ పలు శస్త్రములను
రాక్షసుడు వేయ - సౌమిత్రి - రయము మీర
వాని దునుమాడి రావణు వక్షమగుల
గొట్టె - పలుబాణముల - బహు కుపితుడగుచు. 269

రావణుండంత తీవ్ర నారాచ మొండు
'శక్తి' యను దాని కడుభుజ శక్తి నేయ
లక్ష్మణుడు దాని ఖండింప లక్ష్య మిడుచు
బహుళ బాణమ్ము లేయ నిష్ఫలము లయ్యె. 270

బాణతతి జీల్చుకొంచు నా బాణమేగి
లక్ష్మణుని మూర్ఛితుంజేసె - రావణుండు
నతని లంకకు గొంపోవ - నతి రయమున వ
చెంత జేరగ_గని హనుమంతు డంత. 271

ఉరగ పతి భంగి రోజుచు నుగ్రుడగుచు
కర్ణ - నయన - ముఖద్వారకములు వగిలి
శోణితము ధారగా గార - శూర హనుమ
వజ్రసమ ముష్టి నపుడు రావణుని గొడిచె. 272

కనుల చీకట్లు గ్రమ్మ నద్దనుజ విభుడు
ధరణి మూర్ఛితు డయి వ్రాలె తత్తరమున
అతని గని-హర్షముఖులైరి - అమర వరులు
"జయ జయ" ధ్వానముల తమ చదులు చెలగె. 273

అమిత సత్త్వుఁడు – ధీశాలి – అనిల సుతుడు
లక్ష్మణుని రక్షణమ్మెంచి లక్ష్య ముంచి
రెండు చేతుల గుచ్చుచు లేవ నెత్తి
లక్ష్మణుని రాము జేర్చె సురక్షితముగ. 274

అనిల సుతు సౌహృదత్వమ్ము నమిత భక్తి
కారణమున శక్తి శరము గాలి దూలి
లక్ష్మణుని వీడె–నతడంత రాము ప్రొక్కి;
ప్రీతి కౌగిట జేర్చె నా కోతి భటుని. 275

అంద రభినందనము చేసి రపుడు – పవన
సుతుని – లక్ష్మణు గాచిన శూరుడంచు
వానరాధిపుడును – రామ వరుడు గూడ
అనిలజుని ప్రీతి దొలుకాడ గనిరి యపుడు. 276

# రామ రావణుల మొదటి యుద్ధము

దనుజపతి మూర్ఛ దేరి యుదగ్రు డగుచు
ప్రళయ భీకర రూపాన ప్రబలి – ధనువు
దాల్చి – నారిని సారించి – దడలు పుట్ట
నిశిత శరముల తా రాము నేయ దొడగె. 277

రథము నందుండి యుద్ధము రహి నొనర్చు
రావణుని గాంచి – హనుమ – తా రాము జేరి
"దేవ! నా పృష్ఠ భాగాన తివిరి నిల్చి
అని యొనర్పుము దనుజు తో" నంచు గోరె. 278

సంతస మ్మొంది – భక్త వశంకరుండు
హనుమ మూపున కూర్మితో నధి వసింప
కనక నగ నిభ కడు దీర్ఘ గాత్రుడైన
హనుమ మూపున – సూర్యుడై యలరె నతడు. 279

మిడిసి పడుచున్న రావణు మీది కురుక
తామ్ర రుచి భీకరమున నేత్రమ్ము లలర
తీవ్రతర శింజినీ ధ్వని దిశలు నిండ
సిద్ధమై యుండె రాముండు – యుద్ధమునకు . 280

మేఘ గంభీర నినదమ్ము మించు నట్టి
పలుకులను రావణుని తీవ్ర భాషలాడి
లోకమున కప్రియము సల్పి – లోకమందు
నీవు బ్రతుకుట కల్లంచు నిజము పలికి. 281

"నిలుము నిలుమంచు"–రాముడు నింగి యదుర
విలయ కార్ముక రవ మభ్ర వీధి నిండ
దనుజు – చెయి – కాలు – రాకుండ ఘన శరముల
విడచి అక్షుద్ర లంకేశు వివశు జేసె. 282

రథము వడి గూల్చి యపుడె సారథిని జంపి
పది కిరీటమ్ములను నేల బడగ గొట్టి
పలికె రావణుతో రామ భద్రు డంత
నిన్ను జంపుట నిముసము నీచ దనుజ. 283

అయిన విడతును – లంక కేవరిగి – రాత్రి
సేద దేరుము – రాక్షస క్షేమమునకు
తర్క మొనరించి శాంతి యుతమ్ముగైన
యోజనలు సల్పిరారమ్ము యుద్ధమునకు . 284

విడక సంగ్రామమే గోరి – పెట్టి వగుచు
భ్రమల దేలిన నిజముగా బ్రతుక గలవె?
చచ్చుటకు సిద్ధమై రమ్ము! జగతి నిన్ను
బరగి పాలాక్షుడైన గాపాడ లేడు. 285

తెలిసె నీ లావు - తెగువయు దెలిసి పోయె
విక్రమము గూడ దెలిసె—నీ వీరవటిమ
తేట తెల్లముగా నేడు దెలియు కతన
కోరి - యవకాశ మిచ్చితి - కుటిల దనుజ! 286

అని వచించెడు రాము నేమనగ లేక
సత్వ మడగిన రాక్షస చక్రవర్తి
తొంటి పౌరుషము వెలికి దోపకుండ
లంకకుంజనె సాధ్వస మంకురింప 287

# రావణుని విచారము

దనుజ విభు డట్లు రణభూమి - దారుణమ్ము
నైన యోటమి చవిజూచి - యచటు వీడి
ఘన మృగేంద్రము గను మద గజము మాడ్కి
గరుడునింజూచు సర్పమ్ము కరణి_బారె. 288

రాముచే నభిహతుడైన రావణుండు
పరికయ తర రాము కార్ముక పటిమ దలచి
తీవ్ర వ్యాకుల హృదయుడై తేజ ముడిగి
లంకకుంజేరి నిజ మందిరమ్ము సొచ్చె 289

కొంతవడి చింతలో మున్గి - కుదురు కొంచు
కొలువునస్ సింహపీఠాన గూల బడుచు
నచటి రాక్షస ముఖ్యుల నపుడు గాంచి
నిట్లు వచియించె నవజయ మొంచి వేగ 290

ఎపుడు లేదిట్టి అపజయ - మిపుడు గల్గె;
చేసిన తపస్సు వ్యర్థమై చేయి జారె;
శాపములు నేడు నన్నట్టి శక్తు లుడిపె;
ఏల దయమాలి దైవమీ లీల జేసె. 291

అష్ట దిక్పతు లెవ్వని యాజ్ఞ-తలల
దాల్చి భృత్యుల కైవడి గొల్చు చుందు
రట్టి రావణు డీనాటి యనిని నొక్క
అల మానవు చే నోడె నకట! చూడ 292

అబ్జభవు డెంత జెప్పిన నేపుడు వినక
నరుల వానరులను వీడి - గరుడ సిద్ధ
సాధ్య సుర యక్ష కింపురుషాది దివిజ
వరులచే చావు లేకుండు వరమడిగితి. 293

అదియె తప్పయ్యె - నేడు నా ఆత్మ వెలిగె;
శాపములు నన్ను వడిజుట్టి శక్తి మీరి
ఆత్మ మథనమ్ము గల్గించె - నఖిల గతుల;
వినుడు నా శాపములు వినిపింతు నిపుడు. 294

నాడు - నా కృత్యముల గడు నలిగి నలిగి
రాము వంశీయుడా యనరణ్య నృపతి
అలిగి "నా వంశజుని చేత కలత గనుచు
జత్తు వొకనా" డటంచు నన్ శపు జేసె. 295

నేడు రాముని రూపాన నిలిచి యతడె
అని పలాయితు గావించె నని దలంతు;
గాక రావణు నెదిరించి కదన భూమి
నిలువ నేరికి శక్యమౌ తలచి చూడ. 296

నిర్జనారణ్యమున తప నియతి నున్న
'వేదవతి' యను తన్విని విడువ కుండ
పరిబల కామాతురుండ నై బాధ పెడితి;
ఉగ్రయై యామె అపుడు మదగ్ని మతిని. 297

నన్ను నిరసించి "నా కారణమున మూఢ!
తనుజ యనుజాప్త యుతముగా ధరణి గూలు
దంచు" శపియించె - నామె యే అవని తనయ
యై జనించెడి - పృథ్విపై నదియె నిజము 298

మునుల హింసింప - వారలు ముదము బాపి
కఠిన తర శాప వచనాల గడగి దిట్టి
రట్టి శాపమ్ములన్ని నే డనిని గలసె!
అనృత మగునె మహర్షి పల్కరయ భువిని? 299

నాడు కైలాస గిరి చలనాన - గనలి
పార్వతీ దేవి శపియించె ప్రబలి నన్ను
"నాతి కారణమ్మునను నేనాటికైన
బలిమి జత్తు వటంచు" తత్ప్రాప్తి యేమొ? 300

పరిహసించితి నొకనాడు ప్రబలుడైన
ప్రముఖ నందీశు - నాతడు భంగ పడుచు
వినిచె - మద్రూప శక్తులు వీర్యయుతులు
వైన కపులచే జచ్చెద వనుచు నాడు. 301

కడగి కామార్తతను నే యకామ యైన
స్త్రీని బలిమిని చెరచితి నేని నాదు
శిరము తెగి కూలగ నలకూబరుడు నాడు
శాపమిడె నాకు - రంభకు శాంతి గూర్ప. 302

ఇవ్విధమ్మున శాపమ్ము లిమిడి - నన్ను
కొట్టు మిట్టాడ జేయగా చుట్టు ముట్టె;
బలయుతులు మీరలే లంక భద్రత నిక
నరయ వలె నంచు బలికెను సుర విరోధి. 303

తన పరాజయమును . మంత్రి - ఘను ప్రహస్తు
మరణమును గూర్చి చింతించి మతము మార్చి
భీతి విడనాడి - యనికినై భీమబలుని
కుంభకర్ణుని నిద్ర మేల్కొల్ప బంపె. 304

## కుంభకర్ణుని నిద్ర మేల్కొల్పుట.

అబ్జ భవు తీవ్రతర శాప మావహింప
ఆరు నెలలు నిద్రను మున్గి యాతడుండు;
కడకు మేల్కొని ఆ రోజు గడచినంత
మరల నిద్రించు నజు శాప మహిమ వలన. 305

రావణుని యాజ్ఞ - బలవంతు లైన దనుజ
భటులు నాతని మేల్కొల్ప - ప్రబలమైన
మృష్ట కాంచన దండముల మేళవించి
ఎన్ని భేరుల నచట మోయించి నారొ? 306

ఎంత జేసిన నత డిసు మంతయేని
చలన మందక నిద్రింప - చటుల భీమ
బలులు సలసలా క్రాగు తైల లహరులను
శ్రోత్ర రంధ్రాల నింపి మేల్కొలుప బూని. 307

శిలలు పెక్కులు గొనివచ్చి - శిరము వగుల
కొట్టు చుండిరి కొందరు - కుంభ కర్ణు
చటుల వక్షమ్ము వగులగ చావ గొట్టి
కుదిపి లేపిరి; కాని మేల్కొన డతండు. 308

కఠిన ముద్గరాదుల గొని గదిసి మోది
రంపముల గోసి - ఘన కుఠారముల నరికి
మీసములు పట్టి పెరుకుచు మీది కురికి
విక్రమము చూపి భటులెల్ల విసిగి నారు. 309

ఇటుల కాదని రాక్షసు లేగి వేగ
మదగజమ్ముల గొని వచ్చి — మత్తు నిదుర
మునిగి యున్న యా కుంభకర్ణుని శరీర
మదర త్రొక్కించి రాతని నిదుర సెదర 310

ప్రబల తరఘోరమౌ కర్మ బలిమి వారు
పలువ — నొక్కింత వడికి — నా సత్త్వ డదరి
మేరు పర్వతాకారంపు మేను కదిపి
మేలు కొనెను -క్షుదార్తిచే వ్రాలి పడుచు. 311

అపుడు వారిడు భక్ష్య మాంసాదు లన్ని
తృప్తి దీరగ గుడిచి సంతృప్తు డగుచు
మద్యమును శోణితము గ్రోలి మత్తు డగుచు
ఆవులించుచు నడచె తా నన్న కడకు. 312

# కుంభకర్ణుని చరిత్ర

కుధరముల మించి గన్పించు కుంభ కర్ణు
రూపమును గాంచి భీతులై రోజు కపుల
భయము బాప విభీషణు పగర గూర్చి
అడిగె రాముండు — సంత సయ్యెసుర వరుడు. 313

కుంభకర్ణుండు — వీడతి క్రూరు — దసుర
భ్రాత — విశ్రవస్సుతుడు — ప్రభావ యుతుడు
ధరణి నీతని బోలిన దైత్య ఘనుడు
లేడు వేరొక్కరుడు — రామ! వీడు చూడ. 314

అష్ట దిక్పాల కాదృమరాశి నెల్ల
అట పట్టించి నట్టి మహాద్భుతుండు
పుట్టి వపుడె క్షుదార్తుడై — పుడమి సర్వ
భూతముల మ్రింగు నొక పెను భూతమితడు. 315

ధరణి గల భూతజాలమ్ము దద్దరిల్లి
శర్వు కడజేరి ఘోషించి శరణు వేడ
కుపితుడై శర్వుడంతట కుంభకర్ణు
నసమ వజ్రాయుధమ్మున నదిమి కొట్టె. 316

కుంభకర్ణుడు తీవ్ర సంక్రుద్ధుడగుచు
సింహనాదము చేసి విశేష శక్తి
ఇంద్రునైరావతపు దంత మిట్టె పెరికి
వాసవుని యురమ్మున నాటె వడిగ దాని. 317

కుంభకర్ణు ప్రహారాన క్రుంగి - దేవ
విభుడు కొండొక వడికి వివేక మూని
నలత జెందుచు - దేవతతులను గూడి
అబ్జభవు జేరి - పొగిలి - యిట్లనియె భీతి 318

జగములను రావణుని భ్రాత శక్తి కొలది
మ్రింగుచుండె; నీరీతి తా మ్రింగె నేని
జగము జనశూన్యమై పోవు - సత్వరముగ
కరుణ గని జీవకోటుల గావు మనఘ ! 319

అని వచింపగ దయపూని అజుడు వచ్చి
క్రూరుడై జీవరాసుల గుడుచు చున్న
కుంభకర్ణుని గని కడు కుపితు డగుచు
శవము వలె నిద్ర పడియుండ శాప మిచ్చె. 320

రావణుండంత నధిక విభ్రాంతు డగుచు
అజుని దరి జేరి - "యిది న్యాయ మగునె నీకు?
కనికరమ్ముంచితమ్ముని గావు మంచు
వేడుకొనినంత దయగని విధియు నపుడు. 321

అరయ షణ్మాసములు నిద్రయందు మునిగి
మేలుకొని యొక్క దినముండు; మేను మరచి
మరల నిద్రించు - పత్ప్రదీ మహిత శావ
మసుర కులశేఖరా-యంచు నాత డరిగె. 322

కాల నిర్ణయ మొనరించి కంజభవుడు
కదలినంతనె - ఆ కుంభకర్ణు డెలమి
నిదుర మున్గుచు - నొకనాడు నిదుర వీడి
తిరుగు - ప్రాణుల కడుపార దినుచు తినుచు. 323

ఇప్పుడిట నోడి దనుజేంద్రు డితని నిదుర
భంగ మొనరించె మన పైకి బంప - రామ!
బెదరు వానర సేనల భీతి నణచి
ధైర్య మొదవించి వీనిని దాక వలయు. 324

అని విభీషణు డెరిగింప నవని విభుడు
నిఖిలవానర సేనాని నీలు బిల్చి
కుంభ కర్ణుని నెదిరింప కోతిభటుల
యందు ధైర్యము పురిగొల్పు మనుచు గోరె. 325

# రావణుడు కుంభకర్ణుని యుద్ధమునకు బంపుట

ఆవులించుచు చనుదెంచు అనుజు గాంచి
రావణుండనె తమ్ముడా! రణమొనర్ప
రాము డరుదెంచి విడిసెను లంకయందు
సాగర తటాన మనలను చంప గోరి. 3.6

ముష్కరులు శూరు లౌ దైత్య ముఖ్యు లెల్ల
రరయ విరివిగ నిహతులై రాజిలోన
నొక్క వానరు డైనను నుక్కడంగి
చావ డడియేటి చోద్యమో సంగరాన. 327

తమ్ముడా ! యేమి చెప్పుదుః దాశరథిని
నిన్న ననిలోన దాకితి – నేర్పు మీర
నతడు విడచిన దివ్యాస్త్ర తతుల ధాటీ
కాగ లేక వచ్చితి పారి – ఆజి వీడి 328

అతి పరాక్రమమును జూపి అతడు నన్ను
వివశునింజేసి – దూషించి – విడిచి పుచ్చి
ఇంటి కేగు మటంచనె – ఎంత మాట !
పారి వచ్చితి వేరొండు దారి గనక. 329

ఇపుడు నీవేగి ఆ రాము నెట్టులైన
గడగి యోడించి – కడతేర్చి – కపుల గ్రసించి
అర్కజుని లక్ష్మణుని జంపి – హనుమగూల్చి
వారి శిరములు దెమ్మానవాలు నాకు. 330

ఇటుల నెన్నడు నినుగోరి యెరుగ నేను
కోరితిని నిన్ను నేడిట్లు కుంభకర్ణ
బాహుబల రోష యుతుడవై వర్రిబలి – దనుజ
వంశ మందున పృథుకీర్తి వడయు మీవు. 331

అని మిషుల తోడి యుద్ధాల నద్భుతముగ
మేలి రణ మొనరించిన మేటి వీవు
అనుజః నీ సరి మేటి బలాఢ్యు డొకడు
గలడెః త్రిభువనముల నేడు తలయ గనిన. 332

అనుజు బురి గొల్పుచును దీన తనము గొన్న
అన్న పరిదేవనము గని - అసుర కులుడు
ఖిన్నుడై - దోషయుతుడైన అన్న గాంచి
యెండు పలుకక జనె వేగ యుద్ధమునకు 333

అన్న మాటను కాదన్న నగున దేమొ
యెరిగి యుండుట నతడు మరేమి యనక
రామ బాణాగ్ని మడియ స్వర్గసుఖ మైన
కలుగునని యెంచి కాలోలు కదలె ననికి. 334

# కుంభకర్ణుని యుద్ధము

స్వర్ణ భూషణ యుతుడయి సత్వమొప్ప
పాద విన్యాసమున పృథ్వి వగులు వార
దనుజ వనితలు పూజల్ల తత్తరమున
కాల జీమూత మట్టుల కదలె నతడు. 335

దిక్కు లదరగ రణభేరి తీవ్ర గతుల
మ్రోగు చుండగ - నంబుధుల్ పొంగి పొరల
కపుల పాలిటి లయకాల కాలుడనగ
గదిసె రణభూమి నక్కుంభకర్ణు డపుడు. 336

అంత నతికాయుడును రోష మతిశయింప
తోడుగా కుంభకర్ణుని గూడి వెడలె
దశరథాత్మజు తోడ యుద్ధమ్ము సేయు
తనదు భీకర శస్త్రాస్త్ర తతులు దాల్చి. 337

ప్రళయ భీకర రూపాన వచ్చుచున్న
కుంభకర్ణుని - వానర గుంపు జూచి
ప్రాణ భయమున పరుగిడ : భయముబాపి
అనికి పురికొల్ప నంగదుండనియె నిటులు 338

పౌరుషము వీడి కపులార ! పారనేల?
ప్రాకృతుల భంగి – వీడు దుర్బలుడు-నిజము!
బలయుతులు మీరు ధైర్యము పాదు కొల్పి
వీని వధియింప గుమి గూడి వేగ రండు. 339

అనుచు ధైర్యమున్ మేల్కొల్పి నగచరాళి;
సత్వరము తీవ్ర సత్వులై – శక్తి గదుర
హస్తి సదృశ పాషాణమ్ము లపుడు దాల్చి
దవ్వులందుండి – దనుజుపై రువ్వినారు. 340

తరుచరులు నుగ్ర పాషాణ తతుల విసరి
అక్కజము దిక్కులన్నిండ నార్చుచుండ
ప్రళయకాల వర్షమ్మున కలత గనని
కుల నగము భంగి నతడొప్పె కలత లేక. 341

గాఢమగు రీతి నా కుంభకర్ణు పైన
హరులు వేయు ఘన తరు – శిలాచలములు
కొండపై బడు నల మట్టి కుండ లటుల
వేన వేల్ ముక్కలగుచుండె వివిధ గతుల. 342

అంగద –హనుమ – జాంబవదాదు లెల్ల
రసుర కులు ధాటి కెంతయు నాగలేక
ధరణి బడి మూర్ఛ మున్గిరి – తరుచరాళి
పరమ భీతిని యని వీడి పరుగు లిడిరి 343

అర్కజుడు నిల్వరించుచు నసురు దాక
నతని మూర్ఛితు జేసి – అయ్యె సురవరుడు
చంక నిడుకొని లంకకు జనుచు నార్చె
ఘోర గతి – నవ్వ నాటుల గుండె లదుర. 344

## రాముడు కుంభకర్ణుని హతమార్చుట.

రాము డప్పుడు కోపించి – రయము మించి
దివ్యమగు బాణమున వాని ద్రిప్పి నంత
నర్కజుని వీడి ఆ రావణానుజుండు
తిరిగి చనుదెంచె _ రాముని దీటడంప. 345

మార్గమున నడ్డు తగిలిన మహిజ చయుల
దర్పమున రూపు మాపి - అత్త'ని _ కుంభ
కర్ణు _డడరి విజృంభించి – కపి బలాల
మీద బడి నార్చును వారి మ్రింగు చుంటె 346

దివ్యమగు నస్త్రముల వాని దీటడంప
లక్ష్మణుడు యత్న మొనరింప - లక్ష్య మిడక
లాఘవమ్మున శ్రీ రఘురాము మ్రింగ
గడగి చనుదెంచె నక్కుంభకర్ణు - డంత. 347

కడలి ద్రచ్చెడు కులగిరి కరణి నతడు
భీకరాకారు డగుచు నిర్ఋతి దనరి
నోరు దెరచి రాముని మ్రింగ ధీరమతిని
తత్తరము జూపి చనుదెంచు దనుజుగాంచి. 348

లక్ష్మణుడు బల్కె నీరీతి రాము గాంచి
"అన్న! యీతడు సామాన్యు డంచు దోవ
దనమ సాహసమున వీని నణప తున్న
కీడు మూడును; రఘువంశ కీర్తి మాయు. 349

లక్ష్మణుని మాటలను విని రామ విభుడు
తివిరి దివ్యాశుగమ్మును దీసి - యప్పుడె
అతని కుడిచేయి గూల్చిన -నదియు నేల
బడుచు వేలాది వానర వరుల గూల్చె. 350

కుంభకర్ణుడు కుడి చేయి గూలెననెడి
చింతయిసుమంతయును లేక - వంత మూని
తీవ్రగతి నార్చుచును - రాము దీటడంచి
వడిగ మ్రింగగ గమకించి వచ్చు వేళ. 351

సిద్ధ శర మొండు దూసి ప్రసిద్ధమతిని
యెడమ చేతిని పడిగూల్చె నినకులుండు
దాని తాకిడిచే నల్గి ధరణి బడిరి
వానరులు వేల కొలది సవార్య గతిని 352

ఛిన్న బాహుడునై వాడ భిన్న మతిని
నోర్వ విడనాడి-గాయాల నోర్చు కొంచు
అవని పతి మీది కురుకుచు - నాగ్రహమున
వచ్చుచుండెను ఘనగిరి వలె చెలంగి. 353

శోణితము దేహమున నిండి - చూపరులకు
అరుణ కిరణాల దడిసిన - అద్రి భంగి
రెక్కలూడి వికృతుడునై గానవచ్చె
కదనభూమిని నటు నిటు గదలుచుండి. 354

ఆలసింపక శ్రీరాము డాగ్రహించి
దారుణైంద్రాస్త్రమున వృథ్వి దద్దరిల్ల
శీఘ్రముగ కుంభకర్ణు శిరము ద్రుంచె
దేవ దుందుభి ధ్వానముల్ దెసల మ్రోయ. 355

ధరణి - కులపర్వతమ్ములు దద్దరిల్ల
కుంభకర్ణుండు రణభూమి గూలెనపుడు
దివిచరులు - భూనివాసులు తృప్తి మీర
జయ నినాదాలు సల్పిరి - చతుర గతుల. 356

# రావణుని విషాదము

కుంభకర్ణుడు రణభూమి గూలె ననెడి
వార్త వ్యాపించి వేగ రావణుని జేరె;
శోక వ్యాకులుడై తాను సొమ్మసిల్లి
దీన తవమందె - మది యందు దిగులు నొందె. 357

అనుజ! వైరి వినాశక! హా! - మదీయ
దుఃఖ మెన్నిక రణభూమి దూలినావు
వరగ దైవోప హతుడవై పగరదాకి
ఒంటి నేగితి వకట! నా జంట బాసి. 358

నేడు రణభూమి దెగి కూలె నెవరు వీడి
నాదు దక్షిణ భుజ - మింక నరుల నేను
గెలుతు వేరీతి? నరవానరుల దలంచి
హడలు నొందక నుందు? జయంబు గొందు. 359

చండ తేజుడ! నీవిట్లు చచ్చి పడిన?
రాజ పదమేల? నాకు సామ్రాజ్య మేల
సిరులు విభవమ్ము లవియేల? సీతయేల?
జీవితమ్మేల? సోదరా! నీవు లేక. 360

ఆ ప్రహస్తుడు నీవు ఘోరాజి లోన
కూలి నంతనె నాశక్తి దూలి పోయె;
సభను నాడన్న మన విభీషణుని పల్కు
అనుభవమునకు వచ్చి సత్యంబు లయ్యె. 383

నియమ మెరిగియు_విధి లేక నీదు నిదుర
భంగ మొనరించినాడ - బల్ పాపి నేను!
వశమె నీయట్టి తమ్ముడు వసుధ గల్గ
ననుచు వేభంగి విలపించె. దనుజ విభుడు. 362

# త్రిశిర దేవాంతకాదుల యుద్ధము

కుంభకర్ణుని వధ విని క్రుద్ధులైన
త్రిశిరుడును మహోదరుడును తేజితులయి
అతి భయంకర దేవాంత కాది దనుజ
వీరులను గూడి రణభూమి జేరుకొనిరి. 363

వారు చెలరేగి క్రూరులై వానరులను
యుద్ధమున దూల నేయగ యోద్ధలైన
అంగదుడు జాంబవంతుడు హనుమదాది
వీర శార్దూలు లడరి చంపిరి రయాన. 364

తనదు పినతండ్రి మరణింప కిమక బూని
కనుల నిప్పులు రల నతికాయు డంత
దీప్త శౌర్యాన రాముపై దివ్యమైన
అస్త్ర తతి ప్రయోగించె భయంకరముగ. 365

రామునిందాకుటకు మున్నె లక్ష్మణుండు
వాని భంజించి యతికాయు బలము దొలగ
వారుణాస్త్రమ్ము నేసిన వాడు చచ్చి
నేల గూలెను ధరణి కల్లోల మడగె. 366

# ఇంద్రజిత్తు మరల యుద్ధమునకు వచ్చుట

కడకు హతశేషులైన రాక్షసులు వచ్చి
త్రిశిర దేవాంతకాదులు ద్రెళ్లుటయును
నసుర పతికి నెరింగింప నతడు దుఃఖ
మున మునింగిన నింద్రజిజ్జనకు చూచి 367

తండ్రి నోదార్చి – విపులమౌ ధనువు దాల్చి
అతని అనుమతి గైకొని – హితముపలికి
వానరుల గూల్ప – పొంగెడి వనధి భంగి
ప్రబలమగు సేనతో వచ్చె బవరమునకు. 368

వివిధ శస్త్రాస్త్రముల దాల్చి వీరుడైన
మేఘనాథుండు కపిసేన మీదికురికి
గుండె కొట్టుచు ప్రబల దోర్దండ లీల
ఖండనము సేయ – కపిసేన బారదొడగె. 369

ఇనకులాంబోధి చంద్రులు కినుకఖూను
నంతలో నింద్రజిత్తు బ్రహ్మాస్త్ర మేసె
రామ లక్ష్మణ వానర వ్రాతతి మీద;
ధరణి వణకాడ కుల గిరుల్ దద్దరిల్ల 370

మహిత వీరులు రామలక్ష్మణులు గూడ
బద్ధులైనారు బ్రహ్మాస్త్ర పాటవమున
తక్కగలవారు – మిగిలిన తరుచరులును
నుక్కడంగగ – ధరణిపై నొరిగినారు. 371

కనుగొనుచు వారి – నమరేంద్రకంటకుండు
దనుజులకు శత్రుభయమింక దలగిపోయె
నంచు – నార్చుచు – సంతస మతిశయింప
తండ్రి కెరిగించె – నతడు సంతసము నొంద. 372

భూమిపై నట్లు పడియున్న భువన నుతుల
నరపి – "నావంశ తిలకు లిట్లయి" రటంచు
కలవరమ్మున నెట్టనై కలత నొంది
చూడగా లేక వడిగ్రుంకె సూర్యుడపుడు. 373

కనులు పొడుచు కొన్నను గూడ కానరాని
కటిక చీకట్లు భువి నప్డు గప్పి వేసె
కపి భటులు జాత బంధలై కదన భూమి
బడిరి - కటలక బ్రహ్మాస్త్ర పాటవమున. 374

బ్రహ్మవరమున హనుమయు - బ్రహ్మ మంత్రి
సతత జపమున నల విభీషణుడు - నింక
జాంబవంతుడు వరమంత్ర సాధనమున
నలత నంధక జగమును - దెలిసి యుండ్రి 375

గాఢ తమమున చేదాల్చి కాగడాల
వెలుగులో జాంబవంతుని వెదకి వెదకి
అల విభీషణ హనుమంతు లరసి నారు
పడిన వారలలో జాంబవంతు నపుడు 376

గాంచి సంతస మంది - వారంచితముగ
భల్లుకేశ్వర! మనవారు వ్రీలిభ లుడిగి
ధరణి పై బడి యున్నారు తమిని - వార
లే యుపాయాన మేల్కొందు రిపుడు చెపుమ 377

ఋక్ష కులుడంత కనువిచ్చి రోజుకొంచు
కటిక చీకటి - కన్నులు గానరావు;
గాడ్పువట్టి యొందుండెనో గంటి వేని
ముప్పుదీరును - జయభేరి మ్రోగ నగును. 378

పవనసుతు డంత మ్రొక్కుచు భక్తి యుక్తి
బ్రతికి యున్నాడనీ దయ వలన - యనగ
సంతసము జెంది యాజాంబవంతు డింక
భయము లేదనె - మనవారు బ్రతుకు నను. 379

హనుమగని - వునీ హిమగిరి నధిగమించి
నేరుగా నిషధాద్రిని మేరు నగము
శ్వేతశైలమ్ము గడచి విశేషశ్రమను
క్షీర ఘృత సాగరముల లంఘించి - పిదప. 380

ద్రోణగిరి జేరి సూర్యుడు దోపకుండ
నందు గల యట్టి దివ్యౌషధాల దెచ్చి
సకల సైన్యాల శ్రీరామచంద్రు తోడ
బ్రతుక జేయుము - ఘనకీర్తి వడయుమనెను. 381

పవన సుతుడేగి - పెకలించి - పట్టి తెచ్చె
ద్రోణగిరి - నౌషధమ్ముల గానలేక
మహిత వానరసైన్యమ్ము మధ్య - గిరిని
పుడమి డించెను - గుండెలు పులకరింప. 382

అవ్విభీషణ జాంబవదాదు లకును
వందనము జేయ - హనుమ నమంద గతిని
కౌగిలించుచు మనసార గౌరవించి
అతని గొని యాడినారు - సాహసము మెచ్చి. 383

ఓషధీ గంధ సంస్పర్శ నోలలాడి
కపులు నిద్రించి లేచిన కరణి లేవ
మూర్ఛ మునిగిన దశరథ ముద్దు సుతులు
గూడ తద్గంధమున దోగి కోలు కొనిరి. 384

అంత వరకును రణభూమి యందు పడిన
వానరులు నోషధీ శక్తి బ్రతుకు గనిరి;
మృత దనుజ దేహములు వార్ధిగతము లగుట
రాక్షసులు - ఓషధీ శక్తి బ్రతుక రైరి. 385

బ్రతికి లేచిన వానర వ్రతతి గనుచు
జనకజా నాథు డత్యంత శాంతి నంది
గిరి యథాస్థానమున నుంచి తిరిగిరాగ
హనుమనుంగోరె - నతడప్పుడట్లు జేసె. 386

# కుంభ-నికుంభాదుల యుద్ధము

రాము కోరిక - నక్కపిరాజ శ్రేష్ఠు
డపుడె రణభేరి మ్రోయించ నానతిడిన
కపి సమూహము - జగమెల్ల కంప మొంద
యుద్ధభేరిని ప్రయోగించి రుద్ధృతముగ. 387

భేరి మ్రోగిన నింద్రజిద్వీరు డెడద
క్షణము నివ్వెరబోయె - రావణుడు నపుడు
గనలి కుంభనికుంభాది - కఠినులైన
రాక్షసుల బంపె కపులతో రణ మొనర్ప. 388

అతి భయంకరులౌ రాక్షసాళి - కపుల
నదర గొట్టుచు చేసె మహావహమ్ము
అంగదాదులు నుగ్రులై - యపుడె వారి
పై విసిరినారు తరువులు బండరాళ్లు. 389

కూలు దనుజుల జూచి నికుంభు డంత
కుపితుడై అర్కజుని దిట్టి కూల నేయు
యత్న మొనరింప ననిలజు డడ్డు పడుచు
నవని వణక మహారవమ్మపు డొనర్చె. 390

తోకతో పీక బిగియించి నాకసాన
గిరిగిరం ద్రిప్పి పృథ్వి పై తిరుగ గొట్టి
ఆ నికుంభుని పరిమార్చి అక్కజముగ
సింహనాద మొనర్చె నా సింహబలుడు. 391

కుపితుడై నర్కజుండంత కుంభు గూల్చె;
ఆ ప్రజంఘుని పరిమార్చె నంగదుండు;
వారు కదనాన గూలిన వార్త వినిన
రావణుని తీవ్రతరదుఃఖ మావహించె. 392

అతుల చింతా పరుండౌచు నసుర విభుడు
సుంత యోచించి – ఖరసుతు చెంత జేర్చి
చంపె నీ తండ్రి నానాడు సంగరాన
చూడ నీ రాముడే! వాని పీడ వగునె ? 393

తండ్రి ఋణమును దీర్చెడి తనయు లవని
చిర తరమ్మైన సత్కీర్తి చెందగలరు;
తరుణమది వచ్చె నేడు నీ తండ్రి ఋణము
దీర్ప – రాముని తెగటార్చి తిరిగి రమ్ము 394

అనిన మకరాక్షు డమితమౌ నాగ్రహాన
అతుల భుజబల దర్పమ్ము లతిశయింప
కడు వడిగ సేగె రామలక్ష్మణుల గూల్ప
చిత్తమున నిర్ణయము చేసి తత్తరమున. 395

కపులు వికలత జెంద – రాక్షసుడు రేగి
అన్ని దిక్కుల తానయి యావహమున
కపుల దునుమాడుచుండ రాఘవుడు గాంచి
అతి రయమ్మున మకరాక్షు నడ్డగించె. 396

తీవ్ర శరముల మకరాక్షు తీట దీర్చి
రథము – ధనువును – హరులు – సారథిని గూల్చి
చేసిన జలద గంభీర సింహనాద
మునకు మకరాక్షుడెంతయు గినిసి పలికె. 397

మున్ను మాతండ్రి గూల్చిన మూఢ మతివి
కలిగె నీతోడి యుద్ధ మిక్కలన నాకు
ధరణి నినుగూల్చి దీర్తు నా తండ్రి ఋణము
రమ్ము - రమ్మని గద్రదిప్పి రాము నేసె. 398

శానుకులు డగ్గ్గి శరము చే బూని - వింట
దొడగి మకరాక్షు శిరమును ద్రుంచె తృటిని
అతడు మరణించె నని విని అసుర పతియు
నమిత చింతా పరాధీను డయ్యె మరల. 399

## ఇంద్రజిత్తు తండ్రి నోదార్చుట

మేఘనాధుండు ధైర్యమ్ము మీర వచ్చి
తండ్రి దుఃఖమ్ము తొలగింప దగిన రీతి
పలుకు లాడిన - వినుచు రావణుడు కొంత
స్థైర్యమును బొందె - దుఃఖోప శమన మ ది 400

అసురపతి మేఘనాధుతో ననియె - తనయ!
కనగ మిగిలిన వారము మనమె గాన-గాన
నెటుల జయమందగలమిక? నేది త్రోవ?
అని వచింపగ జనకున కనియె సుతుడు, 401

చాలడా తండ్రి! యీ తరుచరుల నరుల
చీల్చి చెండాడ నియ్యింద్రజిత్తు కండు!
చాలు! నొరులేల? నాకని సాయమేల?
ధైర్యముండుము - జయుడనై దరలి వత్తు. 402

అనుచు గంభీర భాషల ననునయించి
వందనము తండ్రి కొనరించి స్యంద నాన
వెడలె చతురంగ బలములు వెంట రాగ
రామునిందాక సంగ్రామ రంగమునకు. 403

అని యొనర్చి చక్రవ్యూహమును బొనర్చి
అరదమును డిగ్గి తన్మధ్య మందు నిలచి
హోమకుండము రగిలించి - ఊడుకుకృష్ణ
సర్ప రక్తము ప్రేల్చెను - జయము గోరి. 404

అమిత సంతృప్త హృదయుడై యనల దేవు
డపుడు పొడసూపి - యొసగె - దివ్యాస్త్ర శస్త్ర
తతులు - నరదము - కవచమ్ము - దనుజ డంత
మహిమ నలరారె యుద్ధ సామగ్రి తోడ. 405

వాని ధరియించి - ద్విగుణితమైన శక్తి
రథము నధిరోహణము చేసి - రథము తోడ
నాకశమ్మున కెగసె - నయ్యగచరాళి
వివిధ గతి భ్రాంత చిత్తులై వివశ మంద. 406

గగనమును జేరి శాంబరీ గతి చెలంగి
దనుజ భటు లార! నేడు నే దర్పమొప్ప
ననిని దశరథ తనయుల నర్కసుతుని
హనుమతో గూల్తు - నిది సత్యమని వచించె. 407

ఎరికిని గాన రాకుండ నింద్రజిత్తు
అన్ని దెసలను తానె యై - నతిశయించి
అ[illegible]మ శరవృష్టి గురియింప నగచరాళి
పారి రిటు నటు భీతులై పరుగులెత్తి. 408

చలము వహియించి - దృష్టి గోచరుడు గాక
గగన మందున్న దనుజుండు కంప మొంద;
వివిధ వరమంత్ర యుతములౌ విశిఖములను
వేగ బరపిరి రఘుకుల వీరవరులు. 409

విశ్రుత శాంబరి విద్యా ప్రవీణుడైన
శక్రజితు నెడ వ్యర్థమై చనియె నవియు;
అలయకయె వాడు గినిసి మహాంధ కార
శరము నపుడేయ చీకట్లు చదల గ్రమ్మె. 410

విల్లు చేగొని మారుత భల్ల మంది
కటిక చీకట్లు తొలగి ప్రకాశ మొదవ
వేగ సంధించి రాముడు విడచినంత
వీడె చీకట్లు - పొడసూపె వెలుగులపుడు. 411

దనుజ వరసుతు డత్యంత తామసమున
వాడి కోలల-నెల్ల ప్లవంగ సేన
తల్లడిలునట్లు సేయ - నత్తరిని హనుమ
గవలి - దాకె నాతని విభీషణుని తోడ. 412

మీది కురుకుచు శౌర్యమ్ము మీరి పోర
వాడియగు నాయుధమ్ములవారలపుడు
తమిని వ్రేయగ - హనుమయు -దానవాళి
బెదరి-పారగ - తోకతో చిదుగ గొట్టె. 413

అసమ సాహస మొప్పార నసురు డంత
దాశరథులను బొడగని తత్క్షణమ్ము
ఘోరతర బాణ వర్షమ్ము కురియజేసి
వివశులంజేసె వారల విబుధు లదర. 414

పైకి కనరాక - భీషణ భంగి - మాయ
యుద్ధమును జేయు చున్నట్టి ఇంద్రజిత్తుని
అసమ సాహసగరిమ మహాద్భుతమును
గనుచు సౌమిత్రి రాముని కనియె నిటుల 415

అన్నా! మనమాలసించిన నఖిల కపి - బ
లమ్ము నశియించు - దనుజుని రభస మాన్ప
ఆనతిడు మన్న ! యిపుడె బ్రహ్మాస్త్ర మేసి
ఇంద్రజిత్తుని -సేనల - నిలను గూల్తు. 416

అనిన విని రాము డనియె తాననుజుగాంచి
ఒకనికై నెల్లదనుజుల నుగ్ర గతిని
చంప న్యాయమె? అదిగాక సమరభూమి
వీడి పరుగిడు చున్నారు వీరు-చూడు? 417

పరుగు లిడు శత్రువుల జంప పాడి గాదు!
ఇది విరుద్ధము రణనీతి కిపుడు నీవు
ప్రబల సిద్ధ ఫణాధరాస్త్రముల బరపి
మాయ భేదింప దనుజుని మాయలుడుగు. 418

కాననగు వాడు - గని మన కపి భటాళి
ఉగ్రులై వాడు రణభూమి నొరుగు వరకు
తరు శిలాయుధములతో నుదగ్ర గతిని
చితుక గొట్టుదు రికనేల చింత నీకు. 419

అని వచించుచు శ్రీరాము డాలసిలక
ప్రబల తర మంత్ర యుతమైన బాణ మేసె.
బహుళ సన్మంత్ర యుత బాణ పాటవమున
మాయ దొలగుచు దనుజుండు మహిని గూలె. 420

ఇంక నట నిల్వలేక నయ్యింద్రజిత్తు
రణము వడి వీడి పరుగిడి లంకజొచ్చె
సాహసోపేత క్రౌర్య విస్ఫారితమ్ము
నైన రాముని రూపమ్ము నరయలేక. 421

నిడుద నిట్టూర్పు పుచ్చుచు-నిజ గృహమ్ము
చేరి - యొక్కింత వడికి తా సేద దేరి
కుంభకర్ణ ప్రహస్తులుకూలు మాట
తలపునకు రాగ - నాతడు తత్క్షణమ్ము. 422

ఆగ్రహావేశ యుతుడయి వతుల బలము
సంతరించుక - శూరుడై - సమర భూమి
జేరె వడివడి - వతనితో: ఘోర బెంచి
అనిల తనయుండు రామాజ్ఞ నతని బెదిరె. 423

# హనుమదింద్రజిత్తుల యుద్ధము

ఘనములంబోలి గర్జించి గాడ్పు సుతుడు
విక్రమాటోప మొప్పగా వివిధ గతుల
రాక్షసుల దాకి తాడించె; రావణియును
హనుమ దాకుచు నేసె మహాస్త్రములను. 424

రావణి విడచు ప్రబల నారాచములను
వమ్ము జేయుచు దనుజుల గ్రుమ్ముచుండి
అనిల తనయుండు పలికె నద్దమజు గనుచు
నేత్ర యుగ్మమ్ము సెట్టినై నిప్పులురల. 4'5

కుటిల రాక్షస మాయలు కూడ వింక
చెల్లె మున్నవి - ఇక ముందు చెల్లబోవు
హనుమ చను దెంచె నీతోడ వని యొనర్ప
సాహసుడ వేని రారమ్ము - సత్వరమ్ము. 426

జన్య మొనర్చించి నిను నేను జముని పురికి
నతిథిగా బంపెదను నిజ మన-నసురుడు
"ఎరుగవే నాటి యీ దనుజేంద్ర సుతుని
ఖండనమ్మశోకానన - పవనజుండు. 4'7

ఏను కోరి జిక్కితిని - నీ పెరుగ ననుచు
ప్రబల వృక్షమ్ము నొకదాని బట్టి తెచ్చి
దనుజ నందనుపై వేసి దర్పమరల
సింహ నిస్వన మొనరించె క్షితి వణంకె. 4 8

దశముఖుని సూను డల్గి పరిఘానమైన
శిత శరమ్ముల హనుమను చితుక గొట్టి
మూర్ఛ నొందించె దనుజులు మోద మంద
దాని గని విభీషణుడు సత్వరమె పోయి. 429

లక్ష్మణుని జేరి - దనుజుచే - రామభక్త
వీర హనుమ - మూర్ఛితుడైన విధము దెలిపి
శక్రజితు దాకి యెదిరించు శక్తి పరుడ
వీవె యని వల్క - లక్ష్మణు డావహమున. 430

అతని నెదిరించు నంతలో నసుర సుతుడు
పలికె పినతండ్రి గనుగొని - పరమ నీచ
పథమునకు జారితివి నీవు - పౌరుషమ్ము
వీడి - మానమున్ వీడి సేవించి నరుని. 431

పౌరుషము - ఖ్యాతి - మర్యాద - బహుళ నీతి;
ధర్మమును - రాజ ధర్మము తగ త్యజించి
జాతి సహజ గుణమ్ముల నీతి మాలి
పగర సేవించు చుంటివి - పౌరుషమ్మె? 432

"ఇట్టి కడు నీచ గుణముల నీప్సితాన
బ్రతుకు నీ యట్టి స్వల్పులు బ్రతుక జగము
మాన మర్యాద చెడిపోవు - గాన - నీవు
బ్రతుకగా రాదు - యిపుడె నిన్ బట్టి కూల్తు!" 433

అని వచించిన తనయున కసుర కులుడు
'ఎరుగవే నాదు వైర్మల్య? మెరిగి యుండి
నీచ బుద్ధిని వదరుట నీకె తగును;
టక్కరులు మీరు – జగతి కంటకులు గారె? 434

జన్మతః రాక్షసుడ నయ్యు చకిత మతిని
గాక; వర ధర్మ వరుడనై గడగి నడచు
నేను మీ తోడ పొత్తు త్యజించి నాడ।
కడు జుగుప్సను – మీ పనుల్ కలత గొలుప. 435

హింస - పర ధన హరణమ్ము - లింపు గలిగి
పరుల వనితల చెరచెడు పాప బుద్ధి
ఘన దురాచార మీ నాల్గు కలుషగుణము
లరయ వంశక్షయము లంచు నసుర దెలియు 4'6

సాధు జన మౌనివర ఋషీశ్వర వధమ్ము
సుర విరోధమ్ము - కోపమ్ము - పరుల కలిమి
గని యసూయ పడుటయును గనగ దోష
గుణములని పల్కరే మన గురు జనాళి. 437

సకల విధ దుర్గుణమ్ము లసాధు తనము
గప్పి యున్నట్టి నీ తండ్రి కలుష బుద్ధి
విస్తృతమ్మయ్యెనే దాని వీడు మంచు
హెచ్చరించితి నేను మున్నెన్నొ మార్లు. '33

లక్ష్య మిసు మంతయును లేక రావణుండు
రాము సతి సీత చెరబట్టి రాక్షసమున
సంచరించెను - యిది కూడ దంచు పలుక;
తీవ్రుడై సభ వెడలించె_దిట్టి కొట్టి. 433

అతవి సుతుడవు నీవు - నీ కంత కంటె
మంచి బుద్ధి ఘటించునె ? మాట లేల ?
సమరమున లక్ష్మణుడు నీదు సత్వముడుప
ప్రళయ కాలార్కుడై సిద్ధపడియె నదుగొ ! 440

అనెడు పినతండ్రి పలుకుల - నాలకించి
ప్రళయ ఝుంఝూ నిలము భంగి ప్రబలి - రావ
ణాత్మజుడు - తన పినతండ్రి నాడి పోసి
సిద్ధ పడె లక్ష్మణుని తోడి యుద్ధమునకు. 441

## లక్ష్మణ ఇంద్రజిత్తుల యుద్ధము

శక్రజితు గాంచి యపుడు లక్ష్మణ కుమారు
డతుల సంరంభుడై ధనువమ్మర దాల్చి
కాల జలదంబు గర్జించు కరణి ధనువు
నారి సారించె వీరావతారు డగుచు. 442

అది గనుంగొని విల్లంది - అసుర తనయు
డద్భు తాద్భుత భంగి తా నార్చి - నారి
మ్రోగ జేసిన విని సురల్ వేగ మపుడు
సమరమును చూడ మింట నాసన్ను లైరి. 443

ఎదిరి నిలచిన లక్ష్మణు నింద్రజిత్తు
శౌర్యమున జూచి పల్కె - నాశక్తి నీవు
మరచి నాడవె? నాగాస్త్ర మహిమ నంత
తలపునకు వచ్చు-నౌదల తడుము కొనుము. 444

అనుచు వెగతాళి జేయుచు నసుర సుతుడు
వింట శరములు సంధించి విడచి నంత
దానవుని మూర్ఖతను గని - తమి వహించి
ప్రతి శరమ్ముల సౌమిత్రి బరపి ద్రుంచె. 445

మండి పడి - మంత్రముల నూది - మహిత గతిని
భాస మానమ్ములౌ మూడు బాణములను
లక్ష్మణుని నొవ్వ జేసి యా రాక్షసుండు
దివము పగులగ కడు ఘోర రవ మొనర్చె. 446

కినిసి లక్ష్మణు డా దశగ్రీవు సుతుని
ధనువు తునియగ జేసి రథమ్ము విరచి
సారథిని జంపి హరులను చావగూల్చి
వరుస పదిబాణములు గొట్టె వక్షమందు. 447

వరగ సౌమిత్రి శరవృష్టి బరపి నంత
అలిగి సురవైరి కాద్రవేయాస్త్ర మాది
నిశిత శరముల లక్ష్మణు నే నంత
గరుడ శరమున దునిమి లక్ష్మణుడు తిరిగె. 448

అనురుపై కోపమున కుబేరాస్త్ర మేయ
నాత డద్దాని దూల్చి యైంద్రాస్త్ర మేసె
యామ్య బాణము సంధించి యసురు డలర
ఘనుడు లక్ష్మణు డైంద్రాసుగమును దునిమె. 449

రాజ సుతుపైన నా సురరాజ పుత్రు
డవని వణకాడగా వారుణాస్త్ర మేసె
అమిత శౌర్యాన లక్ష్మణు డదర కుండ
దాని దునుమాడె నప్పు డైంద్రాసుగమున. 450

దానవుడు గిన్క బూని గంధర్వ శరము
దొడిగి లక్ష్మణు నదలింప - దొడర నపుడు
దశరథోర్వీప సుతుడు నిస్తంద్ర శక్తి
ఖండ శశి బాణమున దాని గర్వమణచె. 451

# ఇంద్రజిత్తు రణమున గూలుట

ఇంతలో రాక్షసులు కడు వంత మూని
వానరుల మీద ప్రళయమౌ బాణ వర్ష
మపుడు గురియించి నొప్పింప యగచరాళి
అవ్విభీషణ ప్రేరితు లగుచు వేగ 452

చెలగి ఘనసింహ నాదముల్ వెలయ జేసి
విలయ పవన ప్రేరిత మేఘ విధము దోప
దీర్ఘ లాంగూలముల వడి ద్రిప్పు కొనుచు
దనుజ దళముల పైబడి దర్చు చుండ్రి. 453

దేవదానవ యుద్ధంపు తీరు గొన్న
ఘోరమగు యుద్ధ మపుడయ్యె వారలకును
జాంబవంతుడు తన యనుచరుల జేరి
రాక్షసుల దాక పురిగొల్పె నాక్షణాన 454

కాలమేఘమ్ము చెలరేగు కరణి రేగి
పెను శిలావర్ష తరువర్షమును నొగించి
దనుజులను గూల్చ - ఆరామ దండు నరసి
రక్త తామ్రాక్షు డగుచు నారావణియును. 455

ప్రబల తర శింజినీ ధ్వని ప్రబల జేసి
దివము భువమ్ము లదరెడి తీరు దోప
అగ్ని వర్షమ్ము నొగియించు నస్త్ర తతుల
నపుడు కపిసేన నళియించె నార్తి రగుల 456

రాక్షసున కడ్డమై యంత లక్ష్మణుండు
తివిరి పలు శస్త్రముల వాని దీటణంప
గనలి - ఘనశక్తి నసురాస్త్రమును దనుజుడు
దాశరధి పై ప్రయోగించె ధరణి వణక. 457

మహితమై నట్టి దనుజాస్త్ర మహిమ కతన
నక్కజమ్మయి లెక్కకు మిక్కుటముగ
గదలు శరములు చక్రముల్ ఖడ్గ తతులు
పుట్టి రణభూమి వ్యాపించి పొంగి పొరలె. 458

ఆ ప్రళయమును గనుగొన్న అగచరాళి
పరుగు లిడ లక్ష్మణుడు వారి పరుగు నాపి
మును మహేశ్వరు వందించి ముదము గదుర
వర మహేశ్వ రాస్త్రమ్మేసి వాని దునిమె. 459

రాము సోదరు డంత విరామ మిడక
నింద్ర దత్త భుజంగాస్త్ర మేసి పల్కె
వేదములు నిత్యమగు నేని - విశ్రుతగతిని
ఇంద్రజిచ్ఛీర్ష మిప్పుడే యిలను బడుత. 460

అతుల మహిమాన్వితమ్ము నయ్యస్త్ర మంత
స్వర్ణ మణి రత్న భూషణ కర్ణ కుండ
లాది భూషల నలరారు నసుర తనయు
శిరము వడి ద్రుంచె-మౌనులు సురలు మరియు. 461

వేగ దెగినట్టి సురవైరి విపుల శిరము
గాలిలో రక్త సంసిక్త కందు కమ్ము
భంగి దేలుచు - నెగురుచు - పడియె పుడమి
ప్రబల రఘుకుల వీరుని ప్రతిభ మెరయు. 462

కవచమున దోగి - నవరత్న ఖచిత మైన
మణి మయాంచిత భూషణ మయమునైన
కఠిన రాక్షస తనయుని కాయమంత
ధరణి గూలెమ హస్తాన ధనువు తోడ. 463

వాడు పుడమిని బడినంత వానరాళి
హర్షకలిత ముఖమ్ముల నరిగి నారు
జయము సూచింప పులకిత స్వాంతులగుచు
సింహ నాదములత్తరి జేసినారు 464

అంత రిక్షాన గంధర్వులాది దేవ
గణము - ఋషు లచ్చరలును సుగాన రీతి
శ్రీ రఘూద్వహు గీర్తింప శ్రీప్రశస్తి
నవని సకలమ్ము గానలహరుల నిండె. 465

క్రొవ్వి - పదునాల్గు భువనాల కుదిపివేసి
జగతి కంటకుడై సదా జయములంది
నట్టి రావణి నేడిట్టు లనిని గూల
విజయ దుందుభి ధ్వానముల్ విరిసె పృథ్వి. 466

దైత్యబలముల కెల్ల నాధారు డగుచు
అమరులకు పెను పీడయై యడరి నట్టి
ఇంద్రజిత్తుండు తెగెనని ఇంద్రుడు విని
పుష్ప వర్షమ్ము గురియించె పుడమి నెల్ల. 467

# రాముండు లక్ష్మణుని గౌరవించుట

రాక్షసేశ్వరు సుతు ద్రుంచి లక్ష్మణుండు
సోదరుని జేరి - వినయ భాసుర ముఖుడయి
విన్నవించె రావణి మృతి గన్న విధము
రాము డానంద వార్ధిని రహిని దేలె. 468

ఉదిత సంతోషమునను రఘూద్వహుండు
కౌగిటం జేర్చి తమ్ముని గౌరవించె.
సోదరుని యాదరమ్మును చూరగొన్న
లక్ష్మణుని మేను పులకించె - తక్షణమ్ము. 469

అంత నటకు విభీషణు డరుగు దెంచి
దేవ! మీ యాన తలదాల్చి తేజ మురల
ఘోర రణమున నసురేంద్రు కొమరు గూల్చి
ఇతడు కృతకృత్యు డయెనని ఇంపు బలికె. 470

అంతలో మారుతియు – జాంబవంతు – డంగ
దాది ప్రముఖులు చనుదెంచి – అసుర విభుని
సుతుని గూల్చిన లక్ష్మణు – హితము మీర
నభి నుతించిరి – యుద్ధ ప్రఖ్యాతి పొగడి. 471

అనఘ – నా వంతు రావణి మయ్యె – నింక
మిగిలె నీవంతు రాక్షస విభుడటంచు
లక్ష్మణుడు పల్క – రానున్న రణమునందు
దనుపతి జచ్చు విధమును దలపు మనియె. 472

## ఇంద్రజిత్తుని గూర్చి రావణుడు దుఃఖించుట

సత్వరము చారులేగి లక్ష్మణుని చేత
ఇంద్రజిత్తు రణమ్మున నీల్గె నంచు
దెలిపినంత లంకేశుండు – తీవ్ర శోక
మలమి మూర్ఛల్లె కొడుకుకై వగవరించి. 473

పెద్దయుంబ్రొద్దు రాక్షస ప్రభుడు తనదు
తను వెరుంగక మూర్ఛిల్లి ధరణి బొర్లి
యోర్పు విడనాడి వేడి నిట్టూర్పు పుచ్చి
గుండెలవియంగ విలపించె కొడుకు కొరకు. 474

హా సుతా! నీవు సురనాథు నణగ ద్రొక్కి
ముజ్జగమ్ములు వణకాడ మోహరమున
వీర విహరణ జేసిన వీరుడవుర!
అల్ప నరుపాల బడి యిట్టు లైతి వెట్లొ? 475

ధనువు చేబూని నిలువ-యుద్ధమ్ములోన
నిన్ను దరిజేర వెరచి - యా పన్నులగుచు
నమర విభుడాది దిక్పాలు రని దొలంగి
పారి - డాగిరి - పలుమార్లు - పరమవీర! 476

బలము లన్నియు రణభూమి బడి నశింప
చిత్త వైకల్య మొదవి నే చింత నొంద
నన్ను - నోదార్చి - ధైర్య సంపన్ను జేసి
ఇపుడు నన్నొంటి వీడి నీ వేగ తగునె? 477

నీ వొకండవు లేకుంట నిఖిల జగతి
శూన్యమై దోచు నాకిట - సుతుడ! తండ్రి
అంత్యక్రియ జేయవలసిన యట్టి నీకు
నేనె యంత్య క్రియాళిని నెరపవలసె. 478

అనుచు గుండెలు బాదుక నాతడేడ్చి
గుండె రాయిగ జేసుక కొంత వడికి
తనయు నని గూలనేసిన దశరథేశు
సుతుని తక్షణ మని గూల్ప ప్రతినబూనె. 479

## రావణుడు వీరుల యుద్ధమునకు వెడలుట

పంక్తికంఠుడు ఘోరంపు ప్రతిన బూని
స్వీయ చతురంగ బలముల చేర్చి కూర్చి
బ్రహ్మ సత్కృప నిచ్చిన బాణ తతుల
దాల్చి వెడలె దాశరథుల-దాక నెంచి. 480

యుద్ధ భీతులగు దనుజ యోద్ధులకును
ధైర్య మొదవెడి పల్కుల దగ వచించి
వెరపు దీర్చి - మేఘంపు టురుము రీతి
ప్రళయ గర్జన మొనరించి బయలు వెడలె. 481

తనయ మృతి జాత శోక సంతాప కోప
దీప్త నయనాల నసురుండు దిక్కులదర
విలయ కాలాగ్ని రుద్రుడై - ప్రళయ భయద
మూల బలము వెన్నంట నాభీల మూర్తి. 482

కాంచనోజ్వల రథమెక్కి కడు రయాన
కదల - రథచక్ర ఘోషల గగన మెల్ల
కంప మందగ - రాక్షస గంపు మగలు
చుట్టి కొలువంగ రణభూమి జొచ్చె నతడు. 483

# వానర రాక్షస యుద్ధము

ఉభయ సేనలు ఢీకొనె యుద్ధమునకు;
ఘోరమగు రీతి దనుజు లపారమైన
బాణముల నేయ - కపులప్డు ప్రజ్ఞ మెరయు
వాని విరచుచు గిరి తరు ప్రతతి దెచ్చి. 484

చావ మోదిరి రాక్షస సైనికులను;
వానరుల ధాటి కసురులు పరుగులెత్త
పంక్తి కంఠరు డడ్డమై భయమువాపి
కపుల నొప్పించె నమ్ముల గములు బరపి. 485

సూర్య సుతుడు విరూపాక్షు తేరుపైన
కండ బలమొప్ప నొక పెద్ద కొండ వైచి
దనుజు లదరగ - కపులకు ధైర్యమొదవ
చూర్ణ మొనరించె - చూపరుల్ చోద్యమంద. 486

అరద మటు గూలి నంతట ద్విరద మెక్కి
అవ్విరూపాక్షు డెదిరిన - నంగదుండు
వాలమున వాని వడి జుట్టి నేల గొట్టి
వంగరము సేయ నాతండు భంగపడుచు. 487

ఉగ్రముగ నార్చి - యంగదు నరికి బట్టు
యత్న మొనరింప - సుగ్రీవు డడ్డు వచ్చి
వక్షమున నప్పళింప నా రాక్షసుండు
నెత్తురులు గ్రక్కుకొనుచును నేల గూలె. 488

అతని తమ్ముడు తపనజు డన్న మృతికి
తీవ్ర సంచలితాత్ముడై - దృఢము పైన
బాణ వృష్టిని గురియింప - భాను సుతుడు
శైల మొక్కటి విసరి రాక్షసుని జంపె. 489

చెంతనున్న సుపార్శ్వుండు చేవ సెగడి
అనిల సుతు దాక - నాత డయ్యవసరమున
హరులు - రథమును గూల్చి సారధిని జంప
ననిలజుని మూడు బాణాల నాతడేసి. 490

చెంతనని సేయు నా జాంబవంతు పైకి
రాక్షసుడు దూకి - నొప్పించి - రయముగదుర
వాలి సుతు దాకి తూపుల దూల నేయ
అవని బడి - లేచి - ఆ బలుండాగ్రహమున. 491

దనుజు చేవిల్లు విరచిన - గినిసి వాడు
గదను చేబూని వేగ మంగదుని గొట్టె;
తప్పుకొని యాత డసురుని దన్ని నంత
గిలగిలం దన్నుకొని వాడు క్షితిని గూలె. 492

తనదు సైన్యమ్ము పసచెడి ధరణి గూల
నోర్వగా లేక దశకంతు డుగ్రుడగుచు
రామచంద్రుని మీదికి రథము ద్రోలు
మంచు జెప్పిన సారధి యట్లె జేసె. 493

# రామ రావణ యుద్ధము

తడయకయె వచ్చి పడినట్టి దనుజ పతిని
మనుజపతి దాకె నెంతయు కినుక బూని
శంఖ కాహళ భేరుల శబ్దమెసగ
వంధి మాగధ సంస్తుతుల్ సందడింప. 494

ఎదిరి నిలచిన రాముని యదటు సెల్ల
నరసి దశకంఠు డపుడె నాగాస్త్ర మేసె
లెక్క సేయక - తీక్ష్ణుడై - యుక్కు మిగిలి
తీవ్ర బాణాన దూల్చె ధాత్రీ ధవుండు. 495

అంత లంకాధినాథు డత్యంత పటిమ
నిరులు గురిసెడి బాణమ్ము నేసి నంత
నిబిడమై చీకటులు ధర నిండి పోయె
కపులు కను మిన్ను గానక కలత గనిరి. 496

రాఘవుడు దాని భేదించి లక్ష్య మిడుచు
వహ్ని బాణము నేయ - రావణుడు దాని
నడ్డి - రుద్రాస్త్ర మేసిన నదియు నిదియు
పెనగె విను వీథి - తుది తూలి - పృథ్వి బడియె. 497

దాశరథి యేయు ప్రబలాస్త్ర తతుల నెల్ల
తృణము లట్టుల నడుమనే తృంచి - పిదప
దానవేంద్రుండు మయునిచే దత్తమైన
శంబరాంబక మేసె ముజ్జగము లదర. 498

ఆ శరమ్మున్న బహుళ శస్త్రాస్త్ర తతులు
ప్రభవ మందుచు రఘురాము పై కొనంగ
మన్మథాస్త్రమ్ముచే దాని మద మడంచి
నాశనము చేసె రాము డయ్యాశుగమును. 499

సెడక నయ్యాసుగము రాము విడక వక్ష
భాగమున నాట - రాముండు బలము దూలి
తెలివిసెడి నేల బడియె_నత్తఱి గెరలి
వచ్చి పడె లక్ష్మణుడు రాము ప్రక్క క్షపుడు. 500

కోప ముప్పొంగ శితశర కోటి బరపి
దనుజు నడలగ జేసె లక్ష్మణుడు - నంత
రథము ధూలిచి నశ్వ సారథుల జంపె
నవ్విభీషణు డన్నకు హడలు కలుగ. 501

మండి పడి రావణుండంత మమత వీడి
తామ్ర ధూమ్రాక్షుడై వాడు తమ్ముడనక
మహిత శక్తుల నలరారు మహిత "శక్తి
శరము" సంధించి తమ్ముని జంప విడచె. 502

## లక్ష్మణ మూర్ఛ

పావకజ్వాల లుప్పొంగ - భయద గతిని
తీవ్ర ఘోషలు చెలరేగ దిశలు పగుల
జగము వణక-సముద్రాలు చలన మంద;
పెనగి చనుదెంచె నది విభీషణుని ద్రుంప. 503

మహిత గతి నట్లు చనుదెంచు మహిత శక్తి
గమన మాపి విభీషణు గావనెంచి
తీవ్రతర ధైర్య సాహస దీప్త మతిని
లక్ష్మణుడు దాని దూల్చగా లక్ష్యముంచె. 504

ఆశ్రితుల బ్రోచు వర షడ్గుణాతిశయుడు
వినుత సాహస శీలి వివేక గుణుడు
రఘుకులాంబోధి చంద్రుడు లక్ష్మణుండు
తత్క్షణము శక్తిపై శరతతులు పనిచె. 505

రావణుని శక్తి శరము దుర్వారమగుచు
మంట లుమియుచు మిణుగురుల్ మహి చెలంగ
ప్రతిఘటిత శరములందు్రాల్చి ప్రబల గతిని
వచ్చి వడిదాకె లక్ష్మణు వక్ష మందు. 5(6

శక్తి ధాటికి సౌమిత్రి సత్వముడిగి
శరము వాల్చుచు ధరణి మూర్ఛిల్లె - నపుడె
రాముడను లేచి - యదిచూచి - "ప్రాణహాని
కలుగకుండు గాక" ని యెద తలచి - యంత 507

మూర్ఛ మునిగిన యట్టి తమ్మునకు మరల
బాణ ఘాత లేకుండ గాపాడ నెంచి
స్వీయ గాయములను లెక్క సేయకుండ
రావణాసురు నెదిరింప-రామమూర్తి. 508

కపుల నంత సౌమిత్రికి గాపు పెట్టి
ఘన తరమ్మైన కోప విక్రమము లడర
ఉగ్రుడై తీవ్ర భాషల హుంకరించి
పలికె పదునాల్గు జగములు దెలియ నిట్లు. 509

"నేనె దశరథ రాముడ నేని - నేడు
అమరు లెరుగంగ సంగర మందు దనుజ
పతిని ద్రుంచెద - లేకున్న - నతని చేత
జత్తు -నింతియె కాని నే రిత్త మగుడ". 510

రావణుడు - రాము - డనియెడి రాజు లిర్వు
రవని నుండుట పొసగ దీ - అర్క కులుడొ-
రావణుడొ - గాక నిర్వురు గ్రాల బోరు
రావణా! రమ్ము - రమ్మంచు రవి కులుండు. 511

తీవ్ర తర శస్త్ర తతుల దీధితుల - నతని
విడక సర్వాంగముల బాణ వితతి బరపె;
కారు శోణితమున దశకంఠు డపుడు
చూడ - గనుపించె నుదయాద్రి సూర్యునివలె. 512

కాలు సేతులు సుంతైన కదల కుండ
దీప్త శరముల రావణు దీటడంచి
రాము డతి సంతము నందె- రావణుండు
భీత చేతస్కుడగుచు బెంబేలు పడియె. 513

రామ శర లాఘవమ్మున - రణము నందు
విమల భూషలతో కిరీటముల తోడ
తలలు దెగిపడ నార్చుచు దర్పమణగి
ఇంక నటనుండ లేక దా లంక జొచ్చె. 514

## రావణుడు మండోదరి కడ విలపించుట

అంతిపురి జేరి నిజకాంత నపుడు పిలిచి
భయ విషాద లజ్జాభర భరితు డగుచు
నపుడు మండోదరీదేవి యంక పీఠి
శిరము నిడి చింతితుండయి చెప్పె నిటుల 515

రమణీ ! రణభూమి నేటి పరాభవమ్ము
నేమటంచును దెల్పుదు? నినకులుండు
విలయ కాలాభ్ర శరవృష్టి విరియ జేయ
బారి వచ్చితి బ్రతుకాశ ప్రబలు కతన. 516

అగ్నిమించిన వేడి - యయ్యమర విభుని
వజ్రమును మించు వాడి - పరిభావకలిత
కాల దండంపు దాడియు - గాలి రయము
గలిగి రాముని శరములు కలచె నన్ను. 517

హరి హయ్యుని తోడ - నిరుతి యమాగ్ని వరుణ
వాయు వాద్యష్ట దిక్పాల వర్యుల తోడ
ఫణిజగత్పతి తోడ నేర్రణ మొనర్చి
నాడ - యీవాడి వారి బాణములు లేవు. 518

ఇంతి! హరు కంటి మంట సహింప వచ్చు;
ఇనకులుని బాణ హతిని సహింప లేము.
అల్పుడగు తాను శరముల నైతి నిట్లు
కంటి! దేహము జల్లెడ కంత లయ్యె. 519

కరకు వీరుడు మన కుంభకర్ణు డీల్గె;
చేవగల మేటి మన యింద్రజిత్తు మడసె;
చండ వీర్యుడు ఆ ప్రహస్తుండు గెడసె;
కడకు రణధీర్ర వరు ధ్వతికాయు డడగె. 420

అతుల సంగ్రామములను మున్నారి తేరి
అరుల దూల్చిన ఘన మకరాక్ష - వజ్ర
దంష్ట్రాది మహా వీర దైత్యులెల్ల
రరయ కదనాన గూలిరా హరుల చేత. 521

అఖిల భువనాల గుప్పిట నదిమి పట్టి
ఎల్ల వారికి దైవమై - ఇంద్రు డాది
దిక్పతుల సేవలందుచు - దివ్య మైన
వన్నె గాంచిన నేనిట్లు భంగ పడితి. 522

అనుచు చింతించు పతి గాంచి అశివ మిన్న
బదులు పల్కగ లేక తా భర్త గడకి
సాను భూతిని ప్రకటించి - సజల నయన
యగుచు రోదించె మూగగా-నంత నచట. 523

# రాముని విలాపము

రావణుడు పారి నంతట రామభద్రు
డవన తాననుడై శోక మతిశయింప
తమ్ముని జేరి దుఃఖ సంతప్తుడగుచు
నేడ్చె- సామాన్య మానవు డేడ్చు కరణి. 525

రక్త సిక్తాంగుడై నిజ శక్తు లుడగి
చలనమే లేక నాడి సంచలన మడగి
భూమి బడియున్న తమ్ముని మోము జూచి
బాష్పములతోడ తొడ జేర్చి పలికె నిటుల. 526

భాను కులదీప తమ్ముడ! భానుధాంగ
సత్య సల్లాప! గుణదీప! సౌమ్యరూప!
శౌర్య గుణ వృద్ధ- చిత్త సంశుద్ధ! యోద్ధ!
జీవకళ బాసి పుడమిని జేరి తేమి? 527

పర్వతము భంగి నెత్తురుల్ పారుచుండ
రణమహిని వ్రాలి పడియున్న లక్ష్మణాఖ్యు
చలన ముడిగిన దేహమున్-కలయ గనుచు
పలు విధమ్ముల విలపించె - భాను కులుడు 528

జనకు నానతి పురివీడి వనములకును
వచ్చు దినమున నిన్ను రావలదటంచు
నెంత జెప్పిన వినకుండ పంతమూని
వెంట వచ్చి- యిట్లయితివి- విధివశాన. 529

అన్న! లక్ష్మణా! కన నిద్రా హారములను
మరచి - వనవాస మందున మమ్ము గొలిచి
జగము పొగడెడి పరిశుద్ధ చరితము భువి
వలర జేసి నీవిపు డేడ కరిగినావు? 530

ఈవు లేకుండగా నెట్లు లేనయోధ్య
చేర గలనయ్య? నట నేమి చెప్పగలను?
భరత శతృఘ్నులకు నేమి పలుక గలను?
చారవ నీతల్లి ముఖమెట్లు చూడ గలను? 531

నీ సమానుడు తోబుట్టువీ సమాజ
మందు నెటనుండు? సనుజ! నీయమల గుణము
లగణితమ్ములు — నిను బాసి — జగతి నెట్లు
జీవనము సేయు రాముండు? పావనాత్మ 532

తమ్ము గుణముల పలుమార్లు తలచి తలచి
శోక మాత్మ సర్వస్వము చూర గొనగ
మనసు వికలము గాగ — నమ్మహిప సుతుడు
రక్తిచెడి యపరిమిత విరక్తి మునిగె. 533

కపులనంతట గని రామ నృపతి బలికె
"అయ్యలార! మీ సాయాన నసురు ద్రుంచి
జయము చేగొని - ప్రఖ్యాతి జగతి వడసి
వరల నెంచితి-నది నేడు వట్టి దయ్యె". 534

తండ్రి గతియించె - సతిసీత దనుజు చెరను
మ్రగ్గు చున్నది - తమ్ముడు మహిని వ్రాలె;
ఏల అడియాశ నాకు? నింకేటి జయము?
జనుడు మీరిక మీని జాశ్రమములకును. 535

బంధు కోటుల వీడి నాబాస మీది
ఆస తోడ విభీషణా! అలరు చుంటి
వదియు నన్నృతము నగుచుండె; ననఘ! నీవు
లంక కేగుము! నాయందు లక్ష్య మిడకు. 536

అతుల మతి విహీనత మాటలాడు రాము
గని సుషేణుండనియె నంత వినయ మొప్ప
దేవ! చూడు తమ్ముని మోము - జీవ కళయు
బాయ దిసు మంతయును - నింక భయమదేల? 537

నిండు పున్నమి చంద్రుని నెగడు మోము
కలువ కళలను పెదజల్లు కన్నుగవయు
చెన్ను దొరగని - తన కాలు సేతు లరయ
స్పష్ట చైతన్య మున్నది - బ్రతుకు నితడు. 538

అప్పు డప్పుడు కంపించు నతని హృదయ
గతియు - కడు హీన నిశ్వాసగతి - శరీర
కాంతి - సప్రాణు డతడని గాదె తెల్పు;
దోష శూన్యము - రాఘవా! దుఃఖ పడకు. 539

అనఘ! యీ లక్షణమ్ము లియ్యవని నెందు
ప్రాణయుతులకె నుండు - అప్రాణులకును
గలుగ వెప్పుడు - హృదయాన కలత విడుము;
నీదు తమ్ముడు బ్రతుకుట నిశ్చయమ్ము 540

ధైర్యమును రామునకు జెప్పి దరినె యున్న
హనుమ గని - నీవు ద్రోణాద్రి కనఘ! వేగ
పోయి సంజీవి గొని ప్రొద్దు పొడవకుండ
రావలయు - దాన బ్రతుకును - లక్ష్మణుండు. 541

అని సుషేణుండు దెలిపిన ననిలజుండు
పయన మయ్యెను - శ్రీరామభద్రు డంత
కౌగిలించుక బల్కె - నో కపి వరేణ్య!
అనుజు బ్రతికించి గాపాడు మర్క కులము. 542

లక్ష్మణుడు లేక లేకుండు రాముడెపుడు
తథ్యమిది - గట్టిగా నీదు తలపు నుంచి
తనయుకయె వేగ జనుచున్న - తమ్ముఁ డందు
నీవు నాక తమ్ముడవు నాకు నేటి నుండి. 543

అని హితమ్మున శ్రీరాము తనిన యతని
సోదర ప్రేమ గనుగొని - యాదరాన
జగతి చక్రము ద్రిప్పెడి చతుర్ముఖునికి
మ్రొక్కు లిడినారు కపులెల్ల ముగ్ధులగుచు. 544

# హనుమ ద్రోణగిరి కేగుట

రామునకు భక్తి హనుమ ప్రణామ మిడుచు
కార్య దీక్షయె తనువెల్ల గడలు కొనగ
హృదయమున రాము పదముల నొగి ధరించి
ద్రోణగిరి జేర - ధైర్యమ్ము తోడు గాగ 5 5

పయనమై - త్రోవ - సావార్త ప్రముఖులైన
చారు లెరిగింప - దానవ చక్రవర్తి
కార్య విఘ్నమ్ము గావింప కాలనేమి
యనెడు మాయావి నియమించె - నాతడపుడు. 546

ద్రోణ శైలమ్మునకు బోవు త్రోవయందు
కపట వనమొండు గల్పించి - కఠిన నిష్ఠ
తపము నటియించుచును వాయు తనయు కొరకు
వేచియుండెను - దనుజుండు - విషమబుద్ధి. 547

గగన మార్గాన చనుచున్న కపి వరుండు
వనము నట జూచి త్రోవను వదలితి నని
సంశయమ్ము జెంది - ముని జేరి సందియమ్ము
చెప్పగా ముని - కపటమ్ము గప్పి పుచ్చి 548

పవన తనయుడ! శ్రీరామభద్రు కార్య
మస్మదాదుల కరయ నావశ్యకమ్మె!
అనఘ ! సంజీవి కంచు ద్రోణాద్రి కరుగ
వలదు – కలదది – మత్తపోవనము నందు. 549

ఒక్క సంజీవి యేమి ? యీ మొక్కలన్ని
తనువు నిల్పెడి దివ్యౌషధములె ! దెలియు;
వనమునంగల ఫలముల తనివి దీర
దినుము – పిమ్మట సంజీవి గొనుచు – చనుము. 550

పండ్లు దిన వేళ లేదంచు పవన సుతుడు
జలము నర్థింప – మునియు విషంబు కలిపి
తన కమండల జలము లాతనికి జూప
చాల విని యనె – మునియు తత్క్షణమునందు. 551

క్రూర మకరావృతంబైన కొలను జూపి
పోయి రమ్మన నంజనీ పుత్రు డలరి
మడుపు జొరబార – నొక మహా మకర మతని
పాదమును బట్టి కోపించి భగ్గు మనుచు. 552

సూక్ష్మ తనుడయి – కడుపులో జొచ్చి – మకరి
జంపినంతనె – యది – యాకసమున కెగసి
దేవ వనితయై – తనకథ దెలిపి యామె
ఇతడు మునికాడు దనుజుడంచెరుగ బలికె. 553

పమ్మకుము వీడు మాయావి – పొమ్ము – ద్రోణ
గిరికి ననుచు కృతజ్ఞత నెరుగబలికి
"నీవలన నాదు శాపము నేడు దీరె
నంచు" దీవించి చనియె తా నమర పురికి. 554

కపి వరుండంత కినిసి - యక్కపట యతిని
వేగ దరిజేర - నాతండు విసిగి కొనుచు
"దడసితివి - కార్యభంగము - తలపు నిడక;
ధనము కాన్కగ నిడి యౌషధమును గొనుము" 555

అనవుడిదె కాన్క నీకని యనుచు హనుమ
ముష్టి బిగియించి గొనుమంచు మోదినంత
దనుజుడును పక్షిరూపమ్ము దాల్చి - హనుమ
పైన బడ - ద్రుంచె నప్పక్షి పక్షములను. 556

దనుజు డంతట సింహమై హనుమ జీల్ప
బరుగులిడి దాక - నాతడు వంతమూని
అమ్మృగేంద్ర మదము దూల్చి అవని గూల్ప
కాలనేమి సుగ్రీవుడై కానుపించి. 557

పవన సుత ! విన్ము ! సౌమిత్రి బ్రతికె - నింక
మందు పనిలేదు! రాముడు మరలి నిన్ను
వేగ రమ్మనె ; రారమ్ము ! వేగ పోయి
సమర మొనరింప వలెను రాక్షసుల తోడ. 558

అనిన మాయగా తెలిపొంది దనుజు చంప
వాని వాలాన వడి జుట్టి వాయు జుండు
గిరగిరందిప్పి భువి గొట్ట - గింజు కొనుచు
చచ్చె దనుజుండు నెత్తురు చాల గ్రక్కి. 559

## హనుమం ద్రోణగిరిని గొని వచ్చుట

విజయలక్ష్మి విరాజిత వీర హనుమ
ద్రోణగిరి మార్గమును బట్టి దొడరి చనియె;
నంత - నగ్గిరి విడిన ప్రశాంత విమల
యోషధీ గంధ మిశిత వాయువులు దగుల 560

సంతసిలి ద్రోణ శైలము నంత గాంచి
దాని నధిరోహణము చేసి - తత్క్షణమ్ము
నల నుషేణుండు చెప్పిన యట్టి మందు
నరయ దిరుగుచు గురితింప నలవి గాక. 561

పవన సుతుడు విజృంభించి - ప్రళయ కాల
మేఘ మట్టుల దిశలాక్రమించు బహుళ
తనువు దాలిచి - నమ్మహీధరము నంత
పట్టి పెకలించి తనమృదు పాణి దాల్చె. 562

పంచ భూతమ్ము లమరాళి ప్రముఖ మునులు
పవన జుని గాంచి యధిక విభ్రాంతి నొంద
కాపుగా నున్న గంధర్వగణము గూల్చి
గగన మార్గాన లంకకు గదలె వడిగ. 563

అరయ శతయోజ నాయత మైన గిరిని
కందుకము భంగి యరచేతి యందు నిలిపి
అద్భుతాద్భుత దూపాన నాకనమున
పయన మొనరించె నప్పాడప్పరమ బలుడు. 564

మార్గమున నందిగ్రామ మందు భరతు
డట్టి తరుణాన శ్రీరాము డాత్మ మెదల
నిదుర సెదర నిట్టూర్పులు నిగుడ - దుఃఖ
భరిత మతి నుండె సౌధాగ్ర భాగమందు. 565

ముడులు గట్టిన జడలతో మునిని బోలి
అరుణ వల్కలములు దాల్చి యలరు నట్టి
రాము సమ రూపుడైన భరతుని గాంచి
అనిల తనయుండు శ్రీరాము డని భ్రమించి. 566

అకట కట ! లక్ష్మణుండట – అని తలాన
దుష్ట రావణు ఘన శక్తి దూలి – మూర్ఛ
మునిగి యుండగ కపి సంఘములను బంపి
పౌరుషము ఓడి నిందకు పాత్రుడగుచు. 567

ఘనుడు శ్రీరాము డిట నుండ గలడొ? నాదు
స్వల్ప బుద్ధికినిది నిదర్శనము గాక
ఇతడు సుగుణాస్పదుండైన ఇనకులేశు
బోలి యున్నట్టి ముని యంచు బుద్ధి తలచి. 568

అప్రమత్తత నభమున నతి రయాన
జనెడు వనచర వీరుని గనుచు భరతు
డద్భుతము జెంది – పెనుభూత మని దలంచి
జంపగా నెంచి కడు వేగ శస్త్ర మూనె. 569

అరసి అశరీరవాణి ఓ భరత! ఇతడు
పరమ నిర్మలు డత్యంత భక్తి పరుడు
వానరుడు మీహితమ్మును వసుధ నెపుడు
గోరు వాడవ – విని – నాత డూరకుండె. 570

అతుల పయనింప – మార్గాన – అసుర విభుని
పంపునను వచ్చి యమ్మాల్యవంతు డెదుర
వాలమున నంత బంధించి వార్ధి ముంచి
వాని సైన్యము ద్రుంచెను వాయు సుతుడు. 571

రాక్షసులు పన్ను మాయల రామ దూత
అధిగమించుచు – విజయము నందు కొనుచు
గగన తలమున దిశలెల్ల పగుల – నార్చి;
దక్షిణాబ్ధి తటమ్మును దరియు చుండె. 572

అతని చే నున్న దివ్యౌషధాచలమ్ము
దివ్య కాంతులు విరజిమ్మె - దిశలు మెరసె
వనధి వెలుగొందె - బహు సంఖ్య వారి జాప్త
దివ్య దీధితుల్ తూరుపు దెసను నిండె. 573

సూర్య వంశజు డదిగాంచి సూర్యు డంచు
నెంచి - అర్కజు జూచి - యీ నిర్దయాత్ము
ద్రుంతు విల్లందు కొమ్మన - వింత జూచి
జాంబవంతుడు శ్రీరామ చంద్రు నరసి 574

శాంతి గొనుమయ్య - రామయ్య! స్వాంత మందు
శారతకు సూర్యు డౌ దివ్య కాంతులన్ని
ద్రోణగిరి శిఖ రౌషధీ ద్యుతు లటంచు
దెలుప - రాముండు శాంతించె - కలత బాసి. 575

అంతలో వారి కెదురుగా ననిమిషాళి
పన్నుతింపగ సౌమీరి సరభసముగ
ద్రోణ శైలమ్ము దించుచు దాశరి మ్రొక్కె
భక్తి చిప్పిల్ల శ్రీరాము పాదములకు. 576

హనుమ గనుగొని రాముండు హర్ష మంది
క్షేమ మారసి - వేగ సుషేణు బిలచి
అనఘ! సంజీవి గనలేక హనుమ యటకు
ద్రోణ పర్వతమునె దాను దోడి తెచ్చె. 577

ఇంక వనమూలికా తతి నింపు గదుర
సంగ్రహము చేసి - సౌమిత్రి - స్వాస్థ్య మొంది
పుడమి తిరుగాడ జేయుము - పుణ్యుడ పయి
వర్కకులమును గాపాడు మంచుగోరె. 578

హరి వరుంతంత రాముని కంజ లించి
మూర్ఛ మునిగిన సౌమిత్రి మోము జూచి
కపులు కొందరు తన వెంట కదలి రాగ
జేరుకొనె ద్రోణగిరి పైకి శీఘ్ర మతడు. 579

అతడు తనతోడి కపుల కయ్యదిరి - నమరు
లమృత పానమ్ము లొనరించి నట్టి తావు;
మోహినీ రూపమును జూచి మోహ వశత
చేటు దనుజులు గైకొన్న చోటు జూపె. 580

ఈశు డల పార్వతిని పెండ్లి చేసు కొనిన
తలము బలి యాగ మలరిన - స్థలము గూడ
క్షితిజ చరులకు జూపి సుషేణు డంత
జీవ మిచ్చెడి దివ్య సంజీవి దెచ్చె. 581

శాస్త్ర విధి తప్పకుండ లక్ష్మణున తపుడు
కపి చికిత్సను జేయ సాన్ప్రవ సుతుండు
లేచె నిద్రించి యప్పుడే లేచి నటుల;
భ్రాత గని రాము డుత్సాహ వంతుడాయె. 5 2

లక్ష్మణుడు మూర్ఛ దేరిన - రామ దండు
పటుతరోత్సాహ ముప్పొంగ - ప్రబలు లగుచు
శైల గుహల ప్రతిధ్వనుల్ చెలగు నటుల
సింహ నిస్వనముల నంత జేసి నారు. 583

పవన సుతునంత గని రామభద్రు డతని
నమిత గతి గౌరవించుచు - ననఘ! గిరిని
తొంటి చోటించు మనిన వాతూల సుతుడు
వేడ్క నటు జేసె నెల్లరు వెలుగు వడగ. 584

# పాతాళ హోమము

తరుచరులు జేయు సింహ నాదములు వినుచు
గుండె దిటవును గోల్పోయి - గుబులు చెంది
దనుజ నాధుడు శుక్రుని యనుమతమున
నియతి పాతాళ హోమంబు నెరపు చుండె. 585

శక్తి గల కంచు రథములు శస్త్రచయము
కంచు కవచము - గుఱ్ఱాలు - కంచు ధనువు
నొందగా నిష్టమెయి వీతిహోత్రు గూర్చి
సవన రతుడయ్యె దానవ చక్రవర్తి. 586

సవనధూమము చెలరేగి చదలునిండి
చీకటులు గ్రమ్మి వెలుగులు చిక్కిపోవ
గాంచి శ్రీరాము డాశ్చర్య గతి వహించి
అవ్విభీషణు బ్రశ్నింప నాతడపుడు 587

ఆర్య! విధి ప్రేరితాత్ముడై - అన్ని యుడిగి
వితత భయమున దానవ విభుడు పూని
నిష్ట పాతాళ హోమమ్ము నెరపు చుండె
దాని పొగ మేఘముల భంగి - ధరణి గప్పె. 588

అనఘ! శుక్రను మతిని మాయన్న దీని
నిష్టమెయి మంత్రయుతముగ - నియతి తోడ
జయము నొనగూర్చ - ఘనతర శక్తులంద
జేయు చుండె; నయ్యది పూర్తి చేసెనేని. 589

వనజ భవుడైన గెలువగా వలను పడని
దివ్య శస్త్రాస్త్ర చయములు - దివ్యరథము
దివ్య కవచము - సమరాన దిగ్విజయము;
కోరి యొనగూడు - నతడు యకుంఠు డగును. 590

కలన నాతని నెదిరించి గెలువ లేము;
కాన పాతాళ హోమ విఘ్న మొనర్ప
బలము కలిగిన కపులను బంపవలెప్పు!
అని విభీషణు డెఱిగింప నర్కకులుడు. 591

వాలి తనయుని - సుగ్రీవు - వాయు సుతుని
నల - గవాక్షుల భల్లూకనాధ ముఖ్య
హితుల - సైన్యాలతో నంప - వేగి - వారు
శత విధమ్ముల రావణు క్రతువు చెరుప. 592

యత్న మొనరింప - వారి ప్రయత్నములను
చలన మొందక - హోమమ్ము సలుపు చుండె
మనసు నొవ్వగ వారెన్ని మాట లాడ
తట్ట నటు రావణుడు తన పనిని మునిగె. 593

అర్కజుడు రావణుడు విన ననియె నిటుల
రాక్షసేశ్వర! యీగతి రణము వీడి
తాపసుల రీతి - నిజ మగతనము వదలి
చేయు చుంటివి - క్రతువును - సిగ్గు చేటు. 594

శక్తిగల మేటి వీరులు చచ్చు వరకు
వీడగా బోరు రణభూమి వీడితీవు ;
హోమ మొనరింప నేముండె! ధూమ మొండె!
రమ్ము! మగవాడవై రణ రంగమునకు. 595

ఎంత కవ్వించినను దనుజేంద్రు డెడద
చలన మందక - ఘన తపో జలధి మునిగి
మంత్రముల నుచ్చరించుచు - మహిత దీక్ష
వేల్చు నగ్నిని - ధీర గంభీర మతిని. 596

దంభమున రావణుడు శిలా స్థంభ మటుల
సనల వేదిక కడ స్థిరా సనుడు నగుచు
హోమ మొనరింప వాలి తనూభవుండు
నరిగె నప్పుడె సురవైరి యంతి పురికి. 597

తత్క్షణము పోయి - దానవ ధరణి వణక
తీవ్ర గతిని మండోదరీ దేవి జేరి
జుట్టు చేపట్టి యీడ్చుచు నెట్టి నెట్టి
దనుజ పతి మ్రోల నుంచె పాతాళ గుహను. 598

కనులు మూసి జపమ్మున మునిగి యున్న
ముని విధమ్మున నున్న రావణుని - జూచి;
అంగదుండనె - రావణా! అవని సుతను
పతి దరిని లేని సమయాన బట్టి తీవు. 599

తస్కరుడ గాక నీదు బాంధవులు - హితులు
మంత్రులును సర్వ సైన్య సామంతజనము
లెల్లరును చూచు చుండ నీయింతి బట్టి
బల్మి దెచ్చితి నిదె చూడు పాప యుతుడ! 600

పరమ సాధ్వి మండోదరి భర్త నంత
గనుచు నిటు బల్కి నేడ్చుచు - కపి వచించు
పల్కులకు నీకు లజ్జ కోపమ్ము గలుగ
దేలకో నాథ! యీ యజ్ఞ మేల నింక. 601

పరులు స్పృశియింపగా రాని ప్రకృతి నైన
నన్ను - బల్మిని బట్టి వనాటు కతుల
సాహసము జూపె - నీవు - నిశాచరేంద్ర
పట్టనటు లూరకుంటివి పరువె? తలప 602

శక్రజితు వంటి ఘనవీర సాహసులను
గనిన తల్లిని నేను – నాగతి కనంగ
దారుణమ్మాయె – నిక్కపి ధాటి మాన్పి
నెవడు గాపాడు వో దనుజేంద్ర ! నన్ను. 603

మయ తనూజను – నీ వట్టి మహిషి నేను;
నన్ను నొక యల్పు డీ గతి నయము వీడి
కేశ పాశము చే బట్టి కీడు పెల్ల
రవ హసింపగ నీడ్చి నన్నదర జేసె 604

ఇదియె నీదగు ఘనకీర్తి! యిటకు మున్నె
రామ నృపసుతు డాది నారాయణుండు
కపులె సురలని నీకు విన్నపము సేస్తి;
చెవిని నిడవైతి – నేడిట్టి చేటు వచ్చె. 605

రామ బంటులు నను బెట్టు బాము లన్ని
భవ్యముగ దోచెనా నీకు - ప్రాణ నాథ!
భార్య మానము – జూడ గాపాడ లేని
వాడు మగతనమే లేని వాడు గాడె? 606

దనుజ నాథ! యీ ముని వృత్తి దాల్చు కంటె
రాము నెదిరించి ఘోర సంగ్రామ సీమ
చచ్చుటే మేలు – యోచింప – స్వర్గ మొదవు!
అరిని జంపుటో చచ్చుటో అవని మిన్న. 607

అని వచించుచు దైన్య మానసము గ్రమ్మ
వెక్కి వెక్కి యేడ్చెడి భార్య దిక్కు జూచి
లజ్జ చెంది – మహోగ్రుడై రావణుండు
వడిని వావర గుంపుపై బడిన యంత. 608

పోరి అగచరు లా రామభద్రు జేరి
విశదముగ యజ్ఞ విచ్ఛిన్న విధము దెలిపి
సంతసిల జేయ రాముండు శాంతి జెందె;
నంత నిజ దర్ప ముడిగిన నసుర విభుడు. 609

హోమ విఘ్నమ్ము నకు చింత నొంది – నిజ స
తీమణిని – యూరడిల జేసి తీవ్ర కోప
మానసుండయి – నిక్ష్వాకు మహిప సుతుల
నెదిరి – తుదముట్ట జేయగా నెడద నెంచి. 610

కొలువు కూటము వడిజేరి విలువ గలుగు
సకల మణి భూషణమ్ములు – చల్లనైన
గంధ మాల్యాంబ రాదుల గలయ దాల్చి
తనరి – రణభేరి వేయించె దశముఖుండు. 611

రోషమడర వృశ్చిక ఖడ్గ రోము – డగ్ని
వర్ణుడును సర్ప రోముండు బయలు వెడల
ధనువు లిరువది చేతుల దాల్చి మెరసి
రథము నధిరోహణము చేసె రావణుండు. 612

# రావణుని చివరి యుద్ధము

బూర గొమ్ములు – డప్పులు – వీరణములు
తమ్మటలు శంఖ భేరీ మృదంగ కాహ
ళాది పలు యుద్ధ వాద్యము అవని నిండ
బయలు వెడలె రావణు డంత బవరమునకు. 613

వంది మాగధు లిడెడు కైవార ములకు
వీర రస మొల్కు భీకరాకార మెలమి
దాల్చెనో యన – ధైర్యాన దైత్య విభుడు
దరిసె రణభూమి పదునాల్గు ధరణు లదర. 614

దనుజ విభు గాంచి తడబడె తారకాది
సకల గ్రహములు - దిక్పాలు రఖిల మునులు;
భానుకులుడంత రోషము పైకొనంగ
సకల కపిసైన - సైన్యాధి పతుల జూచి. 615

అసుర వాహినులను దాక నానతిడిన
అర్కజుడు ముందు నడచెను - నఖిల కపులు
తరులతో గిరులతో భుజా దర్ప మడర
దాకి రసురుల - జగములు తల్లడిల్ల. 616

ఘోర మగు పోరు నిరుతెగ వారలకును
జరిగె నప్పుడు - నక్కపి వరులు రేగి
తరులు గిరులును పాషాణ తతులు విసరి
ఉక్కడంచిరి దనుజుల నొక్క పెట్టు. 617

వానరుల ధాటి కంత రావణుని సైన్య
మదరి పరుగిడ - రావణు డదర వలద
టంచు - ధైర్యమ్ము పురి గొల్పు నంతలోన
వాయు సూనుండు వచ్చె రావణుని దాక 618

ఖడ్గరోముండు - మారుతింగాంచి - మిగుల
పౌరుషము మీర తనతోడ చివర మాడ
రమ్ము రమ్మంచు తొడగొట్టి రాముబంటు
పర్వతమ్మొండు వానిపై బడగ విసరె. 619

సర్పరోముండు - తప్పుక - సాహసాన
హనుమ పైబడ రా వాలితనయు డడ్డి
ముక్కు ధూలము వగులగా మొత్తి నంత
సర్పరోము డుదగ్రుడై సత్వరమ్మె. 620

వాలి సుతు మోము చెక్కలై తూలి పోవ
తన్ని నంతనె – యార్చి – రథమ్ము దూల్చి
అంగదుడు కొండతో వాని నదర గొట్టి
ధరణిపై గూలె నా క్రూర దనుజు డపుడు. 621

కినిసి వృశ్చికరోముండు గీలు కొనుచు
నిర్భయంబుగ వడిదాకె నీలు నపుడు
చిటికెలో వాని గర్వము చెదర జేసి
నేల దూలగ దన్నె నా నీలు డడరి. 622

వాడు చచ్చుట గని –అగ్నివర్ణుడంత
మేన బహు వహ్ని శిఖలను మెండు కొనుచు
బహుళమై మండ శ్రీరామభద్రు దాకె
వాని రాముండు చిటికెలో వసుధ గూల్చె. 623

అసుర భటవరు లీరీతి నవని గూల
శాంతమును రోసి దానవ చక్రవర్తి
భీషణోదగ్ర మూర్తియై రోషమురల
రథము రాముని జేర్ప సారధికి జెప్పె. 624

సారథటు లొనరింప రాక్షస విభుండు
పట్టగా రాని కోపాన ప్రజ్వరిల్లి
ప్రళయ మేఘార్భటిని రామ భద్రు తోడ
పలికె నీరీతి నరదంబు పైన నిలచి. 625

రావణుని తోడి యుద్ధమో రామ! వినుము
అలి తోడ నాటలు గా వడవు లందు,
ప్రబల బలమున దిక్పాలవరుల గెల్చి
బానిసల జేసి నట్టి రావణుడ . నేను! 626

కాయ గసురులు మెసపెడి కపులు – నేడు
నిన్ను గాపాడగా రామ ! నేర రిచట ;
ధీరమును వీడి – రణభూమి బారి – వనుల
దూరకుము నవ్వుదురు గాదె – భీరుడవని. 627

అనుచు విల్లెక్కు పెట్టి నయ్యసుర విభుడు
ప్రళయ మౌర్వీనినాదమ్ము ప్రబల జేసి
శరము సంధించి రాముని శక్తి కొలది
నేయ నెంచెడి వేళ – దేవేంద్రు డంత. 628

రథముపై రావణుండుండ – రాము నృపతి
పుడమి నిలుచుచు నతనితో పోరు సలుప
ననుచితమ్మని – మదినెంచి – అతి రయాన
రథము – శస్త్రాదు లిచ్చి సారథిని బంపె. 629

వానితో వేగ మాతలి వచ్చి – రామ
భద్రునకు మ్రొక్కి – ఇంద్రుండు బంపె ననగ
నంతసము నొంది శ్రీరామ చంద్రుడంత
నస్త్ర శస్త్రాదులను ధాల్చి – అరద మెక్కె. 630

అమరు లాకశమున నిల్చి యట్టె జూడ
పూల జల్లులు దివినుండి లీల గురియ
కపుల జయజయ ధ్వనులు లోకముల నిండ
రథము నధిరోహణము చేసె రామమూర్తి 631

గిరిని గిరియును – ధరణిని ధరణి – మరియు
జలధి జలధిని దార్కొని చెలగు నటుల
నసుర వైరియు సురవైరి – యతుల ఘోర
యుద్ధ మొనరింప దొడగి రత్యుగ్ర శక్తి. 632

భండనమ్మున రాము డుద్దండ లీల
రాక్షసాధిపు డేయు శస్త్రముల ద్రుంచి
ప్రతి శరమ్ములు సంధించి - ప్రతిభ జూపి
వివిధ శరముల దనుజు నావేశ ముడిపె. 633

అంతకును మున్ను యుద్ధమ్ము లవని నెన్నొ
జరిగె పలుమారులైన - యీ సమర మరయ
గణుతి గాంచెడి దని సురగణము లెల్ల
రుభయ బలముల బొగడిరి నభము నుండి. 634

వింటి గర్జన లురుములై - విపుల శక్తి
దీప్త శరములు మెరుపులై - దెగుచు పడెడి
మణి గణాదులు చినుకులై - మహిని చెలగ
ధరణి గన వాన కాలము తలపు వచ్చె. 635

పంక్తి కంఠుడనంత కోపము వహించి
దేవ గంధర్వ శరము సంధించి తిగిచి
రామభద్రునిపైన విక్రమము మెరయ
వేసియార్చెను, దిగ్దంతి వీను లదర. 636

ఆతురత లేక రాము డయ్యదను నందె
ప్రతిశరమ్మేసి తద్బాణ గతి మరల్చి
ద్రుంచె తత్క్షణ మదిగాంచి దుష్ట దనుజు
డమిత రోషాన మంత్రితాస్త్రమును - తిగిచె. 637

ఆశరమ్మున జనియించె - నగణితమ్ము
లగుచు - ఘన సర్పజాల- మయ్యవసరమున
రామ డతివేగ గారుడాస్త్రమ్ము దూసి
కుప్ప గూల్చెను పాముల నప్పు డపుడె. 638

అదియు వ్యర్థయయి కడు వేగ మవని డుల్ల
దనుజు డత్యుగ్ర హృదయుడై – ధర కలంగ
చేతి శూలము మంత్రించి శీఘ్ర మేయు
రామునిందాకె నది నిప్పు రాల్చు కొంచు. 639

రాము డా శూలము న్ద్రుంప – రహి వహించి
త్రిదశ ప్రభు డొసంగిన శక్తి దీసి యేసె;
బొదలుచును నేగి –యది – దూల్చె భువన మదర
దనుజ శూలము – యది గాంచి దశముఖుండు. 640

ఉగ్రతర రూపుడై మహోదగ్ర గతుల
విశిఖములు వింట సంధించి విడచు చుండ
చకిత మందక – తేజాన శరము లన్ని
నేల దూల్చెను రాముండు నేర్పు మెరసి. 641

సూటిగాని పది తలల కిరీటములను
నేల పడజేసి దనుజుని నెత్తి పగుల
శరము లేసిన – దనుజుండు కరము కినుక
రాము నదలించె వేయి బాణములు వేసి 642

రావణుండేయు బాణాల రామ విభుని
తనువు నిలువెల్ల జీలి రక్తములు పార
నరుణ కాంతుల నస్త్రాద్రి నధివసించు
భానుడో యన దోచె నబ్జాను కులుడు. 643

అంత రఘువరు డలిగి యత్యంత శక్తి
బాణ వృష్టిని గురియించె – పంక్తి ముఖుడు
కాలు – చెయి – వ్రేళ్లు – కదలక కట్టె వోలె
మేను వాలిచి నరదము మీద వోలె. 644

సూతు డక్కాల కేతుండు సుకృత బుద్ధి
రావణుని ప్రాణములు నిల్ప - రథము నంత
కొంత దూరము గొంపోయె - కొంత వడికి
కోలుకొని రావణుడు తీవ్ర కోప మంది. 645

అతుల బలశాలి రావణుడరుల కోడి
కదనమును వీడె నను నపఖ్యాతి నాకు
గలుగ జేసితి వనినంత - కాలకేతు
డసుర విభుగాంచి వినయాన ననియె నిట్లు 646

అలసితివి నీవు నీక్షేమ మరయ వలసి
నట్టి బాధ్యత నాయందు నలరు కర్తవ్య
కొంత విశ్రాంతి నీకును గుఱ్ఱములకు
కలుగజేయగ వీడితి కదన భూమి. 647

ప్రాజ్ఞుడగు సూతు డెప్పుడు రథుని క్షేమ
మరయు - నిది ధర్మ మగుట - నీ వరుల బాణ
ఘాతముల మూర్ఛలో మున్గు కారణమున
దెప్పరిల జేయ నిచటికి దెచ్చినాడ; 648

ఇదియె నా దోసమైన నో ఇంద్ర వైరి
నన్ను శిక్షింపు మనినంత ఖిన్ను డగుచు
రథము వేవేగ నడపుము రాము డాక
ననుటయును కాలకేతు డా నటులొనర్చె. 649

## అగస్త్య మహాముని వచ్చి - శ్రీరామునకు ఆదిత్య హృదయము నుపదేశించుట

రామ రావణ ఘోర సంగ్రామ మరయ
బహుకుతూహలు లై ముని వరు డగస్త్యు
డమరులను గూడి బహుళ శ్రద్ధ నాకసమున
నుండి యుద్ధమ్ము తిలకించుచుండు వేళ. 650

రావణుని గొని సూతుండు - రణము వీడి
చనిన యంత మహాముని - జయము గూర్చి
చింత మునిగిన రాముని జేరి యధిక
వత్సలత పొందె విజయ సంప్రాప్తి కొరకు. 651

మంత్ర ముపదేశ మొనర్ప మౌని వరుడు
ముదితుడై రామచంద్రుని ముందు నిలచి
రామ! రామ! మహాబాహు; రమ్య చరిత!
విను సనాతన మగు మంత్రమును వచింతు. 652

సూర్య మండలాతర్యామి - ఆర్య వినుత!
పరమ పురుషుడు మూలమై బరగు నట్టి
దివ్యమగు మంత్రరాజ "మాదిత్యహృదయ"
మిపుడు నీకు పదేశింప నెంచి దలంచి. 653

వచ్చినాడను; శుచివయి వచ్చి తేని
మంత్ర ముపదేశ మొనరింతు - మహిత శక్తి
పఠన మొనరించి ముమ్మారు పలికి తేని
కార్య సిద్ధియు - విజయము - కలుగు - రామ! 654

ఉత్తమమ్మిది -చూడ నాయుష్కరమ్ము
శోక చింతా ప్రశమనమ్ము - శుభద - మఖిల
పాప హరణమ్ము - పటు వీర్య వర్ధనమ్ము
తాప నాశమ్ము బహుళ ప్రతాప యుతము. 655

రామ! యీమంత్ర మహిమచే రావణుండు
ఘోర సంగ్రామ రంగాన గూలు - నిజము!
నిష్ఠ మెయి దీని పఠియింప - నిఖిల లోక
కారకుడు - భాస్కరుడు - శుభంకరుడు నగును. 656

బ్రహ్మ విష్ణు స్వరూపుండు - పరమ పురుషు
డాది శంకరు - డఖిల గ్రహాదులకును
జన్మ సంస్థానుడు పరమేశ్వరుడు - నతడు
ధరణి కాధార భూతుండు - తాత్వికుండు. 657

సకల భూత శరణ్యుడై - సకల మగుచు
నిఖిల మునిగణ హృదయుడై - నిత్యుడగుచు
పంచ భూతాత్మ కుండయి - పవలు రేయి
జగము గాపాడు చుండెడి శంభు వితడు. 658

అల హిరణ్య గర్భుండును అంశు మాలి
ద్యుపతి - సుమరీచి - యజనుండు - ద్యుతికరుండు
వేద వేదాంగ హృదయు సంవేది - తిమిర
హరుడు - హరిదశ్వ రథమున నరుగు నతడె. 659

అశ్వినులు - సాధ్యులును - సహస్రార్చి - త్వష్ట
తపన శిశిర రవులును - మార్తాండు - డగ్ని
గర్భు - డదితి సుతుడు - దివాకరుడు - మరుడు
శిశిర నాశను - డగ్నియు - శశి యితండె. 660

ప్రణవ నాదాది దేవుడు - భాస్కరుండు
అష్ట దిక్పతుల్ తానౌచు నలరు ఘనుడు
ద్వాదశాత్ముండు నఖిలమౌ తారకలకు
పతియు - విశ్వాత్ముడును - గ్రహపతి యతండె. 661

మహితు డాతడె - పదునాల్గు మనువు లతడె
అగ్ని - వాయువు - నాకాశ - మవని - జలము
లన్నియును తానెయై జగమంత నిండు
సకల ఋతుకర్త - అనితరసాధ్యు డతడె. 662

జగము సృజియించు వాడు _ మఃజ్జగము గూల్చు
విలయ ప్రళయకాల కాలుండు _ విషయ భోక్త
జగములకు ప్రేరకుడు కర్మ జరుపు వాడు
విజయమును మోక్షమును గూర్చు_విభుతతండు. 663

బాంధవుడు _ శాత్రవుడు _ మృత్యు బంధములకు
బాధ్యు డాద్యుఁడు _ సవశిభా భాసమాన
విశ్వ హృదయుడు _ పదునాల్గు విశ్వములకు
జీవ నాడి _ వెలుంగుల _ జీవగఱ్ఱ. 664

జ్ఞాన మొందవించు వష్టావధాని యతడు
దేవ దానవ పూజ్యుండు _ దివ్యమైన
స్వర్ణ ధుచ్చి కిరణమ్ముల _ సర్వ జగము
దివ్య తేజో మయము చేయు _ దీప్తు డతడు. 665

సర్వ దేవాత్మకుండును _ సకల లోక
పావనుడు _ తన్ను నమ్మిన పరమ జనుల
బ్రహ్మ లోకము జేర్చు సత్ప్రభు వతండు
అతడున్లేనిదె _ లేదేది _ యనని ననుచు. 666

మహిత బీజాక్ష రాన్విత _ మంత్రరాజ
మతడు కరుణ రాముననును నవ్వు దషడె
శక్తి నుపదేశ మొనరించి చనిన పిదప
రాము డతినిష్ఠ తాను మంత్రమ్ము నెరిగి 667

ధ్యాన మొనరించి _ సద్భక్తి _ తపను గొల్చె
పూని ముమ్మారు నతి శుచిర్భూతు డగుచు
పిదప నాదిత్యు వీక్షించి _ ప్రియుత ప్రమొక్కి
అస్త్ర శస్త్రమ్ము లిరు చేతు లందు దాల్చె. 668

# రావణవధ

తన్నెదుర్కొన వలగొను దనుజ విభుని
కాంచ నాంచిత రథమును గాంచి -రాము
డప్రమత్తత - మాతలి నరసి - రథము
జూపి - భద్రత దెల్పుచు -చాప మూని 669

"దాని దాకగ మన యరదమ్ము నిపుడె
తోలు" మని శక్ర సూతునితో వచించి
ఎన్నియో ఘోర యుద్ధమ్ము లెరుగు నీకు
భద్రతలు చెప్పుటలు నాకు పాడి గాదు. 670

అమర విభు నంతవానికి - ఆ సురాసు
రులకు జరిగిన ఘనయుద్ధములను - తేరు
దోలినట్టి చతురుడ వీ వేళ నాకు
సారథిగ నుంటి వది యెంతొ సంతసమని. 671

చతురతను రాఘవుండప్డు శక్ర సూతు
ఘనత గొనియాడ - నాతడు కడు సమర్థ
గతిని -నరి స్యందనము నిజ గతులు దప్ప
రహిని రథ ఘంటికలు మ్రోయ రథము నడిపె. 672

అది కనుంగొని దివిజ కులాంతకుండు
తామ్ర విస్ఫారితాక్షుడై - ధరణి వణక
శాత శరముల నారామచంద్రు నేయ
తీవ్రతర కోపమున భూరి తేజుడగుచు 673

రయమునన్ రామచంద్రు డైంద్రాసుగమును
సజ్యమొనరించి - తిరమగు శక్తి విడువ
దనుజ పతి తీవ్రతర శస్త్ర దర్ప ముడుప
ఆ శరజ్వాల లాకాశ మంటు కొనియె. 674

రామ రావణు లుగ్ర సంగ్రామ సీమ
దాకి సింగంబు లట్లు యుద్ధమ్మొనర్ప
సమర వీక్షణ కాంక్ష నయ్యమరులు దివి
బార్లు దీరిరి నుత్సాహ భరితు లగుచు. 675

అట్టి తరి - రావణుని నాశ మవని దెల్పు
దారుణోత్పాతములు దోచె - ధరణి వణకె;
రక్త వర్షము రావణు రథముపైన
గురిసె - గ్రద్దలు వినువీధి - గుంపు గట్టె. 676

తోరణమ్ముల పొడసూపె తోక చుక్క
లెన్నియో నాడు లంకపై నీసు బూని
ఉల్కలమ్ములు రాలె మహోగ్ర గతిని
నక్క కూతలు మెండయ్యె - దిక్కులదరె. 677

విజయ సూచకముగ రామ విభుని దెసను
శుభ నిమిత్తంబు లెన్నియో చూడ నాయె
ఉత్తమగతిమైన శుభ సూచనాళి దలచి
పరమ సంతృప్తి రాముడు పరవశించె. 6 8

పటుతరోత్సాహుడై రామభద్రు డంత
జయ జిగీషను - రావణు శత్రుడుడుప
నుగ్ర కోదండ ధారియై నూర్పు లలర
వీర రస మూర్తియై రణ వీధి దోచె. 679

రావణుండంత క్రూర నారాచములను
దశరథాత్మజు నొప్పింప - తత్క్షణమ్ము
శిత శిలీముఖ జ్వాలల - సింహ బలుడు
రావణుని నొవ్వ జేసె విరామ మిడక, 680

ఘోరమగు ద్వంద్వ యుద్ధ మా వీరువరుల
కపుడు వర్తిల్లె భువనము లదరు నటుల
చేష్టలను దక్కి నిరుపైపు సేన లన్ని
వారి యుద్ధాన నుత్సాహ వంతు లైరి. 681

రోష భీషణ వదనుడై రోజుచున్న
దనుజ విభుగాంచి శ్రీరామ ధరణి ధవుడు
ద్విగుణితోత్సాహ వంతుడై - ధీరమతిని
పలికె నీరీతి రావణు డులికి పడగ. 682

అతుల బలశాలి నంచు నీమతి దలంచి
విఱ్ఱవీగుచు నుంటి వీ వేళ నిన్ను
కదన రంగాన నే గూల్తు - కంజభవుడె
నిన్ను గాపాడ లేడిది నిశ్చయమ్ము. 683

అష్ట దిక్పాల వరులను నాల మందు
నోర్చి జయమందితి వి గాక - యోర్వ గలవె?
మేరు నగధీరు - రణశూరు - మేటి వీరు
మేఘ గంభీరు నీ రామ మేదినీశు. 684

జయము గొన నీదు తరమె? ఓచపల బుద్ధి!
సాధ్వు లగు స్త్రీల చెరబట్టి - సతము జపము
సలుపు మునులను బాధించి - సాహసమ్మ
టంచు - దలచుట గన నాత్మ వంచనమ్మె. 685

నీ ప్రాసటి ప్రాలు హరియింప - నేడు - రామ
బాణ మియ్యెడ సిద్ధమై ప్రబలి యుండ
బయట బడి - భూమిపై నీవు బ్రతుకగలవె?
అనిని గెల్చుట నీయడి యాస గాక. 686

కాలుడదె కన్ను గిటెను - కాల మిపుడు
చేరువైనది - నీ మేన చెమట పట్టె
మహిత రాక్షస వీరులు మంత్రి వర్యు
లందరును ఘోర యుద్ధాల హతులు పైరి. 687

అని వచించెడు శ్రీరాము నరసి - దనుజ
పతియు - భూరి ప్రతాప దంభమ్ము లేల?
మాట లేటికి? రణభూమి మన బలమ్ము
సురలు - జనములు - మునులును చూడరొక్కొ? 688

వేయి మాట లవేల? యీ వేళ రామ!
బ్రహ్మ రుద్రులు నిట నడ్డు పడిన గూడ
విడువ నిన్ను నీతమ్ముని - విజయ మంద
కుండ - రణభూమి విడువ గైకొంటి ప్రతిన. 689

అనుచు రావణు డుగ్రుడై - ధనువు దాల్చ
రాముడును శాంతమును వీడి - రాజసమ్ము
పొంగి పొరలగ - తీవ్రుడై - పోరు సల్ప
సిద్ధ మైనంత - నిరువురు యోద్ధ లపుడు. 690

గగనమున సిద్ధ - గంధర్వ గణము లాది
సురలు గుమికూడి చోద్యము చూచు చుండ
రేయి పగలనకయె వారు రెచ్చి - రెచ్చి
ఏడు దినములు పోరాడి రీర్ష్య బూని 691

ఉగ్ర శరము లేయుచు రాము డుర్వి పైన
దనుజు శిరములు తెగ వేయ - దైత్య విభుడు
మరల మొలచు శిరములతో - మహి వణంక
చేసె రామునితో కడు చిత్రరణము. 692

తలలు మొలచుట గని రామ ధరణి ధవుడు
విస్మయము జెంద - నంత - విభీషణుండు
సంజ్ఞచే జూపె - తనయన్న సతము నాభి
నిమ్ముగా దాల్చు నమృత భాండమ్ము నపుడు. 693

వజ్రి వ్వరిలి దేవ గంధర్వ ప్రభృతు లలర
అగ్ని బాణమ్ము - రాముడు నమర వైరి
నాభి భాగాన నేయ - నా నాభి నున్న
అమృత భాండ మహత్వమ్ము నంత మొందె. 694

అమృత భాండము తెగిపోయినంత తలలు
మరల నొక నూట తొమ్మిది మార్లు మొలచె;
తలలు పిమ్మట మొలచుట తప్పిపోయె
నంత దనుజాకృతియు కడు వింత గొలిపె. 695

అయిన పౌరుషమును వీడ కసుర భర్త
మహిత సాయకముల దూసి - మంత్ర మూది
దీక్షగొని వేయ రాముని దీప్తి ముందు
నన్నియును నిష్ఫలమ్ములై అవని డుల్లె. 69

బాణములు నిష్ఫలమ్ములై బరగి నంత
తాల్మి నశియించి కుపితుడై - దనుజ పతియు
వేయి ఘన శాత శరములు విడచి నంత
కంతలై రాము మేన రక్తములు చిందె. 697

అయిన చలియింపకుండ రామావనీంద్రు
డతి నిశాత శరమ్ముల నసురు నేయ
నసురుడును దీప్త శరములు నప్పుడెసె
నవియు నివియును పెనగెను నాకసమున. 668

గగనమున నున్న సుర ముని గణము లెల్ల
నెన్న డిట్టి దురంబును నెరుగ మంచు
చటుల భయమున నాశ్చర్య చకితు లగుచు
సన్నుతించిరి వారల సత్వ మెంచి. 699

రాము డంతట – మున్ను – విరాధుడాది
క్రూర దనుజుల పుడమిపై గూల్చి నట్టి
తీవ్ర శరముల వడిదూసి – దివిజ వైరి
మీద శరవృష్టి గురియించె – మేరు వదుర. 700

పరిగణింపక దనుజుండు బాహు వటిమ
నద్భుతమ్మగు గద – తోమ రాది – వివిధ
ఆయుధమ్ముల శ్రీరాము నలయ జేసి
నంత రాముడు చింతించు నవసరమున. 701

సురవరాధిపు సారధి – పరమ పురుషు
విజయమును గోరు వాడయి – వినయముట్ట
సర్వ మెరిగిన రామ! యీ సమయ మందు
నే మెరుంగని యట్లు చరింతు వేమి? 702

కాలమును వ్యర్థ పుచ్చక – కడు రయాన
నతుల భీకర కమలాసనాస్త్ర మేసి
దనుజు గూల్పుము – కాలమ్ము దగ్గరాయె
నితనికని చెప్పి మాతలి హితము దెలిపె. 703

అనిమిషాధిపు సారధి యట్లు బలుక
మరచి నట్టుల నటియించి, మహిమ దలచి
పరమ కౌతుక మతియయి – భానుకులుడు
ఘనతరమ్మగు మోదమ్ము గడలు కొనగ. 704

భువనముల సృష్టి కంటెను భూరితర ప్ర
యత్నమున - బ్రహ్మ నిర్మించి - యఖిలలోక
విజయ కాంక్షితుడౌ సుర విభునకిడిన
యా మహాస్త్రమె బ్రహ్మాస్త్ర మన బరంగు. 705

లోక శాంతిని వాంఛించి ప్రాకటముగ
నాడ గస్త్యుండు నిడె మేలు చూడగోరి
అట్టి బ్రహ్మాస్త్రమును దూసి - అవని నాథ
తనయు డామంత్రణము చేసి దాల్చె నంత. 706

వసుధ కంపించె - కులగిరుల్ వడ వడంకె
నంబు నిధు లేడు సంక్షోభ మందె - దివము
పగుల బడినట్టు లయి భయ పడిరి సురలు
రాము డొనరించు కోదండ రవము వినుచు. 707

ప్రళయ కాలాగ్ని రుద్రుడై ప్రబలి రాము
డరి భయంకర మైన బ్రహ్మాస్త్రమపుడు
మంత్రము జపించి - బ్రహ్మను మతి దలంచి
ధనువు సవరించి విడచె నద్దనుజు పైన. 708

అమ్మహాస్త్రము శీఘ్ర మా అసుర విభుని
వక్షమును జీల్చి నమరుల కక్ష దీర
ప్రాణములు తీసివేగ - దిగ్భ్రాంతి తొలగి
సకల జగములు సంతోష జలధి మునిగె. 709

పరిణతమ్మైన కరి పధ్రివ్వ బడిన యట్లు
కుల నగంబొండు పుడమి పై గూలి నట్లు
మాష ధాన్యము రాసిగా పోసి నట్లు
పంక్తి కంఠుడు ధరణి పై వ్రాలి పడియె. 710

అంబరము చిల్లు పడి దిక్కు లదరునటుల
దాశరథి యంత సింహనాదంబొనర్చె.
ప్రస్తుతించిరి ముదమంది వానరాళి
దివ్య సుమములు గురిసిరి దేవగణము. 711

అసుర నాథుండు కూలిన అవసరమున
నసుర బాధలు నేటితో నణగె నంచు
అవని జనములు – వరమును అమర వరులు
పట్టగా రాని ఆనంద భరితు లైరి. 712

లోక కంటకు డయి –మూడు లోకములకు
కీడొనర్చిన రావణు గీటడంచి
నట్టి రాముని దరిజేరి – అర్క తనయు
డాది వీరులు పూజించి రాత్మ పొంగి. 713

## విభీషణాదుల విచారము

అన్న మరణము గాంచుచు – ఖిన్ను డగుచు
తీవ్ర తర దుఃఖితుండయి – దిశలు వగుల
నన్న పదములపై వ్రాలి –నార్త జెంది
వెక్కి వెక్కుచు నేడ్చె విభీషణుండు. 714

అకట! సకల ప్రపంచమ్ము నని జయించి
మేటి వీరుల కెల్లను మేటి వగుచు
దానవాగ్రేసరుడ వయి దనరు – నీవు
నేటి కిటులైతి వన్న! నే నేమ నందు. 715

బాల భాస్కర కాంతుల లీల – దివ్య
మణి గణాంచిత నవరత్న మయము నగుచు
దిశలు వెలుగంగ జేయు నీదివ్య – ఘన –సు
వర్ణ మకుటమ్ము దిగొ! నేడు వసుధ బడియె. 716

వలదు యుద్ధము - మనవైరి బలుడు - గాన
నతని సతి సీత నిప్పుడీ వతని కిడుట
క్షేమమని యెంత జెప్పిన చెవిని నిడక
చేటు కొని తెచ్చు కొంటి వీ పూట - నిటుల. 717

ఈ విధమ్మున విలపించు నా విభీష
ణాఖ్యు గనుగొని - రాఘవుడనునయించి
పంచతను దొందినను తవ భ్రాత ప్రతికి
యుండును - స్వశౌర్య ధైర్య ధీయుక్తి చేసి. 718

అనుచు నూరడిలగ జేసి - అసుర మృత - శ
రీరమును గాంచి - రఘుకుల వీరు డంత
పుష్పమాలను నటనుంచె - పూజ్యగతిని
శూర రావణు గౌరవ సూచకముగ. 719

రాముడు విభీషణాఖ్యు చేరంగ బిల్చి
రావణున కూర్ధ్వలోక సంభావయోగ్య
గతులు కలుగగ కర్మ సంస్కార తతులు;
సలుపు మనుచు బోధించె విజ్ఞాన ప్రభువు. 720

## రావణుని రాణుల ఆక్రందన

రాముచే రావణుడు రణ రంగమందు
నిహతుడై పడె నని విని నిలువ లేక
అంతిపురి వీడి యాతనీ కాంత లెల్ల
వచ్చి రణభూమిని మృత రావణుని గనిరి. 721

అసువిని గూలిన తమ నాథు నరసి - పనలి
పనలి దుఃఖించిరి దనుజ వనిత లెల్ల
పట్ట మహిషి మండోదరి ప్రాణనాథు
పాదముల వ్రాలి రోదించె బహు విధాల. 722

దనుజ కాంతల రోదన ధ్వనులు రేగి
నిండిపోయెను - భూమియు నింగి కూడ
అంత మండోదరి దేవి యార్త నాద
మవని కంపింప వ్యాపించె - నన్ని దెసల- 723

అకట! జానకి నప్పుడే ఆ నరేంద్ర
సుతున కిచ్చిన మాకిట్టి శోక మున్నె ?
బంధు మిత్రులు రణభూమి పడగనేల?
కుమిలి రాక్షసకులమెల్ల కుందనేల ? 724

పుణ్యవతి సీత పై నీకు బుట్టి - పెరిగి
నట్టి కామము కాలాగ్ని యగుచు - నిన్ను
నన్ను - కులమును - మంత్రుల - నాథ! నిఖిల
హితుల కొమరుల - నరయ దహించి వైచె. 725

ఇల నరుంధతి - అల్లరోహిణుల కంటె
పరమ పావని జనక భూపాల పుత్రి
కడు విశిష్ట - పతివ్రత - కామ దృష్టి
నామె మృచ్చిలి తెచ్చితి వడవి నుండి. 726

తెచ్చితివి; దాన ఫలమేమి? తేలె నీకు
కామితము దీరెనా? చేటు గలిగె! నింక
కుల వినాశము చేకూరె! కలుష మబ్బె!
భోగ మిసుమంత యును గూడ పొనగ లేదు. 727

పాప కర్మ లిల పరి పక్వము వహింప
తత్ఫల మనివార్య మయి కర్తకు ఘటిల్లు;
శుభము లొనరించు పురుషుండు సుఖము లొందు
దోషకారికి ద్విగుణిత దుఃఖ మొదవు. 728

అంద మింపొందు బహు సుందరాంగు లెంద
రెందరో సీత మించి నీముందు నుండ
మోహ - మవివేక మకట! నిన్ ముంచి పై చె
గాక - నధికయే? వారల కంటె సీత. 729

పుష్పకమ్మెక్కి నీతో త్రిభువనములను
దనర దిరుగుచు దేవతోద్యాన సీమ
లందు విహరించి - యానంద మనుభవించి
చివరి కీ విధి "విధవ" నై చెలగ వలసె. 730

అనుచు మయపుత్రి - బహు దుఃఖ మావహింప
ప్రళయ ఝంఝూనిలో ద్భూత ప్రసవ లతిక
భంగి వణకుచు - భర్తృ శవాన వ్రాలి
యేడ్చె చూచెడి వారల యెడద కరుగ. 731

పరమ దుఃఖార్త లౌచు రావణుని పత్ను
లంద రావిధి విలపింప - నచట నున్న
కపుల కన్నులు దనుజుల కనులు గూడ
చెమ్మగిలినవి - దుఃఖ వీచికలు రేగ. 732

అంద రావిధి విలపింప నా విభీష
ణుండు - తానేడ్చి - యోదార్చి - నిండు మదిని
దుఃఖమును మ్రింగి - అన్నకు దురిత ముడుగ
పరమ నియతిని సంస్కార ప్రతతి జరిపె. 733

గంధమును బూసి - పూలు నక్షతలు దీర్చి
వర సుగంధాది ద్రవ్యముల్ వస్త్ర తతులు
దనుజ విభు దేహమున నుంచి - ధర్మ నిరతి
అగ్ని నిడెను విభీషణు డాక్షణాన. 734

వధుల హింసయు - దుర్బుద్ధి - పాపకర్మ
మూర్ఖమును - రోషమును - తేజ మోహములును
బలము చలమును - షడ్వర్గ భావములును
చూడ చితి కాలి దేహితో బూడిదాయె. 735

పిదప స్నానము చేసి విభీషణుండు
భ్రాతకు తిలోదకము లిడి - పరమదుఃఖ
భారమున మున్గి - అన్నకై పరితపించి
బాలకుని భంగి యేడ్చె సౌభ్రాత్ర మెంచి. 736

చేయ తగిన కార్యము లెల్ల చేసి - ఆ-వి
భీషణుడు - రాక్షస స్త్రీల ఘోష మాన్చి
పంపె పురమున - కంత - నా - భానుకులుడు
మాతలిని బిల్చి యిటు ముదమార బల్కె. 737

ఘోర రణమున జయ మొనగూడు విధిని
రథము నడపిన చతుర సారధి వటంచు
పొగడి - మృదు భాషణమ్ముల తగ వచించి
పంపె నాతని దేవేంద్ర పట్టమునకు. 738

## విభీషణ పట్టాభిషేకము

సత్య సంధుడు శ్రీరామచంద్రమూర్తి
ప్రియముగా లక్ష్మణునకు - విభీషణాఖ్య
రమణ మీరగ దానవ రాజ్య మహిత
పదవి కభిషిక్తు జేయగా ముదల నిడెను. 739

స్వర్ణ కుంభము లందున - సప్త సాగ
రముల జలముల రప్పించి - లక్ష్మణుండు
అసుర రాజ్య సింహాసన మప్పగించె
వేద ఘోషల మధ్య విభీషణునకు. 740

కపులు రాక్షసులు లంతట కలసి మెలసి
సోదరుల భంగి వర్తించి - రాదరమున
మెలగ మొదలిడి రెల్లరు మెచ్చు కొనగ
రామమూర్తి సంతోషాంత రంగు డయ్యె. 741

రాజ పీఠ మధిష్ఠించి - లక్ష్య ముంచి
రామ నృపునకు బహు విధ రత్న ఖచిత
భూషణాంబరముల నిచ్చి పూజ లిడెను
వినయ గుణ భూషణుండ విభీషణుండు. 742

# రాముడు సీతను రప్పించుట

రావణుడు ఘోర సంగ్రామ రంగ మందు
ముగిసె నను చల్లనౌ వార్త - మృగనయన సీత
కెరుగ బలుకుచు గొని తేర నిన కులుండు
దనుజ విభు గోర - సంతస - తత్ క్షణమ్ము. 743

ఆవిభీషణు నాజ్ఞచే - నసుర కాంత
లెల్ల సీతకు రావణు మృతిని దెలిపి
ధవుని చేరంగ సమయము దరిసె నంచు
బయలు దేరంగ నుత్సాహ వతిని జేసి 744

జలక మార్చిరి పన్నీటి జలము లందు
పట్టు వస్త్రము సవరించి పసుపు బూసి
పూలు ముడిచి చందన మద్ది పూబ్బోడికి
మేలి మణి భూషణమ్ములు చాల దొడగి. 745

సర్వ సౌభాగ్య విభవ సర్వ్వస్వ మైన
ధరణి సుత సీత రఘురాము తన్వి నంత
అందలమ్మున నెక్కించి - అసుర కాంత
లాదరమ్మున గొని వచ్చి రటకు ప్రీతి, 7 6

వినయ వినమిత గాత్రయై విభుని పాద
పద్మముల వ్రాలె భక్తి నప్పరమ సాధ్వి.
సకల కపులామె గనుగొని స్వాంత మందు
సంతసించిరి పరమ హర్షంబు చెంది. 747

## సీత అగ్ని ప్రవేశము

అంత నొక్కింత తడవాగి – నర్క వంశ్య
డవని సుతగని – గద్గదు డగుచు – సకల
కపులు – రాక్షస గణములు – కలత జెంద
పలికె నీరీతి విస్పష్ట వాక్య నమితి. 748

పతిని చెరగొన్న రావణు సత్వ ముడిపి
గెలువ లేదయ్యె రాముడన్ పలుకు లకును
తావు లేకుండ కూల్చితి దైత్యు – నింక
నీవు చనవచ్చు స్వేచ్ఛమై నెచటికైన. 749

అనెడు రాముని పలుకు లయ్యవని జాత
కర్ణముల సోకి ములుకులై గాడి పరువ
భూమి సుత కొయ్య బారెను – మూర్ఛ చెంది
మొదలు నరికిన కదళియై భూమిపైన 750

ఇంత యుద్ధమ్ము చేసి – జయించి – రావ
ణాసురుని జంపినది యెల్ల – అవని సుతను
నిట్లసామాన్య వలెను హింసించు కొరకః
పంచభూతమ్ము లెరుగవే పడతి ఘనత ః 751

ఆమె పాతి వ్రత్య మనవద్యమ్ము కాదెః
ఆమె నిప్పు వంటిది; దోష మంటు కొనునెః
రాము డెరుగడె యామె శీలమ్ము నెడద
పడతి స్త్రీల కాదర్శమౌ పుడమిలోన 752

కొంత వడి కామె యొక్కింత కోలు కొంచు
పలికె ! నాశీల మెరిగియు _ పరుషములను
పలుక భావ్యమె ? నీవొక్క బాణమేసి
నన్ను తెగటార్చు టుచితమ్ము; నాథ! మరియు 753

ఎట్టి పాప మెఱుగని నే నిట్టి వాదు
మేన భరియింప జాలనో ప్రాణ నాథ!
వహ్ని వెలకొల్పు _ మీ అపవాదు మాయ
నంపు దూకెద _మీరెల్ల రరయు చుండ. 754

అనుచు దీనత పలికెడు నవని తనయ
పలుకులకు రాక్షసాళియు ప్లవగు లెల్ల
కంట కన్నీటి కాల్వలు గార్చి నారు
ఇంత రాముని యెడద గ్రహింప లేక. 755

జనకసుత యంత చెంతలక్ష్మణుని గాంచి
వరమసౌజన్య మూర్తి త్వద్భ్రాత , యెరిగి
నాదు శీలము శంకించె — నాకు నింక
బ్రతు కదేల? యటంచు దా బలికె క్రుంగి 756

అనఘ! మిధ్యాపవాదము నను వరించి
నేరమై జీవితమ్ము సాగించు దాన ?
భర్త గౌరవ మందని భార్య బ్రతుకు
నరక తుల్యము — మరణమే శరణ — మార్య! 757

ఈ ప్రసనమున నేను జీవింప నేర !
చితిని పేర్పింపు మిపుడెల్ల హితుల మ్రోల
నాథు పద పంకజమ్ముల నాదు మదిని
నరసి గొల్చుచు దీప్తాగ్ని యందు జొత్తు. 758

అనిన - దుఃఖించి అక్ష్మణు డన్నుజు గాంచి
తదనుమతమ్మున జగములు దద్దరిల్ల
హరులు వెఱగంద = రాక్షసులయ్యో! యనగ
చింత కట్టెలు పేర్పించి - చితి రగిల్చె. 759

పరమ సాధ్వీలలామయౌ పడతి యగుట
పుణ్య సౌశీల్య మూనిన పొలతి సీత
రాము పదముల నెద నిల్పి - రామునకును
అంజలించుచు వడి జొచ్చె నగ్నియందు. 760

సాధ్వి జగదేక పావని పృథ్వి జాత
భర్తృ పద చింతనైక స్వభావి - సీత
వహ్ని జొచ్చిన వసుధ సర్వమ్ము వణకె;
తారకలు రాలె; జగములు తల్ల డిల్లె 761

మింటి నంటుచు లెగసెడి మంట లందు
జొచ్చె జానకి అకళింద మచ్చ పాయ
అపుడు కపులొనరించు "హాహా"రవమ్ము
లవని నగలగ రేగె భయంకరముగ. 762

పావక జ్వాలలో సాధ్వి పావనత్వ
మహిమ - చల్లనై - వెన్నెల మాత్ర నలరగె;
అగ్ని మానవాకృతిని ప్రత్యక్ష మయ్యె
జానకీ పతికిని నమస్కార మిడుచు. 763

పలికె; ఓరామ! యాసీత - భవ్యచరిత!
పరమసాధ్వీమ తల్లి - సౌభాగ్య వల్లి!
అవని జన వినుత చరిత్ర అతి పవిత్ర!
ఇట్టి యాతల్లి నంటంగ నేరి తరము? 764

అనుచు స్తుతిభక్తి జనకరాజన్యనాడు
అప్పగించిన మాడ్కి నయ్యగ్ని హోత్రు
డవని సుత సీత రామున కప్పగించె
జగము సర్వము నానంద జలధి దేల. 765

వనజ సంభవుండును ముని వరులు సురలు
సకల దిక్పాలురును ఋషి సతులు – ఋషులు
దశరథేశుండు సహిత మాదరము నొంది
వచ్చి దీవించి మగిడిరి స్వర్గ పురికి. 766

సంబరమ్మున నప్పుడు సకల సురలు
సీత కౌశల్యమునకు నచ్చెరువు నొంది
శ్రీ రఘూద్వహు ప్రస్తుతి జేసి – మిగుల
పూల వానలు గురిసిరి పుడమి మీద. 767

రాము డానంద భరితాను రాగ మొప్ప
జనక సుత నాదరించెను జగము పొగడ;
బవర మందున గూలిన ప్లవగు లెల్ల
బ్రహ్మ కరుణా కటాక్షాన బ్రతికి నారు. 768

## విభీషణుండు రామునకు పుష్పక విమానమును కానుకగా నిచ్చుట

మనుజ నాథుండు పిదప నద్దనుజ విభుని
గని వచించె – నే వచ్చిన పనులు దీరె;
నింక తడయగ రాదు – నేనేగ వలయు
మా అయోధ్యకు నీ వనుమతిని నిడుము. 769

అనుచు దెల్పిన రామున కంజలించి
కాంచనాంచిత నవరత్న ఖచిత మైన
పుష్పకమ్మును దెప్పించి భూమి పతికి
కాన్కగా నిచ్చె నపుడు రాక్షస విభుండు. 770

ప్రాణములు లెక్క సేయక బవర మందు
దానవుల నెల్ల నిర్జించి - తనకు దైత్య
రాజ్య రాజత్వ ప్రాప్తి కారకులు నైన
సకల కపులను తగురీతి సత్కరించె. 771

దాశరథి మానసమున సంతసము నొంద
కాంచనాంచిత భూషలు కాన్క లిచ్చి
గౌరవము జూపి - సుగ్రీవు గౌగిలించి
అంజనీ పుత్రు నెంతయో యభినుతించె. 772

## రాముని అయోధ్యా ప్రయాణము

భాను వంశాబ్ధి చంద్రుని భావమరసి
అసురకుల నాయకుండంత నాజ్ఞ లిడెను
పుష్పకము సిద్ధమొనరించి - భూమి పతి-ప్ర
యాణమునకంత సన్నాహ మమర జేయ. 773

జానకీదేవి కోరిక - జగము పొగడ
రమ్య గుణులైన పరమాత్ము రమణు లెల్ల
రామతో నయోధ్యకు జన - నపుడె-మురిసి
పయనమైనారు తమ పూర్వ భాగ్యమనుచు. 774

రఘు వరుండంత జానకీ లలన తోడ
లక్ష్మణుని తోడ - వాయుజార్కజుల తోడ
కపిబలము తోడ - రాక్షస నృపతి తోడ.
పుష్పకమ్మెక్కె సాకేత పురము జేర. 775

పుష్పకమ్మేగు మార్గాన - భూమి సుతకు
తాము వెదకుచు వడ్డ కష్టముల నెల్ల
చెప్పి విశదీకరింప - నాసీత - కనుల
బాష్పములు రాల్చె - దుఃఖించె బహు విధాల. 776

ఈ ప్రదేశాన గూలినాడింద్రజిత్తు
కుంభకర్ణుండు నిచ్చటే గూలె - పిదప
సకల దానవ సామ్రాజ్య చక్రవర్తి
రావణుడు గూలె నిట నటె రామవిభుడు. 777

అటుల నన్ని సీతకు జెప్ప నంత లోన
చేరె పుష్పక మంబుధి తీరభూమి
తాము లంక జేర మహా పథంబు నైన
సేతువును జూపె రాముండు సీత కంత. 778

యోగ బలుడు నలుండను నొక , కపీశ్వ
రుడు - గభీరత నొప్పారు కడలి పైన
చతురతను నిర్మితము జేసి సేతు విచట
హొగను లలర - నీకయి - దాని చూడు మనెను. 779

ఈ ప్రదేశాన వెలసె మున్నీశ్వరుండు ;
సుప్రతిష్ఠుడై కొలువుండె చూడు మదిగో.
ఇదియె రామేశ్వరమ్మంచు యిలను నిలిచి
పతితులను పావనము చేసి పరిఢ విల్లు. 780

తా విమానంబు నందుండి దాశరథి - వి
శేషముల నొక్కొ క్కటి జెప్పుచుండ
చేరె పుష్పకంబంత కిష్కింధ పురము
సీత ఆశ్చర్య చకితయై చెంగలింప. 781

మధుర మధుర స్మితానన మహి తనూజ
సీత యనియెను-స్వామి! కిష్కింధ పురిని
కొంత తడవాగి _ మనతోడ గూడ ప్లవగ
కాంత లంగొని పోవ కాంక్షింతు ననుచు. 782

శ్రీ రఘూద్వహుం డదివిని చిర్న గవున
జనక సుత గాంచి _ నీకోర్కె శతవిధాల
యుచిత మైనట్టిదని యెద నుబ్బి పోయి
పుష్పకావతరణమును పూని దలచె. 783

పుష్పకమ్మంత కిష్కింధ పురిని జేర
వనచరాంగన లెల్ల రవ్వసుధ పుత్రి
చుట్టు జేరి _ పూజించెదు నట్టి వేళ
వారి నెల్ల నాదరమున పలుకరించె. 784

వనచరాంగన లెల్ల రవ్వసుధ తనయ
జూపు నాదరమునకు సంస్తుతు లొనర్చి
జనక రాట్పుత్రి కోరిక ననుసరించి
పయనమై రయోత్సుకను పుష్పకముపెక్కి. 785

శ్రీ భరద్వాజు నాశ్రమ సీమయందు
పుష్పకము నిల్పి రఘుకుల పుంగవుండు
మునిని దర్శించె - మునియును మోదమంది
సకల నాతిథ్యముల రాము సత్కరించె. 786

సంతసము మీర కపులెల్ల సమయ మెరిగి
ముని యనుజ్ఞను వనముల ముగ్గియున్న
మధుర ఫలముల భుజియించి - మధుపులాని
దినము దినమెల్ల గడపిరా ముని వనాన. 787

భక్తి యుక్తుడయి మ్రొక్కెడి భరతు గాంచి
గ్రుచ్చి యెత్తుచు నరుదగు కూర్మి దోప
గౌగిలించెను రాముండు కడు ముదాన;
పౌరులను గూడ తగురీతి గౌరవించె. 794

ముఖ్య జనులు వశిష్ఠాది ముఖ్యు లెల్ల
ననుసరింపగ తల్లులా యదను నరిదె
డెంద మానందమున పొంగ నంది గ్రామ
మునకు జేరిరి శత్రుఘ్ను వెంట నంటి. 795

ముని వశిష్ఠునకు రఘురాముండు మ్రొక్కి
మిత్ర జనముల సేమమ్ము మేలు దెలిసి
ప్రజల బాగోగులను గూర్చి పలుకరించి
ఆప్త మర్యాద నెల్లర నాదరించె. 796

మువురు తల్లుల గనుగొని ముదము గదుర
మ్రొక్కె నతి భక్తి రాముండు మోకరిల్లి;
చిన్ని తమ్ముని మనసార చేర దీసి
ప్రీతి దొలుకాడ నతని పరిష్వజించె. 797

వినయ గుణశీల సీత వివేక మలర
నతి వినమ్రతతో ముగు రత్తలకును
పాద వందన మొనరించె; వారు దయను
దీవన లొసంగినారు వైదేహి కపుడు. 798

## భరతుని విన్నపము

కరము ముదమంది భరతు డగ్రజుని గాంచి
విన్నపము చేసె నీరీతి విభుదులలర
అన్న! పరిపాలనా భార మిన్ని నాళ్లు
నీదు పాదుకలన్ముంచి నెఱపి నాడ. 899

ఆశ లేదు నాకిందు - సింహాసనమ్ము
నీది - నీకప్పగించుటే నాదు కోర్కె.
ప్రేమ కాదనకుండ యీ భూమిభార
మును వహింపుము - త్రిజగముల్ మోద మంద. 800

సకల జగమేలు సర్వజ్ఞతా సత్వ మెల్ల
గలుగు ప్రభుడవు నీవె - యొక్కడవు జగతి
నీదు రాజ్య సర్వస్వమ్ము నీ కొసంగ
వేచి యున్నాడ - గైకొమ్ము - వేగ మీవు 801

రాముడును సోదరుని యాదరమ్మును జూచి
పరవశమ్మందె హృది నెంతొ కరగి పోయి;
ఆర్ద్ర నయనాల బాహువు లందు జేర్చి
చిత్తరువు పోలె నయ్యె విచిత్ర రీతి. 802

## అయోధ్యను చేరుట

పుష్పకము నంత పూజించి భూవిభుండు
సెలవొసంగె కుబేరుని చేరుకొనగ
వెడలె నది యంత నాకాశ వీధి కెగసి
జిలుగు మొగుల గుంపుల నెల్ల జీల్చుకొంచు. 803

పుష్పకమ్మేగినంత - నా పుణ్య మూర్తి
స్వర్ణమయ దివ్య పీఠికాసనము నందు
గురుడు కూర్చుండ తానును గూరుచుండె
అంత భరతుడగ్రజునకు నంజలించె. 804

అన్న! పురికేగ వలె మనమని భరతుడు
రథము నాయత్త మొనరించె; రాముడలరి
ధరణి సుతతోడ సాకేత పురము జేర
రథ మధిష్ఠించె కాకుత్స్థ రాజశేఖరుడు 805

లక్ష్మి వర్ధనుడైనట్టి లక్ష్మణుండు
అభినవ వ్యజనంబు చెన్నార వీచె;
శత శలాకల పాండురచ్ఛత్ర మంత
కొమరు మిగుల శత్రుఘ్నుండు కూర్మి బట్టె. 806

విధు నిభంబు వింజామర వేడ్క దాల్చి
అల విభీషణు డంత సొంపలర వీచె
సుగుణ గుణఖని భరతుండు శోభ లెసగ
కడుముదమ్మున హరుల పగ్గముల దాల్చె 807

తగిన వారెల్ల రవ్వాడు తగిన రీతి
భద్ర వాహనముల నెక్కి బయలు వెడలి
రామ భద్రుడధిష్ఠించు రథము వెంట
నంటి జనుచుండి రానంద మతిశయింప. 808

ప్లవగ విభుడును - కపికుల ప్రవరు లంగ
దాది వీరులు - జాంబవదాది ఘనులు
హయ గజ స్యంద నాది వాహనము లెక్కి
అనుసరించిరి రఘువీరు నడుగు జాడ. 809

వేదమును వీడగా లేని నాద మటుల
వీణ విడని సప్తస్వర విషయ మటుల
అపరిమిత సంతసము దేహ మాత్మ నిండ
జనకజా రాములకు వెంట జనెను హనుమ. 810

అపుడె వెడలిరి ప్లవగాంగనాళి గూడ
జనక రాట్పుత్రి వెనుకను స్యందనమున
సంతతానంద సల్లాప సరస భావ
హృదయ సంరంభముల పల్కరించు కొనుచు 811

రామభద్రుడు సీతయు లక్ష్మణుండు
తండ్రి వాగ్దానమును దీర్చి ధర్మమూర్తు
లపు డయోధ్యను చేరిరి - యన్న వార్త
విని కుతూహలులై పుర వనిత లెల్ల 812

వారినింజూడ - నుత్సాహ వంతులగుచు
సౌరభములను వెదజల్లు సంకు మదము
మేననలమక - భూషలు మెయి ధరించి
వేడుకగ పూలు తురుముక మేడ లెక్కి 813

రాము మనసార వీక్షించి - రమణు లెల్ల
బహుళ విస్మయమున దేలి బల్కి రిట్లు
ఇతడె ఖరదూషణుల దున్మె - నింద్ర తనయు
నంత మొందించి నిలిపె రాజ్య మర్కజునకు. 814

ఇతడె కదా శరధి పై సేతు వేర్పరించి
లంకలో జొచ్చి రావణు గొంతు మడచి
నేల గూల్చి లంకారాజ్య మేలు గొనగ
తదనుజున కిచ్చి వరలిన ధర్మమూర్తి ! 815

మన తపమ్ములు పండెను - మన భవములు
సఫలతను బొందె - జానకీ సహితుడైన
యీ రఘూద్వహు గనులార వీక్షణాన
గాంచుటయు జన్మ ధన్యత గాదె మనకు. 816

పడతు లవ్విధి సౌధాగ్ర భాగములను
వేచి పరిమళ సుమముల వేడ్క జల్లి
వంది మాగధ వైతాళ వైభవముల
రాచనగరు ప్రవేశించె రామమూర్తి. 817

అచట తేరును డిగ్గి - హిమాంశు కాంతి
చంద్రికా వైభవోన్నతి చలువ లీన
ప్రత్న - బహురత్న శోభిత ప్రభల దనరు
తండ్రి మందిరమున కంత ధర్మమూర్తి. 818

రమ్య హర్మ్యములం గపి రాజు - హనుమ;
దనుజ పతి-జాంబవంతుల-దగిన రీతి
విడిది సేయించి శ్రీరఘు వీర వరుడు
జనకసుతతోడ జనె తండ్రి సౌధమునకు. 819

సంజ పొద్దున - జనముల స్వాంతములను
చల్లదనములు మెలమెల్ల నల్లు కొనియె
భరతు డంతట ముదమున భానుసుతుని
జేరి యిటు బల్కె తన మది తీరు దెలియ. 820

అంధకారము మారాజ మందిరమున
నలము కొనె నిన్ని నాళులు - అనఘ! నీదు
ప్రబల సహకారమునను రావణుని ద్రుంచి
రాము డేతెంచె - తమము నిర్గతము నయ్యె. 821

మిత్ర సుతుడీవు - మేమును మిత్రకులుల
మగుటచే గాదె యీమైత్రి - మాన్య!
ఘన విచిత్రము దైవ సంకల్ప బలము
గాక చేకూరునే మైత్రి కపి కులాఢ్య. 822

ఇంక నీచేతి మీదుగా - నింపు మీర
భవ్య నక్షత్రమున రామభద్రు నకును
పట్టముంగట్ట వలెను శుభంకరమ్ము
గా- ననిన సుగ్రీవుండు హర్షాన దేలె. 823

అర్కజుండు పట్టాభిషేకార్థ మపుడు
నాల్గు సర్ప్రాల నుండి పుణ్య జలములను
తేర పైడి కుంభాలతో వీర వాన
రాగ్రి యోధుల నంపె శీఘ్రమ్ముగాను. 824

శాస్త్ర విహితమ్ము నగు మంచి సమయ మెంచి
శుభము లొనగూర్చు శుభవేళ - సూర్య వంశ
తిలకు పట్టాభిషేకము మలి దినాన
జేయ సుముహూర్త మిడెను వశిష్ఠ మౌని. 825

# శ్రీరామ పట్టాభిషేకము

మరు దినమ్మునను వశిష్ఠ మౌని వరుడు
మంగళా శాసనము సల్పి - మహిత విప్ర
వైదిక కాశీ వ్రవచనాల వైభవముగ
సభకు గొని వచ్చె రాముని సతియుతముగ. 826

బహు నదీనద సాగర భవ్యజలము
స్వర్ణ ఘటముల - ముదముగా-సంగ్రహించి
కపులు గొని రాగ ఋషులును - ఘన మునులును
స్వచ్ఛతగ వేద మంత్రమ్ము లుచ్చరింప. 827

దివిజ విభుడాది దిక్పతుల్ - దేవ ఋషులు
మిగుల నాసక్తితో వచ్చి మేలు పలుక
స్వర్ణ సింహాసనమ్మున సతియుతముగ
కూర్మి నాసీను నింజేసె కులగురుండు. 828

వామ దేవుడు - జాబాలి - వర వశిష్ఠ
మునియు - కాశ్యపుడును - గౌతముడును - పూని
యమల జలముల నభిషేక మలర జేసి
రపుడు మంగళ వాద్యమ్ములవని నిండ 829

మంత్రి వరులును - కన్యలు - మాన్య యోద్ధ
వరులు ఋత్విక్కులును - ధరామరులు - బ్రహ్మ
వాదు లెల్లరు - రాముని - వర సుగంధ
జలము లభిషేక మొనరించి రలఘు మతులు. 830

వ్యోమమున నుండి దేవతా యోను లెల్ల
సకల దివ్యౌషధీ రసస్సలిల ములను
మంగళాశిషముల మధ్య - మహిప సుతుని
కప్పు డభిషేక మొనరించి రమిత రక్తి. 831

సంతసంబొప్ప సద్గుణ సాంద్రు డిట్లు
సర్వ ఋత్విక్పురోహిత సాధు జనుల
చేత ననుపమముగ నభిషిక్తు డయ్యె
సలక జనతండ మానంద జలధి దేల. 832

వ్యజనమును లక్ష్మణుడు పట్టి - స్వచ్ఛమైన
పాండర చ్ఛత్రమును బట్టి భక్తితో - శ
త్రుఘ్నుడు - వినీతు డగు భరతుండు నిల్చె
బంగరు కరండ మూని త్వత్పార్శ్వ మందు. 833

పవనజుడు రత్న మండిత పాదుకలను
మోయుచును రామునిం గొల్చె మోద మెసగ
చంద్ర నిభ వర సురుచిర చామరముల
వీచి గొల్చిరి కపిదైత్య విభులు నపుడు. 834

అనుజు లాప్తు లమాత్యులు నాదరమున
రాజ లాంఛనములు బట్ట - రమ్య ప్రకృతి
సకల శైత్యోపచారముల్ సలుపు చుండ
జరిగె నభిషేక మా రామచంద్రునకును. 835

రామభద్రుని కీర్తించి - ప్రేమ దొలుక
అమరలోకాధి నాయకు లాదరమున
వచ్చి యిచ్చిరి వెలలేని బహుమతులను
స్వర్ణ నవరత్న మేడిగణ స్థగితములను 836

రాముడును నంత తనడగు రాజ్యమందు
నున్న జను లందరికిని యథోచితముగ
విప్రవర వందితోత్తమ విబుధవరుల
కాదరమ్మొప్ప కానుక లందజేసె. 837

అర్క తనయుని జాంబవదాంగ దాది
ప్రగతి వీరుల - దనుజేంద్ర వరు - విభీష
ణుని-సువర్ణ మయ విభూషణముల నొసగి
గౌరవించె రాముండు ప్రగాఢ ప్రీతి. 838

చంద్ర కిరణ గాథ ప్రకాశమున వెలుగు
సార మణిమయ కాంచన హార మొండు.
జానకి కొసంగె శ్రీరామ చంద్రు - డంత
హనుమ కిడె నామె - దాని రామాజ్ఞ నెరిగి. 839

తనరు తన్మణి హారమ్ము దాల్చినంత
శ్రీ సుధాకర జ్యోత్స్నా విశేష కలిత
చంద్ర శేఖర వరనివాసమయి యొప్పు
వెండిమల బోలె పవనజు డుండె నపుడు. 840

అఖిల ప్రజమెచ్చ - భరతు - నయ్యవని విభుడు
యౌవ రాజ్యాభిషిక్తుగ నలర జేసె;
అంతయును శాస్త్ర విధి దీర్చి నంత - ముగిసె
నుర్వి - రామాభిషేక మహోత్సవమ్ము. 841

[ప్రేమ చిగురింప నపుడు శ్రీరాము డంప
అర్కజునకు చేరె కిష్కింధ - అసుర విభుడు]
చేరె లంకాపురమ్మును - శీఘ్రగతిని
హనుమ రాముని గొల్చుచు - నచటె యుండె. 842

# రామ రాజ్యము

అశ్వమేధాది క్రతువుల నాచరించి
నిత్య సత్య వ్రతుండయి నీతి నెరపి
ధరణి జనులకు రాము డాదర్శుడగుచు
కూర్మి పరిపాలనము జేసె కోసలమును. 843

కన్న బిడ్డలవలె ప్రజల గాంచు చుండి
సకల జగములు రంజిల్ల సరస విధిని
వేడ్కగా పదునొక్కండు వేల యేండ్లు
రాజ్యపాలన మొనరించె రామ విభుడు. 844

ధరణి సురలును - సకలమౌ ధరణి జనులు
మంత్రి వరులు - బాంధవులు - సామంత నృపులు
గుండెపై చేయి నిడుకొని కూర్కు చెంద
రాజ్యమేలె శ్రీరామచంద్ర ప్రభుండు. 845

ధర్మ మరయగ నాల్గు పాదములు నడచె
సస్య వృద్ధియు ధనవృద్ధి జగతి వెలసె
కరువు - కాటక మెరుగరు నరులు నాడు
రాము డేలెడి కాలాన రాజ్య మందు. 846

రామ పరిపాలనమ్మున రాజ్యముండ
దోషులే లేక శిక్షలు దూర మాయె
కల్మషము లేక కరువయ్యె కలుష తతులు
పాపములు లేక నరకమ్ము పాడుబడియె. 847

# ఫలశ్రుతి

... శిష్టులను బ్రోచి - దుష్టుల శిక్ష జేసి
ధర్మమును నిల్పి - మనుజుడై ధరణి బుట్టి
నట్టి విష్ణువె - గన రాము డగుట - రామ
చరణ పూజలు నిహపర సౌఖ్యదములు. 854

రామ చరితమ్ము ధర్మ సామ్రాజ్య పథము
రామ చరితమ్ము భవ ముక్తి రాజ పథము
రామ చరితమ్ము పుణ్య విభ్రాజితమ్ము
రామ చరితమ్ము యోగ సంక్షేమ మయము. 855

ఈ చరిత్రము వినువారి - యీప్సితములు
దీరు - నాయుష్యమగు - నింక దీర్ఘపాప
సంఘములు మాయు - సద్గతుల్ సరసజేరు
తుష్టి గని దేవ పితృలును - తృప్తి గంద్రు. 856

# మంగళాచరణము

మంగళము రామపద భక్త మానసులకు
మంగళము రామకథ విను మాన్యులకును
మంగళము రాము పఠియించు మహితులకును
మంగళము వేద శాస్త్ర ధర్మాదులకును

మంగళం మహత్ శ్రీ శ్రీ శ్రీ

ఇది శ్రీగురువాధీశ్వర వర ప్రసాద సహజ కవితా సంప్రాప్త
కాశ్యపస గోత్ర పవిత్ర - పార్వతీ అనంతరామయ
పుత్ర బుధజన విధేయ-రఘురామ నామధేయ
ప్రణీతంబైన రఘురామ రామాయణము
నందు యుద్ధకాండ సంపూర్ణము

# గమనిక

బాలకాండలో 33 వ పేజీ 127 వ పద్యంలో నాల్గవ పాదం – "అవనిపై జనిచ్చి పడియున్న అసురిణాంబి"కి బదులు పరలు సేక్రి ఘనత లీ వసుధ యందు." అని చదువు కొన వలెను.

కిష్కింధ కాండలో 313 వ పేజీలో 257 వ పద్యం తరువాత పద్యం ముద్రణలో తప్పిపోయి నది. ఆపద్యమును యీక్రింద నిచ్చు చున్నాము.

> పరమ సంతస మంది సంపాతి – రామ
> భటులకును జయమౌనగూడ బలికి చనియె
> వానరులు నంత పయనించి వనులు గడచి
> దక్షిణాబ్ధి తటమ్మును దరిశినారు.